

# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాస పత్రిక

సంపుటి : 35 సంచిక : 1

నవంబరు-డిసెంబరు 2011

వెల : రు 20 (289) పేజీలు : 100

## కామ్రేడ్ కిషన్‌జీకి అరుణారుణ జోహార్లు

## అక్కడి పర్వతాలు ఎరుపు
## అక్కడి పువ్వులు ఎరుపు
## అహో ! వాళ్ళ మరణం ఎరుపు
## వాళ్ళకు మా జోహార్లు ఎరుపు...

12 డిసెంబరు 2011న సుందరయ్య విజ్ఞానకేంద్రం, బాగలింగంపల్లి, హైదరాబాదులో జరిగిన

# కిషన్‌జీ సంస్మరణ సభ దృశ్యాలు












































289 సంపుటి : 35 ◆ సంచిక : 1 ◆ నవంబరు - డిసెంబరు, 2011





సంపాదకుడు

**చలసాని ప్రసాద్**

❖ ❖ ❖

వర్కింగ్ ఎడిటర్

**డి.వి. రామకృష్ణారావు**

ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500040
* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
* ఇ-మెయిల్ ద్వారా
arunatara1977@gmail.com
కూ రచనలు పంపవచ్చు

❖ ❖ ❖

కొరియర్, రిజిస్టర్డ్ పోస్ట్ ల ద్వారా
రచనలు పంపితే...

**టి. కృష్ణాబాయి**

9-19-3, సి.బి.ఎం. కాంపౌండ్
విశాఖపట్నం - 530 003

❖ ❖ ❖

**చందాలు పంపాల్సిన చిరునామ**
**మేనేజర్**

**ఎస్. రవికుమార్**

5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360
సెల్ : 9866021257

❖ ❖ ❖

**విరసం కార్యదర్శి చిరునామా**

**పాణి**

50-348, L 19 B II,
అరోరా నగర్, బి క్యాంప్, కర్నూల్ - 2


ఈ సంచిక వెల : రు. 20

## సంపాదక లేఖ...

మల్లోజుల కోటేశ్వరరావు (57)ను 2011 నవంబర్ 24 సాయంత్రం కోవర్ట్ ఆపరేషన్‌లో కేంద్ర, రాష్ట్ర బలగాలు హత్య చేశాయని మావోయిస్ట్ పార్టీ ప్రకటించింది. చిత్రహింసలతో నుజ్జు నుజ్జయిన ఆయన దేహం ముమ్మాటికి అది బూటకపు ఎన్‌కౌంటరే అన్న సత్యాన్ని వెల్లడించింది. ఎప్పటిలానే ప్రభుత్వం ఎన్‌కౌంటర్ కథను వినిపించింది. పశ్చిమ బెంగాల్ నుంచి పెద్దపల్లికి మృతదేహాన్ని తరలించే క్రమంలో కడసారి చూపు కోసం దారి పొడుగునా ప్రజలు ప్రయత్నిస్తే ఆ అవకాశం కూడా ఇవ్వకుండా శవాన్ని ప్రభుత్వ వాహనాల్లో నిర్బంధంగా తరలించివేశారు. అడుగడుగునా నిఘా, తనిఖీలు కొనసాగించారు. ప్రజల సందర్శనార్థం బహిరంగ మైదానంలో శవాన్ని ఉంచడానికి అనుమతించలేదు. కిషన్‌జీ ఇంటివద్ద కేంద్ర, రాష్ట్ర సాయుధ బలగాల పహారాలో, వీడియో కన్నుతో వీక్షిస్తూ భయభీతావహ వాతవరణాన్ని సృష్టించారు. రకరకాల సమాచారాలతో మీడియా ద్వారా గందరగోళం సృష్టించారు. అయినా వేలాది మంది పీడిత ప్రజలు తరలి వచ్చి తమ ప్రియతమ నాయకుడికి అంతిమ నివాళులు అర్పించారు. అంత్యక్రియలు జరిగాక కూడా స్మశానం, స్మశాన పరిసరాలపై రాష్ట్ర ప్రభుత్వం పోలీసుల నిఘా కొనసాగించింది. కిషన్‌జీ చితాభస్మం కోసం వచ్చిన వారిని కూడా పోలీసులు అరెస్టులు చేసి ఇబ్బందులకు గురిచేశారు. విప్లవకారులకు జీవించినప్పుడే కాదు, వాళ్ళ మరణంలోనూ ప్రజలను సంఘటితం చేసే శక్తి ఉంటుందనే రాజ్యానికి ఈ భయం. నక్సల్బరీ, శ్రీకాకుళాల ప్రేరణతో రాజుకున్న నిప్పురవ్వను అందుకున్న తొలితరం నాయకుడు కిషన్‌జీ. దాదాపు నాలుగు దశాబ్దాలు ఆయన ఆ విప్లవోద్యమంతో నడిచాడు. నడిపించాడు. విప్లవోద్యమం ఎదిగినంత మేరా, విస్తరించినంత మేరా ఆయన అడుగుజాడలు ఉన్నాయి. ఆ ఉద్యమ ఆటుపోట్లు, సంక్షోభాలు, విజయాలు, వైఫల్యాలు అన్నిటా ఆయన ఉన్నాడు. 1980 ఏప్రిల్ 22న ఏర్పడిన సి.పి.ఐ. (ఎం.ఎల్) (పీపుల్స్‌వార్) తొలి కార్యదర్శి ఆయన. ప్రహ్లాద్, రాంజీ, బిమల్, కిషన్‌జీ పేర్లతో ఆయన ప్రజలకు తెలుసు. ఆయన ఉద్యమం కోసం వందలాది ప్రయాణాలు చేసాడు. వేలాది మందిని కలిశాడు. కోట్లాది మందిపై తన ప్రభావం వేశాడు.

ఉద్యమమే పేర్కొన్నట్లు ఆయన ప్రజలకు నాయకుడిగానే కాకుండా అత్యంత ప్రేమాస్పదుడిగా, ఆత్మీయుడిగా మెలిగేవాడు. ఏ వయస్సు వాళ్లతోనైనా, ఎలాంటి నేపథ్యం గల వాళ్ళతోనైనా, మహిళలయినా, పురుషులయినా అందరితో ఆయన కలగలసి పోయేవాడు. 57 ఏళ్ల వయసులోనూ కష్టభరితమైన గెరిల్లా జీవితంలో యువతీ యువకులతో పోటీపడుతూ, తను ఎక్కడున్నా చుట్టూతా కేడర్లలో, ప్రజల్లో ఉత్సాహాన్ని రెకెత్తించేవాడు. ప్రత్యేకించి నేటి యువతరానికి ఆయన జీవితం ప్రేరణగా నిలుస్తుంది. ఆయన విసుగు, విరామం లేకుండా గంటల తరబడి అధ్యయనంలో, పార్టీ పనిలో పాలుపంచుకునేవాడు. దురాభారాల్ని లెక్క చేయకుండా చాలా తక్కువగా నిద్రపోతూ, సాదాసీదాగా జీవిస్తూ, ఎక్కువగా కష్టించేవాడు. మొత్తంగా విప్లవోద్యమానికీ, విప్లవ సాహిత్యోద్యమానికీ ఆయన చేసిన కృషి విలక్షణమైనది. మనం ఆయన నుంచి విప్లవ నిబద్ధత, నిమగ్నత, అధ్యయనం, ఆశయాల పట్ల అంకిత భావం, త్యాగ సంసిద్ధత నేర్చుకోవాలి.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలు అయిన ఈ రెండేళ్ళల్లో కిషన్‌జీతో సహా మూడేసి, నాలుగేసి దశాబ్దాల పాటు విప్లవోద్యమం కోసం అహర్నిశలూ కృషి చేసిన పటేల్ సుధాకర్ రెడ్డి, శాఖమూరి అప్పారావు, చెరుకూరి రాజకుమార్ వంటి విశిష్టమైన నాయకులనూ, విలువయిన కార్యకర్తలనూ విప్లవోద్యమం కోల్పోయింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మానవరహిత విమానాలతో సహా అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానాన్నంతటినీ మనిషి మనుగడ కోసం కాకుండా మనుష్యుల కోసం ఆలోచిస్తున్న వాళ్ళను నిర్మూలించడానికి వినియోగిస్తున్నాయి. అడవులు, భూమి, సమస్త ఖనిజ సంపదలు, ప్రకృతి వనరులు, బహుళజాతి కంపెనీలకు అమ్మివేస్తూ వేలకోట్ల రూపాయల కుంభకోణాల్లో పాలకులు కూరుకుపోయారు. ఇట్లాంటి ప్రజా వ్యతిరేక విధానాలను అమలు చేస్తున్న ఈ దళారీ పాలకులకు ప్రజలను పాలించే కనీస నైతిక హక్కు కూడా లేదని ఉద్యమించాల్సిన తరుణమిదే. కిషన్‌జీయే అన్నట్లు - 'తప్పులు చేయని వారు ఉండరు. వాటిని గుర్తించి సరిదిద్దుకోవడమే కమ్యూనిస్టుల గొప్పతనం' అనే స్ఫూర్తితోనూ, ఆత్మవిమర్శ - విమర్శలతోనూ ముందుకు సాగాల్సిన సందర్భం. ఎంతో వేదనలోనూ, దుఃఖంలోనూ, ఎనిమిది పదుల వృద్ధాప్యంలోనూ 'తన కొడుకు బాటలో పోరాడాలని పిలుపునిస్తున్న' మధురమ్మ స్ఫూర్తితోనూ, అశేష పీడిత ప్రజల ఆకాంక్షగానూ, ఈ దేశపు నిజమయిన స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం, సార్వభౌమత్వాల కోసం ఉద్యమించాల్సిన తరుణం ఇదే.... అమరులు మనకు వదిలిపోయిన నూతన ప్రజాస్వామిక విప్లవ ఆశయాన్ని పూర్తి చేయాల్సిందే మనమే.



## ఈ సంచికలో...

**కరపత్రం (5-9)**
కామ్రేడ్ కిషన్‌జీ హత్య గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమే!
అమరుడు కామ్రేడ్ కిషన్‌జీ విప్లవ ఆశయాన్ని కొనసాగిద్దాం!

**సంస్మరణ (9-16)**
శతకోటి నక్షత్రాల స్వప్నాలు వెలిగించి.... - *వరవరరావు*

**సందర్భం (15-19)**
కిషన్‌జీ పై విమర్శలు - ఉద్దేశాలు - *గంటి ప్రసాదం*

**సందర్భం (19-23)**
తన పిల్లలను తానే చంపేస్తోన్న భారత రిపబ్లిక్ మరింత ఉన్నతమైన సమాజం కోసం పోరాడిన కిషన్‌జీ - *బెర్నాడ్ డి మెల్లో*

**వ్యాసం (22-23)**
చందమామ నుంచి జంగల్ మహల్ వరకు - *రాజశేఖర రాజు*

**రిపోర్టు (24-25)**
కా. చింతల వెంకటస్వామి (సూర్యం) సంస్మరణ సభ
- *విరసం, గుంటూరు యూనిట్*

**సంస్మరణ (25-26)**
వెంకాయమ్మ స్మృతిలో - *కొడవటి హనుమంతరావు*

**ఇంటర్వ్యూ (27-34)**
ఆనంద్ తేల్‌తుంబ్డేతో ముఖాముఖి - *ఆర్. శశికళ*

**గల్పిక (33-33)**
ప్రజాస్వామ్యం - అధికారం! - *పి. చిన్నయ్య*

**పాటలు / కవిత్వం (34-59)**
కా. కిషన్‌జీకి బెంగాలీ కవుల నివాళి; ఆ పిచ్చుక - *నబరుణ్ భట్టాచార్య;* విజేత, వీరుడి కోసం పాట - *కబీర్ సుమన్* పాటలు రెండు; మధురమ్మ పాట - *శాఖమూరి రవి;* పాటే మా జీవగంజి - తంగెళ్ళ సుదర్శనం; ఎత్తిన తుపాకి దించని వీరుడు..... మల్లోజుల - *ఉప్పెన;* కిషన్‌జీపై తల్లి వలపోత - *భారతి;* వీరునికి చావు లేదు - *దప్పు రమేష్;* కిషన్‌జీకి లాల్ సలామ్ - *భూ సాంబశివరాజు;* ప్రజల మనిషి - *అరుణ్;* అతడు - *జనస్వప్న;* అతనొక సజీవ చైతన్యం - *సుజాత;* అజేయసైనికులై బతకండి! - *భాను;* పిల్లలనూ, పిట్టలను కాపాడుకుందాం - *మిడ్కో;* మొలిచే మొలకల్లో జీవిస్తాడని - *జీవిక;* యుద్ధం అనివార్యమే - *కె.బాల్జి;* ఒక యోధుని కలల ప్రపంచం, కలలు కనుగుడ్లు చిట్లిన రాత్రి - *డా. కాసుల లింగారెడ్డి* కవితలు రెండు; గుట్ట, ఎర్ర నక్షత్రం - *శాఖమూరి రవి* కవితలు రెండు; వేలాది మధురమ్మలకు వందనాలు, కాలాన్ని ఉరితీసే గానం, బాల్యం కోసం, రహదారి - *ఆర్. శశికళ* కవితలు నాలుగు; కొన్ని సీతాకోకచిలుకలు ఎగరగలవు - *అనామధేయుడు;* ఆదర్శం....., వాడి నెరవేరని కల - *కెక్యూబ్ వర్మ* కవితలు రెండు; ధృవతార కోసం... - *వికుల మల్లేష్;* జోహార్ ! - *బాలసాని రాజయ్య;* మృత్యుంజయుడు - *కెనరీ;* అసిధారా వాహిక - *చైతన్యప్రకాశ్;* మనసు పొరలను తొలగించి చూస్తే...... - *మధురశ్రీ;* పోరే మార్గం - *రాజేష్ లింగంపల్లి;*

**కరపత్రాలు (60-63)**
విప్లవ రచయితల సంఘం 23వ రాష్ట్ర మహాసభలు;
భూమయ్య, కిష్టాగౌడ్ సంస్మరణలో జీతెన్ కళాబృందం
ఉరిశిక్ష రద్దు, విడుదల కోసం !

**కథలు (63-81)**
తల్లి ప్రేమ - *మిడ్కో*
ఎఫ్‌డిఐ - *సుజాత*
మంత్రాలకి చింతకాయలు! - *బి. అనూరాధ*
కొత్త చదువు - *బి. భానుమతి*

**పుస్తక పరిచయం (82-86)**
వాస్తవికత, మనోవిశ్లేషణల మేలు కలయిక లేర్మంతోవ్ నవల 'మన కాలం వీరుడు' - *ఎస్.వి.ఎస్. నాగభూషణాచార్యులు*

**అనువాదం (86-90)**
గతితార్కిక భౌతికవాదం - *ఐరా గొలోబిన్*
స్వేచ్ఛానువాదం: కొడవటిగంటి రోహిణీప్రసాద్

**నవల సీరియల్ (90-98)**
గుమ్మెటమోత (14) - *పాణి*
(చివరి భాగం...)

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
చిరునామా: ఎస్. రవికుమార్, 5-1307, దొరసానిపల్లె రోడ్, ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516360. సెల్ : 9866021257
విడి సంచిక వెల : రు. 10; సంవత్సర చందా : రు. 100; జీవితచందా : రు. 1000

రెండవ కవర్ పేజి : కిషన్‌జీ సంస్మరణ సభ (12 డిసెంబర్ 2011) దృశ్యాలు; **ఫొటోలు** : రాంకి

కరపత్రం

# కామ్రేడ్ కిషన్‌జీ హత్య గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమే! అమరుడు కామ్రేడ్ కిషన్‌జీ విప్లవ ఆశయాన్ని కొనసాగిద్దాం!

- విరసం

మల్లోజుల కోటేశ్వరరావు 1954లో పెద్దపల్లిలో మధురమ్మ కడుపున పుట్టిన రెండో సంతానం. పెద్దపల్లి హైస్కూల్‌లో చదువుకొని 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోకి ఆకర్షితుడై కరీంనగర్ కాలేజీలో చదువుతుండగా 1972 తెలంగాణ ఉద్యమంలో జైలుకు వెళ్లివచ్చాడు. తెలంగాణలో కొండపల్లి సీతారామయ్య, కె.జి. సత్యమూర్తి, కొల్లిపర నరసింహరావు, చక్కిళ్ల ఐలయ్యలు అప్పటికే ఆరంభించిన శ్రీకాకుళ పంథా మార్క్సిస్టు-లెనినిస్టు ఉద్యమంలోకి కరీంనగర్ మొదటి ఆర్గనైజర్‌గా వెళ్లిన కిషన్ ద్వారా ప్రవేశించాడు. 1974లో సి.పి.ఐ. ఎం-ఎల్ (సి.ఒ.సి.) ఏర్పడే నాటికి రీజనల్ ఇంజనీరింగ్ కాలేజి విద్యార్థి సూరపనేని జనార్దన్, లాల్‌బహదూర్ కాలేజీ విద్యార్థి మురళీమోహన్ రెడ్డితో పాటు కరీంనగర్ విద్యార్థులంతా మల్లోజుల కోటేశ్వర్‌రావు నాయకత్వంలో రాడికల్ భావాలవైపు మళ్లారు. 1974 అక్టోబర్‌లోనే రాడికల్ విద్యార్థి సంఘాన్ని ఏర్పాటు చేసి 1975 ఫిబ్రవరిలో హైదరాబాద్‌లో ప్రథమ మహాసభలు నిర్వహించి నీళ్లు నములుడు లేకుండా నూతన ప్రజాస్వామిక విప్లవంలో అవిభాజ్య భాగమే విద్యార్థి ఉద్యమమని ప్రకటించారు.

1975 జూన్26న ఎమర్జెన్సీ ప్రకటించగానే ఆర్.ఎస్.యు. నాయకత్వం ఎక్కువ మంది అజ్ఞాత జీవితానికి వెళ్లారు. ప్రాథమిక హక్కుల్ని హరించిన ఎమర్జెన్సీతో పాటు ఇందిరాగాంధీ ఇరవై సూత్రాల పథకాన్ని ప్రకటించింది. భూమిలేని వారికి భూమి, ఇల్లులేని వారికి ఇల్లు, గొడ్డు, గోదా, మేకా ఇస్తానన్నది. అజ్ఞాతంలోకి వెళ్లిన రాడికల్ విద్యార్థులు కరీంనగర్ జిల్లాలో ఇరవై ఒక్క నెలలపాటు భూసంబంధాల అధ్యయనం చేశారు. అధ్యయనంతోపాటు ప్రతిఘటన నిర్మించారు. ఫలితమే 1978

> **స్థలం :** సుందరయ్య విజ్ఞాన కేంద్రం, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు
>
> **తేది :** 12 డిసెంబర్ 2011, సోమవారం,
>
> **సమయం :** సా. 6 గం నుంచి రాత్రి 9.30 గంటల వరకు
>
> **అధ్యక్షత :** వరవరరావు
>
> **వక్తలు:** విమల, జె.వి. చలపతిరావు, జి. కళ్యాణరావు, పద్మకుమారి, ఉ.సా., గద్దర్, అల్లం నారాయణ, చిలుకా చంద్రశేఖర్, గంటి ప్రసాదం, మద్ది వెంకట్‌రెడ్డి, నల్లాని స్వామిరావు

**జైత్రయాత్ర! జైత్రయాత్ర! దోపిడిపై దండయాత్ర!**
**లాంగ్‌మార్చ్! లాంగ్‌మార్చ్! ఆగిపోదు లాంగ్‌మార్చ్!**

జగిత్యాల జైత్రయాత్ర ప్రారంభించి, ముప్పై మూడేళ్ళుగా మడమ తిప్పకుండా 'లాంగ్‌మార్చ్' చేస్తూ దోపిడిపై 'పీపుల్స్‌వార్' ప్రకటించిన కిషన్‌జీ, అతని ముందూ వెనకల, అతనితో కలిసి నడిచిన, నడుస్తున్న విప్లవకారులంతా ఎక్కడినుంచి వచ్చారు? ఎట్లావచ్చారు? వాళ్ల కలలు, ఆదర్శాలు ఏమిటి?

మల్లోజుల కోటేశ్వరరావు మావోయిస్టు కిషన్‌జీగా ఎట్లా మారిపోయాడు? తండ్రి వెంకటయ్య తెలంగాణ విముక్తి పోరాటంలో పాల్గొన్న నాటికే సంస్కృత పదబంధం 'మల్లావఝుల' నుంచి విముక్తమయి మల్లోజుల ఇంటి పేరయింది. తెలంగాణ సాయుధ రైతాంగ జైత్రయాత్ర నాయకత్వ విద్రోహం వల్ల అర్ధాంతరంగా ఆగిపోయింది. నల్లగొండ, వరంగల్ జిల్లాల నుంచి సరిగా కరీంనగర్‌కు విస్తరించకుండానే విరమణకు గురయింది. కరీంనగర్ జిల్లా కమ్యూనిస్టు పార్టీ నిర్మాత అనభేరీ ప్రభాకరరావు అమరుడయ్యాడు. కరీంనగర్ చూపు జాపా లక్ష్మారెడ్డి విద్యార్థి యువతరానికి ఆ కుంపటి అడుగున రగులుతున్న నిప్పు అందించాడు. పెద్దపెల్లిలో తెలంగాణ పురాతత్వ చరిత్ర పరిశోధకుడు రాజారాంసింగ్ ఈమట్టిలో దాగిన తిరుగుబాటు అస్థికల మూలుగులు తవ్వితీసాడు. గోదావరి రెండు దరులను ప్రవాహం కలిపినట్లుగా తెలంగాణ పోరాటాన్ని నక్సల్బరీ పోరాటంలోకి మళ్లించిన భూమయ్య, కిష్టాగౌడ్‌లు ఈ తరానికి ఆదిలాబాద్, కరీంనగర్ జిల్లాల్లో ఉప్పందించారు. అప్పటికే శ్రీకాకుళ రైతాంగ పోరాటంతో పాటు తెలంగాణలో ఉవ్వెత్తున ఎగిసిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం, ప్రత్యేకించి విద్యార్థులను ఆకర్షించింది. అది 1968లో ఫ్రాన్స్‌లో వెల్లువెత్తిన విప్లవ విద్యార్థి ఉద్యమం వంటిది. మల్లోజుల కోటేశ్వరరావు తరమంతా అట్లా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నుంచి, జైలు నిర్బంధాల నుంచి ఉత్తర తెలంగాణలో నక్సల్బరీ వసంత మేఘగర్జనకు కూడా గంప ఎత్తిన వాళ్లయ్యారు.

1968 అక్టోబర్‌లో ట్రిగర్ మీద వేళ్లతో వరంగల్‌లో ప్రవేశించిన 'సృజన', విప్లవ అధ్యాపక, విద్యార్థి తేజమై జమ్మికుంటలో తీగసాగిన 'విద్యుల్లత' ఈ తరాన్ని శ్రీకాకుళ పోరాటంతో అనుసంధానించినవి. ఫ్రాన్సులో రెక్కవిప్పిన రెవల్యూషన్' సుడిగాలి విసురును శ్రీశ్రీ భాగ్యనగర్ విజయకుమార్ ద్వారా కరీంనగర్‌లో ఆవిష్కరించాడు. 'ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి' అని అట్లా లాంగ్'మార్చ్' ప్రారంభమైంది. కొనసాగుతున్న వాళ్లుగాక అమరులలో నల్లా ఆదిరెడ్డి, మల్లోజుల కోటేశ్వరరావు, సాహు, సాయిని ప్రభాకర్ మొదలైనవారు ఆద్యులు.

**అమ్మా! మమతమ్మ గురించి ఒక్కమాట!**

ఓ మాట మమతమ్మ రైల్వేమంత్రి గురించి చెప్పకుంటే ఈ లేఖ అసంపూర్ణమే అవుతుందే. సింగూర్ - నందిగ్రామ్‌ల పోరాటం ఆమెకు సౌభాగ్యాన్ని తెచ్చాయే. కాని ఈ సౌభాగ్యాన్ని ఇచ్చిన ప్రజలు ముఖ్యంగా మహిళల నుదిటి బొట్టు చెరపడం అపుడే ప్రారంభమైపోయిందే అమ్మా.... సింగూరు భూమి వెనక్కు రానేలేదు. నందిగ్రామ్‌లో కెమికల్ హబ్ తాత్కాలికంగా నిలిచినా పక్కన సమాచార్‌లో ఈ హబ్ నిర్మాణానికి రంగం సిద్ధమైంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కాగింతపై అధికారికంగా చేయాల్సిందంతా చేశాయి. ఈ సమయంలో కలకత్తాలో రాజార్‌హట్ అనే ప్రాంతంలో పెద్ద ఉపమహానగరం నిర్మాణం కోసం భూముల కుంభకోణం నడిచింది. సిపిఎం - తృణమూల్ కాంగ్రెస్ - ప్రభుత్వ బ్యాంకులు కలిసికట్టుగా జరిపిన లావాదేవీలు, నిర్దాక్షిణ్య హత్యలు ఇప్పుడు బెంగాల్ ప్రజలలో నిత్య చర్చగా మారాయి. ఈ వివాదంలో 60 మంది రైతులు మరణించారు. 120 మందికి పైగా రైతులు అదృశ్యం అయ్యారు. రాజార్‌హట్ రణరంగంగా మారింది. సెజ్‌ల కోసం ఇప్పుడు వంద శాతం భూ స్వాధీన విధానం ముందుకు వచ్చింది. ఈ పాలసీనే రాజార్‌హట్‌లో అమలు జరిగింది. మేకల తినేవాడి చోట ఏనుగుల తినేవాడు వచ్చిన ఉదంతంగా మారింది పరిస్థితి. మమత రోజుకో రైలుకు పచ్చజెండా చూపుతున్నారు. నిన్న-నేడు ఇఫ్తార్ విందులు, రిజ్వాయన్ తల్లితో సమావేశాలు జరుపుతూ ఓట్ల గారడీ నడుపుతున్నారు. ఇప్పుడు కేంద్రంలో కాంగ్రెస్ కుడిచేత్తో మమత పార్టీనీ, ఎడం చేత్తో 'వామ' పక్షాలనూ పట్టుకుని ప్రజా వ్యతిరేక విధానాలు అమలుపరుస్తున్నది.

అందుకే అమ్మా... పోరాటం ఒక్కటే ప్రజల జీవితాల్లో వెలుగులను అందిస్తుంది. పండుగలూ పబ్బాలలోనే కాదు నిత్యజీవితంలోనూ తిండి-ఇల్లు-బట్ట ప్రజాస్వామ్య హక్కులను అందిస్తుంది. ఈ హక్కుల సాధన కోసమే జనం పోరుబాటలో ఉన్నారు.

**- కిషన్‌జీ**

(కిషన్‌జీ తన తల్లి మధురమ్మకు రాసిన లేఖ నుంచి)

సెప్టెంబర్8న 'జగిత్యాల జైత్రయాత్ర'. జగిత్యాల, హుస్నాబాదు, పెద్దపెల్లి,-మెట్‌పల్లి, కోరుట్ల మొదలు లక్సెట్టిపేట, ఆసిఫాబాదుల దాకా నూటయాభై గ్రామాలలో భూమిలేని నిరుపేదలు, వ్యవసాయ కూలీలు దొరల దురాక్రమణలో ఉన్న భూములు, ప్రభుత్వ భూములు స్వాధీనం చేసుకొని ఎర్రజెండాలు పాతి తమకు ఆ భూములపై పట్టాలు కావాలనే డిమాండ్‌తో ఆ సభకు తరలివచ్చారు. ఇది మార్క్సిస్టు- లెనినిస్టు పార్టీ సభ - అంటే మాల మాదుగల సభ అన్నారు దొరలు.

అప్పటికే 1978 ఫిబ్రవరిలోనే వరంగల్‌లో జరిగిన రాడికల్ విద్యార్థి సంఘం రెండవ మహాసభలు విద్యార్థులకు 'గ్రామాలకు తరలండి' పిలుపునిచ్చింది. చెరుకూరి రాజ్‌కుమార్ ఆర్‌ఎస్‌యూ రాష్ట్ర అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. మల్లోజుల కోటేశ్వరరావు జీవన్‌లాల్ (గ్రౌండ్స్(హన్మకొండ)లో ఇరవై ఐదువేల మందితో జరిగిన బహిరంగసభలో సి.పి.ఐ. ఎం-ఎల్ (సి.ఒ.సి.) ప్రతినిధిగా 'ఎన్నికల బహిష్కరణ' పిలుపునిచ్చాడు. అప్పటికే ఆయన పూర్తికాలపు విప్లవకారుడు.

సి.పి.ఐ. ఎం-ఎల్ (సి.ఒ.సి.) కరీంనగర్ జిల్లా కార్యదర్శిగా జగిత్యాల చిన్నమెట్‌పల్లి, రాఘవాపురం, పాత్తెం, రాగిరేడు, షకిల్ల మొదలైన ఎన్నో గ్రామాల్లో ఆయన నాయకత్వంలో ఆయన మాటల్లోనే చెప్పాలంటే నాగేటి చాళ్లల్లో రగిలిన పోరాట జ్వాలలు శత్రువు దృష్టిలో కల్లోలిత ప్రాంతాలు అయిపోయినవి. పోలీసు క్యాంపులు, ఎన్‌కౌంటర్లు, నిర్బంధం, రాజ్యహింస ఒకవైపు, కాళ్ల కింద మట్టి ఎగసి దొరల కళ్లల్లో చిమ్మినట్లుగా ప్రజలు ఎగబడినారు. ఊరుమనది, వాడమనది, బండెడ్లు ఒక్కటైతే దొర ఏందిరో దొర పెత్తనమేందిరో అని ప్రకటించారు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలంలోనే దొరలను సాంఘికంగా బహిష్కరించారు. గ్రామాల్లో ఫ్యూడల్ భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలు బీటలువారినవి. అట్టడుగువర్గాల నుంచి విప్లవానికి నూతన నాయకత్వం రూపొందింది.

ఇందుకు గుర్తింపుగానే సి.పి.ఐ. (ఎం-ఎల్) పీపుల్స్‌వార్ 1980లో ఏర్పడగానే ఆయన దానికి రాష్ట్ర కార్యదర్శి అయ్యాడు. జగిత్యాల పోరాటం క్రమంగా కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాట స్థాయి నుంచి రాష్ట్ర వ్యాప్త రాజ్యవ్యతిరేక పోరాటమైంది. 1981 ఏప్రిల్ 20 ఇంద్రవెల్లి సంఘటన నాటికే ఇది మైదానాల నుంచి అడవిలోకి విస్తరించిన ఉద్యమం కూడా అయింది. సింగరేణి కార్మిక సమాఖ్య ఏర్పడి గోదావరి లోయపొడవునా లక్షా ముప్పై వేల మందితో నల్లా ఆదిరెడ్డి, గజ్జల గంగారామ్, కట్ల మల్లేశ్‌ల నాయకత్వంలో విప్లవ కార్మికోద్యమం నిర్మాణమైంది. ఒక సమగ్రమైన ప్రజా విప్లవంగా వికసించింది.

ఆదిలాబాద్, కరీంనగర్ రైతాంగ పోరాట పాటలు, ఇంద్రవెల్లి, రగల్‌జెండా వంటి కవితా సంకలనాలు, కొమురంభీం నవల ఈ కాలంలోనే వెలువడినవి. విప్లవ సాహిత్య ప్రచారానికి పీస్ బుక్ సెంటర్ ఏర్పడింది.

1981లో ఆంధ్రప్రదేశ్ రైతుకూలీ సంఘం ఏర్పడింది. 1983లో కరీంనగర్‌లో జరిగిన రైతుకూలీ సంఘం మహాసభలు ఐదేళ్ల భూస్వామ్య వ్యతిరేక పోరాటాల విజయ పతాకాల వలె విప్లవోత్తేజాన్ని కలిగించినవి.

1984 జనవరిలో జైలు నుంచి కొండపల్లి సీతారామయ్య గ్రేట్ ఎస్కేప్- అప్పటికే ప్రహ్లాద్‌గా ప్రసిద్ధుడైన మల్లోజుల కోటేశ్వరరావు యుద్ధవ్యూహానికి ప్రతీక అయింది.

1979లో గడ్చిరోలీ, సిరొంచలో పెద్దిశంకర్ ద్వారా, 81లో బస్తర్‌లో మల్లోజుల వేణుగోపాల్ ద్వారా ప్రవేశించిన పీపుల్స్‌వార్

1985 నాటికి ఒక శక్తిగా మారింది. ఆ దశలో దండకారణ్య ఉద్యమాన్ని గైడ్ చేయడానికి మల్లోజుల కోటేశ్వరరావు 'రాంజీ'గా దండకారణ్యంలోకి ప్రవేశించాడు. రాంజీ గోండు బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించి ఉరికంబమెక్కిన గోండ్వానా వంశపురాజు. 'అడవి మనదే' అని ప్రకటించిన రెండవ దశ ఇది.

గోండు, మాండియా, హిందీ భాషలు నేర్చుకొని ఆదివాసుల మధ్యన ఆదివాసులుగా మారి ఆదివాసులను మావోయిస్టులుగా మార్చిన ఈ దండకారణ్య ఉద్యమం ఇవాళ దేశానికే కాదు, ప్రపంచానికే ఆశాదీపంగా మిగిలిన ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి పంథాను 'జనతన సర్కార్' నాయకత్వంలో అమలు చేస్తూ ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ప్రజలపై ప్రభుత్వం ప్రకటించిన యుద్ధాన్ని అపూర్వంగా ప్రతిఘటిస్తున్నది. ఇవాళ దండకారణ్యంలో ఒక సమష్టి నాయకత్వం పటిష్ఠంగా ఏర్పడింది. దండకారణ్యం కావచ్చు, జంగల్ మహల్ కావచ్చు- తగినంత మహిళా నాయకత్వం కూడా రూపొందింది.

తొంభైలలో మల్లోజుల కోటేశ్వరరావు కిషన్‌జీగా బెంగాల్‌లో ప్రవేశించాడు. దీనిని 'ఏటికి ఎదురీత దశ' అనవచ్చు. నక్సల్బరీ పోరాటం 70ల ఆరంభంలోనే సెట్‌బ్యాక్‌కు గురయి 72జూలై 28న చారుమజుందార్ అమరత్వం తర్వాత చీలికలు పీలికలయిన మార్క్సిస్టు-లెనినిస్టు నిర్మాణాలను ఏకం చేస్తూ 'సరోజ్ దత్తా స్మృతి కమిటీ' స్థాయి నుంచి పీపుల్స్‌వార్, మావోయిస్టు పార్టీ నిర్మాణాల దాకా రెండు దశాబ్దాలు ఆయన చేసిన కృషి సాటిలేనిది. ఈ కాలంలోనే ఆయన దేశ వ్యాప్తంగా సి.పి.ఐ. (ఎం-ఎల్) పార్టీ యూనిటీతో సహా మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్‌తోనూ ఐక్యతా కృషిలో పాల్గొని 2004 సెప్టెంబర్ 21న సి.పి.ఐ. (మావోయిస్టు) ఏర్పడే దాకా ఎంతో కీలకమైన భూమిక నిర్వహించాడు. ముప్పై రెండు సంవత్సరాల లెఫ్ట్ ఫ్రంట్ ఫాసిస్ట్ పాలన ఒకవైపు- ఎర్రజెండా, బర్గా ఆపరేషన్ పేరిట కుహనా భూసంస్కరణల పట్ల భ్రమలు మరో వైపు. ఈ స్థితిలో ప్రజల్లో రగుల్కొంటున్న అసంతృప్తి జ్వాలలను ఆయన జంగల్‌మహల్‌లో 'జంగ్' ప్రకటించి లాల్‌ఘడ్‌పై పోరాట ఎర్రజెండాను ఎగరవేశాడు. సంతాల్ ఆదివాసులు ఛత్రధర్ మహతో, లాల్‌మోహన్, శశిధర్ మహతో వంటి వాళ్ల నాయకత్వంలో ఏర్పాటు చేసుకున్న పి.సి.ఎ.పి.ఎస్. అండగా నిలిచి పోరాటక్రమంలో కానూసిదర్హా మిలీషియాలు ఏర్పాటు చేసుకునే దాకా చేయూతనందించాడు. 'నారీ ఇజ్జత్ బచావో' మొదలైన ఎన్నో ప్రజా సంఘాలు ఏర్పాటు చేసుకోవడానికి ఆదివాసుల ప్రభుత్వ ప్రతిఘటనను ప్రోత్సహించాడు. దండకారణ్యం వలెనే జంగల్‌మహల్‌ను ఒక విముక్త ప్రాంతంగా రూపొందించాలని మేదినిపూర్, పురూలియా, బంకురా జిల్లాల్లో విప్లవోద్యమ నిర్మాణం చేపట్టాడు. నక్సల్బరీకాలంలో వలె బెంగాల్ మేధావులందరూ లెఫ్ట్‌ఫ్రంట్ ఫాసిజాన్ని ప్రతిఘటిస్తూ నందిగ్రామ్, సింగూర్, జంగల్‌మహల్‌లో నిర్మాణమవుతున్న ప్రజా ప్రత్యామ్నాయానికి అండగా నిలిచేలా అనుసంధానం చేసాడు. సమన్వయించాడు. సంఘీభావాన్ని కూడగట్టాడు.

కామ్రేడ్ చారుమజుందార్ అమరత్వంతో సెట్‌బ్యాక్‌కు గురయిన ఉద్యమం మళ్లీ నక్సల్బరీని తలపిస్తూ బెంగాల్‌నే కాదు దేశాన్నే కుదిపేసింది. సోనియా, మన్మోహన్, చిదంబరం, బుద్ధదేవ్, మమతా మాఫియాకు ఇది కంటగింపయింది. జంగల్ మహల్‌లో జిందాల్ ప్రవేశించిననాటి నుంచి మిలిటెంట్ ప్రతిఘటనను నిర్మిస్తున్న కిషన్‌జీని మట్టుబెట్టాలని చేయరాని కుట్రలు చేసారు. మీడియా రూపంలో నిఘా వర్గాలను ప్రవేశపెట్టారు. ఉద్యమాన్ని అణచివేయడానికి కేంద్ర రాష్ట్ర సంయుక్త బలగాలను పంపారు. హర్మద్ వాహినీ మొదలు భైరవ్ వాహినీ వరకు ప్రైవేటు మాఫియా సైన్యాలు ఏర్పాటు చేసి జంగల్ మహల్‌పై విరుచుకుపడి గృహదహనాలు, లైంగిక అత్యాచారాలు, చిత్రహింసలు, హత్యలు విచ్చలవిడిగా చేసారు. సోబ్బనీ 'ఎన్‌కౌంటర్'లో గుండుపేల్చి గాయపరిచారు. నిజమైన ఎన్‌కౌంటర్‌లలో తప్పించుకపోగలగడం ఆయనకి మొదటిసారేమీ కాదు. ఎనభైలలో ఒక 'ఎన్‌కౌంటర్'లో ఆయన మణికట్టులోంచి గుండు దూరి చెయ్యి విరిగిపోయింది. ఈసారి కాలునుంచి గుండుదూరి గాయపడ్డాడు. అయినా శత్రువుకు చిక్కలేదు.

చిదంబరం ఇంక 72గంటలు శాంతిపేరిట చర్చల ప్రహసనం మొదలుపెట్టాడు. వరస్వరం ఫోన్‌నెంబర్లు ప్రకటించుకున్నారు. 72గంటలు కాదు 72రోజులు, ఇంకా ఎక్కువ కాలమైనా సరే చర్చలకు అనుకూల వాతావరణం ఏర్పాటుచేసి ఉభయులు ఏకకాలంలో కాల్పుల విరమణ ప్రకటించి పాటించాలని కిషన్‌జీ సూచించాడు. కేంద్ర రాష్ట్ర సంయుక్త బలగాలను వెనక్కి తీసుకొని, గాలింపు చర్యలు నిలిపివేసి, రాజకీయఖైదీలను విడుదల చేసి, పార్టీపై నిషేధాన్ని ఎత్తివేసి, కాల్పుల విరమణ పాటిస్తే తామూ చర్చలకు సిద్ధమేనని గణపతి, ఆజాద్‌లతో పాటు కిషన్‌జీ కూడా ప్రకటించాడు. బెంగాల్ పార్టీ కార్యదర్శి ఆకాశ్ అయితే తృణమూల్ కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత అక్టోబర్3న ఒక నెలకోసం కాల్పుల విరమణ ప్రకటించి ప్రభుత్వం కూడా స్పందించాలని డిమాండ్ చేసాడు. తాను అధికారంలోకి రాకముందు, కేంద్ర మంత్రివర్గంలో రైల్వే మంత్రిగా ఉండికూడా కేంద్ర బలగాలను వెనక్కితీసుకోవాలని డిమాండ్ చేసిన మమతా బెనర్జీ అధికారంలోకి రాగానే తన నిజరూపాన్ని బయటపెట్టింది. తాను మమతాబెనర్జీ కాదు మహమ్మారి బెనర్జీ అని రుజువు చేసుకున్నది కిషన్‌జీ హత్యతో.

నవంబర్ 24న ఎన్‌కౌంటర్‌లో కిషన్‌జీ మరణించినట్లు ప్రకటించినా అప్పటికే ఆయన పోలీసుల నిర్బంధంలో ఉన్నట్లు స్పష్టంగా ప్రజలందరికీ అర్థమవుతూనే ఉన్నది. 23న వెయ్యిమంది కేంద్ర బలగాల చక్రబంధంలో ఉన్నాడని, తప్పించుకున్నాడని ఒకవైపు, మూడు రోజులు లొంగిపొమ్మని ప్రకటించినా వినకుండా వెయ్యి తూటాలు పేల్చినాడని ఒకవైపు ప్రకటించడం ద్వారా ప్రభుత్వం పరోక్షంగా అతడు తమ బందీగా ఉన్నాడని చెప్పినట్లే అయింది. ఢిల్లీలో ఉన్న తనకు ఏమీ తెలియదని ప్రకటించిన మమతా బెనర్జీ తాను ప్రత్యక్షంగా చంపినంత ప్లేటు ఫిరాయింపుతో నిజమైన ఎన్‌కౌంటరేనని నిర్లజ్జగా ప్రకటిస్తున్నది. కరెంటు హీటర్‌పై కాల్చిన గాయాలు, బయోనెట్‌తో కోసిన

గాయాలు, బుల్లెట్ గాయాలతో శరీరమంతా చిత్రహింసలకు గురయి ఛిద్రమైంది. ఎడమ పాదం కాలిపోయి తొలగిపోయింది. కుడిభుజం ఎముకలన్నీ విరిగిపోయి నుజ్జయింది. కుడికన్ను పెరికివేసారు. నోటిలోంచి గుండు పేలిస్తే కింది దవడ ఎగిరిపోయి, వెనకవైపు మెదడు బయటకు వచ్చింది. ఇంత స్పష్టంగా దేహం నిండా చిత్రహింసలు కనిపిస్తుంటే ఢిల్లీ నుంచి చిదంబరం ఇది నిజమైన ఎన్‌కౌంటరేనంటున్నాడు.

మొదటిసారి సిఆర్‌పిఎఫ్ డైరెక్టర్ జనరల్ విజయ్‌కుమార్ ఇది నిజమైన ఎన్‌కౌంటరేనని ప్రకటించడం వల్ల ఇది కేంద్ర, రాష్ట్ర సంయుక్త బలగాల గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమేనని దాచుకోకుండా చెప్పున్నారని ప్రజలకు అర్థమవుతూనే ఉన్నది.

## యుద్ధఖైదీని చంపేశారు

ఒక గడాఫీని చంపినట్లు. ఒక ఉమర్ ముఖ్తార్‌ను చంపేసినట్లు. ఒక అల్లూరి సీతారామరాజును చంపేసినట్లు.

ఆజాద్‌వలెనే 2009 నవంబర్ నుంచి ఎన్‌కౌంటర్లలో అమరులవుతున్న జ్ఞాత, అజ్ఞాత సామ్రాజ్యవాద ప్రత్యర్థుల వలెనే కామ్రేడ్ కిషన్‌జీది కూడా గ్రీన్‌హంట్ ఆపరేషన్‌లో భాగమైన ఎన్‌కౌంటరే!

## మరెందుకీ ప్రజలపై యుద్ధం?

ప్రజల భూమిని, జలాలను, ఖనిజాలను, వనర్లను బడాకంపెనీలకు, బహుళజాతి కంపెనీలకు, సామ్రాజ్యవాదానికి కట్టబెట్టడానికి అన్ని రకాల ఎన్నికల పార్టీలు కేంద్రంలోనూ, రాష్ట్రాల్లోనూ దళారీలుగా మారి చేస్తున్న పాలనను ప్రతిఘటించినందుకు, ప్రతిఘటిస్తున్న ప్రజలకు మావోయిస్టు పార్టీ అండగా నిలిచినందుకు, సాధ్యమైన చోట నాయకత్వం వహించినందుకు 'అంతర్గత ప్రమాదం'గా పరిణమించింది.

కిషన్‌జీ మల్లోజుల కోటేశ్వరరావుగా రాజ్యానికి 'కల్లోలం' సృష్టించడంతో ప్రారంభించి 'అంతర్గత ప్రమాదం'గా పరిణమించేదాకా ఎదిగాడు. మైదానాల్లో మాల, మాదిగ బడుగు వర్గాలను వర్గపోరాటంలోకి సమీకరించడంతో ప్రారంభించి, దండకారణ్యం జంగల్ మహల్‌లో ఆదివాసులను మావోయిస్టులుగా మార్చేవరకు ఎదిగాడు. అందుకే రాజ్యం ఆయనను యుద్ధఖైదీగా బంధించి 'ఎన్‌కౌంటర్' చేసింది.

మోటర్ సైకిల్ యాత్రను ప్రారంభించి క్యూబా నుంచి బొలీవియా దాకా విప్లవ విస్తరణ కోసం ప్రస్థానం చేసిన చేగువేరా వలె పెద్దపెల్లి నుంచి ఢిల్లీ దాకా, జగిత్యాల నుంచి జంగల్ మహల్ దాకా విప్లవ ప్రస్థానం చేసాడు కిషన్‌జీ.

ఈ ప్రస్థానంలో ఆయన ఎంత ప్రజాయుద్ధ సేనానిగా సమర్థంగా నాయకత్వం ఇచ్చాడో అంత ప్రజా సాంస్కృతిక సేనాని భూమికను కూడా నిర్వహించాడు. విద్యుల్లత, సృజన నేపథ్యంలోంచి కవిగా, సాహిత్యవేత్తగా రూపొంది స్వయంగా తెలుగులో కవిత్వం, తెలుగు, హిందీ, బెంగాలీ భాషల్లో వ్యాసాలు విరివిగా రాయడమే కాదు దండకారణ్య రచయితలను కూడా తయారు చేసాడు. విప్లవ రచయితలకు మార్గదర్శకత్వం వహించాడు. 1984లో ఆలకూరపాడులో నిర్వహించిన విరసం ప్రజా కళారూపాల వర్క్‌షాప్ మొదలు ఈనాటి వరకు నిర్వహించబడుతున్న వర్క్‌షాప్‌లకు ఆయన ఆలోచనలు, సూచనలే ప్రాతిపదిక. విరసం ఏడవ దశాబ్దమంతా విప్లవోద్యమ ప్రచారానికి ఎనలేని దోహదం చేసిందని ఇంక యువ, నవ రచయితలను తయారుచేసే బాధ్యతను చేపట్టి, వర్క్‌షాప్‌ల ద్వారా రచనానైపుణ్యాన్ని కూడా పెంపొందించాలని ఆయన పీపుల్స్‌వార్ కార్యదర్శిగా సూచించాడు.

అట్లే ప్రభాత్, ఝుంకార్ తూర్పుకనుమల్లో సాహిత్య, సాంస్కృతిక వ్యక్తీకరణకు నిర్మాణాన్ని ఇవ్వడంలో దోహదం చేసాడు. పిలుపు, క్రాంతి మొదలు పీపుల్స్‌వార్, జంగ్, వ్యాన్‌గార్డ్‌ల వరకు తెలుగు, బెంగాలీ, హిందీ, ఇంగ్లిషు పత్రికల ద్వారా విప్లవ రాజకీయ ప్రచారానికి నాయకత్వం వహించిన వారిలో ఉన్నాడు.

1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో కళ్లు తెరిచిన కోటేశ్వరరావు 72లో మళ్లా ఆ ఉద్యమంలో జైలు నిర్బంధాన్ని చవిచూసి, 97నుంచి ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని గైడ్ చేస్తున్న కేంద్ర నాయకత్వంలో ఒకడుగా 2009 నుంచి తెలంగాణలో విద్యార్థి, బుద్ధి జీవులతో మీడియా ద్వారా ప్రత్యక్ష సంబంధాన్ని నిత్యనూతనంగా నిర్వహించాడు. ఒక చానల్‌లో గంటన్నర సేపు విద్యార్థి నాయకులతో ఫోన్‌లో ప్రశ్నోత్తరాలు నిర్వహించి సాహసిగా అబ్బురపరిచాడు.

అస్తిత్వాల నుంచి జాతివిముక్తి పోరాటాలతో పాటు అంతర్జాతీయ విప్లవోద్యమాల దాకా, మైదానాల్లో దళిత బడుగు వర్గాల నుంచి అడవిలో ఆదివాసీ పోరాటాల దాకా సృజనాత్మకంగా అనుసంధానం సమకూర్చి నాయకత్వాన్ని అందించిన వారిలో ఆయన ప్రముఖుడు. పీడిత పోరాట ప్రజల హృదయాల్లో మావోయిస్టు పార్టీకి ఒక చెదరని గూడు నిర్మించిన వారిలో ఒకడు.

ఒక నూతన మానవ ఆవిర్భావానికి ఆయన, ఆయన విప్లవ సహచరుల ప్రస్థానం ఒక ప్రతీకగా, జైత్రయాత్ర శత్రువుపై దండయాత్రగా మారడానికి ఆయన, ఆయన సహచరుల కృషి ఒక ఆదర్శంగా, విప్లవోద్యమ పురోగమనంలో ఆయన, ఆయన సహచరుల సేవాభావం, ఆచరణ, త్యాగం ఒక ఒరవడిగా నిలిచి ఉంటాయి.

జోహార్ అమరుడు కామ్రేడ్ కిషన్‌జీ!
ఎన్‌కౌంటర్లన్నీ ప్రభుత్వ హత్యలే, రాజ్యహింసలో భాగమే!
నూతన ప్రజాస్వామిక విప్లవం వర్ధిల్లాలి!
విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి!
అమరవీరులకు జోహార్లు!
కిషన్‌జీ హత్య గ్రీన్‌హంట్ యుద్ధంలో భాగమే!
ఎన్‌కౌంటర్లన్నీ హత్యానేరాలుగా నమోదు చేయాలి!
ప్రజాసాహిత్యం, కళలు, సంస్కృతి వర్ధిల్లాలి!
విప్లవం వర్ధిల్లాలి!
అమరవీరుల ఆశయాలను కొనసాగిస్తాం!

-విప్లవ రచయితల సంఘం



# శతకోటి నక్షత్రాల స్వప్నాలు వెలిగించి....

- వరవరరావు

తృణమూల్ కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడినాక జంగల్‌మహల్‌లో పరిస్థితులను పరిశీలించడానికి ప్రజాసాహిత్య సాంస్కృతిక ఐక్యవేదిక కన్వీనర్ కాంచనకుమార్ ప్రొఫెసర్ సరోజ్‌గిరి (ఢిల్లీ యూనివర్సిటీ)ని, నన్ను బెంగాల్‌కు ఆహ్వానించాడు. ఆ సంస్థకు చెందిన రచయితలు, బుద్ధిజీవులతో పాటు మేము సెప్టెంబర్ 20, 21 తేదీల్లో మేదినీపూర్ జిల్లా గోపీభల్లభ్‌పూర్ బ్లాక్, నయాగ్రామ్, జార్‌గావ్ ప్రాంతాలు విస్తృతంగా తిరిగాం. సువర్ణరేఖ నదీతీరం, అటువైపు ఒడిశా, ఇటువైపు సారవంతమైన భూమి - కాని సంతాల్ ఆదివాసుల జీవన పరిస్థితులు మాత్రం పెనంమీంచి పొయ్యిలో పడ్డట్లున్నాయి. కేంద్ర సంయుక్త బలగాలు గ్రామాలలో ఒక భయభీతావహ వాతావరణాన్ని సృష్టిస్తూ తిరుగుతూనే ఉన్నాయి. మావోయిస్టు సానుభూతిపరులని సమాచారమో, అనుమానమో ఉన్న ఇళ్ల మీద దాడులు చేస్తూనే ఉన్నాయి. ప్రతిగ్రామంలోనూ భైరవ్ వాహిని, సంయుక్త పోలీసు బలగాలు కూలగొట్టిన ఇండ్లు, చెల్లా చెదరయిన ఇంటి సామాన్లు హృదయవిదారకంగా కనిపించాయి. భైరవ్‌వాహిని అంటే భైరవ్ అనే పేరుగల తృణమూల్ కాంగ్రెస్ నాయకుడు ఏర్పాటుచేసిన ప్రైవేట్ మాఫియా - వీరికే ముఖ్యమంత్రి మమతా బెనర్జీ పదివేల తుపాకులు ఇస్తానని హామీ ఇచ్చింది. వీరిలో చాలమంది ఇదివరలో వామపక్ష ప్రభుత్వం ఉన్నపుడు హర్మద్‌వాహినిలో పనిచేసినవాళ్లే. అప్పుడైనా ఇప్పుడైనా ప్రభుత్వంలో ఉన్నవారి అండతో తమ హక్కుల కోసం పోరాడుతున్న వారిపై దాడి చేసి తమ పబ్బం గడుపుకునే పరాన్నభుక్కులు - గ్రామీణ రౌడీలు, పైరవీకార్లు వీళ్లు. స్త్రీలను వేధిస్తూ, అత్యాచారాలు చేస్తూ - మావోయిస్టు సానుభూతిపరులనే పేరుతో సంయుక్త బలగాలకు అప్పగిస్తూ తమ ఇష్టారాజ్యాన్ని వీళ్లు అప్పుడూ అమలు చేసారు. ఇప్పుడూ చేస్తున్నారు. సిపిఐఎం కూడ తమ హర్మద్‌వాహినీ కార్యకర్తలను ఒక దెబ్బకు రెండుపిట్టలనే ప్రయోజనంతో భైరవ్ సేనలో చేరమని ప్రోత్సహిస్తున్నదని ఎన్నో గ్రామాల్లో వృద్ధులైన పెద్దమనుషులు మాకు చెప్పారు. మమతా బెనర్జీ బొమ్మ ఇంటిమీద పెట్టుకొని, టిఎంసికి ఓటువేసినా తమ ఇంటిమీద దాడి ఎందుకు జరిగిందో అర్థంకావడం లేదని దేవవ్రార్ అనే వ్యక్తి మాకు చెప్పాడు. మేం చూసేప్పటికి కూడ ఆ ఇంటిమీద మమతా బెనర్జీ బొమ్మ ఉన్న పోస్టర్ ఇంకా ఉంది. ఇక్కడ తగిన కూలీరేట్లు, ఉపాధి దొరకక ముంబై దాకా వెళ్లి లేబర్ పనులు చేస్తున్నవాళ్లు, నది దాటి ఒడిశాకు వెళ్తున్నవాళ్లు ఉన్నారని వాళ్లు చెప్పారు. ఒక మత్స్యకారుడు సగం నిర్మాణమైన ఒక వంతెనను చూపి పిసిపిఏ (పీపుల్స్ కమిటీ అగెయినెస్ట్ పోలీస్ అట్రాసిటీస్) కాలంలో అది చేపట్టారని కాని కేంద్ర సంయుక్త బలగాలు వచ్చి ఆ నిర్మాణాన్ని ఆపి వేసాయని చెప్పాడు. అగ్రగామి కృషక్ మజ్దూర్ ఐక్యతా అనే సంస్థ ఇక్కడ కష్టజీవులను ఐక్యం చేయడానికి పనిచేసేది. బచిర్‌కువార్‌లో సావిత్రి బేరా, నరేంద్రబేరా మొదలైనవాళ్ల కూల్చబడిన ఇళ్లు చూసాం. బొర్దా గ్రామంలో స్త్రీని చెరిచారు. అగ్రగామి కృషక్ మజ్దూర్ ఐక్యతా సమితి సభ్యులనెందరినో అరెస్టుచేసారు. నిర్మల్‌సర్దార్ బెల్‌పహాడీ, సిధుశరణ్, ఉమాకాంత్‌మహతో మొదలైన నాయకులను

> పూసలలో దారం వలె ప్రజాయుద్ధం దారి పొడుగునా.... ఇప్పుడు వృద్ధాప్యంలోనూ, అరవైకి దగ్గర పడుతూనూ ఉన్నవాళ్లంతా బాల్యాన్ని తలచుకున్నట్లు ఒక నాస్టాల్జియా లాగా జగిత్యాల జైత్రయాత్రను తలచుకుంటున్నారు. కాని కిషన్‌జీకి అంతకన్నా గర్వించదగిన పీపుల్స్‌వార్ యవ్వనం, జనతన సర్కార్ ప్రౌఢయవ్వనం, నందిగ్రామ్, సింగూర్, జంగల్‌మహల్ ఏబయ్యోపడి ఉన్నాయంటే అది ఎంత ధన్యజీవితం. ముఖ్యమంత్రి కాన్వాయ్‌లో పేల్చిన మందుపాతర 'దుస్సాహసం' గురించి మాట్లాడేవాళ్లు లాల్‌ఘడ్ ఆదివాసీ జీవన సంస్కృతుల మూలాల కింద పెట్టిన జిందాల్ మందుపాతర ఎప్పుడైనా పేలవచ్చునని, ఎప్పుడైనా ఆలోచించారా? సోంపేట, కాకరాపల్లి తాత్కాలిక విజయాలకన్నా ముందు మైదాన ప్రాంతాల సెజ్ వ్యతిరేక పోరాటాలకు ఒరవడి పెట్టిన నందిగ్రామ్, సింగూరుల ఇవ్వాటివరకు విజయాల వెనుక విప్లవశక్తుల ఐక్య సంఘటనాకృషిని ఎవరైనా అధ్యయనం చేసారా? 'మమతా బెనర్జీని ముఖ్యమంత్రిగా చూడాలనుకున్నాడ'ని ఆయన నోట విన్నట్లుగా మాట్లాడుతున్న మీడియా వ్యాఖ్యాతలు, మేధావులు 'ఆగస్టు పదిహేను విద్రోహం గురించి చెప్పందే ఆరోజు నాకు అన్నం సయించదు' అని చెరబండరాజు అన్నట్లు 'ఓ మాట మమతమ్మ (రైల్వేమంత్రి) గురించి చెప్పకుంటే ఈలేఖ అసంపూర్ణమే అవుతుంద'ని, 'ఇపుడు కేంద్రంలో కాంగ్రెస్ కుడిచేత్తో మమత పార్టీని, ఎడంచేత్తో వామపక్షాలను పట్టుకొని ప్రజావ్యతిరేక విధానాలు అమలుపరుస్తున్నది' అని అమ్మకు రాసిన ఉత్తరం చదివారా? చర్చలు ఆత్మహత్యాసదృశం అంటున్న విశ్లేషకులు ప్రజాసేవలో ప్రాణాలొడ్డడానికే విప్లవకారులు సాయుధులయ్యారని, ప్రజావిముక్తికన్నా మిన్న తమకే ఎత్తుగడా, వ్యూహమూ లేవనే గతితార్కిక సత్యాన్ని గ్రహిస్తారా?

చంపేసారు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రభుత్వాల చిరునామాలు మారినవి, దాడిచేసే మాఫియాసైన్యం మారింది గానీ కేంద్రసంయుక్త బలగాల దాడులు, అరెస్టులు, గాలింపులు నిరాటంకంగా కొనసాగుతూనే ఉన్నాయి.

మొదటిరోజు రాత్రి ఒక ఆదివాసీ గ్రామంలో ఆగాము. మాకోసం వేలాదిమందితో ఆదివాసీ సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేసారు. మర్నాడు సెప్టెంబర్ 21న జార్‌గావ్‌లో జరుపతలపెట్టిన బహిరంగసభ, సాంస్కృతిక ప్రదర్శనలో పాల్గొనడానికి వీళ్లంతా ఆ బ్లాకులోని గ్రామాలనుంచి తరలివస్తూ ఆరాత్రి అక్కడ ఆగారు. అప్పటికే మర్నాడు ఆ సభకు ఇచ్చిన అనుమతి నిరాకరించారని, తృణమూల్ కాంగ్రెస్ నాయకుణ్ని ఒకరిని మావోయిస్టుపార్టీ వాళ్లు చంపారని అక్కడ ప్రచారంలో ఉంది. ఆరాత్రి సంతాలీ ఆదివాసుల ప్రసంగాలు, సాంస్కృతిక ప్రదర్శనలు చూస్తుంటే, అక్కడి నైసర్గిక వాతావరణానికి, చైతన్యానికి మేం ముగ్ధులమైపోయాం. మర్నాడు దగ్గరనే ఉన్న సెలయేరులో స్నానం చేయడానికి వెళ్లినపుడు ఢిల్లీనుంచి వచ్చిన సరోజ్‌గిరి అయితే ఈ అడవిని, ఊళ్లను, ప్రకృతిని, మనుషుల్ని వదిలి వెనక్కి పోవాలని అనిపించడం లేదని, అందమైన పరిసరాలే కాదు, జీవంతో తొణికిసలాడే మనుషుల్లో ఇక్కడ ఏర్పడబోయే మరోప్రపంచం కళ్లకు కడుతున్నదన్నాడు.

పశ్చిమ మేదినీపూర్ రూప్‌నారాయణ (గంగ), సువర్ణరేఖ నదులమధ్యన ఉంటుంది. రూప్‌నారాయణ్ నది దాటిన దగ్గర్నించీ, జంగల్ మహల్‌లో ప్రవేశించిన దగ్గర్నించి మా కళ్లు ఎవరికోసమో వెతుకుతున్నాయని మాకందరికీ అర్థమవుతూనే ఉన్నది. మా మాటల్లో ఆ పేరు వస్తూనే ఉన్నది. గ్రామాలు తిరిగి ఆగిన మొదటిరోజు రాత్రి ఏదో ఆశతో నిరీక్షణ. మేం కలుస్తాడని ఆశిస్తున్న మనిషి అక్కడి మనుషుల మాటల్లో, చేతల్లో కనిపిస్తున్నాడు. వాళ్ల కళ్లలోని ప్రేమాభిమానాల్లో, గౌరవంలో కనిపిస్తున్నాడు. ఆటపాటల్లో వేసే ప్రతి అడుగులో కనిపిస్తున్నాడు. పోల్చుకోగలిగితే ఆయన అక్కడ రూప్‌నారాయణ్ నదిలా ప్రవహిస్తున్నాడు. కాని ఆయన సాహసగాథలు, అజ్ఞాత జీవితంలోని బహిరంగ విన్యాసాలు, పోల్చనీ 'ఎన్‌కౌంటర్' దాకా నిత్యమూ వింటున్న మాటలు, దేశమంతా, బహుశా మీడియా ప్రపంచమంతా ముద్రపడిన ఒక ఆహార్యం - మమ్మల్ని వదలడం లేదు. సాంస్కృతిక ప్రదర్శన ముగిసి తిరిగివచ్చిన తర్వాత నిద్రపోతే మిస్ అయిపోతామో ఏమోనని అట్లా రాత్రంతా మాలో మేమే మాట్లాడుకుంటూ, గ్రామస్తులతో మాట్లాడుతూ గడిపాం. రవీంద్రుని స్ట్రేబర్డ్స్ కవితల్లో చెప్పినట్లు మేం నిద్రపోతే నీ అడుగుల సవ్వడికి నిద్రాభంగమవుతుందని తిరిగిపోతావేమోనన్నట్లు ఎవరి మనసుల్లో వాళ్లం ఎదురుచూస్తున్నాం.

కాని ఆయన రాలేదు. వచ్చి తీరుతాడనుకున్న మనిషి రాలేదు. కొలకత్తా నుంచి పంపిస్తూ కాంచన్‌కుమార్ చెప్పాడు - చాలరోజులయింది కదూ కలిసి - మీరు అంతదూరం నుంచి వచ్చారు. కలవకుండా ఉంటాడా - గుడ్‌లక్ అని. కలిసి మాట్లాడిరండి - మళ్లా 'ఆముఖ్' ప్రారంభిద్దాం. ఈ పీపుల్స్ లిటరరీ కల్చరల్ యూనిట్ ఫ్రంట్‌ను క్రమంగా సామ్రాజ్యవాద వ్యతిరేక సాంస్కృతిక వేదికగా దేశవ్యాప్తంగా విస్తరిద్దాం. తప్పకుండా మీకా కొత్తటానిక్ ఆయన అందిస్తాడు. వెళ్లిరండి అన్నాడు.

ఏడీ, ఏడీ, రాలేదు. కలవలేదు.

మర్నాడు జార్‌గావ్ మీదుగా మరోబ్లాకులో ప్రవేశించాం. జార్‌గావ్ వెళ్లకుండా నిరోధింపబడిన వందలాది మహిళలు అక్కడ సమావేశమై ఉన్నారు. వాళ్లంతా నారీ ఇజ్జత్ బచావో ఆందోళన్ - అనే మహిళా స్వీయగౌరవ సంఘటనకు చెందినవాళ్లు. రోజంతా వాళ్ల సమస్యలు, వాళ్లపైన కేంద్రబలగాల దాడులు, నిన్న హర్మద్ వాహినీ, ఇవ్వాళ భైరవ్‌వాహినీ దాడులు - వీళ్ల ప్రతిఘటనలు - పోటీపడి చెప్పినారు.

జగిత్యాల జైత్రయాత్ర కాలంలో షకిల్ల, రాగినేడు, పాల్తెం, రాఘవాపురం ఒకటేమిటి కరీంనగర్ జిల్లాలో ఎన్నో గ్రామాల్లో భూస్వాములపై, వారి గూండాలపై, పోలీసులపై మహిళలు చేసిన ప్రతిఘటన నా కళ్లకు కట్టింది.

వచ్చిరాగానే ఈ అనుభవాలన్నీ రాయాలని, పుస్తకమే రాయాలని అనుకున్నాను. రెండునెలలు గడిచిపోయినవి. రాయనేలేదు. ఇపుడు నన్ను రాయమని ఒత్తిడి చేసే మనిషి ఏడీ? ఆదేశించే నాయకుడేడీ? మొదటిరోజు రాత్రి ఆయన కలిసి ఉంటే బహుశా హైదరాబాదు చేరగానే రాసి ఉండేవాణ్ని. ఆయన మాటలు నా వాక్యాల్లో. అటువంటి జ్ఞాపకాలు ఎన్నని? వెంటబడి పనులు చేయించే, రాయించే ఆ నాయకత్వం.

ఎమర్జెన్సీ ఎత్తివేయగానే చంచల్‌గూడా జైలునుంచి విడుదలయి వెంటనే అరెస్టయి మళ్లా వరంగల్ జైలుకు పోయాను. 1977 మార్చ్ 31న పార్లమెంటు మీసాను కూడ రద్దుచేసాక విడుదలయ్యాను. ఏప్రిల్ 1న కాలేజీకి పోదామని తయారవుతుండగా పత్రికలో వార్త - కొండపల్లి సీతారామయ్య నాగపూర్‌లో అరెస్టు.

ఎమర్జెన్సీ తొలగిన ఒక స్వేచ్ఛాయుత ఆనందహేల ఒకవైపు. ఈ వెల్లువను ఒక ప్రవాహంలోకి మళ్లించే నాయకుడు - ఇపుడా అరెస్టు- అనే నిర్వేదం ఒకవైపు. ఆ కాలమంతా 1978 సెప్టెంబర్ 8 జగిత్యాల జైత్రయాత్ర దాకా నన్ను ఉత్సాహపరచి, నిలబెట్టి జగిత్యాల జైత్రయాత్రకు తీసుకువెళ్లి మనిషిని చేసిన వాడు మల్లోజుల కోటేశ్వరరావు. 1972 నుంచే పెద్దపల్లి, గోదావరిఖని మొదలైన చోట్లకు సృజన తీసుకపోవడానికి ప్రతినెలా మళ్ల రాజిరెడ్డినయినా పంపేవాడు. తానైనా వచ్చేవాడు. ఎమర్జెన్సీ ఎత్తివేసి కెవిఎస్ అరెస్టయి నేను నిరుత్సాహపడినానని గ్రహించాక తానూ, తన సహచరులతో పాటు వచ్చి కుమార్‌పెల్లి మా ఇంట్లో తెల్లవార్లూ చర్చలు చేసేవాడు. ఆయన దృష్టంతా విప్లవ ప్రచారంలో ఎట్లా ఇంకా మనుషుల్ని కూడగట్టాలనేదే. ఒక్కోసారి అనిపించేది - ఎందుకిట్లా పిల్లవానికి చెప్పినట్లుగా చెప్తున్నాడు - నా లోపలినుంచి రావాలిగదా అని. కాని 1972-73 నుంచే ఇతణ్ని, ఇతని కరీంనగర్ సహచరులను చూస్తున్నాను కదా - ఇంక ఏ యావ లేకుండా పల్లెలు, పల్లెల్లో

నిరుపేద ప్రజలు, వాళ్ల మధ్యన మసలుతూ, వాళ్ల గురించే ఆలోచిస్తూ, వాళ్ల గురించే మాట్లాడే ఈ మనుషుల్ని గురువులుగా స్వీకరించకుండా ఎట్లా ఉంటాం?

1973లో అనుకుంటాను శ్రీశ్రీని తీసుకొని కరీంనగర్ పోయాను - ఇతని ... పైననే. పిడబ్ల్యుడి ట్రావెలర్స్ బంగ్లాలో శ్రీశ్రీ చుట్టూ చేరి ఈ పిల్లలే, కాస్త పెద్దవాడు భాగ్యనగర్ విజయకుమార్ - అప్పుడు విరసం కార్యవర్గ సభ్యుడు శ్రీశ్రీకి అట్లాగే చెప్తున్నారు - కరీంనగర్ చిత్రపటాన్ని, దాని భవిష్యత్ స్వప్నాలను ఆయన ముందు పరుస్తున్నారు. తేడా అల్లా 1977 నాటికి వాళ్లు ఒక రాడికల్ విద్యార్థి సంఘాన్ని నిర్మాణం చేసుకున్నారు. ఎమర్జెన్సీ కాలమంతా మావో నాయకత్వంలో హునాన్‌లో భూసంబంధాల అధ్యయనం చేసినట్లుగా గడ్డివేళ్ల స్థాయి నుంచి ఉత్పత్తి సంబంధాలను అధ్యయనం చేసారు. ఆర్ద్రకార్తె రాగానే ఆర్ద్ర పురుగులు నేలమీద పాకినట్లుగా ప్రబలిన ఎర్రవాతావరణాన్ని కళ్లకు కట్టినట్లు వివరించారు.

రాడికల్ విద్యార్థిసంఘం ఎట్లా పనిచేయాలో నాకున్న శషభిషలను తుప్పు వదిలించినట్లుగా వదిలించారు. వరంగల్‌లో ఆర్.ఎస్.యు. రెండవ మహాసభల ప్రారంభదినం నాడు నాకు అక్షరాల వాళ్లు ప్రభాతసూర్యుళ్ల వలె కనిపించారు. ఆ సూర్యుడు జగిత్యాల నుంచి జంగల్‌మహల్ దాకా విప్లవాకాశంలో ఎంతదూరం పాకిపోయాడు. విప్లవాకాశంలో పాకిపోవడానికి ఎన్ని నేలపగుళ్ల నుంచి, బీళ్లనుంచి, బంజర్లనుంచి, లోయల నుంచి, కొండలనుంచి నిరంతరం భూమితో మాట్లాడుతూ భూమిపుత్రులతో జ్ఞానాన్ని పొందుతూ - రెండుపాదాలూ - దేహం సమస్తమూ నేలమీద నిలిపి ఎట్లా ఆకాశంలో తన బాహువుల్ని చాపాడు.

రాడికల్ యువజనసంఘం కార్యకర్త కందిలచ్చిరెడ్డి బస్సు ప్రమాదంలో మరణించాడు. గ్రామీణ కరీంనగరం. మట్టిరోడ్లు. బస్సులోపల, పైన జనం బస్సు తలుపు ఊడివచ్చి చివరన నిలబడిన లచ్చిరెడ్డి బస్సుకింద పడి చనిపోయాడు. గ్రామగ్రామాన తిరుగుతూ రాడికల్ రాజకీయాలు ప్రచారం చేస్తున్న యువకుడు. సంస్మరణసభకు పెద్దపెల్లికి తీసుకపోయాడు కోటి. దుఃఖమే కానీ రాజ్యం మీద ఆగ్రహం. ప్రమాదమే కాని రాజ్యం కుట్ర. ఇవీ మా భావ తీవ్రతలు. సభకు వెళ్లేముందు బిళ్లప్పాలు, చకిలాలు పెట్టి మధురమ్మ అడిగింది 'మావోణ్ని పెళ్లిచేసుకొమ్మనరాదు, నీ వలెనే చదువుకొని, మీ భావాలే చెప్తూ ఉండొచ్చుగదా' అని. ఆయన నావలె పుస్తకాలు కాదు, మనుషుల్ని చదువుకున్నాడని, ఒక విప్లవాచరణను చెప్తున్నాడని ఆమెకు అర్థంగాకనా నన్ను అడిగింది. ఆయన అప్పటికే తమ్ముణ్ణి తయారు చేస్తున్నాడు.

జగిత్యాల ముందు ఎంతో, ఆ తర్వాత అంత. ఎంత నిశ్శబ్దకృషో. అంత విస్ఫోటనం. అది కరీంనగర్ అయి, ఆదిలాబాదు అయి, ఉత్తర తెలంగాణ అయింది. ఏలినవారు 'డిస్టర్బ్' అయ్యారు. 'కల్లోలిత ప్రాంతాలు' ప్రకటించారు. సృజన ప్రతి ఒక్క సంఘటనకూ ఒక సృజనాత్మక క్రానికల్ కావాలనేది ఆయన ఆకాంక్ష. అయింది కూడ. సృజన నిండా కరీంనగర్ అల్లం సోదరుల ఎద ఎగజిమ్మిన సొద సవ్వడులు. ఎందర్ని దించాడు. అల్లం సోదరులనే కాదు, కథలు, పాటలు, పనులే కాదు, ఢిల్లీ నుంచి సురా, సుధేశ్, మోహన్‌రామ్, అశ్వినీకుమార్‌రాయ్, వరంగల్ నుంచి డాక్టర్ రామనాథం - ఆయన మాట ఎంతదూరం వినిపిస్తే, ఆయన చెయ్యి ఎంతదూరం విస్తరిస్తే అంతదూరం మనుషుల్ని కలుపుకవచ్చాడు.

సిరిసిల్లా జగిత్యాల పోరాటాలపై, కల్లోలిత ప్రాంతాల ప్రకటనపై ఎ.పి.సి.ఎల్.సి., పి.యు.డి.ఆర్. - ఎంత సమగ్రమైన నివేదిక. సృజన ఎన్ని సంచికలు కరీంనగర్‌కు అంకితం.

ఆయనకది చాలదు. కరీంనగర్ బాపుగా పిలుచుకునే జాపా లక్ష్మారెడ్డి ప్రతిసభలో చెప్పుండేవాడు - 'మా కరీంనగర్‌కు, మా జగిత్యాలకు వచ్చి ఒకసారి చూడండి' అని. అపుడాయన మొహంలోకి చూస్తుంటే జగిత్యాల బాధల్ని, పోరాటాల్ని చూసినట్లే అనిపించేది. కుక్కలగూడూరులో భూమయ్య, కిష్టాగౌడ్‌ల కోసం, అప్పటిదాకా అమరులైన కరీంనగర్, ఆదిలాబాదు విప్లవకారుల కోసం నిర్మాణమైన స్థూపాన్ని ఆవిష్కరించడానికి అపుడక్కడ సిఓగా ఉన్న దేవేందర్‌రెడ్డి, జిల్లా నాయకుడు కోటి పిలిచారు. దినమంతా జనం మధ్య. వేలాదిగా జనం. బస్సు దిగి మొద్దుబండిలో ప్రయాణం చేస్తుంటే బండినడిపే మనిషి ఆశువుగా పాట చెప్తూ నన్ను రాసుకొమ్మంటున్నాడు. ఆ సాయంత్రం సభలో ఆ తర్వాత కరీంనగర్ జిల్లా పార్టీ కార్యదర్శి అయిన సత్తెయ్య సుదీర్ఘమైన పాట కట్టి పాడాడు. ఆ తర్వాత ఆదిలాబాదు - కరీంనగర్ రైతాంగ పోరాటపాటలు రెండు సంపుటాలుగా సృజన ప్రచురించింది.

ఈ ఉత్సాహం, ఈ సృజనాత్మకశక్తికి దినుసు ఏమిటి? ఎక్కడినుంచి వచ్చింది? ఈ మహాదేవునికి ఈ భూమిస్వప్నం ఏమిటి? ఈ అగ్రహారీకునికి ఈ మట్టిలో పొర్లాడే పిచ్చి ఏమిటి? తండ్రి వెంకటయ్య స్వాతంత్ర్య సమరయోధుడు. తెలంగాణ స్వాతంత్ర్య సమరయోధుడు అంటే కేవలం బ్రిటిషిండియాలో ఇంగ్లీషువాడు వెళ్లిపోవాలని పోరాటం చేయడం వంటిది కాదు. మధ్యయుగాల ఫ్యూడల్ భూస్వామ్యాన్ని తలపించే నిరంకుశ నిజాంకు వ్యతిరేకంగా పోరాడడం. ఊళ్లల్లో దొరలు, పటేళ్లు - పట్వారీలకు వ్యతిరేకంగా పోరాడడం. ఒక దశలో రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడడం - ఇదంతా నిరక్షరాస్యత మధ్యన. ఎట్టిబతుకుల మధ్యన. అక్షరాల బానిసల తిరుగుబాటు. చాలనట్లు దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని సంబురపడుతున్నవేళ ఆ స్వతంత్ర ప్రభుత్వ తొలి సైనిక దాడి అటు తలపైన కాశ్మీరులో, ఇటు కడుపులో దాచుకోవాల్సిన తెలంగాణ కడుపుమీద. మరి స్వాతంత్ర్య సమరయోధుడంటే - ఎన్నిశక్తులకు ఎదురొడ్డి పోరాడినట్లు? ఇంగ్లీషువాడు - నైజాం - గ్రామపెత్తందారు - చివరకు స్వతంత్రభారత సైనిక దాడి.

కనుక ఆ వాతావరణం అగ్రహార వాతావరణం కాదు. పౌరోహిత్య వాతావరణం కాదు. పరాన్నభుక్కు జీవితం కాదు. ఆయనే ఆఖరిరోజుల్లో అమ్మకు రాసిన ఉత్తరంలో - వాడ అంతా ముస్లింలు. రెండు ఇళ్లే బ్రాహ్మలవి. ఆళ్వారుస్వామి 'ప్రజలమనిషి'

నవలలో కంఠీరవం తురకపంతులు ఇంట్లో పెరిగినట్లు. మరొకవైపు గోదావరి మట్టి అడుగున పొరలు చీల్చి తెలంగాణ పురాతత్వాన్ని వివరించిన రాజారాంసింగ్. చరిత్ర పరిశోధకుడు. న్యాయవాది - తల్లినాయన జిజియాబాయితో పోల్చాడు. తాను ఆరంభంలో ఆర్.ఎస్.ఎస్. వాసనలతో శివాజీ కావాలనుకున్నాడు. శివాజీ వారసుడు కాబోయి సీతారామరాజు వారసుడయ్యాడు. ఆ మార్పుకు తొలి పునాది రాజారాంసింగ్ - గట్టుపెల్లి మురళీ, గుండి దామోదరరావు కూడ చెప్పిన తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట కథలు. కరీంనగర్‌లో ప్రజాభేరీ మోగించి అమరుడైన అనభేరీ ప్రభాకరరావు, అమృతలాల్ శుక్లాల ఉత్తేజం.

తానప్పటికే 1969లో 15 ఏళ్ల హైస్కూలు విద్యార్థిగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో కళ్లు తెరిచాడు. మంకమ్మతోటలోని భాగ్యనగర్ విజయకుమార్ - ఫ్రెంచి విద్యార్థి విప్లవం రెక్కవిప్పిన రెవల్యూషన్‌ను పరిచయం చేసాడు. 1970లలో వరంగల్ 'మార్చ్' కవులను పరిచయం చేసాడు. సృజన సరేసరి. జమ్మికుంట కాలేజీ విద్యార్థిగా 'విద్యుల్లత'ను ప్రారంభించాడు. కనుక 72 నాటికి ప్రత్యేక తెలంగాణ మలిపోరాటంలో కోటేశ్వరరావు క్రియాశీల విద్యార్థిగా జైలుకే వెళ్లాడు. అప్పటికే కరీంనగర్ తొలి ఎంఎల్ ఆర్గనైజర్ కిషన్ ప్రభావంలోకి, కెజి సత్యమూర్తి ప్రభావంలోకి, కొల్లిపర నరసింహారావు ప్రభావంలోకి వచ్చి ఉన్నాడు. ఇవి ఒక ఎత్తు - భూమయ్య, కిష్టాగౌడ్‌ల ప్రభావం ఒక ఎత్తు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో పాల్గొని ఈ జెండానట్లా నక్సల్బరీ శ్రీకాకుళాల దాకా మోసినవాళ్లు. కిష్టాగౌడ్ తెలంగాణ పోరాటకాలపు తుపాకి గుండును తన తొడలో ఒక గాయంగా కాదు, ఒక జ్ఞాపకంగా దాచుకున్నాడు. 72లో గోదావరి తీరాన స్నానంచేస్తూ ఒక నక్సలైటు దళం అరెస్టు అయిందని - అందులో భూమయ్య, కిష్టాగౌడ్, గట్టుపల్లి మురళి, గుండి దామోదరరావు ఉన్నారని - ఆ తర్వాత ఎమర్జెన్సీలో భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఉరితీసినపుడు ఈ కథలు, గాథలు, ప్రభావాలు ఎంత గాఢమైనవి. భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షల రద్దు గురించి కరీంనగర్ జిల్లా హుజురాబాదు నుంచి ఆదిలాబాదులో బెల్లంపల్లి, మందమర్రిల దాకా జరిగిన సభలు ఇపుడు గుర్తుచేసుకుంటే అమరులు ఆదిరెడ్డి, సాహు, గంగారామ్, కోటేశ్వరరావుల విద్యార్థి దశలో ఈ ప్రభావం ఏమిటో ఊహించడం కష్టంకాదు. అందుకే ఆయన ఆదిలాబాదు - కరీంనగర్ రైతాంగ పోరాటాల 78-80లలో కుక్కలగూడూరులో ఆ అమరులకు స్థూపనిర్మాణం తలపెట్టాడు. హుస్నాబాద్‌లో 1990లో కరీంనగర్ జిల్లా అమరులకు స్థూప నిర్మాణం దాకా ఆయన రక్తంలో ఆ అమరుల త్యాగాలు అందించిన పోరాటజెండా చలనతీవ్రతను మనం గమనించవచ్చు. ఇవన్నీ చేయడమే కాదు, ఇదంతా రికార్డు కావాలి- మల్కాజిగిరిలో ఆర్‌కె ఇంట్లో కూర్చొని - తన వేళ్ల చివరలో, పెదవుల మీద, చేతుల్లో - అప్పటిదాకా చేతల్లో ఉన్న కరీంనగర్ పోరాట పుటలు విప్పాడు. నాగేటిచాళ్లల్లో.. రగిలిన విప్లవాగ్నులను విత్తుతూ పోయాడు. నేనట్లా చాలుపెడుతూ పోతాను - లక్ష్మీరాజ్యం, పోశెట్టి, కళ్యాణం వెంకటేశ్వరరావు, కంది లచ్చిరెడ్డి వంటి అమరులు ధారబోసిన రక్తంతో బతుకమ్మ సాంస్కృతిక పోరాటమే కాదు, బంజర్ల పోరాటమే కాదు, ఒక విముక్తి పోరాటమే గాదు - తెలంగాణ రైతాంగ పోరాటపు అనుసంధానంతో రాద్దాం - మళ్లీ మునుముందుకు సాగిన కరీంనగర్ రైతాంగపోరాటం గురించి పోరాడుతూ పోరాట చరిత్రను నమోదు చేయడం ఇట్లా జగిత్యాలలో ప్రారంభమై దండకారణ్యంలో ఒక చైతన్యపూర్వక సంప్రదాయం అయింది. అదీ ప్రహ్లాదునివంటి వాళ్ల పట్టుదల. రాంజీ రణనీతి.

కేవలం ఒక రిపోర్టు కాదు. క్రానికల్ కాదు. అందులో కవిత్వం ఉండాలి. పాటలుండాలి. సంఘటనలు ఉండాలి. జీవితం ఉండాలి. అది ఒక సజీవ సంచలనదృశ్యకావ్యం కావాలి.

1980లో సిపిఐ (ఎంఎల్) (పీపుల్స్‌వార్ ) ఏర్పడి కోటేశ్వరరావు ప్రహ్లాద్‌గా రాష్ట్రకార్యదర్శి అయ్యాడు. విరసంలో కొందరికి కా.కెఎస్ ఆయనను పరిచయం చేసినపుడు - 'ఈ అర్భకుడా?' అని ఆశ్చర్యపోయాడు కెవిఆర్. ఆ బక్కపల్చని- పిడికెడు మీసాలు, పద్మునైన ఎత్తుపళ్లు, తీవ్రమైన, విశాలమైన కళ్లు - పెదవులపై చిరునవ్వు దప్ప - రూపసి గాని ఆ మనిషి - కెఎస్ వంటి గంభీర విగ్రహం ముందు - మొదట అలాగే అనిపిస్తుంది. క్రమంగా ఆయన రాష్ట్రమంతటా విస్తరించడమే కాదు, విరసం మీద ఆయన ముద్ర చెరిగిపోనిది. ఒక దశాబ్దం పాటు నక్సల్బరీ, శ్రీకాకుళ పంథాలో తెలుగు సమాజాన్ని ప్రభావితం చేసిన విరసం - నూతన రచయితలను తయారుచేయాలని - లూసున్ వంటి - కాల్ టు ఆర్మ్స్ - యువకులకు పోరాటపిలుపు ఇచ్చే సాంస్కృతిక అగ్రగామి కావాలని - అందుకు అన్ని సాహిత్య ప్రక్రియల్లో - వర్క్‌షాప్‌లు నిర్వహించాలని సూచించినవాడు ఆయనే. ఆలకూరపాడులో 1984లో ఎనిమిదిరోజుల పాటు ప్రజాకళారూపాల వర్క్‌షాప్ అపూర్వంగా జరగడానికి ఆయన పరోక్షదోహదం ఎన్నటికీ మరువలేనిది.

ఆయన మొత్తం విప్లవజీవితంలో నగరం (హైదరాబాదు) కేంద్రంగా పనిచేసింది బహుశా ఐదేళ్లే. అప్పటిదాకా మైదానాలను మండించాడు. మాలమాదిగలను, బడుగువర్గాలను, వ్యవసాయ కూలీలను, భూమిలేని నిరుపేదలను, మధ్యతరగతి రైతుల నుంచి మధ్యతరగతి మేధావుల వరకు కదిలించాడు. జార్జి ఫెర్నాండెజ్ మొదలు సురేంద్రమోహన్ దాకా దేశంలోని ప్రజాస్వామ్యవాదులను, మేధావులను ఒక చుట్టు చుట్టివచ్చాడు. ఎవరినీ కరీంనగర్, ఆదిలాబాదులకు రాకుండా వదిలిపెట్టలేదు.

దేవేందర్‌రెడ్డిని 'ఎన్‌కౌంటర్' చేసి, కరీంనగర్ జిల్లాలో ఎన్‌కౌంటర్లు, నిర్బంధం పెరిగితే నిజనిరూపణ కోసం గోదావరిఖనిలో సభ పెట్టి జార్జి ఫెర్నాండెస్‌ను తీసుకవచ్చాడు. అట్లే అంకం నారాయణ, వాసం గజేందర్‌ల ఎన్‌కౌంటర్ సందర్భంగా మళ్లా ఫెర్నాండెస్‌ను తీసుకవచ్చాడు.

సిరొంచ అడవుల్లో మహమ్మద్‌బిన్‌పేటలో 74 నవంబర్ 2న పెద్దిశంకర్ ఎన్‌కౌంటర్ అయితే కోబడ్‌గాంధీ, షోమాసేన్ (సిపిడిఆర్, బొంబాయి)లను పిలిపించి చంద్రపూర్‌లో అడ్వొకేట్‌గా

పనిచేస్తున్న కృష్ణారెడ్డితో, అల్లం రాజయ్యను, నన్ను కలిపి నిజనిరూపణకు పంపించాడు. వెయ్యిచేతులతో పనిచేస్తాడా అని ఆశ్చర్యమనిపించింది.

కరీంనగర్ పోరాటంలో ఒక పరిశీలన - ఆ జిల్లాలో పెద్దపెల్లి, జమ్మికుంటలకు తప్ప రైలు లేదు. జిల్లా అంతా బస్సురూట్లు అల్లుకొని ఉంటాయి. డిపోల పేర్లు పొడి అక్షరాల్లో ఉంటాయి. కెఎన్ఆర్, పిడిఎల్, జెటిఎల్ - ఇట్లా - అక్కడ యువకులు ఈ పొడి అక్షరాల వాడుక ఎక్కువ. పార్టీలోనూ అంతే కదా - కెఎస్, ఎస్ఎం ఇట్లా. ఇది ఎంతదూరం పోయిందంటే ఇంద్రవెల్లి మారణకాండ జరిగాక కేస్లాపూర్ దర్బార్‌కు ఢిల్లీనుంచి ఎవరినైనా పిలిపించాలన్నపుడు ఆయన ఎన్.ఎంను పిలిపించమని సూచించాడు. అప్పుడు ఎస్ఎం అజ్ఞాతజీవితంలో ఉన్నాడు. ఇది ఎట్లా సాధ్యమని తల చించుకుంటుంటే ఎన్ఎం అంటే సురేంద్రమోహన్ కావచ్చునని వెలిగింది. అపుడు సురేంద్రమోహన్ ఎం.పి. కేస్లాపూర్ వెళ్లి, అక్కడి దర్బార్‌కన్న నిర్బంధం చూసి ఆదిలాబాదులో ప్రవేశిస్తుంటే ఆయనతోపాటు కన్నబిరాన్‌ను, బాలగోపాల్‌ను, నన్ను అరెస్టుచేసారు.

ఇంద్రవెల్లి మారణకాండ తర్వాత ఆ సంఘటనపై రాయమని ఆయన నా వెంటపడ్డాడు. ప్రతి ముఖ్య సందర్భంలోనూ సృజన సంపాదకీయమే కాకుండా కవిత్వం రాయాలని పోరుతుండేవాడు. ఒకసారి ఎస్ఎం దగ్గర కూర్చున్నపుడు ప్రహ్లాద్ ఈ ప్రస్తావన తెస్తే - నేను కూడ రాయలేకపోతున్నాను 'మనమింకా పేరు, మొహం లేని వీరుల గురించి రాయడానికి అలవాటు పడలేదేమో' అన్నాడు ఎస్ఎం. 81లో ప్రారంభించిన కవిత 84లో గానీ పూర్తి చేయలేకపోయాను (ఏడుపాయల నది ఏమన్నది).

ఉద్యమం 79 నుంచే ప్రయత్నించి 81 నాటికి గడ్చిరోలి, బస్తర్‌లకు విస్తరించింది. శత్రువుమీద దాడిచేసే కాకుండా విప్లవకారులు ఆయుధాలు తయారుచేసుకోవడం కూడ అడవిలో ప్రారంభమైనట్లున్నది. అట్లా ఒక బాంబు తయారు చేసే ప్రయత్నంలో ప్రమాదవశాత్తు గజ్జెల గంగారామ్ (అపుడు ఆదిలాబాదు జిల్లా పార్టీకి నల్లా ఆదిరెడ్డి నాయకత్వంలో సాహుతోపాటు బాధ్యుడనుకుంటాను.) అమరుడయ్యాడు. సాహు చెయ్యికి గాయమై విరిగింది. గజ్జెల గంగారామ్ మృతదేహాన్ని కొన్ని మైళ్లు మోసి, ఎక్కడో విప్లవ సంప్రదాయం ప్రకారం వీడ్కోలు చెప్పి రక్తసిక్తమైన దేహాలతో ప్రహ్లాద్, సాహులు హనుమకొండకు ఒక అన్న ఇంటికి వచ్చి పిలిపించుకున్నారు. ఆ సాహసదృశ్యాలు ఆయన విషయంలో అట్లా చూడడం అదే మొదటిసారి కాదు. అంతకుముందు ఎన్‌కౌంటర్‌లో చెయ్యికి గాయమై తప్పించుకున్నాడు. దిల్‌సుఖ్‌నగర్‌లో ఆయనా, ఆదిరెడ్డి సర్కిల్ ఇన్‌స్పెక్టర్ (కరీంనగర్ దొర) ఎదురుపడితే కాల్పులు జరుపుతూ తప్పించుకున్నారు. 82 జనవరిలో అరెస్టయిన కెఎస్‌ను రెండేళ్లలో విడిపించుకుంటాం చూడండి అన్నాడు ఒకసారి హైదరాబాదులో కలిసినపుడు. సరిగ్గా రెండేళ్లకు 84 జనవరి మొదటివారంలో కెఎస్ గ్రేట్ ఎస్కేప్ గురించి విన్నాం. అది అతిశయం కాదు. దృఢసంకల్పమే.

ఆయన విప్లవ పరిచయాలు, సంబంధాలు - చేర్‌పటాకా వలె ఉంటాయి. ఒకళ్లు పరిచయమయితే - ఆ ఒక్కరి కుటుంబాన్నంతా తానే పరిచయం చేసుకుంటాడు. ఆ ఒక్కరికి సోయి లేకుండానే వాళ్లందరినీ విప్లవ కార్యకలాపాల్లో నిమగ్నం చేస్తాడు. తన బంధువులనైనా - నీ బంధువులనయినా - తన మిత్రులనయినా - నీ మిత్రులనయినా. మిషన్‌గన్ ఉపయోగించడానికి కాకపోతే మేజోళ్లు అల్లడానికైనా పనికిరారా - చేతి సాయానికి కాకపోతే మాట సాయానికైనా అక్కర రారా. ఒక చిరునవ్వుతో హృదయాన్ని గెలుచుకుంటే సుదీర్ఘ విప్లవ పోరాటంతో నీ వెంట నిలుపుకున్నట్లే గదా.

1983లో కరీంనగర్‌లో జరిగిన రైతుకూలీ సంఘం రెండవ మహాసభలు చరిత్రాత్మకమైనవి. ఒకరకంగా అయిదేళ్ల కరీంనగర్, ఆదిలాబాదు పోరాటాల, ఉత్తర తెలంగాణ పోరాట సమీక్షా సభలవి. ఎన్.టి.ఆర్. ఆత్మగౌరవ నినాదంతో మొదటిసారి కాంగ్రెసేతర ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి ఒకవైపు నక్సలైట్లకు లాల్‌సలామ్ చెప్పానే, నక్సలైట్లు దేశభక్తులంటూనే మామిడాల హరిభూషణ్‌ను ఎన్‌కౌంటర్ చేసిన కాలం.

ఆ సభలను, ఊరేగింపును బి.నర్సింగరావు కెమెరాలో భద్రపరిచాడు. కవిత్వంలో నిక్షిప్తం చేయమన్నాడు ప్రహ్లాద్. 'భవిష్యత్తు చిత్రపటం' దీర్ఘకవిత ఆ సభల డాక్యుమెంటరీయే. అది నా చెయ్యిపట్టి రాయించినవాడు ప్రహ్లాద్. ఒకటేమిటి - ఎన్ని జ్ఞాపకాలు. గంజిరామారావుగారితో ఇంద్రవెల్లి స్తూపనిర్మాణం, అల్లం రాజయ్యతో కరీంనగర్ పోరాట సాహిత్య పరిచయం. ఏక కాలంలో ఒకచేత గన్ను, ఒక చేత పెన్ను పట్టడమే కాదు, ఎందరో సాయుధ, సాహిత్య కార్యకర్తలను తయారుచేసిన వాడాయన.

ఇపుడు వెనక్కి తిరిగిచూస్తే 1985 డిసెంబర్ దాకా - ఆయన అజ్ఞాతంలో ఉన్నట్లా? మా మధ్యన ఉన్నట్లా? 1983లో ఎఐఎల్ఆర్‌సి ఏర్పడిన తర్వాత - 1985లో రెండోసారి ఎన్.టి.ఆర్. అధికారంలోకి వచ్చి నిర్బంధం పెరిగినాక ఆయన ఎఐఎల్ఆర్‌సి ద్వారా అఖిలభారత నిర్బంధ వ్యతిరేక దీర్ఘప్రయాణాన్ని రూపకల్పన చేసాడు. విరసం నుంచి నేను, రాడికల్ యువజన సంఘం కార్యదర్శిగా కూడ బిఎస్ రాములు, జననాట్యమండలి గద్దర్, సంజీవ్, పద్మ మొదలైన వాళ్లు దేశంలో పలురాష్ట్రాల్లో నల్లబైవేల మైళ్లు తిరిగాము. అయితే ఇందులో మొదటినుంచీ చివరిదాకా విడవకుండా కొనసాగినవాళ్లు బిఎస్‌రాములు, సంజీవ్, పద్మ మొదలైనవాళ్లు.

1986లో దండకారణ్యంలో ప్రవేశించాక రాంజీగా మారిన ప్రహ్లాదుడు మాకు అడవిగాలి అయ్యాడు. కాని మైదానాలు మండించిన అనుభవంతో ఆయన అక్కడ దావానలం వ్యాపింపచేస్తున్నాడని అర్థమవుతూనే ఉన్నది. దండకారణ్య రచయితల సందేశాలు ఎఐఎల్ఆర్‌సికి పంపడంలో ఆయన పాత్ర ఉన్నదని తెలుసు. ఇది అల్లం నారాయణ చెప్పినట్లు దండకారణ్య పర్‌స్పెక్టివ్‌ను ఆచరించడం. గోదావరి అడవుల నుంచి ఇంద్రావతి, శబరి అడవులకు విస్తరించి విముక్తిప్రాంతాల నిర్మాణక్రమంలో

నిన్న దళితులను విప్లవంలోకి తెచ్చిన అనుభవాన్ని ఇవ్వాళ ఆదివాసులను మావోయిస్టులుగా మలచుకునే అనుభవంలోకి అనువదించడం.

1990 మే 5,6 తేదీల్లో వరంగల్‌లో జరిగిన రైతుకూలీసంఘం సభలు చరిత్రలో కనీవిని ఎరుగని ఘట్టం - ఆ సభల గురించి అమరుడు సూర్యం నోట వింటూ ఆదిరెడ్డి, ఎక్కడైనా చాటుగా నిలబడి ఆ సభలు చూడగలిగితేనా - అని ఆనందభాష్పాలు వదిలాడు. పులి అంజయ్య, రణదేవ్‌లు పొంగిపోయారు. భవిష్యత్ చిత్రపటం వర్తమాన చిత్రపటంగా మారిన క్రమాన్ని రాయమని ప్రహ్లాద్ నన్ను ఎన్నిసార్లు హెచ్చరించాడో.

1996 ఫిబ్రవరిలో ఢిల్లీలో జాతుల సమస్యపై అంతర్జాతీయ సదస్సు జరిగినపుడు నేను 95 సెప్టెంబర్ నుంచి ఫిబ్రవరి దాకా ఎక్కువగా ఢిల్లీలో ఉన్నాను. ఆ రోజుల్లో తరచు ఆజాద్, కిషన్‌జీ కలుస్తుండేవాళ్లు. విలియంహింటన్‌ను కలిసి గంటల తరబడి చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవ కాలపు ఫ్యాన్‌షెన్‌లను, షాన్‌ఫెన్‌లను ఆయన నోటివెంట చెప్పించుకుని విన్నాం. కలకత్తాలో సరోజ్‌దత్తా స్మృతి కమిటీ ఏర్పాటుచేసిన దగ్గర్నుంచీ ముప్పైఏళ్ల నక్సల్బరీ వార్షికోత్సవాలు, పార్టీ యూనిటీతో ఐక్యమయినాక కలకత్తాలో జరిగిన మహాసభ - ఇట్లా నిర్బంధం అంతగా లేని రోజుల్లో చుట్టపుచూపుగా కలుస్తుండేవాడు. కలకత్తాలో 90ల చివర్లలో ఒకసారి కలిసినపుడు మీడియా ఎప్పుడూ బీహార్‌లో హింస గురించి రాస్తూ ఉంటుంది, ఎన్నికల సందర్భంలో బీహార్‌లో హింసా దౌర్జన్యాల గురించి కూడ రాస్తుంటుంది గానీ బెంగాల్ రాజకీయాల్లో ఉన్నంత హింస ఎక్కడా లేదన్నాడు. బెంగాల్‌లో ఎన్నికలు మోటార్‌సైకిళ్లు, బాంబులు, తుపాకులతో తలపడే ద్వంద్వయుద్ధంగా ఉంటుందని - ఒక గ్రామంలోకి సిపిఎం రెండువందల మోటారుసైకిళ్లపై ఇద్దరేసి చొప్పున తుపాకులు, బాంబులతో ప్రవేశించి ఈ గ్రామం మాది అని ప్రకటిస్తారు. ఆ ప్రవేశం నిర్నిరోధమైతే అది ఇంక వాళ్ల గ్రామం. ఓట్లనాడు బూతులన్నీ వాళ్లే వశం చేసుకుంటారు. అట్లే మరోచోట తృణమూల్ కాంగ్రెస్ - అన్నాడు. బెంగాల్‌లోనే కాదు దేశమంతటా - రాయలసీమతో సహా ఎన్నికల పార్టీల పరస్పర హననకాండ ముందు, గుజరాత్ వంటి మారణకాండ ముందు, వ్యవస్థీకృత హింస ముందు, హింస అనబడే నక్సలైట్ల ప్రతిహింస ఏ మూలకో - కాని సమస్య మొదటిదంతా పాలకవర్గాల వైరుధ్యాలలో ఇమిడిపోయేది. ప్రతిహింస సుదీర్ఘ పోరాటక్రమంలో మార్పు రాజకీయాల వైపు దారితీసేది. నక్సల్బరీ తర్వాత జ్యోతిబసు, సిద్ధార్థశంకర్‌రేల కాలంలో కలకత్తాలో అమలయిన రాజ్యహింసను ఒకసారి తలచుకుంటే ఒళ్లు గగుర్పొడుస్తుంది. కిషన్‌జీ 'ఎన్‌కౌంటర్' అయిన నాటినుంచి వరుసగా కలకత్తా ఆసుపత్రులల్లో జరుగుతున్న మరణాలు, కల్తీ సారా తాగి జరిగిన మరణాలు వంటివి వింటూ ఉంటే బెంగాల్ పాలనలో అసహజ మరణాల చరిత్ర తప్ప మరేమయినా మిగిలిందా- దానిని ఎదురుతిరిగి ప్రశ్నించిగదా కిషన్‌జీ 'ఎన్‌కౌంటర'య్యాడనిపిస్తుంది.

ఉత్తేజకరమైన విప్లవోద్యమ విస్తరణకృషి వివరించి మళ్లా కలిసేదాకా నిలువుకునేంత ఊపిర్లు ఊదుతుండేవాడు. సాహిత్యదాహం తీర్చుకునేవాడు. కొత్త కవితలు వినిపించేవాడు.

ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ ఉద్యమం 2009 నవంబర్ 29 తర్వాత ఉధృతమైన కాలంలో ఆయన హైదరాబాదులో పలకరించని విద్యార్థి నాయకుడు, మీడియా పర్సన్ లేరనుకుంటాను. పాతపరిచయాలన్నీ మళ్లా మొబైల్‌తో దుమ్ముదులిపాడు. దండకారణ్యంలో ఆయన నేర్పి, నేర్చుకున్న చలనయుద్ధాన్ని మానవసంబంధాల చలన సంభాషణలోకి మార్చినట్లున్నాడు. అట్లా నాతోకూడ మళ్లా ఫోన్ సంబంధాలను పెట్టుకోవాలనుకున్నట్లున్నాడు. కాని వాళ్ల అమ్మ అన్నట్లు 'ఎవరి అజాగ్రత్త అయినా - ప్రమాదం ఆయనకే' కనుక ఆమె వలెనే నేను కూడ ఆ టెంప్టేషన్‌కు లోను కాలేదు.

కాని సెప్టెంబర్‌లో జంగల్‌మహల్‌లో ప్రవేశించినపుడు ఈ 'ఏటికి ఎదురీదిన' మావో, చారుమజుందార్‌ల వారసుణ్ని ఒకసారి చూడగలిగితేనా అనిపించింది. అందుకే ఆయన కోసం ఆ అడవిలో కళ్లు అంతగా వెతికాయి. మనసు అంతగా అర్రులు చాచింది. ఈసారి నిరాశపరచడం ఆయన వంతయింది. నాకు తగిన జవాబు చెప్పాడనిపించింది. నేను చెప్పిన జాగ్రత్త నాకే అప్పగించాడనిపించింది.

సరిగ్గా రెండునెలలు పోయాక నవంబర్ 25న కలకత్తాకు వెళ్లి, ఆ రాత్రే మళ్లా జంగల్‌మహల్‌లోని మేదినీపూర్‌కు వెళ్లాను. 26 ఉదయం మిడ్నాపూర్ ప్రభుత్వం ఆసుపత్రిలో - జీవితంలో ఎన్నడూ నిశ్చలంగా లేని ఆ నూతన మానవుడు నిశ్చలంగా విగతజీవిగా పడి ఉన్నాడు. నిలువెల్లా గాయాలతో, చిత్రహింసల రక్తసిక్త దేహంతో.

చావు కూడ పెళ్లి వంటిదేనా? విప్లవకారునికి అంతేనేమో?

'మా కోటిని పెళ్లిచేసుకొమ్మనరాదూ' అని 78లో అడిగిన ఆ అమ్మచేతుల్లో నవంబర్ 26 అర్ధరాత్రి ఆయన మృతదేహాన్ని ఉంచాను.

విప్లవం ఎంత కఠోరమైన పరీక్ష.

పెద్దపెల్లికి మధ్యన వెళ్లలేదని కాదు. ఆయనే పెద్దపెల్లిలో నిర్వహించిన రాడికల్ యువజనసంఘం సభలకు వెళ్లాను. కంచె చెట్టుతీగలలోకి కరెంటు పంపించి అడవి పందులను, ఎరుకలవాళ్లను భూస్వాములు చంపుతున్నారని చెప్పంపినపుడు వెళ్లాను. వడ్కాపురం చంద్రమౌళి, కరుణల మృతదేహాలను వడ్కాపురం తీసుకవెళ్తూ కూడ పెద్దపెల్లి మీదుగా వెళ్లాను.

కాని కోటి ఇంటికి, మధురమ్మ ఇంటికి ఆయన నన్ను మొదటిసారి తీసుకవెళ్లిన తర్వాత మళ్లా ఇప్పుడే ఇట్లే వెళ్లడం.

కంది లచ్చిరెడ్డి అమరత్వం నుంచి కోటేశ్వరరావు అమరత్వం దాకా రెండూ మొదటివీ కావు, చివరివీ కావు.

అయితే కిషన్‌జీది సార్థకజీవితం, సార్థక అమరత్వం. జగిత్యాల జైత్రయాత్ర అనే భూపోరాటం నుంచి, రాజ్యాన్ని ధిక్కరించే 'పీపుల్స్‌వార్' నుంచి, ప్రత్యామ్నాయ ప్రజా అభివృద్ధి

# కిషన్‌జీ పై విమర్శలు - ఉద్దేశాలు

- గంటి ప్రసాదం

పాలక వర్గాలకు, పాలకవర్గ పార్టీలకు, ప్రభుత్వాలకు మావోయిస్టు ఉద్యమం ఈనాడు పెద్ద సవాల్‌గా ఉంటున్నదనేది నిర్వివాదాంశం. దీన్ని వారు అంగీకరిస్తూనే- ఇలాగాక తమదే అయిన భాషలో పదేపదే ప్రకటించుకుంటున్న తీరునీ చూస్తాం. వామపక్ష తీవ్రవాదం, ప్రత్యేకించి మావోయిస్టు ఉద్యమం 'దేశ ఆంతరంగిక భద్రత'కు పెనుముప్పుగా, 'అభివృద్ధి'కి పెద్ద ఆటంకంగా ఉంటోందని దేశ ప్రధాని, కేంద్ర హోం మంత్రి పదేపదే ప్రకటిస్తుండడాన్ని మనం గమనించవచ్చు. ఈ మర్మ భాషను మన అనుభవాలకు సంబంధించిన మామూలు భాషలోకి తర్జుమా చేసుకుంటే, మనకు తేటతెల్లంగా అర్థమయ్యే విషయం ఏమంటే- బడా కార్పొరేట్ కంపెనీల యాజమాన్యాలు, బడా కాంట్రాక్టర్లు, బడా భూస్వాములు వ్యాపార వాణిజ్య వర్గాలకు చెందిన పిడికెడు మంది బడాబాబులే వీరి దృష్టిలో దేశం, ప్రజలు, జాతి సమస్తం! వారి ప్రయోజనాలే దేశ ప్రయోజనాలు. వారి భద్రతే దేశ భద్రత. వీరి దృష్టిలో ఎన్నికలే ప్రజాస్వామ్యం, ఓటర్లే ప్రజలు. ఎన్నికల్లో ఓట్లు రాల్చించుకోవడానికి రకరకాల మోసపూరిత వాగ్దానాలతో నానాగడ్డీ కరుస్తారు. తరువాత ప్రజలపై ఎలాంటి దాడులకీ వెనుకాడరు. కనుకనే ప్రజల ప్రయోజనాలకు రక్షణగా నిలిచే మావోయిస్టు ఉద్యమం వీరి దృష్టిలో ఒక సమస్యగా, సవాల్‌గా, బెడదగా, తలనొప్పిగా ఉంటుంది. కనుకనే వారు తమకుండే అధికారం, అపార వనరుల ఆసరాతో మావోయిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా నిరంతర విష ప్రచారం చేస్తూనే ఉంటారు. తమ చెప్పు చేతుల్లో ఉండే ప్రసార, ప్రచార మాధ్యమాల ద్వారా మావోయిస్టు ఉద్యమ వ్యతిరేక ప్రచారం చేస్తూనే ఉంటారు. దీన్ని 'విమర్శ'గా చెప్పజాలం. ఇది కేవలం తప్పుడు ప్రచార దాడి మాత్రమే. దీన్ని గూర్చి పెద్దగా చెప్పుకోవాల్సినది లేదు.

కానీ, ఇలాంటి దాడికి భిన్నంగా మావోయిస్టు ఉద్యమంపైన మరొకొన్ని విమర్శలు, ఫిర్యాదులు, అసంతృప్తులు, అలకలు ఉంటున్నాయి. ఇవన్నీ సైతం ఒకే తరహాకి, తరగతికి చెందినవిగాను చెప్పలేం. వీటి మధ్య తేడాలను చూడగలగడమే గాక, దేనికదిగా గుణ దోషాలను ప్రత్యేకంగా బేరీజు వేయాల్సి ఉంటుంది. రాజ్యహింసకు వ్యతిరేకంగా; అప్రజాస్వామిక నిర్బంధ చట్టాలకు వ్యతిరేకంగా; సామాజిక అసమానతలకు, వ్యవస్థీకృత అధిపత్య అణచివేత ధోరణులకు వ్యతిరేకంగా తుదిశ్వాసదాకా అవిశ్రాంత పోరాటం చేస్తూ వచ్చిన బాలగోపాల్, కన్నబిరాన్‌లాంటివారికి సైతం మావోయిస్టు ఉద్యమంపట్ల కొన్ని అభ్యంతరాలు, కొన్ని ఫిర్యాదులు ఉన్నాయన్న సంగతి మనకు తెలుసు. తనపైని విమర్శలపట్ల ఆ పార్టీ ఏనాడూ అలక్ష్యాన్ని ప్రదర్శించకపోవడమే కాదు, అంటీముట్టని వైఖరితో కూడా లేదు. నిర్మాణాత్మక సద్విమర్శలను స్వీకరిస్తూ, తప్పుడు విమర్శలతో ధీటుగా తలపడుతూ వస్తోంది. నయీమ్‌లు, నాగరాజులు, సమ్మయ్యలు లాంటి వారు ఇకపైన అయినా ఉద్యమంలో తలెత్తబోరని నాటి పీపుల్స్‌వార్ పార్టీ హామీ పడాలని కన్నాబిరాన్ ఓ సందర్భంలో (బెల్లి లలిత హత్యోదంతం సందర్భంగా) డిమాండ్ చేశారు. అందుకు నాటి పీపుల్స్‌వార్ పార్టీ నమ్రతగానే సమాధానం ఇచ్చింది. దోపిడీ పాలకవర్గాలు, తమ స్వార్థ సంకుచిత ప్రయోజనాలకు అనువుగా సమాజాన్ని ఉద్దేశ్యపూర్వకంగానే నేరమయం చేసేస్తూ ఉంటాయి. అలాంటి నేరమయ వాతావరణంలో నుండే విప్లవాన్ని నిర్మించాల్సి ఉంటుంది తప్ప సమాజానికి బాహ్యంగా, వెలిగా ఆకాశం నుండి నిర్మింపజాలం. సమాజంలోని విప్లవకర గుజ్జునే (క్రీమ్)విప్లవంలోకి

---

నమూనాను అమలుచేసిన దండకారణ్య 'జనతనసర్కారు' నుంచి అటువంటి ప్రజాపాలనే సాగుతున్న సరండా అడవుల నుంచి, ఏటికి ఎదురీదుతున్న జంగల్ మహల్ దాకా 'గ్రీన్‌హంట్ ఆపరేషన్' పేరిట ప్రజలమీద ప్రభుత్వం ప్రకటించిన యుద్ధం దాకా ఆయన పూసల్లో దారం వలె తన సహచరులతో పాటు ముందు నిలిచిన సేనానిగా నేలకొరిగాడు.

ఆదిమ సమాజం నాటి వర్గరహిత సమాజాన్ని కమ్యూనిస్టుసమాజంలో పునరావిష్కరించే స్వప్నంతో నూతన ప్రజాస్వామిక విప్లవంలో నూతన మానవుడుగా రూపొంది హిమాలయాలకన్నా ఉన్నతమైన త్యాగాన్ని ప్రదర్శించాడు.

ఆదివాసీ సాయుధ పోరాటంలో ఒక అల్లూరి సీతారామరాజు వలె నేలకొరిగాడు. అయితే గతంలోని అన్ని ఆదివాసీ పోరాటాల వలె కాకుండా నక్సల్బరీ పంథాతో దండకారణ్య పర్‌స్పెక్టివ్‌తో సాగుతున్న ప్రజాయుద్ధంలో నేలకొరిగిన ఆయన స్వప్నం ఆయన కన్ను పెరికివేసినా, చూపుడువేలు నరికేసినా చెదరిపోని చూపుగా, దిశమారని దిక్సూచిగా విప్లవ విజయంలోనే సాకారమవుతుంది.

'మహాద్భుతమైన మనిషి, ఆరోగ్యవంతమైన మనిషి, మట్టినుంచి పచ్చటి మొక్కలు, పంటలు, సర్వసంపదలు సృష్టించదలుచుకున్న మనిషి మహదేవ్' సకల కలలను, సర్వశక్తులను సోనియామొదలు మమతా దాకా ఎవ్వరూ హరించజాలరు. మార్కెటూ హరించజాలదు. ఎందుకంటే ఆయన స్వప్నాలను సాఫల్యం చేసుకోవడానికి జైత్రయాత్రకు బయల్దేరిన సాహసికుడు. ఆ జైత్రయాత్రను దండయాత్రగా, విజయంగా ఆయన సహచరులు టాటూనది వంతెనదాటి సాధించి తీరుతారు.



సమీకరించాలని విప్లవ పార్టీ కాంక్షిస్తుంది. తదనుగుణంగానే అనేక వడపోతలు, వస్త్ర కాగితాల జాగ్రత్తలన్నీ తీసుకుంటుంది. అయినా ఎంతో కొంత సమాజంలో తెట్టు (స్కమ్) సైతం ఉద్యమంలోకి చొచ్చుకు వస్తుంటుంది. అలాంటి తెట్టును ఉద్యమంలో నిలదొక్కుకోవడానికి వీలుగా శుద్ధి చేసుకొనే కృషిచేస్తుంది. ఎంతైనా కొన్ని సందర్భాలలో తెట్టు తనను తాను రుజువు చేసుకుంటూ బహిర్గతమౌతూనే ఉంటుంది. కనుక అలాంటి అవాంఛనీయ తెట్టు ఉండనే ఉండబోదని హామీ పడిపోతే అయిపోయేది కాదు. కనుక కన్సెర్న్ చేయాల్సింది ఉద్యమ పార్టీపై కాదు, సమాజాన్ని నేరమయం చేసే నేరస్త పాలకవర్గాలపైన. ఇదీ నాటి పార్టీ ఇచ్చిన వివరణ. నాటి పీపుల్స్‌వార్ పార్టీ చర్చల ప్రక్రియలో పాల్గొవడాన్ని ఎద్దేవా చేస్తూ రంగనాయకమ్మ చేసిన వెటకారపు విమర్శను ఆ పార్టీ ధీటుగానే సమాధానపరిచింది. అలానే నాడు బాలగోపాల్ ప్రస్తావించిన ఉద్యమంలోని ''చీకటికోణాలు'' పై పార్టీ ప్రసరింపజేసిన విమర్శనా వెలుగురేఖలు సైతం మన ముందున్నాయి.

బూటకపు ఎన్‌కౌంటర్ హత్యలు, ఉద్యమ ప్రాంతాలలోని జనసామాన్యంపై సాగే మూకుమ్మడి హత్యాకాండలు, అలానే మావోయిస్టు పార్టీ చేపట్టే తీవ్ర ప్రతిఘటనా చర్యలు లాంటి సందర్భాలలో ఇలాంటి విమర్శలు రంగం మీదకు వస్తుండడాన్ని మనం ఒక ధోరణిగానే గమనించవచ్చు. ఛాయా భేదాలు ఎన్ని ఉన్నప్పటికీ ఈ తరహా విమర్శలన్నింటిలోనూ పూసల్లో దారంలా కనిపించే ఉమ్మడి అంశం, అదే ప్రధానాంశం కూడా, అదేమంటే - రాజ్యాహింస ఖండనార్హమే! కాదనం, కానీ రాజ్యాహింస ఇలా పేట్రేగిపోతుండడానికి మావోయిస్టు ఉద్యమ కార్యాచరణ శైలి కూడా ఒక కారణమే అని భావిస్తూ ఉండడం, వాదిస్తుండడం!

మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు, పశ్చిమబెంగాల్ రాష్ట్రంలో ఉద్యమ నిర్మాణ బాధ్యుడు అయిన కామ్రేడ్ కిషన్‌జీ హత్యోదంతాన్ని పురస్కరించుకొని జరుగుతున్న చర్చను ఈ నేపథ్యంలోనే పరిశీలించాలి. కిషన్‌జీపై సాగిన విమర్శలు నిజానికి అతడిపైనే వ్యక్తిగత విమర్శలుగా భావించలేం. అవన్నీ ప్రధానంగా అతడు ప్రాతినిధ్యం వహించే ఉద్యమ గమనం, పంథాలపైని విమర్శలే ! చెరుకూరి సత్యనారాయణ కలం నుండి జాలువారిన (చూడండి: ఆంధ్రజ్యోతి దినపత్రికలోని వ్యాసం) ఈ తరహా విమర్శ నిజానికి కొత్తదేమి కాదు. ఇది మొదటిదీ కాదు, చివరిదీ కాబోదు. నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల కాలం నుండి సాగుతూ వస్తున్నదే. సత్యనారాయణ విమర్శలో రెండు భాగాలున్నాయి. ఒకటి - ప్రభుత్వం, పోలీసులు, వారి మీడియా లంకించుకొనే అసత్య కథనాలను యథాతథంగా స్వీకరించేసి తదనుగుణంగా స్పందించకుపోవడం. రెండోది - ఈ తరహా విమర్శకుల సాంప్రదాయిక విమర్శ కొనసాగింపు. అదేమంటే- అతివాద ఒటెత్తువాద పంథాతో దెబ్బతినిపోయిన నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల అనుభవాల నుండి ఎలాంటి పాఠాలు తీసుకోకుండా, ప్రజాసమస్యలపై ప్రజాసమీకరణలకు ఎలాంటి ప్రాధాన్యత ఇవ్వకుండా, 'ప్రజాపంథా'కు వెలిగా మావోయిస్టు ఉద్యమం ఫక్తు సైనికవాదపంథాలో కొట్టుకుపోతోంది అనే విమర్శ. ఈ విమర్శ మంచిచెడులను తరువాత చర్చిద్దాం. ముందుగా మొదటి విమర్శను పరిశీలిద్దాం.

సుమారు మూడు దశాబ్దాల సిపిఎం నేతృత్వంలోని వామపక్ష ప్రభుత్వ ప్రజాకంటక పాలనకు తెరదించుతూ మమతాబెనర్జీ నేతృత్వంలో ప్రభుత్వం ఏర్పడాలని అమరుడు కిషన్‌జీ బహిరంగంగానే పిలుపునిచ్చాడని, చివరకు మమతా విద్రోహానికి, నమ్మకద్రోహానికి బలైపోయాడనేది విమర్శ. తన విధానం బూర్జువా ఎన్నికల బహిష్కరణగానే ప్రకటించుకునే మావోయిస్టు పార్టీ కొన్ని సందర్భాలలో తన ప్రకటిత విధానానికి భిన్నంగా అవకాశవాద తప్పుడు ఎత్తుగడలకు పాలుపడిపోతోందనేది ఈ విమర్శ అంతస్సారం. ఈ విమర్శ ఇప్పుడే కాదు, 2004ల నాటి ఆంధ్ర రాష్ట్ర ఎన్నికల సందర్భంలో కూడా వచ్చింది. అప్పటి చంద్రబాబు ప్రభుత్వాన్ని కూల్చి రాజశేఖరరెడ్డి ప్రభుత్వాన్ని గద్దెనెక్కించడంలో నాటి పీపుల్స్‌వార్ పార్టీ తదనుగుణంగా సర్దుకపోయి సహకరించుకుపోయిందనేది విమర్శ. నాటి పీపుల్స్‌వార్ పార్టీ రాష్ట్ర కమిటీ ఈ విమర్శను స్పష్టంగానే ఖండించింది. తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కొనే రహస్య పార్టీగా దాని ఖండనమండనలు, వివరణలు, సమీక్షలు, తీర్మానాలకు సంబంధించిన పత్రాలు, ప్రకటనలు బహిరంగంగా ప్రజల ముందుకు సకాలంలో రావడంలో ఎన్నో సమస్యలుంటాయి. అయినా, అలాంటి పత్రాలతో సంబంధం లేకుండానే దాని ఉద్యమ ఆచరణే ఇది తప్పుడు విమర్శ అని చెప్పగల నిలువుటద్దమని చెప్పవచ్చు. నాటి పీపుల్స్‌వార్ పార్టీ అలాంటి తప్పిదానికి పాల్పడింది అనేది కేవలం అపోహ మాత్రమే! కానీ, ఎలాంటి ఆధారం లేని అపోహ మాత్రం కాదు. దాన్ని సైతం గుర్తించాలి. అందుకు దోహదపడే బలమైన భౌతిక వాతావరణం ఒకటి కమ్ముకున్నందునే ఇలాంటి అపోహలు తలెత్తుతూ ఉంటాయి. అలాంటి వాతావరణాన్ని వాస్తవికంగా వివేచించడంలో దొర్లే తొందరపాటులు, ఏమరపాటులే ఇలాంటి తప్పుడు నిర్ధారణలకు దారి తీస్తుంటాయి.

2004 నాటి ఆంధ్ర రాష్ట్ర రాజకీయ వాతావరణం ఏమిటి? అలిపిరి ఉదంతం తరువాత, నాటి పీపుల్స్‌వార్ ఉద్యమంపై తన 9సంవత్సరాల పాలనలో సాగిస్తూ వచ్చిన అణచివేత విధానంపై 'రెఫరెండం'గా ప్రకటించుకుంటూ చంద్రబాబు నాయకత్వంలోని టిడిపి ఎన్నికల రంగంలో దిగింది. ఇంకొపక్క, ఎలాగైనా అధికారాన్ని దక్కించుకోవడమే లక్ష్యంగా ఎన్నికల బరిలోకి దిగిన రాజశేఖరరెడ్డి నాయకత్వంలోని కాంగ్రెస్ చంద్రబాబును ప్రపంచబ్యాంకు జీతగాడిగా వెక్కిరిస్తూ ఉచిత విద్యుత్, నక్సలైట్లతో శాంతి చర్చలు అంటూ జనసామాన్యానికి ఊరట కబుర్లు చెబుతూ ఎన్నికల బరిలోకి దిగింది. నాటి పీపుల్స్‌వార్ ఉద్యమంపై సాగుతుండిన నిర్బంధకాండకు ఆ ఉద్యమ ప్రభావిత ప్రాంతాలలోని అశేష జనసామాన్యం నేరుగా గురవుతూ వస్తుండిన వారు కనుక వారు సహజంగానే చంద్రబాబు పార్టీ పట్ల తీవ్ర వ్యతిరేకత, కసి, ద్వేషాలతో ఉంటారు. ఎన్నికల్లో ఈ వాతావరణం చంద్రబాబుతో తలపడే ప్రధాన పోటీదారు పార్టీకి అనుకూలంగా మారడమనేది ఒక సహజ పరిణామం. ఎప్పటిలానే 2004 నాటి ఎన్నికలలో సైతం నాటి పీపుల్స్‌వార్ పార్టీ తన ఎన్నికల బహిష్కరణ విధానానికి

నిజాయితీగా దృఢంగా కట్టుబడే పనిచేసింది. అయినా తన ఉద్యమ ప్రభావిత ప్రాంతాలలోని జనసామాన్యం అత్యధిక శాతం చంద్రబాబు పార్టీకి వ్యతిరేకంగా రాజశేఖరరెడ్డి పార్టీ వైపు మొగ్గిపోయి ఓటు వేశారు. ఇందులో ఆ పార్టీ పాత్ర, ప్రమేయాలు ఏవీలేవు. అంటే, దాని బహిష్కరణ పిలుపును ప్రజలు పెద్దగా పట్టించుకోలేదనే చెప్పాలి. మరి ప్రజలు పెద్దగా పట్టించుకోని ఆ పిలుపు వలన, అలాంటి విధానం వలన ప్రయోజనం ఏమిటి? అలాంటిది సరైన పిలుపు, సరైన విధానం అవుతాయా? అనేవి కీలకమైన చర్చనీయాంశాలు. పాలకవర్గ బూర్జువా శిబిరం ఈ విధానాన్ని తప్పుపట్టడమనేది అర్థం చేసుకోతగ్గదే. కానీ, తాము సైతం విప్లవకారులమే అని అనుకునేవారు, అలా చెప్పుకునేవారు సైతం దీన్ని తప్పుపడుతుండడమే చర్చనీయాంశం. ప్రజలు చురుకుగా అందుకోవడం లేదు కనుక, పాటించడంలేదు కనుక ఇలాంటి పిలుపు తప్పు అనేది వీరి వాదన. ఈ వాదన తప్పు అని చెప్పడానికి పెద్దవివరణ అవసరం లేదు. మనం ఇస్తున్న విప్లవ పిలుపుని జనబాహుళ్యం ఎన్నికల జాతర స్థాయి తరహాల్లోనే అందుకుపోతున్నారా? లేనంత మాత్రాన మన పిలుపు తప్పు అనుకుంటామా? అనుకోం. ఎందుకంటే, ప్రజలకు విప్లవం పెద్ద అవసరంగా ఉంటుంది. దాన్ని గుర్తించడంలో అందుకోవడంలో ప్రజలు అనేక పరిమితులకు లోనవుతూ తాత్కాలికంగా కొంత వెనుకబాటుతనంతో ఉండొచ్చుగాక. కానీ ప్రజలకు వేన్‌గార్డుగా ఉండాల్సిన విప్లవపార్టీ విప్లవ అవసరాన్ని గుర్తిస్తూ తదనుగుణంగా స్పందిస్తుంది. ఆ అవసరాన్ని దీర్ఘకాలిక ప్రాతిపదికగా ప్రజలచేత గుర్తింపచేస్తుంది, దాని చుట్టూతా ప్రజలను సమీకరిస్తుంది. అంతిమంగా విప్లవ విజయానికి చేరుస్తుంది. ఎన్నికల బహిష్కరణ విధానం వెనుక సైతం పనిచేసే అవగాహన ప్రధానంగా ఇదే!

ప్రజాస్వామ్యానికి పెద్ద వెక్కిరింతగా మారిపోయిన పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరించడమనేది విప్లవం గూర్చి సీరియస్‌గా ఆలోచిస్తూ, సాయుధపోరాటాన్ని తక్షణ ఎజెండాగా అచరించేవారికి సహజం, అనివార్యమే. ఎటొచ్చి, బూర్జువా పార్లమెంటరీ పంథాకు విప్లవ సాయుధ పోరాట పంథా ఖచ్చిమైన ప్రత్యామ్నాయం అని అంగీకరిస్తూనే, చెబుతూనే దాన్ని తక్షణ ఎజెండాగా ఆలోచించని, ఆచరించని వారికి మాత్రమే ఇది తప్పుగా కనిపిస్తుంది. కనుక, ప్రజల పట్ల ప్రజాస్వామ్యం పట్ల పెద్ద వంచనగా ఉంటున్న పార్లమెంటరీ ఎన్నికల పంథాను ప్రజలంతా సామూహికంగా గ్రహిస్తూ స్పందించేంతదాకా బహిష్కరించ రాదనడం సైద్ధాంతికంగా దుర్బల వాదనే! పైగా విప్లవాచరణలో ఉండాలనుకొనే, ఉండే విప్లవ పార్టీ అనేది రివిజనిజం బారిన పడకుండా తనను తాను కాపాడుకోవడానికి ఎన్నికల బహిష్కరణ విధానం అవసరమని చారిత్రాత్మక తెలంగాణ సాయుధ పోరాట అనంతర అనుభవాలు చాటిచెబుతాయి. పోతే, ఎన్నికలలో పాల్గొనడం, పాల్గొనకపోవడం అనేది ఎత్తుగడల సమస్య కనుక బహిష్కరణ పిలుపు తప్పు అనే వాదన గూర్చి- ఎత్తుగడల అంశం అయినంత మాత్రనే పాటించి తీరుతామా? విప్లవానికి చేటు గనుక బహిష్కరించమా? పైగా, భారత పార్లమెంటరీ ఎన్నికల చరిత్రను, అలానే భారత విప్లవోద్యమ చరిత్రను, అనుభవాలను లోతుగా పరిశీలిస్తే ఇది కేవలం విప్లవోద్యమ ఎత్తుగడల సమస్య మాత్రమే కాదని, కొంత వ్యూహాత్మక ప్రాధాన్యతను సంతరించుకున్న ఎత్తుగడల అంశమని మనకు అర్థమవుతుంది. మావోయిస్టు పార్టీ ఎన్నికల బహిష్కరణ విధానం వెనుక సుమారుగా ఇదే అవగాహన పనిచేస్తున్నట్లు కనబడుతుంది.

ఎన్నికల బహిష్కరణ విధానం పట్ల ఇంత లోతైన అవగాహనతో, ధృఢ వైఖరితో మావోయిస్టు పార్టీ ఉంటుండగా , దాని కేంద్ర కమిటీ సభ్యుడైన కిషన్‌జీ మమతాబెనర్జీ ప్రభుత్వం అధికారంలోకి రావాలని కోరుకుంటూ అందుకు పిలుపునిచ్చాడని చెప్పడం దారుణమైన అపవాదు, దుర్మార్గమైన అబద్ధం తప్ప వేరుకాదు. మీడియావారు ఎవరైనా (మీడియాతో తరచూ సంభాషించేవారు కనుక) ఎన్నికల ఫలితాలకు సంబంధించిన అంచనాలడిగితే సిపిఎం నేతృత్వంలోని వామపక్ష కూటమి ఓటమి తథ్యమని, మమతా నేతృత్వంలోని తృణమూల్ గెలుపు తప్పదని కిషన్‌జీ చెప్పి ఉండవచ్చు. ఎందుకంటే, ఎన్నికల ముందటి బెంగాల్ రాజకీయ వాతావరణం అనేక మందికి అంత స్పష్టంగానే అగుపడుతుండేది కనుక. దీన్ని కిషన్‌జీ వామపక్ష కూటమి ఓటమిని, మమతా గెలుపుని కోరుకున్నట్టు చిత్రీకరించి ఉండవచ్చు. కనుక మమతా నేతృత్వంలో ప్రభుత్వం ఏర్పడాలని కిషన్‌జీ కోరుకున్నట్లు, అందుకు తానుగా పిలుపు సైతం ఇచ్చినట్లు చెప్పడం హాస్యాస్పదమైన అపవాదు తప్ప వేరు కాదు.

ఇప్పుడు ముందు ప్రస్తావించిన తొలి విమర్శలోకి వెళదాం - అంటే మావోయిస్టు పార్టీ ప్రజా సమస్యలు ప్రాతిపదికగా, ప్రజా సమీకరణల గూర్చి పట్టించుకోవడం లేదని, ప్రజాపంథాకు వెలిగా ఫక్తు సైనికవాద పంథా వెనుక కొట్టుకుపోతోందని, రాజ్య నిర్బంధకాండ విచ్చలవిడిగా పేట్రేగిపోతుండడానికి మావోయిస్టు ఉద్యమ తీరుతెన్నులు సైతం కొంత కారణమైపోతున్నాయని, పైగా 'సరైన పంథా'ను అనుసరించే 'నిజమైన విప్లవకారులకి' మావోయిస్టు ఉద్యమ తీరు, ధోరణులు ఆటంకాలు అవుతున్నాయనే విమర్శ సరకు సారాలను పరిశీలిద్దాం..

'ప్రజాపంథా' అంటే ఏమిటి ? వివిధ ప్రజాసంఘాలను నిర్మించడం, క్రమం తప్పకుండా ఆయా సంఘాల మహాసభలను నిర్వహిస్తుండడం, ఆయా వేదికలకు తగ్గ వివిధ ప్రజల సమస్యలపై కొన్ని ఆందోళనలను చేస్తుండడం, కొన్ని సందర్భాలలో మిలిటెంట్ ఆందోళనలను సైతం చేస్తుండడం, ప్రజాసంఘాల వేదికలపై నుండే కాక పార్టీ వేదికలపై నుండి సైతం (బహిరంగ, చట్టబద్ధ పార్టీలుగా ఉంటున్నందున గల అవకాశాల రీత్యా) కొన్ని ప్రజా సమస్యలపై రాజకీయ ఆందోళనలు నిర్వహిస్తుండడం, పార్టీ పత్రిక, పార్టీ ఆధ్వర్యంలోని వివిధ ప్రజాసంఘాల పత్రికల ద్వారా దోపిడీ పాలకవర్గాలు, వారి పార్టీలు, ప్రభుత్వాలకు వ్యతిరేకంగా రాజకీయ విమర్శలు, విశ్లేషణలు చేస్తుండడం, సామ్రాజ్యవాద వ్యతిరేక విశ్లేషణలు, ప్రచారాందోళనలు నిర్వహిస్తుండడం - ఇది మాత్రమేనా ప్రజాపంథా అంటే ? విప్లవ వ్యూహాత్మక అంశాల ప్రాతిపదికగా చేసే ఈ కార్యక్రమాలు ఎంత విస్తృతంగా చేస్తే అంతగొప్ప ప్రజాపంథా అనుకుంటామా? కానేకాదు. విప్లవానికి కావాల్సింది విప్లవకర ప్రజాపంథా తప్ప ఉత్తుత్తి ప్రజాపంథా కాదు.

విప్లవకర వ్యూహాన్ని వాస్తవ ఆచరణలోకి మలచగల విప్లవకర ఎత్తుగడలతో కూడిన పంథాయే నిజమైన 'ప్రజాపంథా'! వ్యూహం గూర్చి చెప్పేటప్పుడు గొప్ప విప్లవ వాగాడంబరతను వలకబోస్తూ, సదరు వ్యూహాన్ని వాస్తవ ఆచరణలోకి మలచగల శక్తి స్వభావాలతో కూడిన ఎత్తుగడలను కలిగిలేకపోతే అది ప్రజాపంథా కాదు. విప్లవ పంథా అసలు కాదు. వ్యూహాన్ని వాస్తవ ఆచరణలోకి మలచగల పరికరాలుగానే ఎత్తుగడలనేవి ఉండాలి. వ్యూహం - ఎత్తుగడలు అనేవి పాలు పంచదారలాగా కలగలసిపోయేవిగానే ఉండాలి తప్ప పల్లీలు ఇసుకలాగా వేరుపడి వెక్కిరించేవిగా ఉండరాదు. ఇదీ - వ్యూహం ఎత్తుగడల మధ్య ఉండాల్సిన గతితార్కిక సంబంధం. వైరుధ్యాలు, మౌలిక వైరుధ్యాలు, ప్రధాన వైరుధ్యం అనే వాటి గుర్తింపుతో కూడిన వర్గవిశ్లేషణ; సామాజిక స్వభావానికి సంబంధించిన విశ్లేషణ; ప్రపంచ సామ్రాజ్యవాదస్థితికి సంబంధించిన విశ్లేషణ; విప్లవ ఐక్యసంఘటనా విశ్లేషణ; వీటితోపాటు వ్యవసాయిక విప్లవం, సాయుధపోరాటం, దీర్ఘకాలిక ప్రజాయుద్ధం, ప్రజాసైన్య నిర్మాణం, విప్లవ పార్టీ నిర్మాణం అనేవి కూడా విప్లవ వ్యూహంలో కీలక అంశాలు. అయినప్పుడు ప్రజాయుద్ధ సన్నాహాలు, సాయుధ పోరాటం, ప్రజాసైన్య నిర్మాణం అనేవి విప్లవ పార్టీ అని అనుకునేదాన్ని ఆచరణలో కనబడకపోవడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఎన్నాళ్లని, ఎన్నేళ్లని వాటిని గూర్చి కమ్మని కలలుకంటూ, కథలు చెబుతూ కాలక్షేపం చేయాలి? కామ్రేడ్ మావో చెప్పినట్లు విప్లవాన్ని గూర్చి కలలు కనడం తప్పుకాదు. కాని, కలకాలం కలలుకంటూ కూర్చోవడమే విప్లవమూ కాదు. కలలను నిజం చేసే లక్ష్యంతో కూడిన కృషి జరిగితేనే కలల సాఫల్యం! మావోయిస్టు పార్టీ ఉద్యమ క్రమానుగత చరిత్ర పరిశీలిస్తే విప్లవాన్ని ఒక వాస్తవిక తక్షణ ఎజెండాగా మలచే కృషిలో అది ధైర్యంతో అత్మవిశ్వాసంతో కూడిన ఆలోచనలు, ఆచరణలతో అనేక ప్రయోగాలు చేస్తూ, అనేక అనుభవాలు గడిస్తూ, విప్లవ పంథాను పదునెక్కిస్తూ అభివృద్ధి పరుస్తుండడాన్ని మనం గమనించవచ్చు.

బూర్జువా పార్లమెంటరీ పంథాకు ప్రత్యామ్నాయంగా సాయుధ పోరాట పంథాను చేపట్టినప్పుడు అందులో విడదీయరాని భాగంగా ఉండే ప్రజాయుద్ధ నిర్మాణం, ప్రజాసైన్య నిర్మాణం అనేవి ప్రధానంగా రాజకీయ అంశాలే అవుతాయి తప్ప సైనిక అంశాలు కావు. కనుక, విప్లవోద్యమంలో ఆయుధాలను రాజకీయాలు నియంత్రించాలి అనీ, రాజకీయాలను సిద్ధాంతం గైడ్ చేయాలి అనే మౌలిక సూత్రానికి అనుగుణంగానే మావోయిస్టు ఉద్యమ ఆచరణ ఉంటోంది తప్ప అందుకు వెలిగా లేదు అని గుర్తించగలం.

ప్రజాసమస్యలపై ప్రజలను సమీకరిస్తూ రాజకీయ ఉద్యమాలు నిర్వహించడంలో మావోయిస్టు పార్టీ వెనకబడిపోతోందనే విమర్శకు సంబంధించి - ఈ విషయంలో అది చేయాల్సినంత చేయలేకపోతూ ఉండొచ్చు! కాని, తనకు ఉండే అవకాశాలు వనరుల మేరకు కృషి చేయడంలో తన విమర్శక పార్టీలు, వేదికలు ఏ ఒక్కదానికంటే కూడా అది మిన్నగానే ఉంటోంది తప్ప వెనుకబడి లేదు అనే చెప్పాలి.

మావోయిస్టు పార్టీ ఉద్యమంపై తరచూ వినవచ్చే మరో విమర్శ ఏమంటే - పీడిత తాడిత వర్గాల ప్రజల విముక్తే లక్ష్యంగా విప్లవిస్తున్నట్లు చాటుకునే ఆ పార్టీ, పాము తన పిల్లలను తానే తినేసినట్లు ఆయా పీడిత వర్గాల ప్రజా సముదాయాలకి చెందిన వారిని సైతం తరచూ మట్టుబెడుతుంది అనేది. ఇన్ఫార్మర్లు, కోవర్టులు లాంటి ఉద్యమద్రోహులను మట్టుపెట్టే ప్రతి సందర్భంలోనూ ఈ విమర్శ తలెత్తుతూ ఉంటుంది. అవును, మావోయిస్టు పార్టీ ఇలాంటి ద్రోహులను తరచూ మట్టు బెడుతుండడం నిజమే. వారిలో చాలా మంది పీడిత తాడిత విప్లవకర వర్గాలకు చెందిన వారే కావడమూ నిజమే. అయినప్పుడు ఆ పార్టీ ఘోరతప్పిదానికి పాల్పడుతున్నట్లుగా భావిస్తామా? అలా భావించలేం. ఎందుకంటే, ఇలాంటి చర్యలు విశాల విప్లవోద్యమ ప్రయోజనాల పరిరక్షణా క్రమంలో, అదీ అరుదుగా మాత్రమే సాగేవి తప్ప అందుకు భిన్నంగా సాగుతున్నవిగా చెప్పలేం. విప్లవోద్యమంలో ఇన్ఫార్మర్లు, కోవర్టులు లాంటి ఉద్యమ ద్రోహులు పుట్టకొచ్చేది విప్లవ వర్గాల ప్రజాసముదాయాల నుండే తప్ప, అంతరంగికంగానే (ఫ్రమ్ విథ్ ఇన్) తప్ప బాహ్యంగా (ఫ్రమ్ విథ్ ఔట్) పాలకవర్గాల నుండి కాదు. అయితే, ఇలాంటి ద్రోహుల సృష్టిలో, తయారీలో పాలకవర్గాలు, వారి యంత్రాంగాల మంత్రాంగం చాలానే ఉంటుంది. అనేక రకాల ప్రలోభాలు, ఒత్తిడులు, బెదిరింపులతో వారిని ఇలాంటి ద్రోహులుగా తయారు చేసుకుంటారు. విప్లవోద్యమంలో దోపిడీ పాలకవర్గాలను మొత్తంగా భౌతికంగా నిర్మూలించడమనేది ఉండదు. ఎందుకంటే అది విప్లవ అవసరంగా ఉండదు కనుక. ఇంకో పక్క పీడిత విప్లవ వర్గాలకు చెందిన కొద్ది మందిని అంతం చేయడం సైతం విప్లవోద్యమంలో అనివార్యంగానే ఉంటుంది. ఇది మానవ చరిత్ర పొడవునా మనకు కనబడే ఒక కఠోరసత్యం. 'వర్గపోరాటం అత్యంత క్రూరమైనది' (క్లాస్ స్ట్రగుల్ ఈజ్ మోస్ట్ క్రూయల్) అని మార్క్సిస్ట్ మహోపాధ్యాయులు అనడాన్ని మనం ఈ కోణంలోనే అర్థం చేసుకోవాలి. అత్యంత అమానవీయం, అనాగరికం, అప్రజాస్వామికం, చట్టవిరుద్ధం, రాజ్యాంగ విరుద్ధం, నీతి బాహ్యం అయిన పాలకవర్గాల క్రూర ప్రయోగం అయిన సాల్వాజుడుం అనుభవాలు చూసిన తరువాత కూడా ఈ విషయాన్ని అర్థం చేసుకోలేకపోవడమనేది సైద్ధాంతిక దుర్బలతే తప్ప వేరు కాదు.

మావోయిస్టు పార్టీలో సైతం మహిళలపై పురుషుల ఆధిపత్య ధోరణులేకాక ఉద్యమంలో మహిళలు లైంగిక దోపిడీకి సైతం గురవుతున్నారనే విమర్శలున్నాయి. స్త్రీ పురుషులు కలసి పనిచేసే చోట ఎక్కడైనా ఇలాంటి తప్పులు జరగగల, ఇలాంటి సమస్యలు తలెత్తగల అవకాశాలు సహజంగానే ఉంటాయి. అయినా క్రమశిక్షణ గల, ఉద్యమ లక్ష్యంతో పనిచేసే మావోయిస్టు పార్టీలో ఇలాంటి తప్పిదాలు అరుదుగానే తప్ప తరచుగానూ, ఒక పెడధోరణిగానూ మనం చూడజాలం. అరుదుగానైనా ఉంటున్నాయనే దానికి ఇలాంటి తప్పిదాలపై ఆ పార్టీ చేసే సమీక్షలూ, తప్పుకు పాల్పడినవారిపై తీసుకునే క్రమశిక్షణ చర్యలూ నిదర్శనం. మరీ అరకొరగా జరిగే స్వల్ప ఘటనలను సైతం శత్రు వర్గాలు ఎందుకింతగా రచ్చ చేస్తుంటాయి? ఎందుకంటే ఇలాంటి తప్పిదాలకి చాలా మట్టుకు దూరంగానే ఉంటుందనే గణనీయమైన విశ్వసనీయత ఆ పార్టీకి

సందర్భం

# తన పిల్లలను తానే చంపేస్తోన్న భారత రిపబ్లిక్ మరింత ఉన్నతమైన సమాజం కోసం పోరాడిన కిషన్‌జీ

- బెర్నాడ్ డిమెల్లో

స్వేచ్ఛానువాదం : ఆర్. శశికళ

**(ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో బెర్నాడ్ డిమెల్లో పనిచేస్తున్నారు. ఆయన కమిటీ ఫర్ ప్రొటెక్షన్ ఆఫ్ డెమోక్రాటిక్ రైట్స్, ముంబాయిలో సభ్యులు.)**

కేంద్ర హోం మంత్రి పి. చిదంబరం, పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ, కేంద్ర హోంశాఖ కార్యదర్శి ఆర్.కె.సింగ్, రక్షక బలగాల్లో పై అధికారులు వీరంతా కలిసి వ్యక్తం చేస్తున్న అభిప్రాయం ప్రకారం - "పశ్చిమ బెంగాల్ - జార్ఖండ్ సరిహద్దులకు కేవలం 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న పశ్చిమ మిద్నపూర్ జిల్లా, బూరిషోలి అటవీ ప్రాంతంలో జరిగిన నిజమైన ఎదురుకాల్పుల్లో మల్లోజుల కోటేశ్వరరావు అలియాస్ కిషన్‌జీ, కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా (మావోయిస్ట్) పొలిట్‌బ్యూరో సభ్యుడు మృతి చెందాడు." కానీ మీడియా, విలేకరులు, అధికారులు మాత్రం నిజాయితీగా కిషన్ మృతికి దారితీసిన పరిస్థితులు ఇంకా తెలియాల్సి ఉంది అని చెప్తున్నాయి. పార్టీ సెంట్రల్ కమిటీ స్పోక్స్ పర్సన్ అభయ్ మాత్రం తాను విడుదల చేసిన పత్రికా ప్రకటనల్లో "బతికుండగానే పట్టుకొని కుట్రపూరితంగా కిషన్‌జీని చంపారని" విస్పష్టంగా ప్రకటించారు.

విప్లవ కవి వరవరరావు కిషన్‌జీ మేనకోడలితో పాటు అతని మృతదేహాన్ని కరీంనగర్ జిల్లాలోని పెద్దపల్లికు తరలించేందుకు ఆ ప్రాంతానికి వెళ్ళారు. అక్కడ విలేకరులతో మాట్లాడుతూ 'గత 43 సంవత్సరాలలో బూటకపు ఎదురు కాల్పుల్లో చంపబడిన అనేక మృతదేహాలను చూశాను, కానీ ఏ దేహం కూడా ఇటువంటి స్థితిలో లేదు' అని అన్నారు. 'శరీరంలో గాయం లేనిది ఎక్కడ'? పోస్ట్‌మార్టమ్ కాక ముందే ప్రజాస్వామిక హక్కుల సమన్వయ సంస్థలు ప్రతినిధులు మృతదేహం చూసి వ్యక్తం చేసిన అభిప్రాయం ప్రకారం తల వెనుక పుర్రెలో మెదడు లేదు, కుడికన్ను బయటికి వేలాడుతోంది. దవడ కింది భాగం చెక్కబడి ఉంది, ముఖంపై నాలుగు చోట్లగాట్లున్నాయి. గొంతు కోసిన గాయం కన్పడుతోంది. చేతులు విరిగినట్లు వేలాడుతున్నాయి. ఒక చేతిలో బుల్లెట్‌గాయం, ఊపిరితిత్తుల గుండా బులెట్‌లు దూసుకుపోయిన గాయాలున్నాయి. ఎడమ చేతి చూపుడు వేలు 3వంతు లేదు. కుడి మోకాలు చెక్కబడింది. ఎడమ పాదం పూర్తిగా కాల్చివేయబడింది. దేహంపై 30 చోట్ల బయోనెట్‌తో గుచ్చిన గుర్తులున్నాయి. ఆశ్చర్యంగా ఆయన వేసుకొన్న షర్టు, పాంటుపై ఎలాంటి గుర్తులు లేవు. (పోస్ట్‌మార్టం రిపోర్టు కిషన్‌జీ బంధువులకు అందాల్సి ఉంది)

చర్చలను విచ్ఛిన్నం చేయడం; బూటకపు ఎన్‌కౌంటర్ చేయడం వలన 2 డిసెంబర్ 2011న సి.డి.ఆర్.ఓ. నిజనిర్ధారణ కమిటీ సభ్యులు నవంబర్ 24వ తేదీన బురిసోలి అటవీ ప్రాంతానికి వెళ్ళి అక్కడ ఎన్‌కౌంటర్ జరిగినట్లుగా చెప్తున్న ప్రదేశాన్ని పరిశీలించారు. వారు విడుదల చేసిన పత్రికాప్రకటనలో - అధికారుల మాటలకు, మృతదేహం ఉన్నప్రాంతంలో ఉన్న గుర్తులకు తేడా కన్పిస్తోంది. అనేక అనుమానాలకు అవకాశం కల్పిస్తోంది. కిషన్‌జీ మృతదేహం ఉన్న కుడివైపున ఒక చెదలపుట్ట ఉంది. అది కాల్పుల్లో ఏ విధంగానూ చెక్కు చెదరలేదు. అక్కడక్కడా ఉన్న అటువంటి పుట్టలేవీ చెక్కుచెదరలేదు. మోర్టార్ లేదా రైఫిల్ ఫైరింగ్ దాఖలాలు లేవు. అధికారులల్లిన కథలో ఒకదానికొకటి పొంతన లేదు. ఇటువంటి పరిస్థితులపై స్వతంత్ర న్యాయవిచారణ అవసరం. రిటైర్డ్ లేదా సుప్రీంకోర్టు సిట్టింగ్ జడ్జీలచే ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా న్యాయ విచారణ జరిపితే నిజాలు తెలుస్తాయి.

### కిషన్‌జీ స్ఫూర్తికి చలించకుండా ఉండడం అసాధ్యం

మీడియాలో తలచుట్టూ గుడ్డచుట్టుకొని కేవలం వెనుకవైపు చూపించే కిషన్‌జీ మాత్రమే భారత ప్రజలకు తెలుసు. అతన్ని ప్రేమించేవారు, అభిమానించేవారు, ఎటువంటి హక్కులులేని నిరుపేద భారత ప్రజలు. వీరి నీరు, అడవి, భూమి దోపిడికి గురయింది. తూర్పు, మధ్య భారత రాష్ట్రాల్లోని అపార సహజ

---

ప్రజలలో ఉంటుంది కనుకనే. నిత్య లంచగొండుల గురించి మాట్లాడుకునే వారే ఉండరు. ఎప్పుడూ లంచాన్ని దరిచేరనీయని వ్యక్తి ఏదోఒకసారి ఎంగిలిపడితేనే పెద్ద చర్చ అవుతుంది. ఇంతకు మించిన ముఖ్యకారణం ఏమంటే - మావోయిస్టు ఉద్యమంలో మహిళల భాగస్వామ్యం గణనీయంగా ఉంటుండడం శత్రు వర్గాలను కలవరపెట్టే అంశం. కనుక మావోయిస్టు ఉద్యమం వైపు మహిళల ఆకర్షణను అడ్డుకోవాలనే దుష్టపన్నాగంలో భాగమే ఈ నేలబారు ప్రచారం.

మావోయిస్టు ఉద్యమ అమరనేత కామ్రేడ్ కిషన్‌జీపై వెలువడిన విమర్శలు, దుర్వ్యాఖ్యానాలు, దుష్ప్రచారాలు నిజానికి అతడిపై వ్యక్తిగతంగా సంధించినవి గావు. ఆయన నాయకత్వం వహిస్తుండిన ఉద్యమానికి వ్యతిరేకంగానే ప్రధానంగా గురిపెట్టబడ్డాయని అర్థం చేసుకుంటూ, వాటి డొల్లతనాన్ని అర్థం చేసుకోవడానికి వీలుగా మావోయిస్టు ఉద్యమ ఆచరణను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.



వనరులను దేశ విదేశాల్లో మల్టీ నేషనల్ కంపెనీలు దోపిడీ చేసే ప్రయత్నాలు చేస్తున్నాయి. అధికారుల్లోని మేధావులు, పాలకవర్గాలు మావోయిస్ట్ పార్టీ అంతర్గత భద్రతకు ప్రమాదం అంటున్నాయి. "శాంతి" - "ఆపరేషన్ గ్రీన్‌హంట్" పేరుతో పేద ఆదివాసీ ప్రజలపై యుద్ధం ప్రకటించారు.

పెద్దపల్లి, కరీంనగర్‌జిల్లాలో 1954లో స్వాతంత్ర్య సమర యోధులైన వెంకయ్య, మధురమ్మ దంపతులకు కిషన్‌జీ పుట్టారు. వీరిరువురూ ప్రగతిశీల భావాలు కల్గినవారు. 1974లో నక్సల్బరీ, శ్రీకాకుళం పోరాటాలతో స్ఫూర్తి పొందిన కిషన్‌జీ కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాఖలో చురుకైన కార్యకర్తగా పనిచేశారు. 1978లో సిరిసిల్ల, జగిత్యాల తాలూకాల్లో జరిగిన రైతాంగ పోరాటాల్లో కీలక పాత్ర పోషించారు. ఉత్తర తెలంగాణలోని ఆ రెండు ప్రాంతాలు కల్లోల ప్రాంతాలుగా ప్రకటించబడ్డాయి. ఈ నేపథ్యంలోనే ప్రస్తుతం కార్యదర్శి - గణపతి, కిషన్‌జీ వారి శక్తి, సామర్థ్యాలతో పార్టీ నిర్మాణం చేపట్టారు. వాస్తవానికి కరీంనగర్, ఆదిలాబాద్‌లలో 'రోడ్ టు రెవల్యూషన్' అనే ఎత్తుగడకు మొదటి బీజం పడింది.

1967 తర్వాతి నుండి సి.పి.ఐ. (ఎం.ఎల్) ఎత్తుగడలను సమీక్షించుకొన్నాక కొండపల్లి సీతారామయ్య ఆయన సన్నిహిత కామ్రేడ్స్‌తో కలిసి పార్టీ ఏర్పాటు చేయబడింది. ఎమర్జెన్సీ ఎత్తివేశాక రైతాంగ ఉద్యమం మొదలయింది. శ్రామికులు, రైతాంగం, విప్లవకారుల కార్యాచరణ ఫలితంగా 1980 ఏప్రిల్ 22న సి.పి.ఐ. (ఎం.ఎల్.) (పీపుల్స్‌వార్) ఏర్పాటయింది.

తక్షణ కర్తవ్యం ఉత్తర తెలంగాణ, దండకారణ్యంలలో గెరిల్లా జోన్‌లను ఏర్పాటుచేయడం అనేది పార్టీ అవగాహన. ఈ విషయంలో కిషన్‌జీ నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది. సి.పి.ఐ. (ఎం.ఎల్.) (పి.డబ్ల్యూ) నాయకత్వంలో కార్మికుల్లో ఒక వర్గం, భూమిలేని పేద దళితులు, వెనుకబడిన కులాలు, స్థానిక ఆదివాసీలు, పేదరైతాంగం దోపిడీ, అణిచివేతలను, రాజకీయ పెత్తందారీతనాన్ని ఎదిరించడం మొదలయింది.

1986లో దండకారణ్యంలో పార్టీని బలోపేతం చేసేందుకు కిషన్‌జీని పార్టీ పంపింది. ఆయన కృషి ఫలితంగా 'గెరిల్లా జోన్' ఏర్పడింది. పార్టీ, ప్రజా సంఘాలు బలంగా ఉన్న ప్రాంతంలో గెరిల్లాలు పై చేయి సాధించారు. రాష్ట్ర బలగాల ఆధీనంలోని ప్రాంతాల్లో గెరిల్లాలు రిట్రీట్ అయ్యారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో అక్కడి సహజ వనరులపై బడా కార్పోరేషన్ల ఆధిపత్యం సాధించడం ప్రభుత్వాల, బలగాల బాధ్యత - దీన్ని నిరోధించాలంటే ప్రజా గెరిల్లా విముక్తి సైన్యం - ప్రజావిప్లవ కమిటీలు, గిరిజన రైతాంగం - ప్రకృతి, వాతావరణం నాశనం కాకుండా అడ్డుకొని రక్షణ కల్పించాలంటే సుదీర్ఘకాలం పోరాడి సాధించుకోవాలి. ఆదివాసీలకు సహజ, సాంస్కృతిక రక్షణ ప్రశ్నార్థకమయింది.

1999ల మధ్యకాలం నుండి, ఆయన పార్టీలో విప్లవ శక్తుల ఐక్యత కోసం పనిచేశాడు. ప్రస్తుతం కేంద్రకమిటీ సభ్యుడు. పశ్చిమ బెంగాల్‌లోని జంగల్ మహల్ ప్రాంతంలో కిషన్‌జీ అతని సహచరులను ఎల్లప్పుడూ ఉత్తేజపరిచేవారు. 50 ఏళ్ల వయసులో కూడా యువ గెరిల్లావలె ఉత్సాహంతో పనిచేసేవారు.

నవంబర్, 2008లో పశ్చిమబెంగాల్‌లో ఉద్యమం మొదలవగానే సంస్కరణల సి.పి.ఐ. (ఎం) నాయకత్వంలోని ప్రభుత్వానికి వణుకు ప్రారంభమయింది. అతను దృఢవిశ్వాసం, శక్తిసామర్థ్యాలతో అతి సాధారణమైన జీవితం గడుపుతూ మరింత మెరుగైన సమాజ సాధన కోసం పోరాడంలో పాల్గొన్నాడు. అతడు చెప్పినదే ఆచరించాడు. గొప్ప నైతికత అతనిలోని వర్గపోరాటంపై తపన వలననే సాధ్యమైంది.

పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీలోని కామ్రేడ్స్ అంతా ఒకరి పట్ల మరొకరు ప్రేమ, సహకారంతో, ఆపదల్లో ఒకరి క్షేమం మరొకరు కోరుతూ, పరస్పరం గౌరవంతో ప్రజల మధ్య కలిసిపోయారు. యుద్ధఖైదీలు ఆయుధాలు అప్పగించి లొంగిపోతే వారిని గౌరవంతో చూడడం వారి ఆచరణ (2009, అక్టోబర్‌లో సంక్రాలి పోలీస్ స్టేషన్ ఇన్‌ఛార్జ్ ఆలేంద్రనాథ్ దత్తాను తీసికెళ్ళినపుడు) - జగిత్యాల నుండి జంగల్ మహల్ వరకు ప్రజల్లో అంతర్భాగమైన పీపుల్స్‌గెరిల్లా ఆర్మీ ప్రజలు కష్టాలు అధిగమించడానికు సహాయపడ్డారు. కిషన్‌జీ ఈ నిర్మాణంలో భాగమయ్యారు.

పశ్చిమ బెంగాల్‌లో నక్సల్బరీ పోరాట స్ఫూర్తి పునరుద్ధరించబడింది: కిషన్‌జీ నాయకత్వంలో (సి.పి.ఐ. - మవోయిస్ట్ పార్టీ) లాల్‌గఢ్ ఉద్యమం బలపడింది. పశ్చిమబెంగాల్ ప్రభుత్వం 4500 ఎకరాల అటవీ భూమిని సజ్జన్ జిందాల్ వ్యాపార గ్రూపుకు పశ్చిమ మిద్నాపూర్‌లోని సల్‌బోనిలో అప్పగించింది. భూసంస్కరణల కార్యక్రమంలో భాగంగా గిరిజనులకివ్వాల్సిన పట్టా భూముల పంపకం తొక్కి పెట్టేశారు. 2 నవంబర్ 2008న అప్పటి పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి బుద్ధదేవ్ బట్టాచార్యపై మావోయిస్టుల ల్యాండ్‌మైన్ పేల్చివేత ప్రయత్నం విఫలమయింది. జిందాల్ ప్రాజెక్టు శంకుస్థాపనలో పాల్గొని తిరిగొస్తున్నపుడు ఈ ఘటన జరిగింది. కిషన్‌జీ నాయకత్వంలో గిరిజన రైతాంగం తిరుగుబాటు చేస్తోంది. అక్కడి ప్రజలను ఎంతో కాలం అణచివేయడం సాధ్యం కాదన్న విషయం తేటతెల్లమయింది. నవంబర్‌లో లాల్‌గఢ్, సమీప ప్రాంతాల ప్రజల పోరాటాలకు మద్దతుగా 'పోలీస్ అత్యాచార విరోధి జన సాధారణ కమిటీ' ఏర్పడింది. దీన్నే పీపుల్స్ కమిటీ అగెనెస్ట్ పోలీస్ అట్రాసిటీస్ అంటారు.

డిసెంబర్ 2008 నుండి జూన్ 2009 వరకూ మావోయిస్ట్ రాజకీయ ఆధిపత్యంలో ఉన్నంతవరకూ ప్రజల ప్రత్యక్ష ప్రజాస్వామ్యరూపాలు ఆచరణలో ఉన్నాయి. ప్రతి గ్రామంలో గ్రామ కమిటీ ఉంటుంది. అందులో ఐదుగురు స్త్రీలు, ఐదుగురు పురుషులు ఉంటారు. ప్రతి గ్రామం నుండి ఇద్దరు కేంద్ర కో ఆర్డినేటింగ్ కమిటీలో సభ్యులుగా ఉంటారు. (ఒక స్త్రీ + ఒక పురుషుడు) నిర్ణయాలు ఆమోదించే విధానం పూర్తిగా ప్రజాస్వామ్య బద్ధంగా ఉంటుంది. అధికారులు ప్రజలతో పాటే నేలపై, చాపలపై కూర్చుని చర్చల్లో పాల్గొంటారు. శ్రమదానం ద్వారా చెరువుల తవ్వకం, గొట్టపు బావులను నిర్మించడం, గట్టులను రిపేరూ

చేయడం, ఆరోగ్యశాఖను నిర్వహించడం, వారానికి ఒకమారు కలకత్తా నుండి అక్కడికి వచ్చే డాక్టర్ల సహకారంతో ప్రజల ఆరోగ్య పరిరక్షణ కోసం శ్రద్ధ పెట్టడం, స్థానిక భాషలోనే పాఠశాలల బోధన కార్యక్రమాలు నిర్వహించడం లాంటి ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

ఆ ఏడు నెలల కాలం 'పీపుల్స్ కమిటీ అగెనెస్ట్ పోలీస్ అట్రాసిటీస్', సి.పి.ఐ. (మావోయిస్ట్) కిషన్‌జీ నాయకత్వంలో వివేకంతో కూడిన సమతుల కార్యాచరణ ఒకవైపు, రాజకీయ సమీకరణ మరోవైపు ఇలా అభివృద్ధి కార్యకలాపాలు, సంక్షేమ కార్యక్రమాలు జరిగాయి. ఎప్పుడైతే అనూజ్‌పాండే (సి.పి.ఐ. (ఎం)) జోనల్ సెక్రటరీ "ఇంటిని వైట్‌హౌస్" (పురాతన పాలనకు చిహ్నమైన)ను జూన్ 14న ధరమ్‌పూర్ వద్ద నాశనం చేయడంతో తిరిగి ఆ ప్రాంతాల్లో అలజడి మొదలయింది. కేంద్ర, రాష్ట్ర బలగాలు స్థానిక హర్మద్‌ల (సి.పి.ఐ. (ఎం.)) సహకారంతో ఆక్రమించుకొంటూ, సైన్యంలాగా ముందుకు చొచ్చుకొని రావడం మొదలయింది. రాజకీయ సమీకరణ, సాయుధ పోరాట ఎత్తుగడతో విజయవంతంగా నడుస్తున్న మావోయిస్టు ఎత్తుగడ తాత్కాలికంగా వెనక్కు తగ్గింది. అప్పటి పాలక పార్టీ సి.పి.ఐ. (ఎం), తృణమూల్ కాంగ్రెస్‌ల మధ్య వైరుధ్యాలతో వ్యవహరించడంలో కిషన్‌జీ పొరపడ్డారు. అతని ఒంటెత్తు వామపక్ష తీవ్రమైన ఎత్తుగడల వలన పార్టీ, ప్రజా ఉద్యమాలపై ప్రభుత్వ అణచివేత మొదలయింది. మావోయిస్టు విప్లవకారులపై, ప్రజా ఉద్యమాలపై ప్రభుత్వ అణిచివేత మొదలయింది. మావోయిస్టు విప్లవకారులు, సోషల్ డెమోక్రెట్లు సి.పి.ఐ.(ఎం)ల మధ్య స్థానిక వ్యతిరేకతలు తీవ్రమయ్యాయి. కొందరిని పొరపాటుగా చంపడంతో (వర్గ శత్రు నిర్మూలనా?) సి.పి.ఎం. పార్టీలోని బలహీన పరిస్థితులను తనకు అనుకూలంగా మార్చుకొని ఏప్రిల్ - మే నెలలో జరిగిన ఎన్నికల్లో సి.పి.ఐ. (ఎం.) అభ్యర్థులను తృణమూల్ కాంగ్రెస్ ఓడించింది.

ఆ పరిస్థితిని మారుస్తానని మమతా బెనర్జీ చేసిన వాగ్దానం ప్రకారం 2009 నుండి ఆదివాసీ ప్రాంతాల్లో ఉంటున్న సంయుక్త బలగాలను ఉపసంహరించుకోవాలి; రాజకీయఖైదీలను బేషరతుగా విడుదల చేయాలి. వందలాది మంది ఆదివాసీలు జైళ్లలో ఎటువంటి విచారణ లేకుండా నిర్బంధించబడి ఉన్నారు. వారిని విడుదల చేయాలి. తర్వాత మావోయిస్టులతో చర్చలు - ఇవన్నీ ఏవీ ఆమె అమలు చేయలేకపోయారు.

10,000 మంది ప్రత్యేక పోలీస్ కానిస్టేబుళ్ళను నియమించారు. ఛత్తీస్‌గడ్‌లో సాల్వాజుడుం వ్యవహారం పద్ధతిలో తృణమూల్ కాంగ్రెస్ భైరవ్ వాహిని సంయుక్త బలగాలకు సహకరిస్తోంది. సి.పి.ఎం. హర్మద్‌ల పరిస్థితి కూడా ఇందులో భాగమే. అభివృద్ధి - లొంగుబాటు ప్యాకేజీ ఒకవైపు ప్రకటిస్తూనే సంయుక్త బలగాలకు కోబ్రా గెరిల్లా యుద్ధంలో శిక్షణ కార్యకలాపాలతో ముందడుగు వేస్తోంది. ఆంధ్రలో ప్రత్యేక ఇంటలిజెన్స్ బ్యూరోలాంటి నక్సలైట్స్ కార్యకలాపాల ఇంటలిజెన్స్ బ్యూరోను బలోపేతం చేయడం ద్వారా కిషన్‌జీ లాంటి వారిని చంపిన విజయానందంలో పాలకవర్గాలున్నాయి. ప్రస్తుత పరిస్థితికి ఉద్యమం పునఃసృజన చేసిన కా. కిషన్‌జీ, శశిధర్ మహతోలాంటి కామ్రేడ్స్ కారణమని చెప్పాలి.

## ఎన్‌కౌంటర్లు అన్నీ హత్యలే

న్యాయవ్యవస్థ పరిధిని దాటి మావోయిస్టులను చంపడం కొత్త విషయం కాదు. విప్లవోద్యమ నాయకత్వాన్ని అంతం చేయడం అనేది భారత పాలక వర్గాల కౌంటర్ ఇన్‌సర్జెన్సీలో భాగం.

- వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం వీరిరువురూ ఉపాధ్యాయులు. 1955 నుండి శ్రీకాకుళంలో గిరిజన రైతాంగాన్ని సమీకరించి 1967-68 మధ్యకాలంలో సాయుధపోరాటం చేశారు. 1969లో సి.పి.ఐ. (ఎం.ఎల్)లో చేరారు. 1970లో వీరివురినీ పోలీసులు ఎన్‌కౌంటర్ పేరున చంపేశారు.
- సుబ్బారావు పాణిగ్రాహి (జముకల కథలో ప్రసిద్ధులు) శ్రీకాకుళ ఉద్యమాన్ని ఒరిస్సా సరిహద్దులకు విస్తరింపజేశారు. డిసెంబర్ నెలలో 1969లో పోలీసులు ఆయనను పట్టుకొని కాల్చిచంపారు. ఆంధ్రప్రదేశ్‌లో ఎమర్జెన్సీ కాలంలో నిర్బంధం, ఎన్‌కౌంటర్ల రోజులను చీకటి రోజులుగా భావిస్తారు. ఈ హత్యలపై విచారణ కోసం జయప్రకాశ్ నారాయణ్ అధ్యక్షతన సిటిజన్స్ ఫర్ డెమోక్రసీ పేరుతో ఒక కమిటీ ఏర్పాటయింది. అందులో వి.ఎం. తార్కుండే నాయకత్వంలో కె.జి. కన్నబిరాన్‌తో పాటు అనేకమంది పౌరహక్కుల కార్యకర్తలు ముఖ్యపాత్ర పోషించారు.
ఈ మధ్యకాలంలో పార్టీ అభివృద్ధికి ఎన్నో ఏండ్లుగా కృషి చేస్తున్న ముఖ్యులను. మావోయిస్ట్ పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యులను కౌంటర్ ఇన్‌సర్జెన్సీలో భాగంగా భౌతికంగా నిర్మూలించారు. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన విప్లవోద్యమ నాయకత్వాన్ని మావోయిస్ట్ పార్టీ కోల్పోయింది.
- శెట్టిరాజు పాపయ్య (అలియాస్ సోమన్న) స్పెషల్ జోన్ కమిటీ నార్త్ తెలంగాణకు చెందిన ఇతన్ని బెంగుళూరులో ఎ.పి. స్పెషల్ బ్రాంచ్ పోలీసులు అపహరించారు. 29 జూన్ 2006లో తీవ్రమైన చిత్రహింసలకు గురిచేసి జూలై 1న వరంగల్ అటవీ ప్రాంతంలో అతని మృతదేహం పడవేశారు.
- బుర్రా చిన్నయ్య (అలియాస్ మాధవ్) రాష్ట్రకార్యదర్శిగా ఉన్న ఇతనితో పాటు మరో ఏడుగురిని 23 జూలై 2006 గ్రేహౌండ్స్ బలగాలు, స్పెషల్ బెటాలియన్ పోలీసులు నల్లమల అటవీ ప్రాంతంలో చుట్టుముట్టి కాల్చి చంపారు. పక్కా సమాచారంతోనే వాళ్ళు దాడి చేశారు.
- రాఘవులు పార్టీ రాష్ట్రకమిటీ సభ్యుడు - ఇతడు పేద రైతు కుంటుంబం నుండి వచ్చాడు. పశువుల కాపరిగా పెరిగాడు. అతనితో పాటు మరో ఎనిమిది మంది విప్లవకారులను 8 నవంబర్ 2006న కడప జిల్లా అటవీ ప్రాంతంలో చంపేశారు.
- చంద్రమౌళి మావోయిస్ట్ పార్టీ సెంట్రల్ కమిటీ సభ్యుడు, అతని సహచరి కరుణలను (ఆమె డాక్టరు) ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దుల్లో 29 డిసెంబర్ 2006న పార్టీ కాంగ్రెస్‌కు వెళ్తున్నప్పుడు పట్టుకొని చంపేశారు.

(మిగతా 23వ పేజీలో.....)

వ్యాసం

# చందమామ నుంచి జంగల్ మహల్ వరకు

- రాజశేఖర రాజు

బాల్యంలో చందమామ కథలు చదువుకున్న ఆ కుర్రవాడు చందమామ కథలు చెప్పే మంచితనం తన చుట్టూ ప్రపంచంలో కనిపించడం లేదని మనసుకు తట్టినప్పుడు సంప్రదాయాలను, బాల్యంలో ఆచరించిన ఆర్.ఎస్.ఎస్ భావాలను కూడా త్యజించి పోరుబాట పట్టాడు ఒక బ్రాహ్మణ కుర్రాడు. నమ్మిన విశ్వాసం కొరకు నేలకొరిగిన మాన్యుడి కులం గురించి ప్రస్తావించినందుకు మన్నించాలి. పుట్టుకతో వచ్చిన సమస్త సంప్రదాయ విలువలను తాను నమ్మిన లోకహితం కోసం వదులుకుని పోరు బాట పట్టాడు.

ఇల్లు, తల్లిదండ్రులు, రక్తసంబంధాలు...ఇలా తనదీ అనిపించుకున్న సమస్త వ్యక్తిగత సంబంధాలను ఆ పిల్లవాడు తెంచేసుకున్నాడు. జీవితాన్ని విప్లవం కోసం అంకితం చేసి 35 ఏళ్లక్రితం భవబంధాలకు దూరమై ప్రజల్లో కలిశాడు. 17 సంవత్సరాల నూనూగు మీసాల లేత వయసులో అతడు చేపట్టిన మార్గం ఇవ్వాళ భద్రసమాజం దృష్టిలో "హింసా" మార్గంగానే కనబడవచ్చు. రాజకీయ పంథా పేరిట భౌతిక హత్యలను ప్రేరేపిస్తున్న "పేదధోరణి"గా నాగరిక సమాజం ఆయన మార్గాన్ని అభిశంసించవచ్చు కానీ, చందమామ కథలతో బాల్యాన్ని పండించుకున్న ఈ అత్యంత సున్నిత హృదయుడు 35 సంవత్సరాల పాటు ప్రత్యామ్నాయ మార్గం తప్ప ఇంకా ఏదీ వద్దనుకున్నాడు. ఎవరు అంగీకరించినా, అంగీకరించకున్నా తెలుగునేలపై మధ్యభారత దేశంలో లక్షలాది మంది ప్రజలను కదిలించిన ఒక మహోద్యమాన్ని ముందుండి నడిపించాడు.

ఉద్యమ అనివార్యతల్లో భాగంగా అమ్మను చూడలేకపోయినవాడు....కన్న ఊరికి, కన్నవారికి, తల్లిపేగుకు దూరంగా గడపవలసివచ్చినవాడు. "జీవితమే ఒక పండుగ కావాలని, కోట్లాది మంది తల్లుల కన్నీళ్ళు తుడవాలనీ, పండుగలు, పబ్బాలు ఎవరి మత విశ్వాసాల ప్రకారం వారు శాంతియుతంగా జరుపుకోవాలనీ, కన్నతల్లులందరి మమకారం కోసం ఎవరు తిరస్కరించినా, ప్రాణాలొడ్డి పోరాడుతున్నామని" మరణించడానికి రెండేళ్ళ క్రితం కూడా కన్న తల్లికి సుదూరం నుంచి ఉత్తరం పంపినవాడు.."నీ రహస్యాన్ని, గుట్టును దాచలేనప్పుడే నీ పతనం ప్రారంభమవుతుంద"ని రెండు వేల సంవత్సరాల క్రితం చాణక్యుడు తెగేసి చెప్పిన దేశంలో పుట్టిన ఈ కుర్రాడు ఆ రహస్యజీవితాన్నే తన ప్రాణవాయువుగా ఎంచుకుని తాను నమ్మిన విశ్వాసం కోసం 35 ఏళ్లు పోరాడుతూనే చివరికి నేలకొరిగాడు. మన దూషణ భూషణలకు అతీతంగా విగతజీవుడై కన్న ఊరిలో అంతిమ సంస్కారానికి నోచుకున్నాడు.

ఆంధ్రప్రదేశ్ నుంచి నేపాల్‌తో దేశ సరిహద్దుల వరకు వందలాది, వేలాది మైళ్ళు కాలినడకతో చుట్టిన ఈ మనిషి చాలా మంది దృష్టిలో విప్లవాన్నే కాదు, ఆరుపదుల జీవితంలో కూడా ఏమీ సాధించలేని వాడిగానే కనపడవచ్చు కాని ఒక మిత్రుడు అన్నట్లు "విప్లవం గురించి అట్లా విడిచిపెడదాం. ఒక మనిషి ఎనిమిది రాష్ట్రాల్లో తన పాదముద్రలు వేయడం ఎలా సాధ్యం? ఒక మనిషి ఎనిమిది రాష్ట్రాల్లో ఆంధ్రప్రదేశ్ నుంచి ఆసోం దాకా విప్లవాల కలలను ఎగజల్లడం ఎలా సాధ్యం? ఆ మనిషి ఎక్కడుంటే అక్కడ ఒక సైన్యం తయారు కావడం ఎలా సాధ్యం? ఆయనేమన్నా జానపద హీరోనా? వేయి చేతులు, వేల కాళ్ళు, లక్షల ఆలోచనలు ఏకకాలంలో అనేక పనులు చేయగలిగిన మహిమానిత్యుడా? కాదు మల్లోజుల కోటేశ్వరరావు ఒక మనిషి. మాములు మనిషి. ప్రేమగా మాట్లాడే మనిషి. ప్రేమగా నలుగురితో నవ్వుతూ మాట్లాడే మనిషి.

ఆర్.ఎస్.ఎస్ నుంచి ఆర్.ఎస్.యు. దాకా, కరీంనగర్ పెద్దపల్లి నుంచి లాల్‌గడ్ జంగల్ మహల్ దాకా పాదరసంలా పరిణమిస్తూ ప్రవహించిన ఈ సామాన్యుడు ఇవ్వాళ దేశంలోని అన్ని ప్రచార, ప్రసార సాధనాలలో ప్రధానవార్తగా మిగిలాడు. మంచిగా, చెడ్డగా కూడా కావచ్చు. కాని ఒకప్పుడు ఈ కుర్రాడిని సంఘంలో చేర్పించి కర్రసాము నేర్పించి క్రమశిక్షణతో మలిచిన నాటి ఆర్ఎస్ఎస్ గురువులు, నాటి ఆర్ఎస్ఎస్ సహచరులు సైతం వ్యక్తిగా అతడి సున్నిత గుణాన్ని, స్పందించే తత్వాన్ని తలుచుకుని మరీ బాధపడుతున్నారు. ఆ కుర్రాడి ఆచరణను, సిద్ధాంతాన్ని మనలో చాలామంది తోసిపుచ్చవచ్చు. దేన్నయినా తోసిపుచ్చగల, విమర్శించగల, దూషించగల మన హక్కును ఎవరు కాదనలేరు కూడా. నిజాయితీగా ఆలోచిస్తే గాంధీజీ తప్ప ఈ దేశంలో ఎవరూ ఏ క్షణంలో కూడా పాటించని గాంధేయ వాదానికి భిన్నంగా మూడున్నర దశాబ్దాలపాటు తిరుగుబాటు మార్గంలోనే తాను నడిచిన మాట వాస్తవం.

మనిషి ఎందుకు తిరగబడుతున్నాడో...మానవ సమూహాలు వేలాది సంవత్సరాలుగా పోరాట బాటలోనే ఎందుకు నడుస్తూ వచ్చాయో అర్థం కాని బాల్య అమాయకత్వంలో సమాజంలో ఏ ఒక్క వర్గమూ, బృందమూ ప్రస్తుతం లేదు. తిరుగుబాటు ఎందుకు పుడుతుందో అర్థం కావడానికి మనం నేతాజీ, భగత్‌సింగ్‌ల వద్దకే పోనవసరం లేదు. మన గడ్డపై పుట్టి రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యంపై బాణాలు సంధించిన మన అల్లూరిని తలచుకుంటే చాలు. ఒక ప్రజాస్వామ్య మేధావి అన్నట్లుగా "ఈ దేశం సార్వభౌమత్వాన్ని, దేశ వారసత్వ సంపదల్ని కాపాడుతున్నది వాస్తవంలో ఆదివాసీలే. దేశాన్ని టోకుగా, చిల్లర చిల్లరగా అమ్ముతున్నది రాజకీయ నాయకులు. అవినీతి పరులైన

ఉన్నతాధికారులే. దేశానికి చెడుచేస్తున్నవారే నిత్యం మనందరి గౌరవ మర్యాదలు పొందుతునారూ! లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని ఈ ఘరానా మనుషులు సొంతం చేసుకొంటున్నారు. ఈ దేశ సంపదను విదేశీ పెట్టుబడిదారుల నుంచి కాపాడేది ఆదివాసీలే. వాళ్ళకి నాయకత్వం వహిస్తున్న ఆదిరెడ్డి, సంతోష్ రెడ్డి, ఆజాద్, కిషన్‌జీలు అత్యంత ప్రమాదకారులుగా ముద్రవేయబడి కిరాతంగా చంపబడుతున్నారు.

ఆదివాసుల కాళ్లకింది భూమి ఇవ్వాళ మన దేశంలో నిలువునా కరిగిపోతోంది. ఇప్పుడే కాదు భవిష్యత్తులో కూడా ఈ దేశంలో పుట్టబోయే వంద తిరుగుబాట్లకు కూడా ఇదే మాతృక. తిరుగుబాటు అవసరం లేనంత ధర్మబద్ధంగా రాజ్యం రెండుపాదాల మీద అయినా నడుస్తూ ఉంటే దేశవ్యాప్తంగా ఇన్ని వేల ప్రాణాలు హరించుకుపోయేవి కాదు. ఇంకా పోతూ ఉండేవి కావు. వ్యక్తిగత అవసరాలకు, ఉద్యమావసరాలకు, దేశ రక్షణ అవసరాలకు మనిషి తోటి మనిషిని చంపడం, చంపక తప్పని పరిస్థితి రావడం ఉండకూఢదని కోరుకోవడం మానవ విలువల్లోనే అత్యున్నతమైన విలువ. ఇది ఏకాలంలోనయినా ఎవరయినా వ్యతిరేకించలేని విలువ. కాని మనిషిని , జీవితాన్ని భౌతికంగా, మానసికంగా, మనుగడ పరంగా చంపని, పీడించని సమాజం కోసం మనిషి అన్వేషణ ఇంకా ఫలించలేదు. ఏ హింసా ఉండకూడదని కోరుకోవడం ఎంత గొప్ప విలువో, సమాజ జీవితమే, మానవ జీవితమే వరమ హింసాయుతంగా అన్ని రకాలుగా మారిపోతున్నప్పుడు కొన్ని రకాల హింసలను ఖండిచడమే మన సమాజంలో ఒక పెద్ద సమస్యగా మిగిలిపోతుంది. ఒకే ఒక్క ఉదాహరణ. "అవతార్ పోరాటాలు కొద్దో గొప్పో స్థాయిలో తమ మనుగడ కోసం అనివార్యంగా, అవసరంగా కొనసాగుతున్నాయో, ఇంకా కొనసాగబోతాయో కూడా మనలో చాలా మందిమి తెలియనట్టే, చూడనట్టే వ్యవహరిస్తాం. భిన్న దృక్పథాలు, అవసరాలు ఘర్షిస్తున్న సమాజంలో కిషన్‌జీ కొందరికి దేవుడయితే మరి కొందరికి రాక్షసుడుగానే కనబడవచ్చు. ఆదివాసీలు బతకాలంటే కిషన్‌జీ వంటి వ్యక్తులు అవసరం. ఈ కోణంలోనే మనుగడ కోసం పోరాడుతున్న, పోరాడక తప్పని ప్రజలు మాత్రం కిషన్‌జీని భావి తరాలు ఒళ్లు గగుర్పొడిచేలా, నిలువెల్లా విద్యుత్ ప్రవహించేలా, చరిత్ర పొడవునా నిలిచి ఉండే వీరుడిలా, జానపద కథానాయకుడిలా తలపోసుకుంటారు.



---

(21వ పేజీ తరువాయి.....)

- పటేల్ సుధాకర్ రెడ్డి (సూర్యం, వికాస్) ఇతను కూడా సెంట్రల్ కమిటీ సభ్యుడు. మరో కామ్రేడ్ వెంకటయ్య వీరిరువురినీ కలిపి నాసిక్‌లో పట్టుకొని 23 మే 2007న వరంగల్‌కు తీసుకొని వచ్చి, చిత్రహింసలు పెట్టి కాల్చి చంపి 'లవ్వాల' అటవీ ప్రాంతంలో మృతదేహాలను పడేశారు.
- ప్రభుత్వం ఆచరిస్తున్న టెర్రరిస్టు నేరవిధానంలో భాగమే కిషన్‌జీ హత్య. న్యాయవ్యవస్థకు అతీతంగా మనుషులను చంపి పడేసిన ఇటువంటి స్థితిని సవాలు చేయగలమా? ప్రజాధనంతో నియమితమయిన న్యాయవ్యవస్థ ఇటువంటి వారిని శిక్షించదా? ఈ సంవత్సరం ప్రారంభంలో సుప్రీంకోర్టు న్యాయమూర్తుల బెంచి, అఫ్తాబ్ ఆలమ్, ఆర్.ఎం.లోధా రెండు బూటకపు ఎన్‌కౌంటర్లపై ప్రజా వ్యాఖ్యాలను విచారిస్తూ - "భారత రిపబ్లిక్ తన పిల్లలను తానే చంపడాన్ని సమ్మతించడం కుదరదు" అని వ్యాఖ్యానించింది.
- చెరుకూరి రాజకుమార్ (ఆజాద్) పార్టీ స్పోక్స్‌పర్సన్, పొలిట్ బ్యూరోమెంబర్, అలానే జర్నలిస్ట్ హేమచంద్రపాండేలను 1, 2 జూలై 2010 తేదీల్లో నాగపూర్‌లో పట్టుకొని ఆంధ్రప్రదేశ్ పోలీసులు వారిని ఆదిలాబాద్‌లో కాల్చి చంపారు.
- కిషన్‌జీ హత్య కూడా అదే రీతిలో జరిగింది. పోలీస్ వ్యవస్థకు శిక్ష నుండి మినహాయింపు ఉండడం వలన న్యాయవ్యవస్థనే ధిక్కరించే స్థాయికి ఆ వ్యవస్థ చేరింది. అణచివేత యంత్రాంగం మనదేశంలో అధికారులను ఉపయోగించుకుంటోంది. రాజ్యహింసను ప్రతిఘటిస్తున్న కిషన్‌జీని అటువంటి బలగాలే ప్రతీకారంతో చంపేశాయి.

## ఎర్రజెండాను ఎత్తిపట్టండి - అంతర్జాతీయ గీతం పాడండి:

కిషన్‌జీ అమరత్వం విప్లవోద్యమానికి తీరని లోటు. ఈ ఉద్యమంలో ఎత్తుపల్లాలు, లోటుపాట్లు, విజయాలు ఎన్నెన్నో ఉన్నప్పటికీ ఉన్నత సమాజ సాధన కోసం ధృఢమైన విశ్వాసాన్ని కల్గిస్తోంది. పెద్దపల్లిలో కిషన్‌జీ అంతిమ యాత్రలో పాల్గొనేందుకు వేలాదిమంది అభిమానులు తరలి వచ్చారు. నవంబర్ 27న అక్కడ పోలీసు బలగాల మోహరింపు పెద్దఎత్తున ఉంది. 3 దశాబ్దాలుగా కొడుకును చూడని, 80 ఏళ్ళ మధురమ్మ దుఃఖం ఆపడం ఎవరితరమూ కాలేదు. ఆమె మాటల్లో "నా కొడుకు నమ్మిన దానికోసం చంపబడ్డాడు. ఎందుకు చంపారో, ఎవరు చంపారో నాకు తెల్సుకోవాలని ఉంది. హైకోర్టుకు కూడా అవసరమైతే వెళ్తాను, లేదంటే సుప్రీం కోర్టుకు. 37 ఏళ్ళుగా నేను నా కొడుకును చూడలేదు. నేను చనిపోక ముందే అతన్ని చూడాలనుకొన్నాను. కానీ ఇప్పుడు అతని మృతదేహం చూడలేను. ఆ దేహం చేరకముందే నేను చనిపోతే బాగుంటుంది. ఇంక నేను బతకలేను." అంటూ హృదయవిదారకంగా కిషన్‌జీ తల్లి దుఃఖిస్తోంది.

గద్దర్ పాటలు అక్కడున్న వాళ్ళ కళ్ళల్లో ప్రవహించాయి. వేలాదిమంది! కిషన్‌జీ అమర్ హై! జోహార్ అమరజీవి కిషన్‌జీ, కా. కిషన్‌జీ లాల్ సలామ్, అంటూ నినదించారు. అతని వారసులు పేద రైతు కూలీలు, విప్లవ మేధావుల దుఃఖంతో ఆ ప్రాంతం నిండిపోయింది. ప్రజలను విప్లవోద్యమంలోకి సమీకరించడం ద్వారా విప్లవం విజయవంతమవుతోంది. అతని కలలు నిజమవుతాయి. అతని జ్ఞాపకాలు, ఆచరణ నూతన సమాజం ఆకాంక్షిస్తున్న వారందరికీ అవసరం. చరిత్రలో కిషన్‌జీ అమరత్వం శాశ్వతం.



రిపోర్టు

# కా. చింతల వెంకటస్వామి (సూర్యం) సంస్మరణ సభ

- విరసం, గుంటూరు యూనిట్

రాజ్యహింస మరోసారి ప్రశ్నించబడింది. సర్కారీ గూండాల చేతుల్లో సర్కారు జిల్లాలో నేలకొరిగిన ప్రజాయుద్ధ వీరుడు కా. సూర్యం సంస్మరణ సాక్షిగా ఆయన కుటుంబ సభ్యులు, మిత్రులు, శ్రేయోభిలాషులు నెమరువేసుకున్న జ్ఞాపకాలు పురివిప్పిన వేళ... ఆ మహనీయుని అడుగుల్లో అడుగు వేసిన నాటి అనుచరులు, ఆయుధాన్ని భుజం మార్చుకున్న సహచరులు తమ తమ అనుభవాల్ని పంచుకున్న వేళ... జిల్లా నలుమూలల నుంచి కదలివచ్చి కసితో, కన్నీటితో భావాల్ని పంచుకున్న వేళ... నాగేటి చాళ్ళల్లోని ఎర్రమల్లెల త్యాగాల్ని పునఃస్మరించుకున్న వేళ.... అది ఎర్రజెండాల రెపరెపలతో కా. సూర్యం స్మారక స్థూపం సభ ప్రాంగణం.... అంతటా ఒకే నినాదం... అమర్ రహే కా. సూర్యం! ఆయన ఆశయాల్ని కొనసాగిస్తాం....

అది 29 సెప్టెంబరు 2011 సాయంత్రం 6 గంటలు. గుంటూరు నగరం ఆంజనేయపేట కా. సూర్యం స్వగృహం. రాష్ట్ర ఇంటిలిజెన్స్ పోలీసులు 28 సెప్టెంబర్ 1994న దొంగచాటుగా దాడి చేసి కా. సూర్యం, పద్మలను నెల్లూరులో అరెస్ట్ చేసి తీవ్ర చిత్రహింసలకు గురిచేసి కోవూరులో దారుణంగా కాల్చి చంపిన రోజు. కా. సూర్యం పీడిత ప్రజానీకానికి భౌతికంగా దూరమైన రోజు. సామాన్య కార్మిక జీవితం నుంచి అసాధారణ విప్లవ శిఖరంగా మారి పీపుల్స్‌వార్ పార్టీ రాష్ట్ర కమిటీ సెక్రటేరియట్ సభ్యునిగా కొనసాగుతూ పోలీసుల తుపాకీ తూటాలకు నేలరాలిన రోజు. ప్రజాయుద్ధ పోరాటయోధుడు చింతల వెంకటస్వామి అలియాస్ సూర్యం 17వ సంస్మరణ సందర్భంగా ఆయన కుటుంబ సభ్యులు కా. సూర్యం సంస్మరణ సభని ఏర్పాటు చేశారు. ఈ సభలో కా. సూర్యం బాల్యం, కార్మిక జీవితం నుండి విప్లవ జీవితం దాకా సాగిన ప్రస్థానంలో ఆయన చేసిన పోరాటాలు, త్యాగాలు కొనియాడబడ్డాయి.

తొలుత కా. సూర్యం సహచరి అనసూయమ్మ, ఆయన కుమారులు శ్రీనివాసరావు, మల్లికార్జునరావు, స్టాలిన్ ఇతర కుటుంబ సభ్యులు ఆయన చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. కా. సూర్యం అమరత్వానికి గుర్తుగా రెండు నిమిషాలు మౌనం పాటించిన అనంతరం సభ ప్రారంభమైంది. సభకు కా. సి.ఎస్.ఆర్. ప్రసాద్ స్వాగతం పలకగా కా. సూర్యం కుమారుడు చింతల మల్లికార్జున రావు అధ్యక్షత వహించారు. అమరవీరుల త్యాగాలను స్మరిస్తూ కా. డప్పు రమేష్, ప్రకాశ్, కృష్ణ, పండు తదితరులు ఆలపించిన విప్లవ గీతాలతో, నినాదాలతో సభా ప్రాంగణం ఉద్విగ్నంగా మారింది.

కా. సూర్యం సంస్మరణ సభకి అధ్యక్షత వహించిన ఆయన కుమారుడు చింతల మల్లికార్జున రావు మాట్లాడుతూ తనకు ఏడవ ఏడు వచ్చే సరికి తన తండ్రి అజ్ఞాత జీవితంలోకి వెళ్ళిపోయాడని, తల్లి అనసూయమ్మ ద్వారానే తండ్రి జ్ఞాపకాలను నెమరు వేసుకోగలుగుతున్నాని చెప్పారు. పోలీసు నిర్బంధంలో 18 గంటలపాటు తీవ్ర చిత్రహింసలకు గురికాబడినా తల్లిలాంటి పార్టీ గుట్టు విప్పలేదన్నారు. తొలుత సభకి స్వాగతం పలికిన కా. సి.ఎస్.ఆర్. ప్రసాద్ మాట్లాడుతూ గుంటూరు జిల్లా విప్లవోద్యమ నిర్మాతలైన కా. గురవయ్యసారు, కా. జవ్వాజి వెంకట సుబ్బయ్య, కా. సూర్యంల త్రయం శ్రామిక కుటుంబాల నుంచి వచ్చి, సామాన్యులుగా జీవితాన్ని ఆరంభించి అసామాన్య విప్లవ నాయకులుగా ఎదిగిన క్రమాన్ని వివరించారు. వాళ్ళ వాళ్ళ అనుభవాలలోంచి తమను తాము అన్వయించుకొని మొత్తం సమాజానికి అన్వయించడంలో ఉత్తమమైన పాత్రని నిర్వహించారని కొనియాడారు. సరళమైన భాష ఆయన శైలి. తాత్విక స్థాయిలో ఆలోచించడం, ఇతరులను ఒప్పించడంలో ఆయన అందెవేసిన చెయ్యి. ఈ సాధారణ వ్యక్తి శ్రామిక మేధావిగా మారడానికి విప్లవోద్యమమే కారణం. మాలో కొద్ది మందిమి మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్న తొలినాళ్ళల్లో మమ్మల్ని ఒప్పించడానికి పార్టీ నాయకత్వం కా. సూర్యంని పంపించింది అంటూ తన జ్ఞాపకాలను పంచుకున్నారు. విరసం సభ్యులు కా. జి. కళ్యాణరావు మాట్లాడుతూ విప్లవ జీవితంలో అనేక విలువలకి కొత్త చేర్పులు కల్పించిన... 

అన్నారు. ఆయన సంస్మరణ సభ నిర్వహణ తీరు కూడా చారిత్రాత్మకమైనదన్నారు. ఇవ్వాళ దేశంలో, రాష్ట్రంలో పీడిత ప్రజలు ధైర్యంగా, నమ్మకంగా బతుకుతున్నారంటే కారణం మావోయిస్టు పార్టీయేనని కళ్యాణరావు స్పష్టం చేశారు.

అమరవీరుల బంధుమిత్రులు కమిటీ అధ్యక్షులు కా. గంటి ప్రసాదం మాట్లాడుతూ ఉదాత్తమైన ఆశయంతో ప్రజల కోసం మరణించడం గొప్ప విషయమని, కా. సూర్యం పోరాట రూపాలు, గుణాలు చారిత్రాత్మకమైనవన్నారు. కా. సూర్యం ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్‌లలో కా. సూర్యం సజీవంగా సాయుధమైయున్నాడు. ఆయా ప్రాంతాలలో ఆయనెత్తిన అరుణ పతాకం సమున్నతంగానే రెపరెపలాడుతోంది. ఆయన కన్న కలలను దేశ పోరాట ప్రజలు

# వెంకాయమ్మ స్మృతిలో

- కొడవటి హనుమంతరావు

వెంకాయమ్మ మరణవార్త వినగానే ఇక పనిచేయలేకపోయాను. వేటపాలెంలో బస్సు దిగగానే పాత ఇల్లు కాదు. వేరేచోట అంత్యక్రియలని తెలిసి ప్లేస్ ఎక్కడో తెలుసుకుందామని ప్రయత్నిస్తున్నాను. అంతలోనే డప్పుల మోతలు, మైక్‌లో ఎర్రజెండా ఎర్రజెండన్నీయలో అనే పాట. అవి వినపడే దిశగా బయల్దేరాను. సమీపించగానే ఒక ట్రాక్టరులో అమ్మ పార్థివ కాయం చుట్టూ ఎర్రజెండాలు. వాయిద్యాలు కూడా ఎర్రజెండా ట్యూన్‌నే వినిపిస్తున్నాయి. అక్కడికెళ్ళగానే నా కోసమే ఆగినట్లు ఊరేగింపు బయలుదేరింది. స్థానికులకన్నా జిల్లా నలుమూలలనుంచి వచ్చిన వాళ్ళే ఎక్కువగా ఉన్నారు. అందరినీ పలుకరించికుంటూనే రోడ్డు పక్కన నిలబడ్డ వారి సంభాషణలు వింటున్నాను. కమ్యూనిస్టోళ్ళు ఎవరో చనిపోయినట్లుంది అని కొంతమంది, ఆ మేరా! కమ్యూనిస్టు వెంకాయమ్మ, ఆమె జీవితమంతా కమ్యూనిస్టుగానే బతికింది, కమ్యూనిస్టుగానే చనిపోయింది అనీ సంభాషణలు సాగుతున్నాయి. ఊరేగింపులో ఉన్నవాళ్ళలో పెద్దగా పరిచయం లేని వాళ్ళేమో ఎనభైయేళ్ళు పైనేనంట. నిద్రపోతున్నట్లుగానే ఉంది. ఈ రోజుల్లో నలభై ఏళ్ళకే అన్నీ రోగాలు. ఆరోగ్యం కాపాడుకుంది. కష్టాలకెదురీది స్టేటస్ కాపాడుకుంది. అందరికీ సాధ్యం కాదు. అనుకొంటున్నారు.

ఊరేగింపు శ్మశానానికి చేరుకోగానే అమ్మ పోయిందనే బాధకన్నా ఆమె అంతిమయాత్ర కమ్యూనిస్టుగా ఘనంగా ఆమె బతికున్నప్పుడు కోరుకున్న దానికన్నా బాగా జరిగిందన్న తృప్తి కలిగింది. కట్టెలు పేర్చి, అమ్మ చెప్పినట్లుగానే చితికి మోహన్ నిప్పటించడానికి సమాయత్తమవుతుండగానే మోహన్ నా దగ్గరకు వచ్చి "అన్నా! కాంతివాళ్ళు బయలుదేరారంట, టంగుటూరు దాకా వచ్చామని, నేను వచ్చిందాకా ఉంచండి కడసారి చూసుకుంటానని బతిమిలాడింది, ఆమెను రోడ్డుమీద నిలబడి రిసీవ్ చేసుకో. నిన్నయితే గుర్తుపట్టగలమన్నారు ప్లేస్ కోసం" అని చెప్పాడు.

రోడ్డు మీద నిలబడ్డనే గాని ఆలోచనలన్నీ ఒక్కసారి గతంలోకి వెళ్ళాయి. రెండేళ్ళ నిర్బంధం నుంచి బయటకు పడి, ఇంటికి రాగానే జీవనం లేదు. కుటుంబాన్ని ఎలా పోషించుకోవాలి. నా వృత్తి కొనసాగించాలంటే రు. 5000 కావాలి ఎలా? ఆ విషయమే

---

సాకారం చేసే పనిలో ఉన్నారు. కా. సూర్యం ఆశయాలని కొనసాగించడానికి నిబద్ధత మాత్రమే కాదు అంకిత భావం అవసరమని, అందుకుగాను "ప్రజలారా! ధైర్యంగా ఆలోచించండి! ధైర్యంగా పోరాడండి!!" అంటూ పిలుపునిచ్చారని కా. గంటి ప్రసాదం తెలిపారు. కా. సూర్యం మిత్రుడు, ఉద్యమకారుడు ఆర్.వై.ఎల్. రామారావు మాట్లాడుతూ ఎం.ఎల్. పార్టీ పురుడు పోసుకున్న గుత్తికొండ బిలం నుంచే కా. సూర్యం తన విప్లవ ప్రయాణాన్ని ఆరంభించాడన్నారు. వరంగల్ రైతాంగ సభలను నిర్వహించడంలో ఆయన పాత్ర మహత్తరమైనదని ఆయన వొక వీర సైనికుడు, వీరయోధుడని అభివర్ణించారు. కా. సూర్యంతో 15 సంవత్సరాల పాటు ప్రయాణం సాగించిన కా. ఎం. రాంబాబు మాట్లాడుతూ జిల్లా కార్యదర్శి స్థాయి నుంచి రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యుని దాకా ఆయన చేసిన ప్రయాణంలో ఎంతో మందిని విప్లవకారులుగా తీర్చిదిద్దారని ఆయనొక గొప్ప ఆర్గనైజర్ అని అన్నారు. పార్టీలో నిర్మాణ సమస్యలు తలెత్తినప్పుడు, కామ్రేడ్స్ మధ్య విభేదాలు వచ్చినప్పుడు ఆయన నిర్వహించిన పాత్ర అమోఘమని పేర్కొన్నారు. కా. సూర్యం, కా. ఏసన్నల కుటుంబాల ఆర్థిక పరిస్థితి దయనీయంగా ఉండేదని, కానివారికి ఇవేవి అడ్డుకాలేదన్నారు. వ్యక్తులు సంక్లిష్ట సమయాల్లో ఊగిసలాటకు గురవుతున్నపుడు సూర్యం లాంటి నాయకులు లేకపోవడం ఎంత దురదృష్టకరమో మాలో కొందరి జీవితాలే అందుకు ఉదాహరణ అంటూ ఆయన జ్ఞాపకాలను నెమరువేసుకున్నారు. కా. డప్పు రమేష్ మాట్లాడుతూ 1982-91 కాలంలో గుంటూరు జిల్లా జననాట్య మండలికి కా. సూర్యం మార్గదర్శకత్వం వహించారని, సామాన్య పాటగాడిగా ఉన్న తనను ప్రజాగాయకుడిగా తీర్చిదిద్దడంలో ఆయన పాత్ర మరువలేనిదన్నారు. అమరులైన నా తోటి సాంస్కృతిక సైనికుల సరసన నిలబడతానని కా. సూర్యం అమరత్వం సాక్షిగా ప్రకటిస్తున్నానని శపథం చేశారు. ఈ సభలో ప్రసంగించిన కా. ఎన్. రుక్మిణి, కా. ఉమలు ఆయన జ్ఞాపకాలతో ఉద్వేగానికి గురైయ్యారు. హైకోర్టు న్యాయవాది సురేష్ మాట్లాడుతూ చనిపోయిన తర్వాత కూడా కా. సూర్యం తన పోరాటాన్ని ఆపలేదని రీ-పోస్ట్‌మార్టం ద్వారా ఎన్‌కౌంటర్ బూటకత్వాన్ని బట్టబయలు చేశారన్నారు. శవాలకీ హక్కులుంటాయని కా. సూర్యం తన శరీరమే సాక్షిగా ఎలుగెత్తి చాటారన్నారు. ఇంకా ఈ సభలో కామ్రేడ్స్ శ్రీకాంత్, గిడుతూరి చంద్రం, కూనపరెడ్డి సత్యం, వై.కె.డి. రామకృష్ణ కొడవలి రాజేంద్రప్రసాద్, అంజమ్మ, పుష్ప, కోటన్న, గఫూర్, మాధవరెడ్డి, ఎ. రత్నప్రసాద్, లక్ష్మారెడ్డి, పి. రాజారావు, పలు ప్రజా సంఘాల నాయకులు, కా. సూర్యం బంధుమిత్రులు పాల్గొని ఆయనకు ఘనంగా నివాళులర్పించారు.



అమ్మతో చర్చించాను. ఏదైనా కష్టం కలిగినప్పుడు మనవాళ్ళెవరూ కలవరు. అమ్మతోనే చెప్పుకొనే వాణ్ణి. ఆమె ఇబ్బందులు ఎవరితో చెప్పేదికాదు. ఆమె జీవితమంతా ఏ కష్టం లేదు. అంతా సాఫీగానే ఉందన్నట్లుండేది ఆమె పలకరింపులు. ఎప్పుడూ నిండు కుండలా ఉండేది. నా సమస్య వినగానే, "ఏమండీ అట్లా ఎందుకు ఆలోచిస్తున్నారు? కార్మికవర్గానికి నాయకత్వం వహించే పార్టీలో ఉండి, ఒక కార్మికుడిగా బతకడానికి నామోషిగా ఫీలవుతున్నారు. బతకడానికి పెట్టుబడి అవసరం లేదు, రేపటి నుండి మీ ఊళ్ళో ఏ పని అందుబాటులో ఉంటే ఆ పనికి వెళ్ళండి" అంది. నేను అమ్మ చెప్పినట్లుగానే మా ఊళ్ళో సాగే వ్యవసాయ కూలిపనులకెళ్ళాను. అందరూ బి.కాం. చదివి ఏం పనిరా ఇదీ అని హేళన చేసినా పట్టించుకోలేదు. మొదట 4,5 రోజులు కష్టమనిపించినా 3 నెలలు పనికెళ్ళాను. సమస్య పరిష్కారమయింది.

వేరొక సందర్భంలో నిరంజన్ ఆ స్థాయి నుంచి దిగజారి ఆర్థిక సహాయం కోసం శత్రువు ముందు మోకరిల్లాడేంటి? అంటే, కొండ మీద నుంచి రాయి కిందకు దొర్లిన తరువాత చివరిదాక వచ్చి కాని మధ్యలో ఎందుకాగద్దని చెప్పింది.

మన కామ్రేడ్స్ అరెస్టయిన సందర్భంలో సాహసవంతులుగా ఫోజుపెట్టి శత్రునిర్బంధంలోకెళ్ళగానే అంత పిరికిగా కొందరు ఎందుకు వ్యవహరిస్తున్నారంటే, మనుషుల్లో ధైర్యవంతులు పిరికివాళ్ళుండరు. అది పరిస్థితుల మీద, ఆ మనిషి సంసిద్ధత మీద ఆధారపడి ఉంటుంది. అట్లానే ప్రతి మనిషిలో మంచీ, చెడూ రెండూ ఉంటాయి. ఆలోచనల్లోంచి తన వ్యక్తిత్వాన్ని తీర్చుదిద్దుకుంటాడు. పుట్టుకతోనే ఎవరూ కమ్యూనిస్టులు కాలేరు. ఆలోచనలకనుగుణంగా పద్ధతులు అలవరచుకొంటేనే కమ్యూనిస్టవుతాడు అని అంది.

అమ్మా నేను కుటుంబాన్ని పోషించడానికి ఇద్దరి ఆదాయం పెడితేనే సరిగా జరగడం లేదు. ఆమె డబ్బులు దాచి పెట్టుకుంటుంది. నాకు చెప్పదు నీవైనా చెప్పమ్మా అంటే "అవును నేనే చెప్పాను, మన అవసరాలు మనకు తెలిసి రావు అందుకని వచ్చిన ఆదాయంలో కొంత తీసి పక్కన పెడితే రేపు ఏదయినా గొంతు మీద కొస్తే ఉపయోగపడ్తది. అయినా స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం కావాలని మీరు చెప్తుంటారు. తీరా ఆచరణలోకి వచ్చేటప్పటికి దానిని ఆమోదించరు. మీరు కమ్యూనిస్టులమని చెప్పుకొంటున్నా! మీదాకావచ్చేటప్పటికి పురుషాధిక్యతను వదులుకోవడం లేదు'' అన్నది ఇక ఆమెకు సమాధానం చెప్పలేకపోయాను.

ఒకసారి మందుగుండు సామాను ఇంట్లో పెలి నా భార్యకు ఒళ్ళంతా కాలి, నయమై ఇంటికి వచ్చిన తరువాత చూచిపోవడానికి ఇంటికి వచ్చి ఇంటి ముందు వంచలో కూర్చొని మాట్లాడుకొంటున్నాం. అప్పుడే ఒకాయన వీథిగుండా వెళుతుంటే ఆయనను చూపించి ఆయనెవరో తెలుసా! అంది. ఆ... మావూరాయనే అన్నాన్నేను. "ఆయనే నా భర్త, పెండ్లయిన కొద్ది రోజులకే నాకు పార్టీతో సంబంధాలు లేకుండా ఉంటేనే నాతో కాపురం చేయి" అన్నాడు. నేను పార్టీని వదులుకోలేదు. ఆయననే వదులుకున్నాను. తరువాత ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకొని పిల్లలతో ఉంటున్నాడు. అయినా నేను బాధపడడం లేదు. సమాజంలో ఉండే వ్యక్తిగత సంబంధాలకన్నా పార్టీ సంబంధాలే విలువయినవి అనిపించింది. అప్పటి నుండి పార్టీ సంబంధాలలో పనిచేసి, ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ తెలంగాణ సాయుధపోరాటం మధ్యలో ఆపేసి, ఎలక్షన్లలో పాల్గొన్నది. నాకు ఎన్నికల ద్వారా దరిద్రం పోదు, ఈ వ్యవస్థ మారనిదే మన బతుకులు మారవని అర్థమయ్యేది. అంతలో మనోళ్ళు పరిచయమయ్యారు. అప్పటి నుండి ఇప్పటి దాకా పార్టీయే నా కుటుంబం, పార్టీలో పనిచేసే వాళ్ళే నా పిల్లలు. ఇక ముందు కూడా, అంటి చచ్చేంత వరకు ఇలాగే ఉందామనుకొంటున్నాను. అంతా నిశబ్దంగా వింటుండగానే అమ్మ ఆపేసింది. విన్నవాళ్ళంతా పిల్లలతో సహా అమ్మ వెనుక ఇంత చరిత్ర ఉందా అని ఆశ్చర్యపోయారు.

ఎదురుగా మోహన్ వచ్చి అన్నా! అక్కవాళ్ళు వచ్చారా అన్న తరువాత ఈ లోకంలోకి వచ్చాను. అందరం కడసారి చూసుకొన్నాక మోహన్ చితికి నిప్పు పెడుతూ దుఃఖం ఆపలేక అమ్మా... అని ఏడ్చాడు. నేను దుఃఖం ఆపుకోలేక మోహన్‌ను పట్టుకొని పెద్దగా ఏడవాలనిపించింది. కాని అంత దుఃఖంలో అమరుల సంతాపం తెలియజేసే సందర్భంలో రంగనాయకమ్మ వాదన దానికి పాణి సమాధానం గుర్తొచ్చి ఆగిపోయింది.

ఆమె మనకన్నా ఎక్కువ సాహిత్యం కూడా చదివి ఉండదు. ఆమె ప్రజల జీవితాల నుంచే ఆచరణలో కమ్యూనిస్టు సిద్ధాంతాలను అన్వయించుకోగలిగింది. ఆమె జీవితంలో కష్టనష్టాలను కమ్యూనిస్టు సిద్ధాంతం ద్వారానే పరిష్కరించుకొని జీవితాంతం కమ్యూనిస్టుగా జీవించగలిగింది.



# ఆనంద్ తేల్‌తుంబ్డేతో ముఖాముఖి

- ఆర్. శశికళ

(ఆనంద్ తేల్‌తుంబ్డేగారు అనేక సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషణలతో కూడిన వ్యాసాలను రాస్తున్నారు. దళిత సమస్యలపై విస్తృతంగా రాస్తున్నారు. ఎన్నో పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. ఆయన మాతృభాష మరాఠీ. ఆంగ్లంలో ఆయన రాసిన పుస్తకాలు ఇతర భారతీయ భాషల్లోకి అనువదింపబడ్డాయి. కులం, వర్గం, సామ్రాజ్యవాదం, ప్రపంచీకరణ, సరళీకరణ మొదలైన అంశాలపై రెండు దశాబ్దాలుగా రాస్తున్నారు. పౌరహక్కుల కార్యకర్త, రచయిత, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రచనా వారసత్వం - ప్రగతిశీల ఉద్యమ వారసత్వం అందుకొన్న అరుదైన ప్రజా మేధావి. ముంబాయిలో నివాసం ఉంటున్నారు. 'అరుణతార' పాఠకుల కోసం.... ఆయన ప్రత్యేకంగా ఇచ్చిన ఇంటర్వ్యూ....)

**1. మీ మాతృభాష, పుట్టిన ప్రదేశం, తల్లిదండ్రులు గురించిన పరిచయం:**

మహారాష్ట్రలోని యవత్‌మాల్ జిల్లాలోని 'రాజూర్ కొల్లియరీ' అనే గ్రామం ఆంధ్రప్రదేశ్‌లోని తెలంగాణ సరిహద్దులకు సమీపంలో ఉంది. నా బాల్యం అక్కడే గడిచింది. అక్కడ బొగ్గు గనులు, సున్నం పరిశ్రమలు ఉన్నాయి. వలస పాలన నుండి రైల్వే టర్మినల్, ఢిల్లీ - మద్రాస్ మార్గాన్ని కలుపుతూ మజారీ వద్ద రైల్వే లైన్ వెళ్తుంది. ఆ ప్రదేశం రెండు గ్రామాలుగా విడిపోయింది. పాత గ్రామం ఒక కిలోమీటరు దూరంలో ఉంది. గనులకు దగ్గర్లోనే చిన్న పట్టణం ఉండేది. ఆ గ్రామం మధ్యలోనే మేము నివసించేవాళ్ళం. 'వాని' అనే తాలూకా 8 కిలోమీటర్ల దూరంలో రోడ్డు - రైలు మార్గాలను కలుపుతూ ఉండేది. ఆ గనుల ప్రదేశంలో వలస వచ్చిన జనాభా అధికంగా ఉండేది.

తెలంగాణ సరిహద్దు ప్రాంతాల నుండి తెలుగు మాట్లాడే వాళ్ళు శ్రామికులు, ముస్లిం, కోమట్లు, మర్వాడీలు సున్నం బట్టీలు / ఫ్యాక్టరీల యజమానులుగా ఉండేవారు. భూమిలేని పేదలైన నా తల్లిదండ్రులు అక్కడి పరిశ్రమల్లో పనిచేసేవారు. ఆ గ్రామంలో మా కుటుంబానికి బలమైన అనుబంధం ఉంది. అమ్మమ్మ, మామయ్యలు ఇప్పటికీ అక్కడే ఉంటున్నారు. ఇటువంటి వాతావరణం వలన ఆ గ్రామంలో ఇతర గ్రామాల్లాగా కాకుండా భిన్నమైన సామాజిక - ఆర్థిక సాంస్కృతిక వాతావరణం ఉండేది. భూమిలేని దళితులు వ్యవసాయం పైన కాకుండా అక్కడ గనుల్లో పనిచేస్తూండేవారు. మా గ్రామం అంబేద్కరైట్ ఉద్యమంలో చురుకుగా పాల్గొనేది. నాగపూర్, చంద్రపూర్‌ల తర్వాత చారిత్రకంగా మూడవ స్థానంలో ఉంది. అక్కడ బౌద్ధులుగా మారిపోవడం అనేది పెద్ద ఎత్తున జరిగింది. మా అమ్మ అనూసాయా తేల్‌తుంబ్డే, మా నాన్నగారు బాపూరావ్ తేల్‌తుంబ్డే.

మా అమ్మనాన్నలు ఇద్దరూ చదువుకోలేదు. మా నాన్న సున్నం ఫ్యాక్టరీలో పనిచేసేవారు. దీర్ఘచతురస్రాకారంలో ఉన్న డబ్బాల్లోకి లైమ్ నింపి, వాటి మూతలను రేకు షీట్‌తో సీల్ చేసే పని ఆయనది. దానిని 'కయ్యి' అనేవాళ్ళు. తెలుగు వాళ్ళు, ముస్లింలు ఆయనతో కలిసి పనిచేసేవాళ్ళు. వారందరితో మాకు మంచి సంబంధాలుండేవి. మా అమ్మ కూడా కష్టజీవి. ఆమె విసుగు, విరామం లేకుండా రోజూవారి ఇంటి పని పూర్తి చేసుకొని సున్నంబట్టీల్లో లేదా వ్యవసాయకూలీగా పనులు చేసేది. సున్నపు ఫ్యాక్టరీల్లో పనిచేసే స్త్రీల పని చాలా కష్టం. సున్నపురాయి, బొగ్గుతో కలిపి పై భాగంలో బట్టీలో దాన్ని వేసేవాళ్ళు. అక్కడ దట్టమైన పొగ వ్యాపించి ఉండేది. బాధతో వాళ్ళు కేకలు పెట్టేవారు. అటువంటి పనికి ప్రతిఫలం ప్రతిమారు 5 లేదా 6 టోకన్లు (బల్లాలు) వచ్చేవి. అవి మార్చుకొని వేతనాలు తీసుకొనేవారు. 10 అణాలు అంటే 60 పైసల సంపాదన... అటువంటి పని చేసేటప్పుడు ఆక్సిజన్ కోసం ఆరాటపడాల్సి ఉంటుంది. శ్వాస ఆడని పరిస్థితి ఏర్పడుతుంది. ఈ పని నాకూ అనుభవమే. ఈ రోజుల్లో చిమ్నీ ఏర్పాటు చేస్తున్నారు. పురుషుల కంటే సాధారణంగా స్త్రీలే ఎక్కువ పనులు చేస్తారు. ఒక కిలోమీటరు నుండి బావి నీరు తెచ్చుకోవాలి. వంట చెఱకు కోసం రెండు కిలోమీటర్లు వెళ్ళేవాళ్ళు. డబ్బు సంపాదన కోసం చేసే పనులు సరేసరి. కొందరు పురుషులు ఎటువంటి పనులు చేయకుండా జులాయిగా తిరుగుతూ భార్యలను కొడ్తూ వేధిస్తుండేవాళ్ళు. వారి ఆర్తనాదాలు సర్వసాధారణ దృశ్యం. మా ఇల్లు మాత్రం ఇటువంటి వాటికి అతీతంగా ఉండేది. మా అమ్మకు తీవ్రంగా స్పందించే స్వభావం ఉంది. అప్పుడప్పుడూ మాకూ అటువంటి పరిస్థితి ఏర్పడేది.

గ్రామం కులం ఉన్నవాళ్ళు - కులం లేని వాళ్ళు అనే ప్రాతిపదికగా రెండుగా విడిపోయి ఉండేది. కులం - కునాబీలు (వ్యవసాయం) ధనంగారులు (గొల్లవాళ్ళు), టేలి (ఆయిల్ తీసేవాళ్ళు) గొంతులు (గిరిజనులు) కులం లేనివాళ్ళలో మహరులు, చంబారులు, మాంగ్‌లు (దళితులు) పరధాన్‌లు (ఆదివాసీలు). వారి బావులు వారికి ఉండేవి. భూమి లేని పేదలు లైవ్ ఫ్యాక్టరీల్లో పనిచేస్తూ వారాంతపు వేతనాలపై ఆధారపడేవాళ్ళు - హిందూ కులాలపై ఆధారపడే అవసరం లేదు.

ఇటువంటి ప్రశాంత వాతావరణం ఒక్కసారిగా చిన్నాభిన్నమైంది. ఒకప్పుడు 'కునాబీలు' మా బావిలో చెత్త వేయడంతో మొదలయింది. మా అమ్మ ఇతర దళిత స్త్రీలతో

పాటు హిందూవుల బావికి నీళ్ళకై వెళ్ళింది. వాళ్ళల్లో కొందరు కునాబీ స్త్రీలు ఆటంకపరిచినా మా అమ్మి వాళ్ళను పక్కకు నెట్టేసి నీటిని చేదుకొని వచ్చింది. ఆ రోజు సాయంత్రం దళిత స్త్రీలంతా మా అమ్మ అండతో నీళ్ళు తెచ్చుకున్నారు. ఆ మరుసటి రోజు గనుల్లో నుండి మరికొందరు దళిత స్త్రీలు వచ్చి మా అమ్మకు అండగా నిలిచారు. రెండు వైపులా ఉద్రిక్తత నెలకొంది. రెండు వైపులా ఘర్షణ కోసం తయారుగా ఉన్నారు. మొదట్లో దళితుల వైపు పురుషులు కొట్లాటకు సిద్ధమయ్యారు. కానీ స్త్రీలు కొట్లాడుతున్నారని ఆ పని విరమించారు. నాకప్పుడు 7 ఏండ్లు. నేను దళిత పిల్లలతో కలిసి రాళ్ళు సిద్ధం చేశాను. కత్తులు నూరి దాచుకున్నాం. మరుసటి రోజు కులం అనుసరించే గ్రామం మొత్తం బావి వద్ద సమావేశం అయ్యారు. కొద్ది దూరంలో బొగ్గు గనిలో పనిచేస్తున్న వాళ్ళంతా దళితులకు మద్దతు ఇస్తున్నారని వారు నీటిని తోడుకుంటుంటే అడ్డుకోలేకపోయారు. జిల్లా అధ్యక్షుడు సమావేశంలో గ్రామం అంతటికీ కలిపి అందరికోసం బావి తవ్విస్తానని చెప్పాడు. అప్పటి లోపల మా బావి శుభ్రం చేయబడింది. ఎవరు ఎవరి బావి నుండైనా నీరు తోడుకోవచ్చునని తీర్మానం చేశారు.

నా మాతృభాష మరాఠీ. మహర్లు గ్రామాల్లో మాట్లాడే యాస నా భాషకుంటుంది. మీరు మాట్లాడే మరాఠీ బట్టి మీ కులం తెల్సుకోవచ్చు. చదువుకున్న వాళ్ళు తమ కులం దాటి బ్రాహ్మణుల వలె తమ భాషను మార్చుకొన్నారు. వారు తమంతట తాము తక్కువ అనే భావన వలన ఈ విధంగా వ్యవహరిస్తారు. నేను చిన్నప్పుడు గ్రామాల్లో మాట్లాడిన భాషను అలాగే ఉంచుకొన్నాను. ఎవరూ గ్రామంలో ఆ భాష మాట్లాడరు. నేను మాట్లాడుతుంటే వాళ్ళు ఆశ్చర్యంతో వింటూంటారు.

**2. మీ విద్యాభ్యాసం - ఉద్యోగం... గురించి చెపుతారా?**

ఎనిమిది మంది పిల్లల్లో నేనే పెద్దవాన్ని. 5గురు అన్నదమ్ములం - ముగ్గురు చెల్లెల్లు. మా ఇల్లు గ్రామం చివర్లో ఉండేది. ఆ దారిలో చుట్టుపక్కల గ్రామాల నుండి మా గ్రామంలోని బడికి పిల్లలు వచ్చేవారు. వారితో పాటు నేనూ ఆసక్తిగా వెళ్ళేవాన్ని... 4 ఏండ్లప్పుడు - టీచరు నన్ను రానిచ్చారు కానీ ఎన్‌రోల్ చేయలేదు. సంవత్సరం చివర్లో నా చదువు చూసి, రెండవ తరగతికి పంపారు. ఆ విధంగా నా విద్యా ప్రయాణం మొదలయింది. ఆ ప్రతిభే నా జీవితమంతా కొనసాగుతూ వచ్చింది. క్లాస్‌లో నేనే ప్రథముడను. గ్రామంలో అందరికీ ఇష్టుడై పోయాను. నాలుగు, ఏడు తరగతుల్లో బోర్డు పరీక్షలుండేవి. రెండింటిలోనూ నేనే మొదటి ర్యాంకుల్లో పాసయ్యాను.

మా అమ్మ టీచర్లు గుర్తుపెట్టుకొన్నట్లు - పనికిమాలిన ప్రశ్నలు అడిగేవాన్నట - పిల్లలు తల్లిదండ్రులకు వినయంగా ఉండాలనే మాటను వ్యతిరేకిస్తూ - మా అమ్మను అడిగేవాన్ని - మనకెందుకు పెద్ద ఇల్లు లేదు - మేక లేదు ఆవు లేదు - నాకు తెలుసు వారి వద్ద సమాధానం లేదని.

మా బాల్యం నుండే అంబేద్కర్‌లాగా బాగా చదువుకోవాలని ఆయన ఎంతో తెలివైన వారని, మేము కూడా అలాగే తయారు కావాలని చెపుతూ ఉండేవారు. మహారాష్ట్రంలో ఆనాడు ప్రతి దళితుని పిల్లలకు ఆయనే ఒక రోల్ మోడల్. నేను స్కూల్‌కు వెళ్ళేటప్పుడు ఒకమారు మా అమ్మను అడిగాను. అంబేద్కర్‌గారికి ఎన్ని మార్కులు వచ్చాయి అని, ఆమెకు ఏం తెలుస్తుంది. నేను ఎప్పుడూ గర్వపడే వాడిని నాకు 100కి 100% మార్కులు వచ్చేవి. అంబేద్కర్‌కు కూడా అన్ని మార్కులు బహుశా వచ్చి ఉండవేమో! మేం తెల్సుకున్న మరొక విషయం ఏంటంటే ఆయన ఎన్నో గ్రంథాలు చదివేవారని, ఆయన ఇంటి నిండా పుస్తకాలుండేవని; తెలియకుండానే నాలో పుస్తక పఠనంపై ఆసక్తి కలిగింది. అలా స్కూల్లో ఉన్న పుస్తకాలు చదివేశాను. అందులో నా మనసులో బాగా ముద్రించుకొన్న పుస్తకం 'భగత్ సింగ్'. ఆయన నా రోల్ మోడల్‌గా మారిపోయారు. పుస్తకంలో వర్ణించినట్లు నేను ఆయన బొమ్మను చేతిలో పిస్టల్‌తో గీశాను. 'భారతరత్న షహీద్ భగత్‌సింగ్' అని పేరు పెట్టాను. స్కూల్‌లో ఆ బొమ్మ అంటించాను. మొన్నటివరకూ అది అలాగే ఉండేది. కానీ ఆయనకు ఈ దేశం ఇంకా ఆ గౌరవం కల్పించలేదు.

మా స్కూల్ ఒక పద్ధతిని పాటించేది. ఎవరైతే ఫస్ట్ వస్తారో వారికో పుస్తకం బహుమతిగా లభించేది. అలా ప్రతి సంవత్సరం నాకు పుస్తకాలు వచ్చాయి. నా మూడో తరగతి పరీక్షలో 'జోసెఫ్ స్టాలిన్' పుస్తకం బహుమతిగా వచ్చింది. ఆ పుస్తకం చదవడం ద్వారా మాకు ఆవులు, మేకలు ఎందుకు లేవో మా ఆర్థిక స్థితి ఏమిటో అర్థమయింది. 7 సంవత్సరాల వయసుకే నేను కమ్యూనిస్ట్ అయిపోయాను. 'వాని'కి వెళ్తుండే వాన్ని - మా మామతో స్థానిక పుస్తకాల షాపు నుండి పుస్తకాలు కొనిపించుకొనేవాన్ని. ఈ విధంగా రాయ్‌పూర్‌లో నా పాఠశాల చదువు ముగిసింది. వాని గవర్నమెంట్ హై స్కూల్‌లో 8వ తరగతిలో చేరాను. మామయ్య వద్దే ఉండి ఎస్.ఎస్.సి. పూర్తి చేశాను. తర్వాత నాగపూర్‌లో ప్రీ-యూనివర్సిటీ కోసం ఇన్‌స్ట్యూట్ ఆఫ్ సైన్స్‌లో చేరాను. విశ్వేశ్వరయ్య రీజనల్ కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్ (ఇప్పుడు - ఎన్.ఐ.ఐ.టి అని పిలుస్తారు). నాగపూర్ నుండి ఇంజనీరింగ్ పూర్తి చేశాను. తర్వాత ఐ.ఐ.టి. కాన్పూర్‌లో ఎం.టెక్ చేయాలనుకొన్నాను, బాధ్యతల వలన వెళ్ళలేకపోయాను. కొంతకాలం పనిచేశాక సరిపోయేంత డబ్బులు సంపాదించాను. ఐ.ఐ.ఎం. అహమ్మదాబాద్‌లో ఎం.బి.ఎ. చేయాలనుకొన్నాను. నేను పనిచేస్తున్న సమయంలో ముంబాయి, బీహార్, పశ్చిమబెంగాల్, గుజరాత్, రాజస్థాన్‌లకు వెళ్తుండేవాన్ని. ఎందరో స్నేహితులయ్యారు వారిలో విప్లవోద్యమంలో పనిచేస్తున్న వాళ్ళూ ఉన్నారు.

ఐ.ఐ.ఎం. చేరాలనుకొన్నది రెండు కారణాల వలన. ప్రాజెక్ట్ పూర్తికావడంతో ఏదైనా కంపెనీలో పనిచేయవచ్చునని, అలాగే నేను అనుకొన్నది పూర్తి చేయాలనే కోరిక రెండవది. పి.హెచ్.డి. చేయాలనుకొన్నాను. ఐ.ఐ.ఎం.ల నుండి అడ్మిషన్ దొరికింది. ఫ్రెండ్స్ సలహాతో మానేశాను.

యూనివర్సిటీ నుండే నా రాజకీయాలు ప్రారంభమయ్యాయి. విప్లవోద్యమం స్ఫూర్తితో విద్యార్థులను అందుకనుగుణంగా

...ట్టే ప్రయత్నం చేశాను. కానీ అవి ఎంతో దూరం నడవలేదు. ...న్ని కన్సల్టెన్సీ పనులు చేపట్టడంతో ముంబాయి వెళ్ళాల్సివచ్చింది. ముంబాయిలో 'నవజవాన్ భారత్ సభ'లో పని చేశాను. అలాగే వాటి అనుబంధ సంఘాల్లో కూడా పనిచేయడం జరిగింది. కలకత్తా వీధుల్లో నివసించేవారిలో, క్యాజువల్ వర్కర్స్, హాల్దియా, అలాగే అహ్మదాబాద్‌లోని కొన్ని దళిత సంఘాల్లో పనిచేశాను. కొద్ది కాలంలోనే ప్రయివేటు రంగంలోని మల్టీనేషనల్ కంపెనీలో ఉద్యోగం వచ్చింది. అయినప్పటికీ మురికివాడల్లో నివసించేవాళ్ళు, అసంఘటిత రంగంలోని కార్మికులు, దళిత యువకుల మధ్య పనిచేయడం కొనసాగిస్తూనే వచ్చాను. ఆయా అవసరాలను బట్టి రెండు పనులను సమన్వయంతో చేసుకుంటూ పోయాను.

ప్రస్తుతం 'పెట్రోనెట్ ఇండియా లిమిటెడ్' అనే కంపెనీలో మెనేజింగ్ డైరెక్టర్‌గా పనిచేస్తున్నాను.

**3. మీ కుటుంబం గురించి వివరిస్తారా?**

1983లో 'రమా అంబేద్కర్'ను వివాహం చేసుకొన్నాను. మాకు ఇద్దరు అమ్మాయిలు. ప్రాచి ఎం.బి.బి.ఎస్. పూర్తి చేసింది. పి.జి. కోసం ప్రిపేర్ అవుతోంది. చిన్నమ్మాయి 'రశ్మి' టెన్నిస్ ప్లేయర్. ఆమె భారత్, ఆసియా తరఫున మూడు గ్రాండ్ స్లామ్స్‌లో ప్రతినిధిగా పాల్గొన్నది. చదువులో కూడా వెనుకబడలేదు. పూనేలో 'ఫెరున్‌సన్' కాలేజీలో బి.ఎ. చదువుతోంది. ఆమెను ప్రోత్సహించే స్పాన్సరర్స్ లేకపోవడంతో ఆమెను ప్రోత్సహించడం వ్యక్తిగతంగా కష్టసాధ్యమవుతోంది.

**4. వృత్తికి సంబంధించిన పనులు చేస్తూ రచయితగా, మానవ హక్కుల కార్యకర్తగా సమయం కేటాయించుకోవడం ఎలా సాధ్యమవుతోంది?**

మొదటి నుండి నాకు ఈ పనులు చేయడం అలవాటే. బాల్యంలోని అనుభవాల ద్వారా ఈ ఆచరణతత్వం అనేది నా మనసులో సాధ్యమయింది. బలహీనులపై జరిగే పెత్తనాన్ని నిరోధించే ప్రయత్నం చేశాను. ఎన్ని పనులున్నా విద్యాభ్యాసంలో ప్రథమ శ్రేణిలోనే ఉత్తీర్ణత సాధిస్తూ వచ్చాను. యూనివర్సిటీ స్థాయిలో క్యాంపస్ రాజకీయాల్లో విభిన్న స్థాయిల్లో పాల్గొనే ప్రయత్నం చేశాను. కార్పొరేట్‌రంగంలో కేవలం ఫలితాలపై మాత్రమే దృష్టి ఉంటుంది. సాధించే లక్ష్యాలపై సమయం కేటాయింపు ఉంటుంది. ప్రతి ఒక్కరినీ వారి కాళ్ళపై వాళ్ళను నిలబడేటట్లు చేసే విధానం అది. 'టీమ్ వర్క్' విధానంలో ప్రతి ఒక్కరినీ ప్రోత్సహించడం వలన సమస్యలను అధిగమించి తక్కువ సమయంలో సాధ్యమయినంత ఎక్కువ పనులు చేయగలిగాను. ఏ పనీ ఇంటికి మిగిల్చి తీసికెళ్ళను. మామూలుగా కార్పోరేట్ రంగంలో ఇంట్లో కూడా పనిచేసుకోవడం ఉంటుంది. నేను సమయ పాలన వలన హక్కుల పరిరక్షణ కార్యక్రమాల కోసం, ఇతర సామాజిక కార్యక్రమాల కోసం ఉపయోగించడం సాధ్యమయింది. ఆచరణతో కూడిన ఆలోచనా విధానం వలన, విస్తృత అధ్యయనం వలన ప్రస్తుత పరిణామాలపై ఎప్పటికప్పుడు రాయడం, కార్యక్రమాల్లో పాల్గొనడం వీలయింది.

**5. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ కుటుంబ సభ్యుడు కావడం వలన గుర్తింపు లేదా సామాజిక / మేథోపరమైన సంబంధాలు సాధ్యమా? అలా కొందరిలోనైనా అపోహ ఉంటుంది కదా!**

మొదట నాకొక విషయం అర్థం కావడం లేదు. అంబేద్కర్ బంధువులమైనంత మాత్రాన ప్రజలు మమ్మల్ని భిన్నంగా ఎందుకు భావించాలి. నా స్వంత గుర్తింపును విరూపం చేసే ఆ సంబంధం గురించి నేను మొదటి నుండి నివారిస్తూనే ఉన్నాను. ఆయన కుటుంబంలో భాగం అవ్వడం అనేది కేవలం యాదృచ్ఛికం మాత్రమే. మా స్వంత జీవన విధానం మాకున్నది. ఈ ప్రత్యేకత వలన అనవసరంగా భారం మోపబడడం జరుగుతోంది. ఆయన కుటుంబంలో సభ్యున్ని కాకమునుపే నా స్వంత సామాజిక, మేధోపరమైన ఉనికి నాకున్నది. దళిత ప్రజానీకం దృష్టిలో అంబేద్కర్ దేవునికంటే ఎక్కువ. వారిలో ఎక్కువ మంది మమ్మల్ని ప్రత్యేకంగా భావించడం జరుగుతోంది. ప్రజా దృష్టి కోణం సవరించే శక్తిలేనప్పటికీ, నాకు అవకాశం ఉన్న ప్రతిచోట మమ్మల్ని ప్రత్యేకంగా చూడద్దు అని కోరుతూ ఉంటాను. అంబేద్కర్ దళితులకు ఫ్యూడల్ దృక్పథం ఉండరాదు అని కోరుకుంటున్నాను.

**6. మీ సాహిత్య సృజన గురించి**

1990లలో సంస్థాగత కార్యక్రమాలు తగ్గిపోయాయి. కొన్ని విషయాల కోసం సమయం కేటాయించడం వలన నేను అర్థం చేసుకొన్న మేరకు రాస్తున్నాను. వందలాదిగా ఆర్టికల్స్, పేపర్స్ చాలామటుకు వార్తాపత్రికల్లోను, పీరియాడికల్స్‌లో ప్రచురింపబడ్డాయి. 17 పుస్తకాలు ఇంగ్లీష్ భాషలో ప్రచురించబడ్డాయి. వాటిలో కొన్ని పుస్తకాలు ఇతర భారతీయ భాషల్లోకి అనువదింపబడ్డాయి. నేను ఇదివరకే చెప్పినట్లు, ప్రస్తుత పరిస్థితుల సందర్భంలో నేను రాసినవి ప్రజలకు వారి సమస్యల పట్ల ఆలోచనా స్పృహను కల్గించడం కోసం ఉద్దేశింపబడ్డాయి. 'ముస్లింల గురించి అంబేద్కర్' అనేది హిందూత్వ శక్తులు ప్రచారం చేసినట్లుగా అంబేద్కర్ ముస్లింలకు వ్యతిరేకం అనేది తిప్పికొట్టాలనే ఉద్దేశ్యంతో రాసినది. అలాగే "హిందుత్వ - దళితులు" దళితుల హిందూత్వ శక్తులకు పదాతి సైన్యం అనే భావనను వ్యతిరేకించేందుకు లేదంటే "సామ్రాజ్యవాద వ్యతిరేకత - కులాల నిర్మూలన" లేదా "ఖైర్లాంజి" ఖైర్లాంజి హత్యల నేపథ్యంలో, కులం పేరుతో జరిగే దాడులను అత్యాచారాలను, అర్థం చేసుకొనే లక్ష్యంతో రాసినవి. కార్యకర్తల అవగాహనను పెంపొందింపజేస్తాయని భావిస్తాను. దేశవ్యాప్తంగా ఉంటున్న కార్యకర్తల్లో ఈ పుస్తకాలను గురించి మంచి స్పందన వచ్చింది. నేను కోరుకున్నది కూడా అదే. అంతేకాక మీడియా ద్వారా ప్రభుత్వ నయా ఉదారవాద విధానాలను, వీలయినన్ని ప్రస్తుత సమస్యలపై విస్తృతంగా రాస్తున్నాను.

**7. మానవ హక్కుల కార్యకర్తగా మీపై ఎవరి ప్రభావమైనా ఉందా? లేదా మీకు స్ఫూర్తి ఎవరు?**

వాస్తవానికి నా చుట్టూ ఉన్నవారితో నేను స్ఫూర్తి పొందలేదు. అలా అయితే నేను కలిసిన ప్రతి ఒక్కరు ఒక సాధారణ కార్మికుడు, ఒక గిరిజనుడు, ఫుట్‌పాత్‌పై నివసించే సామాన్యుడు ఇలా నన్ను ఎందరో ప్రభావితం చేశారు. నాలో అంతర్లీనంగా ఉన్న భావాల వలన నా బాల్యంలో ప్రభావితం చేసిన సంఘటనలు అలాగే నేను చదివిన పుస్తకాలు 'అంబేద్కర్, భగత్‌సింగ్, జోసఫ్ స్టాలిన్' వలన గొప్ప స్ఫూర్తి పొందాను. తర్వాత తర్వాత పుస్తకాల సంఖ్య పెరిగిపోతూ ఉంది. అంతేకానీ నా చుట్టూ ఉన్న వారి వలన కాదు. 'మానవ హక్కులు' అనే అంశం కేవలం న్యాయం కోసం పడే తపనలో ఒక భాగం మాత్రమే. నేను ప్రస్తుతం జీవించే విధానం ఒక పోరాట రూపాన్ని బహుశా ఈ విధంగా సరిపుచ్చుకొనే అవకాశం ఇచ్చి ఉండవచ్చు. ట్రేడ్ యూనియన్, మురికి వాడల ప్రజల పోరాటాల్లో పాల్గొన్నప్పటికే ఆ రోజులు భిన్నమైనవి. ఎవరైనా సరే అవకాశాలను, ఒత్తిళ్ళను బేరీజు వేసుకొని తమ కార్యక్రమాలు ఆచరణను తమ తెలివితేటలతో మలుచుకోవాలి. దేశంలో విప్లవ పరిస్థితి అభివృద్ధి అయితే, ఎంతోమంది బయటికి వచ్చి విభిన్నమైన పద్ధతిలో తమవంతు సహకారం అందిస్తారని భావిస్తున్నాను.

### 8. ఆంధ్రప్రదేశ్‌లో హక్కుల ఉద్యమం గురించి మీ అభిప్రాయాలు

రాష్ట్రంలో సుదీర్ఘకాలంగా నడుస్తున్న విప్లవోద్యమ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్‌లో హక్కుల ఉద్యమం ఏర్పడింది. దేశంలోని ఇతర ప్రాంతాల్లోని హక్కుల సంస్థలకు ఒక నమూనాగా నిల్చింది. మహారాష్ట్రలోని సి.పి.డి.ఆర్. ఎప్పుడూ ఎ.పి.సి.ఎల్.సి.తో సన్నిహిత సంబంధాలను కల్గి ఉంది. రెండూ నిర్మాణపరంగా వేరే విధానాలను అనుసరిస్తున్నాయి. సి.పి.డి.ఆర్.కు ఎ.పి.సి.ఎల్.సి. లాగా రాష్ట్రవ్యాప్త నిర్మాణం లేదు. నాగపూర్‌లో ఒక యూనిట్ ఉంది. ఎ.పి.సి.ఎల్.సి.కి రాష్ట్ర వ్యాప్తంగా ప్రజల సమస్యలతో పనిచేసే నెట్‌వర్క్ ఉంది. అంతేకాక ఆ సంస్థను రూపుదిద్దేందుకు తోడ్పడిన వారిలో సుప్రసిద్ధులైన కన్నబిరాన్, డాక్టర్ బాలగోపాల్ లాంటి మేధావులు ఉండడం అదృష్టంగా భావించవచ్చు. క్లిష్టమైన రోజుల్లో అది రూపుదిద్దుకొనేందుకు వారి సహాయం ఉదాత్తమైనది. హక్కుల ఉద్యమం పరిధులు అనిశ్చితంగా ఉంటాయి. స్వభావంలో వర్తమాన సందర్భంలో లోతుగా వేళ్ళూనుకొని ఉన్నారు కానీ విపరీతార్థంలో హక్కుల ఉద్యమం నైతిక కోణం కల్గి ఉన్నది. ఈ వైరుధ్యం వలన భావవంతమైన విషయాలకు దాని అభివృద్ధి క్రమంలో పరిమితమవుతోంది. ఎ.పి.సి.ఎల్.సి. విషయంలో కూడా అదే జరిగింది. ఈ క్రమంలో బాలగోపాల్ లాంటి వ్యక్తిని అది కోల్పోయినప్పటికీ పనిచేసే క్రమంలో నిర్మాణపరంగా తన శౌర్యాన్ని తాను నిరూపించుకొన్నది.

డాక్టర్ బాలగోపాల్ గారు ఆంధ్రప్రదేశ్ పౌర, ప్రజాస్వామిక హక్కుల ఉద్యమాల్లో మూడు దశాబ్దాలుగా విడదీయలేని విధంగా కల్సిపోయారు. మాలో చాలా మందికి ఆయన స్నేహితుడు. ఆయన హఠాన్మరణం హక్కుల ఉద్యమానికి తీరని లోటు. గణిత శాస్త్రంలోని ఖచ్చితత్వాన్ని, సామాజిక విశ్లేషణకు జోడించి సాహిత్య రూపంలో అభివ్యక్తం చేశారు. కన్నబిరాన్ గారు, బాలగోపాల్‌లాంటి వ్యక్తులు శతాబ్దంలో ఒక్కసారో తయారు అవుతారు. ఎ.పి.సి.ఎల్.సి.లో లేవనెత్తిన చర్చ వలన నాతోపాటు చాలా మంది గందరగోళానికి లేదా అశాంతికి గురయ్యాము. సైద్ధాంతిక, ఆచరణకు సంబంధించిన విషయాలపై ఎంతో చర్చ జరిగింది. కానీ బాలగోపాల్‌గారు నమ్మిన విషయాలను గురించి నిబద్ధతతో పనిచేశారు. ఆయన ఎప్పటికీ స్మరణీయుడు.

### 9. ఆంధ్రప్రదేశ్‌లోని దళితోద్యమంపై మీ అభిప్రాయాలు

మహారాష్ట్రలో అంబేద్కర్ బలపడుతున్న కాలంలోనే ఆంధ్రప్రదేశ్‌లో శక్తివంతమైన దళిత ఉద్యమం రావడం అంటే 1920 సంవత్సరంలో యాదృచ్ఛికమే కావచ్చును.

హైదరాబాద్‌లో ఎన్నో దళిత సంఘాలుండేవి. భాగ్యరెడ్డివర్మ మొదటి దళిత నాయకుడుగా చెప్పుకొనేవాళ్ళు. బి.ఎస్. వెంకట్‌రావ్, హైద్రాబాదీ అయిన ఇతన్ని హైద్రాబాదీ అంబేద్కర్ అని పిలిచేవారు. అలాగే అరిగె రామస్వామి - వీరు ముగ్గురిని.దళిత నాయక త్రయం అని భావించేవారు. 1920లల్లో ఆది హిందు సోషల్ సర్వీసెస్ లీగ్ అధ్యక్షునిగా భాగ్యారెడ్డి వర్మ ఉండేవారు. హైద్రాబాద్‌లో మొదటి దళిత సంస్థ అదే. అరిగె రామస్వామి, బి.ఎస్. వెంకట్రావ్ అధ్యక్ష, కార్యదర్శులుగా ఆది - హిందూ మహాసభ కోసం పనిచేశారు. ఈ రెండు సంస్థలు దళితుల హక్కుల కోసం పనిచేయడం జరిగింది. మాలల ఆధిపత్యం ఉండేది. తర్వాత మాలమాదిగల వైరుధ్యం వలన ఒక ప్రత్యేకమైన సంస్థ అరుంధతీరాయ మహాసభ - మాదిగల సంక్షేమం కోసం 1931లో ఏర్పడింది. శేషగిరి రావ్, ఎస్. బాబయ్య మహాసభలో ముఖ్యమైన నాయకులు. 1950లో ఈ సంస్థ బలహీనపడింది. అందులోని సభ్యులంతా, జగ్జీవన్‌రామ్ నాయకత్వంలో హైద్రాబాద్ రాష్ట్ర దళిత జాతీయసంఘంలో చేరిపోయారు. ఎక్కడా లేని విధంగా ఉప కులాల రాజకీయాలు ఈ అవకాశం తీసుకోవడం అనేది 1930 లల్లోనే ఆంధ్రప్రదేశ్‌లో ప్రారంభమైంది. ఈ చారిత్రక ఘట్టంలోనే బహుశా ప్రస్తుతం నడుస్తున్న మాదిగ దండోరా వేళ్ళు ఉండి ఉండవచ్చుననుకొంటాను. నెహ్రూవియన్ మోడర్నిస్ట్ ప్రాజెక్టు అమలు కావడం ద్వారా ఆంధ్రప్రదేశ్‌లో అనేక మార్పులు అనుభవంలోనికి వచ్చాయి. ఈ ప్రాజెక్టు వలన దళితులు, బి.సి.ల మధ్య అధికారం కోసం దాడులు తీవ్రమవుతూ వచ్చాయి. ప్రజల ఊచకోత లేదా దళితులపై దాడులు 1985లో జరిగిన కారంచేడుతో మరింత తీవ్రమయ్యాయి. తరువాత నీరుకొండ, తిమ్మసముద్రం, చుండూరు, వేంపెంట, వై. చెర్లోపల్లి ఇంకా ఎన్నెన్నో భయానక, దుర్మార్గమైన దాడులు 1980-1990ల మధ్య కాలంలో జరిగాయి. ఈ దాడులు దళిత ఉద్యమ స్వరూపాన్ని మార్చివేశాయి. అనేక మంది దళిత యువకులు రాడికల్ ఉద్యమాల్లో పాల్గొన్నారు. వామపక్ష ఉద్యమంపై ఒత్తిడి పెరిగింది. కుల సమస్య చర్చకు వచ్చింది. అంబేద్కర్ ఆలోచనా విధానంలో రాడికల్ స్వభావంను అంతర్లీనం చేసుకొనే దిశ మొదలయింది. ఇటువంటి ఉద్యమ అనుభవం మరో రాష్ట్రంలో ఉందనుకొను. మాల-మాదిగ ఘర్షణ

వర్గీకరణ సందర్భంలో ఉత్పన్నమయిన దురదృష్టకరమైన విషయం. రిజర్వేషన్ విధాన పరిధిని బహిర్గతం చేసే ముఖ్య ఉద్దేశ్యాన్ని నెరవేర్చింది. కులవర్గీకరణ గురించి పునరాలోచించేందుకు మనల్ని మరింత దగ్గర చేర్చేందుకు ఉపయోగపడ్డుంది.

**10. విప్లవ రచయితల సంఘం గురించి మీ అవగాహన**

హక్కుల ఉద్యమం లాగా, ఆంధ్రప్రదేశ్‌లో విప్లవ రచయితల ఉద్యమం నిర్మాణాత్మకంగా ఉంది. రాష్ట్రంలో ప్రజా ఉద్యమాల ప్రత్యేకమైన లక్షణంగా భావిస్తాను. 1970లో విప్లవ రచయితల సంఘం ఏర్పాటు జరిగిందనుకొంటున్నాను. చెరబండరాజు, కె.వి.రమణారెడ్డి, టి. మధుసూదన్‌రావు, ఎం.టి.ఖాన్, ఎం. రంగనాథమ్‌లాంటి ప్రముఖనాయకుల కృషి ఎంతో ఉంది. సాంస్కృతిక రంగంలో జననాట్యమండలి వలె విరసం తన రచనా సహకారాన్ని మార్క్సిస్ట్, లెనినిస్ట్ ఉద్యమం కోసం అందిస్తోందనుకుంటున్నాను.

**11. మీ మాతృభాషలోని విప్లవ, అభివృద్ధికారక సాహిత్య పరిచయం రేఖామాత్రంగానయినా చెప్తారా? అలాగే మిమ్మల్ని బాగా ప్రభావితం చేసిన రచయితలు**

ప్రత్యేకంగా నన్ను ఒక్కరే ప్రభావితం చేసినారనుకోను. అయితే భిన్నమైన విషయాలపై అనేకమంది రచయితలను నేను ఇష్టపడతాను. కథా సాహిత్యంలో గోర్కి, ప్రేమ్‌చంద్, విష్ణుప్రభాకర్ (హిందీ), ఠాగూర్, అరుంధతీరాయ్, చినువా అచుబే, మనిక్ బంధోపాధ్యాయం, వాలెసోయింకా, గూగి, అవతార్ సింగ్ పాష్, ఫయాజ్ అహమ్మద్ ఫయాజ్, ఫిరాక్, గొరఖ్‌పురి, నామ్‌దేవ్ దశాల్ (మొదటి దశలో) పి.ఎల్. దేశ్‌పాండే, లూసన్, రామ్‌ధారిసిన్హ దినకర్, బాబూరావ్ బాగుల్, ఉత్తమ్ కాంబ్లే, కుమార్ అనిల్, ఇలా చెప్పుకొంటూ పోతే ఇంకా చాలామంది ఉన్నారు. వ్యాస రచయితలలో మార్క్స్, కోశాంబి, అంబేద్కర్, నోమ్ చామ్‌స్కీ, సమీర్ అమిన్, డేవిడ్ హార్వే, స్వీజి, బారన్, ఇంకా ఇలా ఎంతో మంది నన్ను ప్రభావితం చేశారు.

మరాఠీ సాహిత్యంలో ఎంతో మంది గొప్ప సాహిత్యకారులున్నారు. పి.వై. దేశ్‌పాండే (1899-1986), వి.ఎస్. ఖాండేకర్ (1898-1976), వి.వి. హడప్ (1900-60), జి.టి. మధుకొల్కర్ (1899-1976) కుసుమాన్‌రాజ్ కవిత్వం, అనంత కానేకర్ (1905-80), వి.ఆర్. కాంత్ (1913), అలాగే అన్నాభావ్ సాథ్- 1950-1960లలో దళిత రచయిత. ఆయన కులం, వర్గం, రాడికల్ రాజకీయాలపై విస్తృతంగా రాశారు. బాబురావ్ బాగుల్ ఎంతో మంది దళిత రచయితలను తన సున్నిత, సృజనాత్మకమైన రాడికల్ రచనలతో ప్రభావితం చేశారు. దళిత సాహిత్యం, అంబేద్కర్ సాహిత్యం, విద్రోహి సాహిత్య సంపద అపారంగా ఉంది.

**12. (ప్రోగ్రెసివ్ స్టడీ సర్కిల్స్) అభ్యుదయ అధ్యయన వేదికల ఏర్పాటులో మీ అనుభవం**

ప్రస్తుత పరిస్థితుల్లో ఏదైనా ఒక సమస్యపై పోరాడం ప్రారంభించడం అనేది అనేక అవరోధాలతో కూడుకొన్నది. భవిష్యత్‌లో పోరాటాలకోసం అధ్యయనవేదిక ఉత్తమమైన తయారీ దశగా ఉపయోగపడ్తుందని గుర్తించాను. సామాజిక ఉద్యమాలకు కూడా ఏదో వ్యాపార చక్రంలాంటి అనుభవాలున్నాయి. అవి వంకరటింకరగా, పేలవంగా ఉంటున్నాయి. చారిత్రక నడకరీత్యా భూగోళమంతా 2015 నాటికి అంటే రెండు, మూడేళ్ళలో విప్లవ తిరుగుబాట్లు తలెత్తుతాయని భావిస్తున్నాను. అధ్యయన వేదికలు మౌలికంగా పోరాట శక్తులను తయారుచేసే విధంగా సహాయపడతాయి.

యువతకు అధ్యయన వేదికలు ఏర్పాటు చేసుకోవాలని సలహా ఇచ్చాను. నా అనుభవం ద్వారా, నేను గుర్తించింది ఏమిటంటే విప్లవ సిద్ధాంత అధ్యయనం - ఆచరణకు ఇది ఉత్తమమైన పద్ధతి. నా సలహాను అనుసరించి 40 - 50 అధ్యయన వేదికలు మహారాష్ట్రలోని ముంబాయి, పూనే, ఔరంగబాద్, నాగపూర్‌లలో ఏర్పాటు చేయబడ్డాయి. అందులో 10 - 20 మంది యువకులు ఉంటారు.

ఇటువంటి అధ్యయన వేదికల ఏర్పాటు వలన సమస్యలపై స్పష్టమైన అధ్యయనం, అవగాహన ఏర్పరచుకోవడం సాధ్యమవుతుంది. ప్రాధాన్యతననుసరించి ఒక్కో అంశం ఒక్కొక్కరు చర్చించడం, కలిసి ఆలోచించడం వలన ఎన్నో ప్రయోజనాలుంటాయి. నేను అటువంటి వేదికల్లో సహాయకుడిగా తోడ్పడుతూ ఉన్నాను.

**13. కులసమస్య, మహిళోద్యమం వంటి అంశాలపై మీ సామాజిక దృష్టి కోణం వివరిస్తారా?**

భారతదేశం మార్క్సిస్ట్ - విప్లవ సిద్ధాంతంలో వర్గ నిర్వచనం - కులానికి సంబంధించిన 'మౌలిక అంశాలను పరిశీలిస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

మొదటితరం కమ్యూనిస్ట్ సిద్ధాంతకర్తల దృక్పథంలో 'కులం' ఉపరితల అంశంగా భావించారు. పెట్టుబడీదారి విధానం అభివృద్ధి చెందితే కులం పోతుందని భావించారు. కానీ ఇందుకు భిన్నంగా కులవ్యతిరేక పోరాటాలు, వర్గం ఆధారం చేసుకొన్న కమ్యూనిస్ట్ ఉద్యమాలు వాటిల్లోని భిన్న వైఖరులు, రెండు రకాల ప్రవృత్తి నన్ను చికాకు పరిచింది. భారత సమాజంలో 'కులం' అంతర్లీనంగా సామాజిక నిర్మాణాల్లోను, ఉపరితలంలోను విస్తరించి ఉంది. ఈ అంశం తప్పనిసరిగా పరిగణనలోకి తీసుకోవాలి. ఆలోచించాలి. కులం - వర్గం సంబంధం గురించి పరిశీలన చేయడంలో అప్పటి కమ్యూనిస్ట్ ఉద్యమం పట్టించుకోలేదు. ప్రస్తుతం నడుస్తున్న ఉద్యమాలు సవరించుకొనేందుకు సిద్ధంగా లేవు. కులపోరాటాలు, వర్గపోరాటాలు ఒక్కటిగా నడుస్తాయని నేను ఊహించడం అవాస్తవికమే అవుతుంది.

నా ఆలోచన ప్రకారం ఈ ఉద్యమాలు వేటికవి స్వతంత్రంగా బలపడుతూ ఒకదానితో మరొకటి సహకరించుకుంటూ కొనసాగడం వలన ఆశించిన ఫలితాలు సాధ్యమవుతాయి. అయితే

ఈ సహకారం అనేది కమ్యూనిస్ట్ పార్టీల్లో వ్యూహంగా కాకుండా సిద్ధాంతపరమైన విశ్వాసంతో పాటు కొనసాగితే బాగుంటుంది.

అంబేద్కర్ దళిత ఉద్యమం కులనిర్మూలన గురించి చెప్తే, దానికి వ్యతిరేక అర్థంలో కులాలు బలపడుతూ ఇతర కులాలపై ఆధిపత్య పోరు కోసం ప్రయత్నం చేయడం జరుగుతోంది. నాయకత్వం కేంద్రంగా ఇటువంటి ఉద్యమాలు వస్తున్నాయి. అంబేద్కర్‌గారి తర్వాత నాయకులు రంగంలోకి దిగి లెక్కలేనన్ని భాగాలుగా విడిపోయి, స్వప్రయోజనాల కోసం చీలిపోతున్నారు. రాబోవు తరం కుల నిర్మూలన ప్రాతిపదికగా దళిత ఉద్యమం పునర్నిర్మాణం చేయాలి.

మహిళా ఉద్యమం విశ్వవ్యాప్తమైన సమస్యగా నేను భావిస్తాను. మన దేశంలో ఇతర సామాజిక సమస్యల్లాగా మహిళా సమస్యల తీవ్రత సమాజ పరిస్థితికి అద్దం పడ్తోంది. వీటిల్లో అత్యధికంగా కులం పునాదుల్లో ఉన్నాయి. కులవ్యతిరేక పోరాటంలో ప్రత్యేకంగా జెండర్ పోరాడం కూడా జరగాల్సి ఉంటుంది. జనాభా అసమతుల్యత తీవ్రమవుతోంది. తగ్గిపోతున్న స్త్రీల శాతం ఆందోళనకరంగా ఉంది. ఈ సమస్య మహిళా ఉద్యమ సమరశీల స్వభావంతో బాగు బలపడాలి. విప్లవోద్యమంలో స్త్రీలు ఉద్యమ నాయకత్వంలోనికి రావడం లేదనే ఆరోపణలున్నాయి. వాళ్ళు ముందుకు వచ్చినపుడే ఫలితాలు అద్భుతంగా ఉంటున్నాయి.

నా అవగాహనలో కులవ్యతిరేక, వర్గపోరాటాల్లో స్త్రీలు ముందు వరుసలో ముఖ్యమైన పాత్ర పోషించగలిగితే భవిష్యత్ ఉన్నతంగా ఉంటుంది.

**14. ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించి అనుభవాల్లో ఏదైనా ముఖ్యమైన జ్ఞాపకం**

మొదటిసారి తెలంగాణను చూసినపుడు, నేను పుట్టి పెరిగిన మహారాష్ట్రలాగే అన్పించింది. వాతావరణం, సంస్కృతి పరంగా రెండూ ప్రాంతాలు ఒకేలాగా అన్పించాయి. కర్నూలుకు వెళ్ళినపుడు ఒక సంఘటన జరిగింది. దళిత క్రిష్టియన్లు ఒకమారు నన్ను ఆహ్వానించారు. చెన్నైలో ఉన్న నా స్నేహితుని ద్వారా వారి సమావేశంలో నన్ను మాట్లాడమని కోరారు. దళిత బిషప్ కోసం ఆందోళనలో భాగంగా జరిగిన సమావేశం అది. కాథలిక్ చర్చీలకు సంబంధించి నేను చూచాయిగా మాత్రమే విన్నాను. ఆ చర్చిలో దళితులు, దళితేతరులుగా విడిపోయి ఉండడం గమనించాను. నా ఉపన్యాసం అయిపోగానే ఆ బిల్డింగ్ కింది భాగంలో గొడవ మొదలయింది. అక్కడున్న వాళ్ళంతా కిందకు పరిగెత్తారు. నేను వారిని అనుసరించి వెళ్ళాను. అక్కడ దళిత క్రిష్టియన్లు - రెడ్డి కమ్మ క్రిష్టియన్లు పరస్పరం దాడులు చేసుకొంటున్నారు. మత మార్పిడి కులవైరస్‌కు ఎలా పరిష్కారం కాదో చెప్పిన కొన్ని నెలల తర్వాత దళిత బిషప్ ఉండాలనే డిమాండు వాళ్ళు సాధించుకొన్నారు.

ఒకమారు వరంగల్ డిపోలో ప్రాజెక్టు వర్కులో భాగంగా జరిగిన అగ్ని ప్రమాదంలో ఇద్దరు కాంట్రాక్ట్ వర్కర్లు మరణించారు. ఇంకో అతను గాయపడ్డాడు. ఆ సందర్భంలో చెన్నైలో ఉన్న నేను ఎలాగో అక్కడికి చేరుకొని వారి కోసం కావలసిన ఏర్పాటు చేశాను. ఈ సంఘటన నన్ను బాగా కలిచి వేసింది.

**15. భారత రాజకీయ, ఆర్థిక పరిస్థితిపై మీ అభిప్రాయాలు**

భారత పాలకవర్గాలు నయా ఉదారవాదానికి పూర్తిగా అమ్ముడుపోయాయి. 'హిందుత్వ - దళితులు' అనే నా రచనలో ఈ నయా ఉదారవాదం ఎలా సాంప్రదాయిక బ్రాహ్మణ భావజాలంతో జత కలిసి అవసరమైన విభిన్న స్థాయిలతో కూడిన పాలకవర్గ వ్యవస్థలో అంతర్భాగంగా ఉన్నది అనే విషయం చూపించాను. ఇది ఒక రకమైన భ్రష్ట సమాజాన్ని సృష్టించింది. క్రూరత్వం, అణచివేత అనే వాటిని సమాజంలోని అట్టడుగు వర్గాలపై అమలు చేస్తున్నాయి. ప్రజాస్వామిక ఆచరణకు చోటును నశింపజేస్తూ క్రమంగా అభివృద్ధి, దేశభద్రత పేరుతో, మధ్య తరగతిని తనలో కలుపుకుంటున్నది. మధ్య తరగతి, సేవారంగం విస్తృతమవుతున్న క్రమంలో లాభపడింది. అది ఎటువంటి ప్రతిఘటనను అడ్డుకొనే శక్తిగా యథాతథ స్థితిని కొనసాగించేందుకు దోహదం చేస్తోంది. మీడియా, ఉద్యోగులు, పౌరసంస్థలు, మేధావులుతో కూడి ఉన్న ఈ తరగతి నయా ఉదారవాద భావజాలాన్ని రక్షించేందుకు ప్రభుత్వాలను ప్రోత్సహిస్తోంది. ఏదైనా తీవ్రమైన ప్రతిఘటన అణగారిన వర్గాల నుండి తలెత్తితే మొగ్గలోనే క్రూరమైన అణచివేతకు పాల్పడడం జరుగుతోంది. ఎటువంటి నీతినియమాలు లేకుండా ఇటువంటి క్రమాన్ని ప్రోత్సహిస్తున్నాయి రాజకీయ దుష్టశక్తులు. ఎ.పి.లు, ఎం.ఎల్.ఎ.లు అవినీతిలో కూరుకుపోయి, ఈ మధ్యకాలంలో విపరీతంగా సంపన్నులయ్యారు.

మన ఆర్థిక వ్యవస్థ ఇటువంటి నయా ఉదారవాద అభివృద్ధి మానియాను ప్రతిఫలిస్తోంది. నిర్మాణంలో అది కార్మికులను, వ్యవసాయ ఉత్పాదక రంగాలను నిర్లక్ష్యం చేస్తోంది. మన పాలకులు ఇటువంటి ఆర్థికాభివృద్ధి గురించి పారవశ్యంతో ఉన్నారు. కానీ అనేక వర్గాల ప్రజలపై దాని ప్రభావం మరిచిపోయారు.

వ్యవసాయ, ఉత్పాదక, సేవారంగాల్లో మన ఆర్థిక వ్యవస్థ నయా ఉదారవాద సంస్కరణల మొదట్లో వాటా 32, 22, 46గా ఉండేది. అది 2009 నాటికి 17, 20, 63గా మారింది. వ్యవసాయ, ఉత్పాదక రంగాల క్షీణత స్పష్టంగా కనబడుతోంది. ఈ రంగాల్లో ప్రజలను గమనిస్తే 52% వ్యవసాయం, 14% పరిశ్రమలు, సేవారంగాల్లో 34%గా ఉన్నారు. ప్రపంచ వ్యాప్తంగా నయా ఉదారవాద ఆర్థిక వ్యవస్థ లక్ష్యం అంటే ఆదాయంలో అసమానతలు తీవ్రమవుతున్నాయి.

**16. వామపక్ష ఉద్యమం గురించి మీ పరిశీలన**

దళితోద్యమంలాగా వామపక్ష ఉద్యమం సరియైన స్థితిలో ఉందని అనుకోను. ఎన్నికలు ఎండమావి చుట్టూ పరిగెత్తడమే పార్లమెంటరీ లెఫ్ట్ భావజాలంగా మారిపోయింది. పూర్తిగా తుడిచిపెట్టుకు పోవడం అనే నిజాన్ని గుర్తించేందుకు తిరస్కరిస్తున్నారు. ఇక విప్లవ పార్టీల విషయానికొస్తే, అణగారిన ప్రజలతో మమేకం అవుతూ సాయుధ పంథాను అనుసరిస్తున్నారు.

గల్పిక

# ప్రజాస్వామ్యం - అధికారం!

- పి. చిన్నయ్య

విద్యార్థి : సార్, నాకు అర్థంగాక అడుగుతున్న, కాంగ్రెస్ పార్టీని అధికారంలోకి తీసుకొచ్చింది ప్రజలా లేక రాజశేఖర్ రెడ్డా?

ఉపాధ్యాయుడు : ఏంటిరా, ఎప్పుడూ ఏవో తిక్క ప్రశ్నలు వేస్తావు, రాజశేఖర్ రెడ్డేరా...

వి : నేను ఒప్పుకోను సార్...

ఉ : 'ఎందుకురా, ఎందుకొప్పుకోవు...' మొట్టికాయ వేయబోయాడు

వి : 'ప్రజాస్వామ్యం అంటే ఏమిటి సార్?' మొట్టికాయను తెలివిగా తప్పించుకుంటూ అడిగాడు

ఉ : ఏంటిరా నీ గోల అంటూ, 'ప్రజలు తమకోసం తాము ఏర్పాటు చేసుకునేదిరా...' అతి కష్టంగా అబ్రహాంలింకన్ మాటల్ని గుర్తుచేసుకుంటూ చెప్పాడు

వి : అలా అయితే కాంగ్రెస్‌ను అధికారంలోకి తెచ్చింది ప్రజలేగాని రాజశేఖర్ రెడ్డి ఎట్లవుతడు సార్?

ఉ : ..............!?, అయితే ఏందిరా ఇప్పుడు?

వి : మా నాన్న అధికారం సంపాదించి పెట్టాడని జగన్, కర్ణాటకలో గాలి జనార్దన్ రెడ్డి వలనే అధికారం వచ్చిందని బి.జె.పి, అసలు ప్రభుత్వాలను ఏర్పాటు చేసే అధికారం ప్రజలకుంటుందా లేక రాజశేఖర్ రెడ్డి, గాలి జనార్దన్ రెడ్డి, సోనియాగాంధీ లాంటి వాళ్ళకుంటుందా సూటిగా చెప్పండి...

వి : 'ఓరి సన్యాసి, తెలివిమీరి పోతున్నవురా, అయినా ఎవరు నేర్పుతరురా ఇవన్ని మీకు...' ఇరవై సంవత్సరాలనుండి సాంఘిక శాస్త్రాన్ని బోధిస్తున్నా ప్రజాస్వామ్యమంటే ఏమిటో జీర్ణంగాని ఆ ఉత్తమ ఉపాధ్యాయుడు ఆ విద్యార్థి నోరు మూయించాడు!



---

కానీ రాజకీయ అవసరాలు ఉపేక్షిస్తున్నారు. రాజ్యం క్రూర నిర్బంధంలో అణచివేయబడి దీనమైన జీవితాలు గడుపుతున్న ప్రజల కోసం, స్వార్థరహితంగా పోరాడుతూ ప్రాణాలిస్తున్న కామ్రేడ్స్‌కు ఎవరైనా సెల్యూట్ చెయాల్సిందే. వీరి త్యాగాలతో విప్లవం విజయవంతం కావడం అత్యంత క్లిష్టమైనది. భారత రాజ్యం బలవత్తరమైనది. ప్రజా బాహుళ్యంలో రాజకీయ స్పృహను పెంపొందించే దిశగా దృష్టి పెట్టాల్సి ఉంది. చెప్పడం సులభమే కానీ, విప్లవ విజయం అనేది అటువంటి ప్రజల శక్తి సామర్థ్యాలపై ఆధారపడి ఉంటుంది. మిలటరీ పద్ధతులపై కాకుండా వారి ఎత్తుగడలు గురించి పునరాలోచించుకోవాలి.

**17. మానవ హక్కుల కార్యకర్తలు / రచయితలు తప్పని సరిగా చదవాల్సిన పుస్తకాలు**

What is Maoism? Edited by Bernard D'Mello (Ed), Yater, Michael D. Naming the System; Inequality and work in the Global Economy.

Open veins of Latin America: Five Centuries of pillage of a continent by Eduardo Galeano.

Marxism and the agrarian question, Hussain. A. and Tribe. K.

**18. మీ రచనల గురించి వివరిస్తారా?**

రెండు దశాబ్దాలుగా ప్రచురించబడిన రచనలు

1. On Imperialism and Caste, (Marathwada University, Aurangabad, 2009).
2. Globalization and Dalits : Perspectives of Buddhist Economics, (Srujan, Mumbai, 2009)
3. Samrajyavad ani jaat (Marathi), (Sugawa, Pune, 2009).
4. Khairlanji : A Strange and Bitter Crop (Navayana, Delhi, 2008)
5. Ekavisavya Shatakatil Bharat : Unmad ani Awhane (Marathi), (Lokwangmay Gruh, Mumbai, 2008)
6. Samajik Nyay ani Juglikikaran, (Lokwangmay Gruh, Mumbai, 2007)
7. Anti - Imperialism and Annihilation of Carty (Ramai, Mumai, 2005).
8. Hindutva and Dalits : Perspectives for Understanding Communal Praxis, (Ed) (Sanya, Kolkata, 2005)
9. Ambedkar and Muslims : Myths and Facts (VAK, Mumbai - 2003)
10. Jagatilikaran ani Kashtakari Dalit - Bahujan, (Dignag, Pune, 2002)
11. Globalization and Dalits, (Sanket, Nagpur, 2001)
12. Capitalism and Caste (Monograph, Pune University)
13. 'Ambedkar' in and for the Post - Ambedkar Dalit Movement, (Sugawa, Pune) 1997.
14. Impact of New Economic Reforms on Dalits in India, (Monograph), Pune University, Pune 1997.
15. Dr. Ambedkar, Pratik, Vastav Va Nawa Anwayarth (Savitribai Phule, Pune), 1997
16. Aarthik Sudhar ani Dalit - Shoshit, (Prabuddha Bharat, Aurangabad), 1995

English లో ప్రచురింపబడిన పుస్తకాలు ఇతర భారతీయ భాషల్లో ప్రచురింపబడ్డాయి.

1. On Mahad Satyagraha of Dalits.
2. A New Look of Buddhist Paradigm of Well Being.
3. On Lenin Bukharin Thesis.
4. Revisiting Labour Theory of Value.
5. SEZ, Chinese and ours (in English and Marathi)



పాటలు / కవిత్వం

# కా. కిషన్‌జీ కి బెంగాలీ కవుల నివాళి

పశ్చిమ బెంగాల్ లోని మేదినీపూర్ అడవులలో 2011 నవంబర్ 24న కేంద్ర రిజర్వ్ పోలీసు బలగాల చేతిలో హత్యకు గురయిన కా. కిషన్ జీ (మల్లోజుల కోటేశ్వరరావు) గత ఇరవై సంవత్సరాలుగా పశ్చిమ బెంగాల్ ప్రజాఉద్యమాలను నిర్మిస్తూ, నాయకత్వం వహిస్తూ, సింగూర్, నందిగ్రామ్ వంటి అద్భుతమైన ప్రపంచీకరణ వ్యతిరేక ఉద్యమాలకు మార్గదర్శకత్వం వహించారు. నక్సల్బరీ పునరుత్థానంగా అభివర్ణించదగిన లాల్ గఢ్, జంగల్ మహల్ ఆదివాసి పోరాటాలకు నాయకత్వం వహించారు. పశ్చిమ బెంగాల్ లో ప్రజా ఉద్యమాలకు మాత్రమే కాదు, మధ్యతరగతి బుద్ధిజీవులకు, మేధావులకు ప్రేరణగా నిలిచారు. రెండు దశాబ్దాల పాటు తమ ప్రజల మధ్య పని చేసి, తమ భాష నేర్చుకుని, తమ నేల మీదనే ఒరిగిపోయిన కా. కిషన్ జీ కి నివాళిగా ఈ బెంగాలీ కవితా స్పందనలు వెలువడ్డాయి.

వీటిలో మొదటి కవిత రాసిన నబరుణ్ భట్టాచార్య కవి, పత్రికారచయిత, విప్లవోద్యమ అభిమాని. మహాశ్వేతాదేవి కొడుకు. ఈ కవితను తథాగత భట్టాచార్య బెంగాలీ నుంచి ఇంగ్లిష్ లోకి అనువదించారు. ఆ తర్వాతి రెండు పాటల రచయిత కబీర్ సుమన్ గా ప్రఖ్యాతుడైన సుమన్ ఛటోపాధ్యాయ. ముస్లింగా మారి పేరు మార్చుకున్న ఆయన కవి, గాయకుడు, సంగీతకారుడు. ఇప్పటికి డజనుకు పైగా పాటల్ ఆల్బంలు విడుదల చేశారు, ఎన్నో పుస్తకాలు రచించారు. సింగూర్, నందిగ్రామ్ పోరాటాలను సమర్థిస్తూ తృణమూల్ కాంగ్రెస్‌కు దగ్గరైన ఆయన ఆ పార్టీ అభ్యర్థిగా 2009 మే ఎన్నికలలో జాదవ్‌పూర్ నియోజకవర్గం నుంచి పార్లమెంట్ సభ్యుడిగా కూడ ఎన్నికయ్యారు. ముప్పై సంవత్సరాలకు పైగా వందలాది పాటలు రాసి పాడిన ఆయన లాల్‌గఢ్ ప్రజాపోరాటాన్ని సమర్థిస్తూ కూడ ఎన్నో పాటలు రాశారు. ఆ పోరాటం గురించి "నిషానేర్ నామ్ తాపసి మాలిక్" అనే ఆత్మకథాత్మక రచన చేశారు. 2011 జనవరిలో వెలువడిన ఆ పుస్తకాన్ని కిషన్‌జీ కి అంకితం చేశారు. ఇప్పుడు కా. కిషన్‌జీ హత్యావార్త తెలిసిన వెంటనే రెండు పాటలు రాసి పాడారు. వాటిని ఆయనే ఇంగ్లిష్‌లోకి అనువదించారు. ఈ పాటలు రాసినందుకు తృణమూల్ కాంగ్రెస్ ఆయనను పార్టీ నుంచి సస్పెండ్ చేసింది. ఈ రెండు పాటలూ కబీర్ సుమన్ గొంతులో ఇంటర్నెట్ మీద ఉన్నాయి. "విజేత" పాటను http://www.kabirsumanonline.com/home/2011/11/29/bijoyee-the-victor/ దగ్గర, "వీరుడికోసం పాట"ను http://www.kabirsumanonline.com/home/2011/11/27/a-song-for-a-hero/ దగ్గర వినవచ్చు.

## ఆ పిచ్చుక

- నబరుణ్ భట్టాచార్య

తడబడుతున్న నా అడుగులు
తప్పతాగి కాదు,
గుండెపోటుతోనూ కాదు
హృదయంలో మొలకెత్తి మెదడులోకి
విస్తరిస్తున్న మహోద్వేగ భూకంపం

రహస్యంత్రుల గోపురాలు అరుస్తాయి గీపెడతాయి
పిచ్చుకలు విగతజీవులై నేలరాలుతాయి
పిచ్చుకలదే అయిన ఆకాశం ఇప్పుడు వట్టిపోయింది
వాటి ఆకాశాలను బందిపోట్లు కొల్లగొట్టారు

అతనక్కడ పడి ఉన్నాడు, ఒంటరిగా
రాలిపోయిన ఒక పిచ్చుక
దాని ఈకల మీద ఆ గుర్తులేమిటి - రహస్య ఆచ్ఛాదనలేనా?
కళ్లమీదా, పెదాల మీదా పిడిగుద్దులతో నీలంగా మారాడా?
అతని చుట్టూ చెల్లాచెదురుగా మట్టీ, గడ్డీ, ఆయుధమూ
ఈ సారి సమాలోచన ఇలా ముగిసింది

గౌరవనీయ గద్దలారా, దయచేసి మీ నోరు మూసుకుంటారా
బొంగురు గొంతుకల నీతివచనాల వల్లింపు మానుకుంటారా
కాసేపటి కోసం మన చెవుల యంత్రాలు తీసేసి
మనందరమూ పిచ్చుకల పాటలు వినగలుగుతామా

* * *

## కబీర్ సుమన్ పాటలు రెండు

## విజేత

వాళ్లాయనను పడేసిన చోట, ఒక చిన్నారి పువ్వు
తన రేకులు విప్పి, "తిరుగుబాటుకు వందనం" అంది
నువ్వొక యోధుడివి
అరణ్యాలలో జీవించావు
నీ ఎర్రెర్రని కొన్నెత్తురు గడ్డికి ఊదారంగు పూసింది
నువు చాల దృఢమైన వాడివి
అందువల్లనే చివరికి ఒంటరివి
నాకు ఏ సిద్ధాంతాలూ పట్టవు
కాని నువు మాత్రం నా సోదరుడివి
ఎన్నెన్ని గ్రెనేడ్ల విస్ఫోటనాన్ని చూశావు నువ్వు
ఎన్ని తుపాకి తూటాల లక్ష్యానివయ్యావు నువ్వు
నా కాలపు చిమ్మచీకటిలో

నువ్వొక వెన్నెల కాంతి రేఖవు
నీ దారి తప్పో ఒప్పో
నాకక్కర లేదు
నీలాంటి శత్రువు మాత్రమే
విజేత పొందే ఉజ్వలత్వం సాధిస్తాడు

# వీరుడి కోసం పాట

వీరుడి మరణం వీరమరణమే
వీరుడి మరణం ఒక్కడిగానే
మిత్రులారా, మనం మళ్లీ కలిసేది
తిరుగుబాటులోనే
మరణించేది వీరుడు మాత్రమే
జీవించేదీ వీరుడు మాత్రమే
దారులు వేరు వేరు కావచ్చు
మన మాటలు కలవకపోవచ్చు
కాని ఎన్నదగిన మనుషులు మీరు
వీరుడి మార్గం అలాగే ఉంది
ఒంటరి దారి అది
మిత్రులారా, మనం మళ్లీ కలుస్తాం
ఆ దారి లోనే
ఈ దేశం అందరిదీ
కాదంటే ఏ ఒక్కరిదీ కాదు
అవసరమైన చోటల్లా
సాగుతూనే ఉంటుంది పోరు
ఎదురు బొదురు కాల్పులట
నిజమేనా బూటకమా
మరణంలో దిక్కులు పిక్కటిల్లే నినాదం
జీవితం పట్ల అపార అభిమానం
నువు కంటినిండా నిద్రపోయి ఎన్నాళ్లయిందో
ఇప్పుడిక నేలే విశ్రాంతి స్థలం
సుమన్ గళపు ఆలాపనే
నీ అలసట పోగొట్టే జోలపాట
పాట జీవించేది పాట కోసమే
వీరుడు మాత్రమే మరణిస్తాడు
ఏదో ఒకరోజు మరొకపాటలో
ఉషస్సు మేలుకుంటుంది
వీరుడి మరణం వీరమరణమే
వీరుడి మరణం ఒక్కడిగానే
మిత్రులారా, మనం మళ్లీ కలిసేది
తిరుగుబాటులోనే

(బెంగాలీ పాటలు, కవిత ఇంగ్లిషు నుంచి
తెలుగుసేత : వి. కవిత)

# మధురమ్మ పాట

- శాఖమూరి రవి

ఎక్కడెక్కడివారు ఎన్నదెరుగనివారు
ఎదురంగ వస్తుంద్రు కొడుకా
కోటన్న తల్లంటు మొక్కుతుంద్రు కొడుకా!
కిషన్‌జీ నీకు నూటొక్క దండాలు
జననేత మాకోటొక్క దండాలు
అనుకుంటు వస్తుంద్రు కొడుకా
నీకు ఆయుష్ను పోస్తుంద్రు కొడుకా

కనిపెంచినందుకే ఇంత పేరిచ్చావు
ఏ మిచ్చి నీ రుణము తీర్చుకోమంటావు

చందామామలాంటి చక్కాని మొకమున్న
చిక్కని కొడుకు చేతులెట్టుకోని
అల్లానేరేడు కన్నూలు కలిగినా
చిన్నారి కూతిర్ని సంకాలెత్తుకోని
తల్లులంతోస్తుంద్రు కొడుకా
చుక్కాని నీ కొడుకు పేరెట్టమంటూ
చల్లాని దీవెన ఈయమంటుంద్రు ఎక్కడెక్కరివారు

బుడిబుడి నడకల బుడుతలంతొస్తుంద్రు
చిలకపలుకులు పలికె చిన్నారులొస్తుంద్రు
రాతి బొమ్మైన సరస్వతీ ఇచ్చే
రాతిచదువులు మాకు అక్కారలేదని

పలకబలపము నా చేతికందిస్తూ
మదురమ్మ దీవెన మాకు ముద్దంటూ
సజీవ చదువులో సాగిపోయెలాగా కొడుకా
నా చేతి దీవెనేలీయమంద్రు
ఓనమాలను దిద్దించమంద్రు ఎక్కడెక్కరివారు

అర్ధరాత్రిపూట అలికిడాయిందని
తలుపులు తీస్తేను కొడుకా
నేను ఆశ్చర్య పోయినా కొడుకా
వర్గ బందువులంత ఒక్కటైనారు
కోటిబందువులంత ఏకమైనారు
కనిపెంచిన తల్లి చితిపేరుస్తుంటే కొడుకా
వర్గపోరు తల్లి విలపించెనానే
ఎక్కెక్కి ఏడ్చింద్రు కొడుకా
నన్ను ఎదలాకద్దుకుంద్రు కొడుకా ఎక్కడెక్కరివారు

# పాటే మా జీవగంజి

**- తంగెళ్ళ సుదర్శనం**

పాటే మా ప్రాణమూ
ఆటే మా ఆయుధము
పాటను విడిచి ఉండలేమయ్యో మాయన్నల్లారా
పాటే మా జీవగంజయ్యో మాయన్నల్లారా పాటే

మా ఊరు సుదూరు
మాజిల్లా గిరిడి జిల్లా
మా రాష్ట్రం జార్ఖండమ్మో మాయమ్మల్లారా
పేదింటి బిడ్డలము మేము మాయమ్మల్లారా పాటే

కలము గిలము పట్టనేలేదు
చదువు గిదువు రానేరాదు
గొడ్లగాసి బతికినామమ్మో మా యమ్మల్లారా
గోసిగొంగడేసి నామమ్మో మాయమ్మల్లారా పాటే

నగార డొలక్ డప్పు
మా పాటకు వాయిద్యాలు
గజ్జె గట్టి ఆడిపాడి
గంతులు మేమేసినం
మా పాట పోరు పాటేరు మా యన్నల్లారా
తుది దాక ఆపబోమురో మా యన్నల్లారా పాటే

చైతన్యం పొంగిపొర్లే
పాటలు మేం పాడినం
నాటకాలు వేసినం
చైతన్యం పెంచినం
ప్రజా కళాకారులుగానే మాయమ్మల్లారా
ప్రజలల్లో దిరిగినామమ్మో మా యమ్మల్లారా పాటే

ఏ నేరం చేయలేదు
ఏ ఘోరం చేయలేదు
కుట్రజేసి మమ్ము కమ్మింద్రో మా యమ్మల్లారా
కారాగారములో నెట్టింద్రో మా యమ్మల్లారా పాటే

దేవ్రీ ప్రాంతం వెళ్ళనే లేదు
తేఘ్రి గ్రామం తెలియదు మాకు
చిల్కరి హత్యలో ఉన్నారనియంటు మా యన్నల్లారా
దొంగ సాక్ష్యం జెప్పించంద్రయ్యో మా యన్నల్లారా పాటే

క్రాంతికార్ జీతన్ వేరే
కళాకారుడు జీతన్ నేను
వాడే వీడని నన్ను బట్టింద్రో మా యమ్మల్లారా
ఉరికంబం మీద బెట్టింద్రో మా యమ్మల్లారా పాటే

రాజ్యం పన్ని వలలో జిక్కిన
పోరు పాటలై పిలుపిస్తున్నం
ప్రజాస్వామ్య వాదుల్లారా
ప్రగతిశీల మేధావుల్లారా
కవులారా రచయితలారా
ప్రజ కళా కారుల్లారా
ఉద్యమమై లేచి రండయ్యో మా యన్నల్లారా
ఉరికంబం కూల్చివేయండోయ్ మా యన్నల్లారా

# ఎత్తిన తుపాకి దించని వీరుడు..... మల్లోజుల

**- ఉప్పెన**

ఎత్తిన తుపాకి దించని వీరుడు... మల్లోజుల
మడమతిప్పని మావోయిస్టుర... మల్లోజుల
కరీంనగరు పెద్దపల్లి
కనిపెంచిన పోరుబిడ్డర
తండ్రి స్ఫూర్తిని నింపుకున్నడు
తల్లి దీవెన అందుకున్నడు
బంధుత్వాలను వదులుకున్నడు... మల్లోజుల
బందూకునే అందుకున్నడు... మల్లోజుల ॥ఎత్తిన॥

మైదానంలో పుట్టిన వాడు
మన్యంలో అడుగును పెట్టి
ఆదివాసులతో అల్లుక పోయి
పేదవాళ్ళకు పెన్నిధి అయ్యి
అజ్ఞాత జీవితం గడిపిన వాడు.... మల్లోజుల
విప్లవ సేనను నడిపిన వాడు.... మల్లోజుల ॥ఎత్తిన॥

మల్లోజులను మట్టుపెట్టుటకు
ఎన్నో ఏండ్లుగ వెంటపడి వేటాడిన
శత్రువు కెన్నడు చిక్కనివాడు
పక్కలో బాకై నిలిచిన వాడు
గెరిల్ల తంత్ర వీరుడు.... మల్లోజుల
యుద్ధ నేర్పుతో కదలినవాడు.... మల్లోజుల ॥ఎత్తిన॥

శత్రువు చేతిలో మిత్రులెందరో
నేలకొరిగిన అదరనివాడు

అమరులాశయ సాధన కోసం
ఆయుధమెత్తి సాగిన వాడు
ఎత్తిన ఏ.కె ఫార్టీసెవెన్‌ర.... మల్లోజుల
దోపిడి గుండెలో దిగిన తూటరా....మల్లోజుల ॥ఎత్తిన॥

చేతిలోన ఆయుధముంటే
చెంతకు చేరని శతృవులంత
ఏ ఆయుధం లేని నిన్ను
పట్టుకోని హింసలు పెట్టి
తుపాకులతో కాల్చి చంపిరి.... మల్లోజుల
ఎదుర కాల్పుల కథలు చెప్పిరి.... మల్లోజుల ॥ఎత్తిన॥

జనం పోరులో రణం బాటలో
సదా నీవు చిరంజీవివే
నీ వారసత్వం అందుకుంటము
సాయుధ పోరులో సాగిపోతము
ఈ దోపిడి కోటలు కూల్చి వేస్తము.... మల్లోజుల
మన ఎర్రకోటను కట్టి తీరుతం..... మల్లోజుల ॥ఎత్తిన॥

(25 నవంబర్ 2011న పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ పోలీసులు పట్టుకొని కాల్చి చంపిన మావోయిస్టు అగ్రనేత కా॥ మల్లోజుల కోటేశ్వర రావు(కిషన్‌జీ) కి విప్లవ జోహార్లు తెలుపుతూ)

# కిషన్‌జీపై తల్లి వలపోత

- భారతి

ఆదివారం రోజు అర్ధరాత్రి పూట
అమ్మా అని నన్ను పిలిచానట్లయ్యింది
వాకిట్లో అడుగుల అలికిడైంది
తలుపు తట్టిలేపినట్లు అనిపించింది
బిడ్డడో బిడ్డడో నీ రాక కోసం ఎదురుచూస్తిరా
ఈ కన్న తల్లినొక్క సారి చూసిపోరా

కన్నపేగు కదిలినట్లు అనిపించింది
కారు చీకట్లో వచ్చి కలుస్తవని అనుకున్నా
కన్నపేగు కదిలినట్లు అనిపించింది
కారు చీకట్లో వచ్చి కలుస్తవని అనుకున్నా
బిడ్డడో బిడ్డడో ఈ అమ్మకొక్క లేఖ రాస్తవా
ఆ లేఖలల్లో మంచి చెడులు తెలుసుకుంటవా

రాజ్యం తలపెట్టె రాజ్య హింసలోన
రాలేకపోతినని రాసిపంపుతావ
రాజ్యం తలపెట్టె రాజ్య హింసలోన
రాలేకపోతినని రాసిపంపుతావ

రాబందులు ఏలే రాజ్యం కూల్చబోయి
రాజ్యాధికారాన్ని సాధిస్తానన్నావు
బిడ్డడో బిడ్డడో అందనంత ఎత్తుకు ఎదిగిపోతివా
ఆ ఆకలి కేకలకు నీవు అండగున్నవా

రోజులు గడిచాయి ఏళ్ళు గడిచాయి
కొడుకు రాకపోయె ఆశ తీరకపాయే
రోజులు గడిచాయి ఏళ్ళు గడిచాయి
కొడుకు రాకపోయె ఆశ తీరకపాయే
అడివమ్మ ఒడిలోన సేదతీరుతుంటే
ఆదివాసి తల్లి అండగున్నాదన్నడు
బిడ్డడో బిడ్డడో వాళ్ల హక్కులకై పోరు చేస్తివా
ఆ పోరుబాటలల్ల నువ్వు ముందుగుంటవా
బిడ్డడో బిడ్డడో వాళ్ల హక్కులకై పోరు చేస్తివా
ఆ పోరుబాటలల్ల నువ్వు ముందుగుంటవా

ఆకలి దూప అన్నదెరగకుండా
అబూజ్‌మడ్ కొండలన్ని తిరిగినావు
నువు పోయే దారుల్లో పోరువిత్తులు వేస్తే
గెరిల్లా సైన్యామై శత్రువును వెంటాడే
బిడ్డడో బిడ్డడో విముక్తి పోరుకు దారులేస్తివా
ఆ దారిలోన అందరిని నడవమంటివా
బిడ్డడో బిడ్డడో విముక్తి పోరుకు దారులేస్తివా
ఆ దారిలోన అందరిని నడవమంటివా

ఒక్కసారి నన్ను చూసిపో కొడకంటే
మన రాజ్యం వచ్చినంక కలిసుందమన్నావు
ఒక్కసారి నన్ను చూసిపో కొడకంటే
మన రాజ్యం వచ్చినంక కలిసుందమన్నావు
బిడ్డడో బిడ్డడో అందనంత ఎత్తుకు ఎదిగిపోతివా
ఆ ఆకలి కేకలకు నీవు అండగున్నవా
బిడ్డడో బిడ్డడో అందనంత ఎత్తుకు ఎదిగిపోతివా
ఆ ఆకలి కేకలకు నీవు అండగున్నవా

# వీరునికి చావు లేదు

- డప్పు రమేష్

వీరునికి చావు లేదు
విప్లవం ఆగిపోదు
నీకు చావూ లేదనీ మా యన్న కోటన్న
నువు చిరంజీవివో మా యన్న కిషనన్న

వీరులను గన్న జిల్ల
నీది కరిమినగరు జిల్లా
కరింనగరు జిల్లలోన
పెద్ద పల్లి ముద్దు బిడ్డ
పెద్దచదువునిడ్సిపెట్టి
పేదల బత్కులు చదివి
పేదల బత్కులు మార్చ
నువ్ పోరు బాట బట్టావ్
మాకు బుద్దులు నేర్పితివో మాయన్న కోటన్న
తొలి పొద్దువైతివో మాయన్న కిషనన్న

నక్సలూబరి నిన్ను
మా నక్సలైటును జేసే
సిక్కోలు పోరు నిన్ను
సంహమూలాగ నిలిపె
జగిత్యాల జైత్రయాత్ర
రథసారథి నిను జేసే
గోదారి కావలి గట్టు
భారత విప్లవ చెట్టు
నీకు స్థావరమయ్యెరో మా యన్న కోటన్న
దావానలమయ్యెరో మాయన్న కిషనన్న

ఏపిలో ప్రహ్లాదు
డీకేలో రాంజిదాదా
బెంగాల్‌లో కిషన్‌జీగా
పోరుల్లో పెర్గినావు
ఎంసిసి పియు లాను
పీపుల్స్‌వార్‌తో కలిపి
ఒక ఐక్య పార్టీ జేసిన
ఓ విప్లవ మేధావీ
మా బుద్ధీ జీవివో మాయన్న కోటన్న
మా యుద్ధనేతవో మాయన్న కిషనన్న

జనులల్లో గల్సిపోయి
జంగల్లో గల్సిపోయి
కవులల్లో గల్సిపోయి
భాషల్లో నిల్సిపోయి
సిద్ధాంత రాజకీయ
నిర్మాణ సైనిక శక్తి
విప్లవానికున్న అన్ని
రంగాల్లో రాటుదేలి
మా మార్గదర్శివో మా యన్న కోటన్న
ఆదర్శమూర్తివో మాయన్న కిషన్న

నీ పాద ముద్రలన్నీ
పోరు బిడ్డల గంటున్నాయ్
నువ్ తాకిన చెట్లన్నీ
బంకర్లు గడ్తువున్నయ్
గ్రీన్‌హంట్ నోడించా
రెడ్‌హంట్ సాగుతుంది
నీ మరణవార్త విన్న
గేరిల్ల సేనలన్ని
కళ్ళెర్రా జేసెరో మాయన్న కోటన్న
కసితోని లేసెరో మాయన్న కిషనన్న

## కిషన్‌జీకి లాల్ సలామ్

- భూ సాంబశివరాజు

బాపనీది బాలుడు
పెద్దపల్లి పోరడు
తెలంగాణ పోరులో
ఉదయించిన సూర్యుడు

రెండు పదుల నాడురా
ఇల్లు విడిచినాడురా
పేదవాల్ల కోసమూ
పోరుకు బయలెల్లెరా

బక్క పల్చరైతులా
లైనుబెట్టి నడిపెరా
దగాపడ్డ సెల్లెల్ల
దండుగట్ట పిలిచెరా
జగిత్యాల జైత్రయాత్ర
జెండలు బట్టిచ్చెరా ॥హ॥

ప్రజాపోరుబాటలో
ప్రజలను గదిలించెరా
రగల్ జెండలెత్తిపట్టి
రణములో ముందుండెరా ॥బాప॥

తన తోటి యువకులతో
భుజం భుజం గలిపెరా
పిడికిలెత్తి సాగెరా
అడివి బాట బట్టెరా
ఒకని కొకని చేర్చెరా
గళం గట్టి సాగెరా
దళం గట్టి సాగెరా

దండుగట్టి సాగెరా
ప్రజాయుద్ధ నాయకుడై
ప్రహ్లాదుగ నిలిచెరా! ॥బాప॥

మహిళలేని పోరురా
ఒంటికాలు పీటయనీ
పోరుదారి పొడుగునా
సెల్లెమ్మల చేర్చెరా
ఆడపిల్ల లందరినీ
సబలలుగా జేసెరా ॥హ॥

నిర్మలక్క సాహసాన్ని
సెల్లెళ్ళకు నేర్పెరా
అణచబడ్డ సెల్లెల్లకు
ఆయుధాలందించెరా! ॥బాప॥

తెలంగాణమంతట
పోరిత్తులు జల్లెరా
గోదావరి దాటెరా
ఆదివాసుల గల్సెరా
అలుపెరుగక తిరిగెరా
సాయుధాలను జేసెరా ॥హ॥

దండకారణ్యంలో ఎర్రసేన గట్టెరా
జనతన సర్కారుకే జైజై అనిపించెరా ॥బాప॥

అడవితల్లి గర్భంలో
పొదుముకున్న ఖనిజాలు
కాజేసే కంపెనీల
కోరలు పీకించెరా
అడవి మీద సర్వహక్కు
ఆదివాసుల దన్నడా... ॥హ॥

పార్లమెంటు పందులూ
ప్రపంచబ్యాంకు దొంగలు
చిదంబరం, టాటాలకు
తూటా గురిబెట్టెరా ॥బాప॥

నగ్జల్బరీ పురిటిగడ్డ
లాలుగడుకు జేరెరా
సింగూరు, నందిగ్రామ
సంగ్రాలూ నడిపెరా
జంగల్ మహలంతటా
జంగ్ సైరనూదెరా! ॥హ॥

రివిజనిస్టు ఎర్రకోట
రంగు బైటబెట్టెరా
చారుబాబు వారసుడై
కిషన్‌జీగా నిలిచెరా ॥బాప॥

చిదంబరం ఒబామాలు
చెవులు గొరుక్కున్నరా
మాయలాడి మమతాను
మధ్యవర్తి గుంచిరా
శాంతి చర్చలంటూనే
సుట్టు ముట్టి పట్టిరా ॥హ॥

కోట్లమంది ప్రేమికుడు
కోటన్నను బట్టిరా
చిత్రహింసలెన్నో బెట్టి
వీరునొకని జంపిరా ॥బాప॥

వీరునొకని జంపొచ్చు
విప్లవాన్ని ఆర్పలేరు
కోటన్న త్యాగంతో
కోట్లమంది గదులుతుండ్రు
ఎర్రకోట సుట్టుముట్ట
ఎర్ర దండ్లు సాగుతుండ్రు ॥హ॥

విముక్తి ప్రాంతాలతో
యుద్ధం జేస్తున్నరా
జనతన సర్కారుతో
సమతను జేస్తున్నరా... ॥బాప॥

# ప్రజల మనిషి

- అరుణ్

అమ్మని విడిచి
అమ్మల కోసం
ఆయుధాలు పట్టి
మార్క్సిజం - లెనినిజం
మావో ఆలోచనలతో
పెద్దపల్లి నుంచి బయలుదేరి
జగిత్యాల మీదుగా
లాల్‌గడ్ చేరినోడు
ఎన్నో ప్రాంతాలకు విముక్తి
కొరకు పోరు నేర్పినోడు
అంధకారం అలుముకున్న

అమాయకుల జీవితాల్లో
కాంతిని నింపేందుకు
క్రాంతి మార్గం పట్టినోడు
లాల్‌గడ్‌లో లాల్ జెండెగరెసీ
జంగల్ మహల్‌లో జంగ్ నేర్పినోడు
చనిపోయాడంటే నమ్మేదేలా!
కాంతికోసం క్రాంతి అన్నోడు
క్రాంతి కోసం శాంతి అన్నాడు
చిత్రహింసలు చిరునవ్వుతో
స్వీకరించిన మరో భగత్‌సింగ్‌వాడు
కుట్ర ఏమి లేకుంటే
అంత్యక్రియలకు అనుమతెందుకివ్వలే?
పార్థివ దేహం చుట్టూ
పోలీస్ మూకల మోహరింపెందుకు?
భారీ యాత్రలో బందూకుల
పహారా ఎందుకు
అనుమతిస్తే గుట్టురట్టవద్దనే
భయం కదా నీకు?
విరిగిపడ్డ కాలి ఎముకలు
కదనానికి సిద్ధమవ్వమంటాయనా?
తెగిపోయిన కింది దవడ
దోపిడీని ప్రశ్నించమంటుందనా?
నీవు చీల్చిన చూపుడు వేలు
ప్రశ్నల కొడవెలెత్తమంటుదనా?
చిల్లులు పడి ఛిద్రమైన దేహం
విప్లవాలు సృష్టించమంటుందనా
వాడు ఎప్పుడూ చచ్చిపోడు
వాడు ప్రజల మనిషి
ప్రజల నాలుకలో నానిపోయినోడు
వాళ్ళ విముక్తికై పోరాడినోడు
నీవు చంపితే మాత్రం ఎలా చస్తాడు!
వాడు బతికి ఉన్నాడు కాబట్టే
నీ బందూకుల పహారాలూ
నీ డేగకన్నుల నిఘాలూ
నీ మారు వేష మాటలూ

# అతడు

- జనస్వప్న

ఒక మహాప్రవాహమై కదలిపోతున్నాడతడు
తన చిన్ననాటి గురుతుల గుండా...
తొలి తూరుపు వెలుగుల్ని పొదివి పట్టుకున్న
నూతన యౌవన జ్ఞాపకాల మజిలీల నించి
తన సహచరుల, జనం గుండెతడుల మధ్య
అశేష జన వాహినికి జీవధాతువై...
ఆగిపోని చరిత్రయై సాగిపోతూనే ఉన్నాడు

మరణంతో మాసిపోని మహోన్నత జీవితం
మూడున్నర దశాబ్దాల ఎడతెగని పయనం
ఆదివాసీ కొమ్ముగానాల గాలిలో కలిసిపోయి
జేగంట సవ్వడుల, జోహారుల హోరులో
అక్కల పోరుపాటల ప్రవాహంలో తేలియాడుతూ
కదలి కదలి సాగిపోతూనే ఉన్నాడతడు -

ఆ రోజందుకే పెద్దపల్లి జనసంద్రమయింది
నలుదిక్కుల్నించి వచ్చి వాలిన పక్షుల కలకలమైంది
మన్నుల తోడేళ్ల, బొచ్చెటోపీల, మఫ్టీమాయాపుల
కెమెరా ఒంటికన్ను భయాల్ని ఎడమకాలితో తన్ని
ఆ రోజు పెద్దపల్లి ఉద్యమ ప్రజాప్రవాహమైంది
నల్లని డాంబర్ రోడ్డంతా ఎర్రపూలవనమైంది

అతడు సాగిపోతున్న దారెంట ఇండ్లన్నీ
మహావృక్షాలైనయ్, ఆ బాలవృద్ధులు
కొమ్మల చేతుల్నిచాచి, తమ కోటికి
కోటి పూలవాన జల్లుల్ని కురిపించిన్రు
హూవోయిస్తులే మానవతావాదులన్న
నిజం, ఆసేతు శీతనగం నిప్పెరగిలింది
రాజ్యనీచత్వంపై తుప్పున ఉమిసింది

అరవై తొమ్మిదిల పుట్టిన ఉద్యమ ఊట
ఉత్తర తెలంగాణ ఊళ్లన్ని సుళ్లుదిరిగి
గుండెల్ని తడిజేసి, కన్నీటి పాటై
జగిత్యాల నించి జంగల్ మహల్ దాకా
పీడిత జన మహాప్రవాహంగా సాగి
ఓటు రాజ్యాన్ని పరిహసించి, సవాల్జేసి
ప్రజల చరిత్రకు గర్వకారణంగా
నిలిచి గెలిచి కొనసాగుతూనే ఉంటాడతడు

పుట్టుక కుక్కతోకను పట్టుకొని గోదారీదేవాళ్లకు
వర్గ చైతన్యమహాప్రకాశమై, అనేకానేక
అస్తిత్వవాదాల నిరాశా నిస్పృహల
నిర్వ్యాపారులకు జవాబుగా తను
సాగిపోతూనే ఉంటాడతడు

శత్రువే సిగ్గువిడిచి చెప్పినట్టు, బద్దలైన
వ్యవస్థ అగ్నిపర్వతం నుంచి ఎగసిన లావాయై
భారత సామాజిక కల్లోల లోయల గుండా

దండకారణ్యం నిండా ఒరుసుకొని ప్రవహిస్తూ
అబూజ్‌మాడ్ కొండల దాకా...
కదలి కదలి సాగుతూనే ఉంటాడతడు

అతడు ప్రహ్లాద్, అతడు రాంజీ, అతడు కిషన్‌జీ
జన తెలంగాణ ముద్దు బిడ్డడతడు
ఆదివాసీ జన జీవన ప్రాణవాయువతడు
సోషల్ ఫాసిజాన్ని మట్టి గరిపించిన
విప్లవ ప్రజాసేనాని అతడు
ప్రపంచ బ్యాంకు జీతగాళ్లకు
పట్టపగలే చుక్కలు చూపించిన
ప్రజారాజ్య వెలుగు రేఖ అతడు

# అతనొక సజీవ చైతన్యం

- సుజాత

ఆ నేలంతా రక్తంతో తడిసింది
ఆ రక్తం మడుగులో అతను...
శరీరం నిండా గాయాల గుర్తులే
నేలను తాకుతున్న సూర్య కిరణాలు
అతని శరీరంపై పడి ఎర్రగా ధగ, ధగలాడుతూ
దక్షిణం నుండి ఉత్తరం దాకా,
పూర్వోత్తరం అంతా అలముకొని
అగ్నిశిఖలై దేశాంతరాలకు వ్యాపిస్తున్నాయి

అతను అచేతనంగా పడి ఉన్నాడా?
కాదు
వేల కోట్ల గొంతుల్లో రణనినాదమై
చైతన్య రథాన్ని నడుపుతూ
యుద్ధభేరి మోగిస్తున్నాడు
అతని కనుకొలుకుల్లో కారిన రక్తం
వసంత మేఘగర్జనకు మెరిసిన మెరుపై
ఆకాశమంతా అలుముకున్నది
తెగిపడిన అతని వేలు
లక్షల వేళ్లను ఒక్కసారి ట్రిగ్గర్‌పై పెట్టి
శత్రు గుండెను గురి చూస్తున్నట్టుంది
తెగిన అతని కాలు కోట్ల ప్రజల
పాదాలతో కదంతాల్ చేస్తుంది
రాలిపడిన శరీరం ఏం చేస్తుంది అనుకున్నావా?
అది మేరు పర్వతమై
వందల వేల డైనమైట్ల విస్ఫోటనాలతో
నిన్ను ముక్కలు చేస్తుంది - ఖబడ్దార్ !
(అమరుడు కా. రాంజీ స్మృతిలో)

# అజేయసైనికులై బతకండి!

- భాను

ఎందుకురా నాయినా మమ్మల్నిలా పరీక్షిస్తారూ!
పిల్లల్ని కనకూడదని అత్యంత కఠినంగా నిర్ణయించుకున్న వాళ్లమే
కావొచ్చు
కానీ, అమ్మ మనసును చంపుకున్న వాళ్లం కాదుగా
నువ్వు 'అక్కా' అని పిలిస్తే
నాకు 'అమ్మా' అనే వినబడేది
పేరుకు తగ్గట్టే భాస్కర తేజస్సును పులుముకున్న రూపుతో
చల్లని వెన్నెల చూపులతో
పాలనురుగు నవ్వుతో
ఆత్మీయంగా నువ్వు పలకరిస్తే...
ఎదనిండా వాత్సల్యం
పురుటి నొప్పుల బాధ తెలియకుండానే అమ్మనయినంత ఆనందం
పరుగెత్తే కాలువను దాటేందుకు తంటా పడుతున్నప్పుడు
ఆదరంగా నువ్వు చెయ్యందిస్తే
'కలిసొచ్చే కాలానికి నడిసొచ్చిన కొడుకు'లాగే తోచావు

* * *

ఇప్పుడిప్పుడేగా నువ్వుదయించింది
ఇంకా వేకువ కిరణాలనేగా నువ్వు వెదజల్లుతున్నది
అప్పుడే నువ్వస్తమించడమేంటి తండ్రీ!
నీ జననం ఒక తల్లికే వేడుక అయ్యిందేమో
కానీ నీ మరణం ఎందరి తల్లుల వేదన అయ్యిందో
అందని తీరాలకు తరలిపోయిన నీకెలా చెప్పేదిరా బాబూ!
ఛూటే* మరణం ఒడిలో కట్టుకున్న నిప్పుల మూటలా
ఇంకా దహిస్తూనే ఉంది
ఇంతలోనే అరవిందూ, నువ్వూ...
అన్నిట్లోనూ ఫస్ట్ ఉండాలనే మీ పట్టుదలను
అమరత్వంలోనూ చూపించారా మా చిట్టి తండ్రులూ
ఇప్పటికే మా ముందు తరాల అమరత్వపు దుఃఖాన్ని
మోయలేకుండా ఉన్నాం
మా భారాన్ని పంచుకోవాల్సిన తనయులు మీరు
తర తరాల మన అప్పుల్ని తీర్చాల్సిన వారసులు మీరు
మీ తరం భారాన్నీ మా మీదే వేసి
మీ మానాన మీరు చక్కా పోవడం మీకేమయినా న్యాయమా!
అణువణువూ గాయపడిన మన తెలంగాణ పల్లెలూ, పట్టణాలూ
ఒక ఉషోదయాన
మీ కవాతుతో పులకిస్తాయని
మేం బతికుంటే
మీ భుజాల్ని ఆసరాగా చేసుకొనైనా సరే నిటారుగా నిలబడి
ఆ ఉషోదయాన్ని మా మునివేళ్లతో స్పృశించాలని కలలు కంటుంటే

మా కలల్ని భగ్నం చేస్తూ మీ కలల్నీ మాకే బదిలీ చేసి
తుర్రుమని ఎగిరిపోవడానికి మీకు మనసెలా ఒప్పిందిరా
భవిష్యత్తును మీలోనే దర్శిస్తున్న వాళ్లం
మీరప్పుడే గతంలో కల్సిపోతే తట్టుకునేందుకు మాకున్నది గుండే
కానీ బండ కాదుగా
మా కన్నీటిని తుడవాల్సిన మీరే
కన్నీటి కాలువలై మా ఎదనంతా తడిపేస్తున్నారే
ఈ రక్తసిక్త చరిత్రను సుందర చరిత్రగా మలచాల్సిన మీరూ
ఈ రక్తసిక్త చరిత్రలో కల్సిపొయ్యారే
చరిత్రను కొనసాగించవల్సిన మీరు... చరిత్రను పదిల పరచవల్సిన
మీరు
మీరే చరిత్రగా మారిపోవడం, మీ చరిత్రను మేం పదిలపర్చడం...
ఎందుకురా నాయినా మమ్మల్నిలా పరీక్షిస్తారూ!

* * *

బతకండిరా నాయినా బతకండి
మా ఆయుస్సును సైతం పోసుకొని బతకండి
దోపిడీ కోటలు నేలమట్టం అయ్యే ఆఖరి క్షణం వరకూ
అజేయసైనికులై బతకండి!

(చిన్న వయసులోని కామ్రేడ్స్ అమరులైనప్పుడల్లా కలిగే భావాలు, 2009 అక్టోబర్ 31న కామ్రేడ్ భాస్కర్ అమరత్వపు వార్త తెల్సినపుడు మరింతగా కదలాడి, "క్రాంతి"లో ప్రచురించడానికి తన చరిత్రను సరిచేస్తున్నప్పుడు ఇలా అక్షర రూపం తీసుకున్నాయి. *ఛూటే - కామ్రేడ్ బి.కె.కు గార్డుగా పనిచేస్తున్న సమయంలో నాకు ఎంతో ఆప్తుడైన ఈ కామ్రేడ్ కంచాల ఘటనలో వీరోచితంగా పోరాడుతూ అమరుడయ్యాడు.)

# పిల్లలనూ, పిట్టలను కాపాడుకుందాం

- మిడ్కో

కాళ్ల కింద నేలనుకోల్పోయి మీరు నడకను మర్చిపోతుంటే
మేమిక్కడ మట్టి గంధాన్ని పూసుకుంటూ మనుషులుగా
నిలబడుతున్నాం
చారెడు పచ్చదనం కరువై కాంక్రీటు 'వనం'లో మీరు
ఉక్కిరిబిక్కిరవుతుంటే
మేం అడవి తల్లి ఒడిలో రేల పాటలు పాడుకుంటున్నాం
మీరు ఎవరికి వారే వంటరి ఖైదీలై వున్నపుడు
మేం వినీలాకాశం కింద దిగంతాలే హద్దులుగా సామూహిక
నృత్యాలు చేస్తున్నాం
విద్యుత్‌కాంతిలోనో, ఇరుకు గదుల్లోనో
మీ పిల్లలు వెన్నెల రాత్రులను పోగొట్టుకొంటుంటే
ఇక్కడ మా పిల్లల ఆటలకు వెన్నెల మైదానం పరుస్తోంది
టీపాయ్‌ల మీద ప్లాస్టిక్‌పూలను పెట్టుకొని మీరు భావుకతను
చాటుకుంటుంటే
మా యువతుల కొప్పుల్లో అడవి మల్లెలు పరిమళభరితంగ
నవ్వుతున్నాయి
మీ పిల్లలకు పిట్టలను చూపించడానికి మీరు జూల చుట్టూ
తిరుగుతుంటే
మా వాకిట్లో పిల్లలూ, పిట్టలూ కలగలిసి కిచ కిచలూ కిల
కిలలూ

* * *

మీ కాళ్ల కింది నేలను లాగేసుకున్నవాడు
మీ పిల్లల వెన్నెల రాత్రులను పోగొట్టినవాడు
మిమ్మల్ని వంటరి ఖైదుల్లో బంధించిన వాడు
మా భూమిని కాజేయాలనుకుంటున్నాడు
మా అడవిని బుగ్గి చేయాలనుకుంటున్నాడు
మా వెన్నెలను చీకటి చేయాలనుకుంటున్నాడు
మా సామూహిక నృత్యాలను 'రాహత్' శిబిరాల్లో
బంధించాలనుకుంటున్నాడు

* * *

వాడి కలను కల్లలు చేయడానికి
మా భూమికి మందుపాతర్ల ఆటను నేర్పుతున్నాం
మా అడవికి యుద్ధ తంత్రాన్ని బోధిస్తున్నాం
మా వెన్నెలకు శత్రు జాడను పసిగట్టడం నేర్పుతున్నాం
మా పువ్వులకు పోరు పరిమళాలను అద్దుతున్నాం
మా నీటి చెలిమలను ఉప్పెనలను చేస్తున్నాం
మా పిట్టలకు ఎర్రజెండాలై ఎగరడం నేర్పుతున్నాం

* * *

రండి మీరూ చేతులు కల్పండి
మట్టి పరిమళాలనూ, పిల్లలనూ, పిట్టలను కాపాడుకుందాం

# మొలిసే మొలకల్లో జీవిస్తాడని

- జీవిక

అడవి అడవిలా లేదు
విరబూసిన పుష్పాల్లా
ఎర్రని జెండాలు పర్చుకొని
తనని తానే రక్షించుకోవడానికి
బారికేడ్‌ల నిర్మించుకుంది
యుద్ధతంత్రాన్ని నేర్చుకుంటుంది
మానవ రహిత యుద్ధ విమానాలనే కాదు
మనుషుల మధ్య సంబంధాలను
ధ్వంసం చేస్తున్న
నీ అభివృద్ధి పథకాల
సాంస్కృతిక విధ్వంసాన్ని

నీ యుద్ధ తంత్రాన్ని
తుత్తునియలు చేయ
మానవ సంబంధాలను బలోపేతం చేసుకుంటుంది
విలువలతో కూడిన సమాజాన్ని నిర్మిస్తుంది
ఆ అడవిలో
విలువలతో జీవించి
విలువల కోసం పోరాడిన
మా కిషన్‌జీని చంపినవంటే
మీలో అతను రగిలించిన అశాంతి
మీలో
తరిగిన ఆత్మవిశ్వాసాన్ని
తెలియజేస్తుంది
పిరికిగా చంపి
చెప్పడానికీ
ఎన్ని తంటాలు పడ్డావో
పట్టుకొని చంపడానికి
వేలమందిని
మోహరించిన పిరికివాడవు
జగిత్యాల జైత్రయాత్రే అనుకోకు
జంగల్ మహల్లై మండుతూనే ఉంటాడు
ప్రజాతంత్ర విప్లవమయ్యి ఉదయిస్తాడు
మరువకురా
అడవి అడవిలా లేదని
సాయుధమయ్యింది
పచ్చని పంటపొలాలయ్యింది
పంటకుప్పలతో
అడవంతా ఆరబోసుకుంటుంది
విరబూసిన అభివృద్ధి
ప్రత్యామ్నాయ ప్రభుత్వంగా మారింది
కడుపులు కాలేవారి చెంతకు చేరింది
రోగమొచ్చిన వారిని పలుకరించింది
పిల్లలకు పాఠాలు చెప్పుకొస్తోంది
రైతుల ముఖంలో
వెన్నెలై పారుతోంది
చెక్ డ్యాములయ్యింది
చెరువుల్లో చేపలయ్యింది
భూమిపుత్రుల
మూలవాసుల అధికారమయ్యింది
పుట్టల్లోని చీమలయ్యి
పాముల కండ్లు పీకుతుంది
ఆయుధాలు పట్టిన
సాయుధ రైతాంగం
రోడ్లయ్యి
వరదలా
లాల్‌గడ్‌కు పయనం గట్టింది
'మమత'లు లేని సర్కారుకు
'మట్టి' పెల్లలతో సవాల్ విసురుతూ
మొలిసే మొలకల్లో జీవిస్తాడని
రైతు కడుపులో మెతుకులా ఉంటాడని
అడవి తల్లి
కిషన్‌జీతో ఎప్పుడో గొంతు కలిపింది
అమరునికి జోహార్లు చెప్పింది

# యుద్ధం అనివార్యమే

- కె.బాబ్జి

జార్ఖండ్, దండకారణ్యం నామవాచకాలు కాదు.
గ్రీన్ హంట్‌కు పర్యాయ పదాలు
గ్రీన్ హంట్ చట్టబద్ధమైన చోట
భూమి శ్వాశించడం సాహసమే.
నమ్మకాల వారసత్వాన్ని పూయించడం నేరమే.
ప్రశ్నించడం అంటే చావును కౌగిలించుకోవడమే
దేశసంపదను, పచ్చని పొలాలను డాలరు నోట్లగా మడిచి
కార్పొరేట్ సంస్థల కోటు జేబులు నింపే
దోపిడీ పాలక వర్గాలపై ధిక్కార స్వరాన్ని వినిపించి
మావోయిస్టు పద్ధతుల్లో ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను
కొనసాగించడమే వాళ్ళు చేసిన సాహసం.
దేశ ప్రయోజనాలంటే బహుళజాతి సంస్థల ప్రయోజనాలు కాదని
ప్రజా సంక్షేమం అంటే సామ్రాజ్యవాద మార్కెట్ సంక్షేమం కాదని
నక్సల్బరీ వారసత్వాన్ని కొనసాగించడమే వారు చేసిన నేరం.
జాతి అభివృద్ధి పేరుతో
ఖనిజ పరిశ్రమలను, స్టీలు ప్లాంట్, పవర్ ప్రాజెక్టులతో
పచ్చని అడవి సెలయేరులతో, వెచ్చని రక్తాన్ని పారించడం
అడవి పుత్రులపై చట్టబద్ధంగా సాగుతున్న హింసను ప్రశ్నించడమే
నేరం
ప్రశ్నించే ప్రజలందరూ నేరస్తులే
అబూజ్‌మాడ్, జార్ఖండ్ దండకారణ్యాలన్నీ యుద్ధ క్షేత్రాలే
దేశ అంతర్గత భద్రత పేరుతో పారామిలిటరీని దింపింది చాలక
గ్రీన్ హంట్, మినరల్ హంట్, సల్వాజుడుం ఎక్కుపెట్టే తూటాలు
ఈ దేశ సంస్కృతి మూలాలపై, జాతి నిర్మూలన వైపే గురి
చూస్తున్నాయి
పాలక సామ్రాజ్యవాదులకు యుద్ధమే అభివృద్ధి అయితే
అమరత్వం అంచులపై నిలబడి, చావును గేలిచేసిన గుత్తికోయల
వీరులకు
యుద్ధాన్ని కొనసాగించడం అనివార్యమే.
( కామ్రేడ్ కిషన్‌జీ ఎన్‌కౌంటర్‌కు నిరసనగా)

డా. కాసుల లింగారెడ్డి కవితలు రెండు

# ఒక యోధుని కలల ప్రపంచం

ఆకురాలే కాలం కదా!
స్వేచ్ఛల రెక్కలు చిగురు తొడగడానికి
అడవి దేహాన్ని రాల్చుకుంది-
వీరుడా!
ఆశయాలు మొగ్గతొడగడానికి
మేము నిన్ను విత్తుకుంటున్నాము
కాలపు కొలముల్లో
కరిగించబడిన ప్రాణాలు
మృత్యు శిఖర అంచుల మీద
సానబెట్టబడ్డ సంఘర్షణలు
యోధుడా!
చరిత్ర చెక్కిలి మీద
నీ ముద్దు అరుణారుణమైంది
నేలకెప్పుడూ విసుగులేదు
పచ్చదనమై విశ్వవ్యాప్తంగా విస్ఫారుతుంది
కొమ్మకెన్నడూ అలసటలేదు
ఒరిగిన చోటే తిరిగి లేస్తుంది
సహచరా!
కొమ్మచేసిన త్యాగం
కోయిల గొంతులో గానమైంది
ఆశయాలు పదునెక్కాలే గాని
ఆయుధాలదేముంది?.
స్వేచ్ఛల రెక్కలు విప్పారాలే గాని
కాలదూరానిదేముంది?
ప్రియమైన కామ్రేడ్!
అదిగో అణగారిన జనుల ఆగ్రహ పదఘట్టన
విరిగిపడిన సంకెల శంఖారావం
సమస్త జన సహోదరత్వాన్ని కాంక్షిస్తూ
నీ కలల ప్రపంచాన్ని వాగ్దానిస్తూ

# కలలు కనుగుడ్లు చిట్లిన రాత్రి

**1**

బొడ్డుకోసి పేరుపెట్టి
పెద్దపల్లి పొత్తిళ్ల బిడ్డకు
ఉద్యమ ఉగ్గుపాలు పడ్తున్నప్పుడు
ఒక కలగన్నాను

కల్లోల కలల మేఘం
జగిత్యాల జనజలపాతపు
జైత్రయాత్ర సృష్టించినపుడు
ఒక కలగన్నాను.

దండకారణ్యం దాటి
దంతెవాడ దున్ని
ఒడిశా సాళ్లల్ల ఒడుపుతోటి విత్తనమేసినప్పుడు
ఒక కలగన్నాను

సింగూరు నందిగ్రామంలు విప్పిరవ్వలై
పెట్టుబడుల ఉరికొయ్యల మీద
పాలకులకు శిలువేసినప్పుడు
ఒక కలగన్నాను

జంగల్ మహల్
ఎర్రపూలవనమై విస్తరించి
జనారణ్యాల్ని సాయుధం చేస్తున్నప్పుడు
కల నిజమౌతుందనుకున్నాను

**2**

అనేక స్వయం ప్రకటిత శిశిర మౌనాల తర్వాత
వేయిపూల నేలరాల్చిన నిషేధ ఈదురు గాలుల తర్వాత
కత్తులీ దూసిన నూరు ఆలోచనలు
కాలం కుత్తుకల మీద నెత్తురోడ్చిన తర్వాత
వసంత మేఘం ఆర్తిగా ముద్దాడిన ఈ పచ్చని నేలంతా
మరుభూమిగా రూపాంతీకరించబడిన తర్వాత
ఓ అజ్ఞాత ప్రేమికుడా
నా గొంతు సముద్రం
నీ మీద వినిపించే చరణం కోసం
నిలువెల్లా గాయమై తెలంగాణ ఎదురు చూస్తోంది
నువ్వింకెంత మాత్రమూ కేవలం నువ్వు కాదు
నన్నింకొక్క క్షణమూ నన్నుగా నిలువనివ్వడం లేదు
నువ్విప్పుడు ఒక సర్వనామానివి
వసంత మేఘగర్జనకు
గొంతునిచ్చిన నక్సల్బరీవి
శ్రీకాకుళం విప్లవాగ్నులకు
దారిచూపిన సత్యానివి
ప్రతిఘటన పోరాట గోదావరిని
సజీవం చేసిన ప్రాణహితవు
నడుస్తున్న జంగల్ మహల్ చరిత్రకు
తూర్పు వాకిళ్ళు తెరిచిన సూర్యుడివి

**3**

ఒకానొక నిర్బంధపు చీకటి భయం నుంచి

కుటుంబం, స్వంతాస్తి, సామాజిక హోదాల వ్యామోహం నుంచి
ఒకానొక మధ్యతరగతి సందిగ్దపు పొలమారిన సందర్భంనుంచి
ఎండిన నా గొంతునదిలో
నీ మరణం రాల్చిన నాలుగు కన్నీటి చినుకుల తడినుంచి
ఒక అజ్ఞాత శత్రువు వెంటాడుతున్న
కలల కనుగుడ్లు చిట్లిన ఈ చీకటి రాత్రి
మేధావి తోలు విప్పుకొని
పడక కుర్చీ ప్రహసనాల అద్దం బద్దలు కొట్టుకొని
నిరాసక్త సుప్తచేతన దిగుడుబావిలోంచి లేచొస్తున్నా
కాలం మీద నువ్వు సగం రాసివెళ్ళిన వాక్యాన్ని పూర్చిచేస్తున్నా
పదే పదే విన్నదే ఐనా
మళ్లీ మళ్లీ అదే చెప్తున్నా
'వీరుడికి మరణం లేదు
ప్రజలే చరిత్ర నిర్మాతలు'

## శాఖమూరి రవి కవితలు రెండు

# గుట్ట

హలో
నేను గుట్టను
నిర్జీవమైన రాతి బొమ్మల గుట్టను కాను
సజీవులకు ప్రాణవాయువు నందించే
సంజీవని పర్వతం నేను

ఆకలేసిన పశువుల మందలు
పాలకోసం పరుగెత్తే లేగ దూడల్లా
నా చెంత చేరితే
వెన్నున మోసిన గడ్డిని
అన్నంగా కడుపు నింపిన గుట్టను

జొన్నకంకుల కొచ్చే రామచిలుకల గుంపుల్లా
బతుకమ్మ పూలకొచ్చే అక్కచెల్లెళ్లకు
తలకొప్పుల్లో తంగేడు పూల వనాన్నిచ్చి
పాలపిట్టచే
పోరు బతుకమ్మ పాటనేర్పిన గుట్టను

నూనూగు మీసాల నూతనోద్యమ పిల్లలు
చిరుతలెంటబడ జింకపిల్లల్లా
నా గుట్ట నెక్కితే
గుండె ధైర్యం చెప్పి
జమ్మిపై దాచిన ఆయుధాలందించిన గుట్టను

గుట్టలో నా పిల్లల అలికిడి లేదని
గుర్తెరిగిన 'మైనింగ్ మాఫియాల' సర్కార్
నా గర్భాశయంలో
ఇనుపగుండ్లపై కన్నేసి
మట్టితో ఎత్తుకపోయి
నన్ను సమాధి చెయ్యాలని చూసే
గుండ్లప్పచెప్పి చూస్తూ ఉరకుంటానికి
నేనేడుకొండల ఎంకన్న గుట్టను కాను
వెలిశాల ఎర్రమట్టి గుట్టను

# ఎర్ర నక్షత్రం

కోటేశ్వర్
ప్రహ్లాద్
రాంజీ
కిషన్‌జీ
ఏదైతేనేం
ఎవరైతేనేం
పోయిన కొడుకే పోరాట సముద్రమై
అలలు అలలుగా ఉరకలేస్తున్నానని
అమ్మకు రాసిన లేఖ చదివి
సంబరపడితి

పేగుతెంచుకున్న కొడుకు
నా ప్రేమకు దూరమై
కూడు పెడతాడనుకొనే వయస్సులో
గూటికి దూరమై

రెక్కలొచ్చిన పక్షులోలే
ఎక్కడెక్కడో ఎగిరి
అలసిపోయిన
వలస పక్షులకు

ఓ ఆదివాసి అభూజ్‌మడ్
ఆయుషుపోసిందని
మురిసిపోయిన వేళ
ఏ ఆపరేషన్ గ్రీన్‌హంట్
వాన్ని ఎగదన్నుక పోతుందోనని
నా పేగులు గిరికిలు పెట్టబట్టె
ఏదైతేనేం
ఏమైతేనేం

ఎర్ర నక్షత్రమై
విత్తనిలెదజల్లుతున్నప్పటి నుండి
వాన్ని రాజ్యం వేటాడందెప్పుడని
వాడెదుర్కొందెప్పుడని

గుండెనిబ్బరమై
బతికుంటే అందరివాడని
మరణిస్తే శోకం నాదని
నిన్న జైత్రయాత్ర
నేటి లాల్‌గడ్ పోరాటాల నెమరేసుకుంటూ

వీర కిశోరాలై ఎల్లిన వాళ్ళు
ఎన్నెల ప్రపంచాన్ని మోసుకొస్తారని
ఎన్ని రాత్రులెదురు చూసానో......

(ద్రవీభవించిన తల్లుల దుఃఖం నుండి)

ఆర్. శశికళ కవితలు నాలుగు

# వేలాది మధురమ్మలకు వందనాలు

అయినా ఇంకా వాళ్ళకు
అనుమానం తీరలేదు
అతను కిషన్ జీ
అవునో? కాదో?

ఒళ్ళంతా కుళ్ళ బొడిచారు
కన్నూ పెకిలించారు
కాళ్ళూ నరికేశారు
అహింసావాదుల మనస్సుల్లో
ఇంకా అనుమానం తీరలేదు
అతను సరిగా చంపబడ్డాడో? లేదో?

కానీ, ఆశ్చర్యం
అతను ఇంకా చిరునవ్వులతో
వెలిగిపోతున్నాడే...
వాళ్ళ మనస్సుల్లోకి
మెదడు పొరల్లోకి
మారణాయుధంలా చొచ్చుకొని
పోతున్నాడే...
ఆచ్ఛాదన సరిగా లేని
పేదోళ్ళ జీసస్ అతను

ఆ మహా యోధుని
మరణం నిర్ధారణ అయింది
అహింసావాదులు, చీమలకు
కూడా హాని చేయని వాళ్ళు
తల్లికి వార్త పంపారు.

ఎక్కడో అడవుల్లోంచి
పెద్దపల్లికి చేరింది వార్త
ముప్పై ఐదేండ్ల ఎదురుచూపులు
ఎన్నివేల తలపులు
తన పాదాలను మాటి మాటికి
గుమ్మం వైపు లాక్కెళ్ళాయో
ఎన్నివేల సార్లు
తన కళ్ళల్లో ఆశలు
దీపాల్లా గుమ్మంలో
వెలిగి పోయాయో!
ఎన్ని బత్కమ్మలు
నడిచిపోయాయో
ఆ కళ్ళ లోగిళ్ళు నేడు
ధారా పాతంగా వర్షిస్తున్నాయి

ఇప్పుడు తన ముందున్న
దేహం తన కొడుకుది
కాదు...
అది మల్లోజుల కోటేశ్వరరావు
కాదు...
అది గాయాల
ఆదివాసీ భారతం...
అతను ఏ క్షణమైనా
మీడియాలో
తన గొంతు విన్పిస్తాడు...
తల్లి మధురమ్మ
ఎన్నడూ అనుకుంటూండేది
తన కొడుకులెంత
మంచి వాళ్ళు...
ఎక్కడో ఒక చోట
క్షేమంగా ఉండాలని
తల్లడిల్లింది తల్లి మనస్సు...

కానీ ఆ మంచితనం
విలువను లెక్కించే
పరికరం ఏదీ
ఇంత వరకూ లేదు...
అది ఇంకా ఏ సామాజిక
శాస్త్రవేత్తా కన్పెట్ట లేదు.

రాడికల్ ప్రస్థానం నుండి

రెడ్ కారిడార్ లక్ష్యం వైపు
పల్లె నుంచి అడవులకు
వ్యాపించిన ఆకుపచ్చని
కిరణం అతను...
వేలాది మధురమ్మల
కడుపు కోత...
కోట్లాది మందికి
సెల్ఫ్ డిఫెన్స్ మెకానిజం

మీరింక ఫార్మేషన్లోకి రండి
పొజీషన్ తీస్కోండి అంటూ
మనల్ని అలర్ట్ చేసే
సైనిక కవాతు అతడు
ప్రజాయుద్ధ ప్రాణం
ఆదివాసీల బృందగానం...

అవును వాళ్ళు
ఇంకా అనుమనిస్తున్నట్లు...
అతనెప్పుడూ
జీవించే ఉంటాడు...
ఆ మహాయోధునికి
రెడ్ శెల్యూట్స్...
వేలాది మధురమ్మలకు
వేల వేల వందనాలు.

## కాలాన్ని ఉరితీసే గానం

ఎంత నిర్లక్ష్యంగా...
కత్తిలా వేలాడుతూ
తుపాకిలా పేలిపోతూ
నిప్పు కణికల్లా రాలిపోతూ...

వెంటాడుతూ
వేటాడుతూ
రగులుతూ
రగిలిస్తూ

కడుపులో పేగులన్నీ
బయటికి తీసినట్లు
ఆకాశమంతా...
అలుముకున్న ఎర్రని ఛాయలా
హఠాత్తుగా
రోడ్డుపై
ఆగిపోయిన
వాహనాల్లా
ఒక్కసారి
స్తబ్దుగా
మరోసారి
జీవన చైతన్యంతో
వేగం పెంచుకొని శర వేగంతో
దూసుకుపోతూ
ఆదివాసీ జీవన నాదంలా
ఒక ఆర్తి గీతంలా
సంగీత వాద్యంలా
మోగిస్తున్న అలోకచంద్ర
డోలక్ లోండం
జల్ జమీన్
జంగిల్ హమారా...
అంటూ కాలం...
రూపు దిద్దుకున్న
నినాదంలా
నింగి కెగిసిన
పతాక గీతంలా
జీతన్ మరాండీ
ఛత్రపతి మండల్
మనోజ్ రాజ్వర్
అనీల్ రామ్ ల
విషయంలో
కాలం
రెక్కలాడ్చుతూ
ఎగిరిపోవాలనుకుంది...

కానీ...
ఎంత ఆశ్చర్యం
నిరపరాధులని
కోర్టు విడుదల చేసింది...
ఇంక కాలాన్నే
ఉరితీసే
గీతమేదో వారి
మెదడు పొరల్లో
ఈ పాటికి
రగులుతూనే
ఉంటుంది

## బాల్యం కోసం

ఈ క్రీడా మైదానంలోనే
ఎక్కడో నా బాల్యాన్ని
కాలం నిర్లక్ష్యంగా

విసిరివేసింది...
పునఃజీవిక కోసం
అన్వేషణ కొనసాగుతూనే ఉంది
పిల్లల కేరింతల్లో
ఈ సాయంత్రం
పునీతమైంది
పెద్దరికం ముసుగు
విసిరి వేసి
బాల్యంలోకి పరుగులు తీస్తూ
కేరింతలు కొట్టాలన్పిస్తోంది...
కార్ఖానాల్లోబందీ అయిన
బాల్యానికి రెక్కలివ్వాలన్పిస్తోంది
సంతోషాలు వెల్లివిరిసే
సరికొత్త బాల్యం కోసం
పెద్ద ఎత్తున దైవకణం
కనిపెట్టే పరిశోధనలాంటిదేదో
జరగాల్సే ఉంది

# రహదారి

మా ఇంటి ముందర రహదారి
నాలుగు రోడ్ల కూడలి
కలుపుతూ, కూడబలుక్కున్నట్లు
ఇక్కడికి సమీపంలోనే ఉంది
మధ్య తరగతి మనిషి నిర్వేదంలా ఉంటుంది
విషాదంగానూ ఉంటుంది...
తనపై ఎన్నెన్నో
హారన్లు, సైరన్లు
మోగినా,
చడీ చప్పుడు లేకుండా
తనకేం పట్టనట్లు అలాగే
పడి ఉంటుంది...

ఒక్కొక్కప్పుడు
అంబులెన్స్
ఆక్రందనలా
ఆకలి కేకలా
నినాదంలా
విరామం తర్వాత
నిశ్శబ్దం...
ఏ బాటసారి ఎలాపోతేనేం
ఏ వాహనం దారిఎటో
ఎవరు ఎలా పోతేనేం
తనకేం పట్టదు...

ఒక్కోమారు
రోడ్డు పక్క చెత్తకుండీలో
శిశువు ఆక్రందనలా
ఉంటుంది
తాగుబోతులకు
పూల పాన్పు అవుతుంది
ఏ దిక్కు లేని పిచ్చి తల్లి
మరణశయ్య అవుతుంది
అన్నాహజారే జిందాబాద్ అంటుంది
నాయకులు కావచ్చు
వినాయకులు కావచ్చు
తప్పెట్ల దరువు కావచ్చు
ఎవరికైనా జిందాబాద్ అంటుంది

ఒక్కోమారు
తనకేం పట్టనట్లు
ఎవరికోసమో
ఎదురుచూస్తున్నట్లు
కనుచూపు మేరంతా
పరుచుకొని
తనలో తనే
నిరంతరం
సంభాషణ జరుపుతూ
అలా సాగిపోతూనే
ఉంటుంది.

# కొన్ని సీతాకోకచిలుకలు ఎగరగలవు

-అనామధేయుడు

బహుశా ఇదో తోట గురించిన పద్యం
కాకపోతే కాపు కాసీ కాసీ
తానే ఓ తోటగా మారిపోయిన
తోటమాలిని గురించిన పద్యంకూడా!

నలభైయేళ్ళుగా
అత్యంత పదిలంగా
తమగుండెల్నే అరచేతులుగా చేసుకొని
జనం దాచుకున్న ఓ అపురూపమైన వానచినుకు
అధాటుగా చేజారిపోవడం గురించిన పద్యం కూడాకాదు
ఆ చిట్లిన చినుకు రవ్వల్లో
ప్రజ్వరిల్లుతున్న వేలాది సూర్యుళ్ళని గురించిన పద్యమిది.

వాళ్ళందరూ చెబుతున్నారు
అలలలుగా తెగిపడడం
అరణ్యానికి కొత్తేమీకాదని
లోతుగా గాయపడడం
ప్రవాహాలకు పాతైన విషయమేనని
కానీ...
అఖండిత దేహమేదో సమస్తాన్నీ అపరిచితం చేసేస్తోంది
ఆగర్భశోకమేదో పరిచిత స్పర్శతో మెలితిప్పేస్తుంది

నాకు తెల్సి
అతడో మామూలు తోటమాలి
నిరంతరాయంగా
మొలకలను సృజిస్తూ
మొక్కలను పలకరిస్తూ
చెట్లతో సంభాషిస్తూ
మహావృక్షాలతో చర్చిస్తూ, చలిస్తూ
ఇప్పుడు అతడే ఓ అద్భుతవనంగా మారిపోయినవాడు
ఇప్పుడు వనమంతా విరిసిన
సీతాకోకచిలుకల రెపరెపలు!
ఇప్పుడా వనమంతా రాలిన
ఆకుల రగులుతోన్న క్రోధం!

అది పీకేసిన కనుగుడ్డు నుంచి
కాసేపు తొణికిన స్వప్నం కావచ్చు
అది నరికేసిన కాళ్ళ నుంచి
కొద్దిసేపు నిలిచిన మార్గం కావచ్చు
అది చీల్చేసిన దవడనుంచి
క్షణంపాటు ఆగిన శబ్దం కావచ్చు

కానీ అవి ప్రతీ ఒక్కర్నీ వెంటాడుతున్నాయి
నెత్తుటిలోకి ఒక ఆకుపచ్చని తోటేదో చొచ్చుకొచ్చినట్లు
నరాల తీరాల్లో పచ్చికేదో మొలకెత్తుతున్నట్లు
నల్లని శరీరాల్లో ఎర్రగా ఏదో తట్టుకుంటున్నట్లు
గతంలో సుదూరంగా ఉన్నదేదో
మరింత దగ్గరి కొచ్చినట్లు -
లోపలేదో దావానలం ఎగుస్తోంది.
ఇప్పుడిక్కడ ఎవరినితాకినా
ఏదో తోట తగలబడుతున్న వాసన
ఇప్పుడిక్కడ ఎవరిని పలకరించినా
ఏవో వృక్షాలు కూలుతున్న చప్పుడు!

సంచార జాతులైన మన పూర్వీకుల నుంచో
అవిరామంగా సాగుతున్న అంతులేని గానం నుంచో
వారసత్వంగా సంక్రమిస్తోన్న ఆయుధాల పాదినుంచో
గింగిర్లెత్తుతున్నదేదో
మరణించిన మనిషితోనూ
కొత్తగా ఉదయించబోయే సూర్యుడితోనూ
మనల్ని అనుసంధానం చేస్తున్నాయి
మనల్ని మనుషులుగా నిలబెడుతున్నాయి.

తప్పదు -
చీలిన బీళ్ళలోనో, నాగేటి చాళ్ళలోనో
స్వేద నదుల గట్టునో, నగరాల నడిబొడ్డునో
ఘనీభవించిన గ్రీష్మాల్లోనో
మళ్ళీ ఆ తోటని నాటి తీరాలి
సీతాకోక చిలుకై ఎగిరే కలని
జలపాతమై చెంగున దూకే బాటని
తిరిగి ఉక్కులా కంగున మోగే మాటని
మళ్ళీ మొలిపించి తీరాలి.

మనుషులు మాట్లాడక పోవడమంటే
మనుషులు కలలు కనలేకపోవడమంటే
మరణించడమేనని, తన జీవితం పొడవునా
ప్రతీ చర్యలోనూ స్పష్టంచేసిన
ఆ తోటమాలిని తిరిగి బతికించుకోవాలి
అతడి మాటని బతికించుకోవాలి
అతడి తోటని బతికించుకోవాలి
మరీ ముఖ్యంగా
అతడు వేసిన బాటను బతికించుకుతీరాలి!

కోల్పోవడంలో మేల్కొనడం
మేల్కొనడంలో ఓ మహాస్వప్నాన్ని
ఆవిష్కరించడం సాధ్యమైనవాడే
తాను తచ్చాడిన నేలనేలంతా
పచ్చని తోటగా శాశ్వతం చేసి వెళతాడు
లేదూ తానే తోటగా శాశ్వతమైపోతాడు!

ఓ తటిల్లతనో
ఓ తడబాటునో
ఓ తల్లిపేగుకోతనో
మహోజ్వలచరిత్రగా మలుస్తాడు
అతడిక లేడని ప్రకటించిన ప్రతీసారీ
ఓ పద్యాన్ని సర్రున చించి
ప్రపంచంలోని తల్లులందరికీ

తన పునరుత్థానం గురించిన
ప్రేమలేఖల్ని రాస్తాడు.
ఆ లేఖల నిండా, రేపటికలల జలతారువాన!

అతడు వట్టి తోటమాలికాడు
మహా మాంత్రికుడు కూడా!
మైదానాల్ని తాకి మహారణ్యాల్ని సృష్టించాడు
శూన్యాన్ని మీటి సమూహాల్ని విరబూయించాడు
నెత్తుట్ని వెదజల్లి సీతాకోక చిలుకలుగా ఎగరేశాడు

అతడు వట్టి కాపరే కాడు
మహా బోధకుడు కూడా!
మహాసముద్రాలకు ఎదురుగా
నదుల్ని ఎక్కుపెట్టడం నేర్పాడు
వంద శిశిరాలకు ప్రత్యామ్నాయంగా
ఒకే ఒక్క వసంతాన్ని సంధించాడు
వేలాది మర ఫిరంగులకు పోటీగా
కోట్లాది క్రోధాల్ని కవాతు చేయించాడు

అతడు అసమాన్య సామాన్యుడు
నిలువెల్లా గాయాల్లో ఒరిగి పోయికూడా
నెత్తుటి బొట్టు బొట్టుగా ఒలికి పోయికూడా
కోట్లాది మందిలోకి ఇంకి పోయినవాడు.

నలభై ఏళ్ళుగా
మట్టిజనం తమ దేహాల్నే పిడికిళ్ళు చేసుకొని
అత్యంత పదిలంగా దాచుకున్న చురకత్తుల గాలివాన
అధాటుగా తీరందాటిపోవడం గురించిన పద్యం కాదిది!
బీళ్ళయిన నేల నేలంతా
ఎరువాకల పచ్చని నారుమళ్ళై పరుచుకోవడం గురించిన
పద్యమిది!
ఆదర్శవంతమైన ఆచరణో
కేవలం మరణించిన పద్ధతో
ఓ మనిషిని యోధుడ్ని చేయదు
శత్రువు ఎవరో స్పష్టంగా గుర్తించి
నిరంతరాయంగా చేసే యుద్ధాలనుంచిగ్రహించినసారం,
ఆ సారాన్ని నేలంతా విస్తరింపచేసిన పద్ధతే
ఓ మనిషిని యోధుడ్ని చేస్తుంది
జానపద గాథల్లోని నాయకుడ్ని చేస్తుంది
తర్వాత తరం చదువుకొనే చరిత్ర పాఠాన్ని చేస్తుంది
కచ్చితంగా -
అతడు యోధుడు
అతడు నాయకుడు
అతడు చరిత్ర .
అతడు శిలువల్ని గేలిచేసిన పునరుత్థానం
అతడు సంకెళ్ళపై వాలిన సీతాకోక చిలుక!

## 2

అత్యంత మర్యాదస్తులకు కాస్తంత అమర్యాదగా...
బహుశా ఇదో స్వేచ్ఛని గురించిన పద్యం
కాకపోతే నినదించి నినదించి
తానే ఓ సంకెలగా మారిపోయిన
స్వేచ్ఛని గురించిన పద్యం కూడా!

పద్యం మళ్ళీ
పురుటిగది నెదుక్కుంటుంది
దీపం మళ్ళీ
చీకటిని తడుముకుంటుంది
సీతాకోకచిలుక
రెండో రెక్కనీ రాల్చుకుంటుంది
ఏ ఆసరా చిక్కడం లేదు
ఏ అంతూ దొరకడం లేదు
కనిపించని పెనుగాలేదో
పయనాన్ని మరుపు మెట్లమీదకు కూలదోసేస్తోంది
గొంగళి పురుగులే
సీతాకోకచిలుకలుగా
భ్రమింపజేస్తూ చెలామణవుతోన్న
ఈ కాలంలో కూడా
ఛిద్రమైన రెక్కలతో సైతం
కొన్ని సీతాకోకచిలుకలు ఎగురుతూనే ఉంటాయి!

ఉన్నట్టుండీ...
వీళ్ళంతా రేపటి గోడలకు
నిన్నటి మరుపు రంగుల్ని పులిమేస్తున్నారు.
శ్మశానాల్లో బూడిదరాశులపైన వెదజల్లిన
బియ్యపు గింజలపైన రాసిన పేర్లను సైతం
చెరిపేస్తున్నారు

రేపటికోసం
నిన్న రహస్యంగా దాచుకున్న
అన్నం మెతుకొకటి
నరాల్ని పట్టుకొని పైపైకి ఎగబాకి

బతుకునే పాలమార్చేస్తోంది.

జ్ఞాపకాలన్నింటినీ తుడిచిపెట్టేస్తూ
అగాథాల్లోకి దూకుతోన్న వాగుల ఆర్తనాదాలంటే
కొండలు గుండెలు బాదుకుంటూ
అవిరామంగా పాడుతోన్న ఆదివాసీ గానమేకదూ!
శరీరమే దహనంగా
రాత్రంతా కాలుతున్న వాసనంటే
పుటం పెటుకొని మరీ
ఒక్కో పుటనే చించేసుకొనే స్వీయహననమే కదూ!

ఉండండీ...
దీపం పూర్తిగా మలిగిపోకముందే
ఈ కాసిని జ్ఞాపకాల్ని కూడా
గతం గాయాల మీద వాలిన కాకులకు వెదజల్లేసివస్తాను
పద్యం పూర్తిగా పిగిలిపోకముందే
గుచ్చుకుంటున్న ఈ చిట్టచివరి వాక్యాన్ని కూడా
ఏ శిథిల శిశిరానికో తగిలించి వస్తాను!

ఇలా - ఓ జననాన్ని జారవిడ్చుకోవడమంటే
మళ్ళీ ఓ ఉమ్మనీటి చుక్కై ముడ్చుకుపోవడమే కదూ!
ఇలా - ఓ స్వేచ్ఛని భగ్నం చేసుకోవడమంటే
మళ్ళీ ఓ గొంగళి పురుగై ఉండచుట్టుకు పోవడమే కదూ!

శిథిలమైన దర్గామెట్లమీద
తచ్చాడే సూఫీ సాధువులా
గసగసాల పూల వాసనలోకి మేల్కొన్నాక
ఎడతెగని ఈ నెత్తుటి ఊటని ఆపే పద్యం కోసం
బుద్ధుడు తెమ్మన్న పిడికెడు ఆవాల కోసం
ప్రతీ గడప ముందూ శతాబ్దాలుగా
యాచకుడిలా నిలబడుతూనే ఉన్నాను.
అర్ధరాత్రి వదిలేసిన కపిలవస్తు
కలలోనైనా కలవర పెట్టింటుందా?
జీవితం పొడవునా
వీడని సంకెలై ప్రతిధ్వనించి ఉంటుందా?
అనుసరించి వస్తోన్న దుఃఖం నీడమీద
ఆరేసిన ఆఖరి వస్త్రం కూడా చేజారిపోయింది
బహుశా అది జీసస్‌దేమో!
జూడాస్‌కు దక్కిన ఆ కాసిని పెన్నీల్లో
నేను దక్కించుకున్న ద్రోహపు వాటా ఎంతో
ఎంతకీ లెక్కతేలడంలేదు

సత్యం వెనుకే దాగిన అసత్యం
పదేపదే ప్రకటిస్తోన్న కారుచీకటి మీద
మిగిలిన ఆ కాసిని
కలవరపెట్టే జ్ఞాపకాల పీలికల్ని ఆరేసి వచ్చాను
కాలం వాటిని డైపర్స్‌గా తొడుక్కొని
ఎటో వెళ్ళిపోయింది

తాము గొంగళి పురుగులమని
మర్చిపోలేని సీతాకోకచిలుకలు
వర్ణమయ వసంతాల్లోకి
ఎప్పటికీ మేలుకోలేవేమో!

పూర్తిగా మర్చిపోయిన ఆ పదబంధాన్ని
తిరిగి కొత్తగా పరిచయం చేస్తోన్న
మర్యాదస్తుల సాంగత్యంలో
ఈ పద్యానికి అల్జీమర్స్ సోకుతుంది

ధ్వంసం చేసుకోవడంలోనే
జీవితమంతా గడిచిపోయింది
కిటికీల్నీ, ద్వారాల్నీ
గోడల్నీ, కుటుంబాల్నీ
విగ్రహాల్నీ, ఉద్యమాల్నీ
ప్రవచనాల్నీ, ప్రవక్తల్నీ
ఇలా ప్రతీక్షణం
విధ్వంసక రణమే!

యోధుడా!
ఎన్నింటిని, ఎంతగా
ధ్వంసం చేసుకోకపోతే
ఇంత సుదీర్ఘ పయనం
సాధ్యమవుతుంది!
ఎన్నింటిని, ఎంతగా
పీలికలు చేసుకోలేకపోతే
కాలం కన్నీటిమడుగై
ఇంతగా సుడులు తిరుగుతుంది!

ఒక్కటి చెప్పు...
తండ్రి సల్వాజుడుం శిబిరంలో

తల్లి చిందరవందరైన గూడెంలో
కొడుకేమో విద్రోహ ముఠాలో
కూతురేమో ముళ్ళదారి ఫార్మేషన్‌లో
వీళ్ళనికూడా 'కుటుంబం' అనే పిలవాలా?

ఏ బంధమూ మిగల్లేని ఈ సందిగ్ధంలో
ఆ విధ్వంసక పదబంధాన్ని మళ్ళీ ఎలా నేర్చుకోవడం?
ఓ కుటుంబాన్ని ధ్వంసం చేసుకొని
మరో కుటుంబాన్నే నిర్మించుకోవడం
ఒక్కో అవయవాన్నే పెకలించుకొని
గగుర్పొడిచే విగ్రహంగా తిరిగి రూపొందడం
ఒక్కో వాక్యాన్నే జారవిడుచుకొని
మళ్ళీ అదే పాతపద్యాన్ని పలవరించడం
ఓ సంకెలనే బద్దలు చేసుకొని
దాన్నే స్వేచ్ఛాగీతంగా పెనవేసుకోవడం -
వీటిని కూడా కొనసాగింపేనని సరిపెట్టుకోవాలా?
వీటినికూడా అస్తిత్వశకలాలేనని ఆమోదించాలా?

స్థూపంగానో,
దానిముందు సుడులు తిరుగుతున్న ధూపంగానో
తలాపున వెలుగుతోన్న దీపంలో పడి
శలాభాలవుతోన్న సీతాకోకచిలుకల గుంపులుగానో
సకల విధ్వంసాల మీద
వికృత నిర్మాణ విన్యాసం
విగ్రహ నగ్నత్వాల్ని
కప్పెడుతున్న అచ్ఛాదనం!

ఛీ! ఈ పద్యానికి సిగ్గులేదు
పదేపదే తడిచి పోతుంది
ఎవరైనా డైపర్ మారుస్తే బావుణ్ణు
కావాలంటే కాసేపు అమ్మా అని పిలుస్తాను
సంతాప సంతోషం తర్వాతో
కుటుంబ ప్రార్థన అనంతరమో
కాసేపు గాఢంగా కావులించుకుంటాను
ఇంతకీ ఈ పద్యం
చెమర్చుతోంది నెత్తుటినే కదూ!?

సందేహమే
ఎంత నిద్రనటించినా సుఖంలేదు
ఎంత వంపర్లాడినా ఈ ప్రేమలో దుఃఖంలేదు
ఈ దీపయాత్రను దహించడం
ఈ దగ్ధ క్రీడను ముగించడం
అంతతేలిక కాదు.

మన్నించండి!
మర్యాదస్తులారా!
యిది ఆరిపోయిన పద్యం గురించో
మలిగిపోయిన దీపం గురించో
రాలిపోయిన సీతాకోకచిలుక గురించో
మరోసారి కొత్తగా గాయపడడం కాదు

మరుపు లోయల్లోకి జారిపోతోన్న
ప్రతీ గాయపడ్డ క్షణాన్నీ
మరోసారి కొత్తగా పరిచితం చేసుక్కోవడమే!
కలల రెప్పలమీద కురుస్తున్న
కరుకు కత్తుల వానని
మరోసారి కొత్తగా ఆవాహన చేసుకోవడమే!

### 3

పగటి క్రూరత్వం దించిన కత్తులమొనలకు
దిగులుగా వేలాడే సంవేదనాభరిత రాత్రుళ్ళకి...

బహుశా ఇదో రాత్రిని గురించిన పద్యం
కాకపోతే గాయపడీ గాయపడీ
ఉనికినే కోల్పోతొన్న
చీకటి అస్తిత్వాల్ని గురించిన పద్యంకూడా!

చిరిగిపోయిన జాబితాలో
చెదిరిపోయిన చివరి పేరెవరిది?
నెత్తురోడుతోన్న నిశిరాత్రికి
తమ ఛిద్ర దేహాల్తో కట్టుకడుతుందెవరు?

నీరసిస్తోన్న నరాల్లోకి నల్లని భయాన్ని
బొట్టుబొట్టుగా జారుస్తోన్న ఈ సమయాన్ని
ఎంతవరకూ నమ్మొచ్చు?
రెండు దశాబ్దాల ప్రణాళికాబద్ధ అస్తిత్వ సమూహాల
బేరసారాల మధ్య రెపరెపలాడుతోన్న ఈ దీపాన్ని
ఎంతవరకూ నమ్మొచ్చు?

అసలు
మనిషికీ మనిషికీ మధ్య సంబంధాన్ని
అబద్ధంగా, అసంబద్ధంగా తీర్చిదిద్దుతుందెవరు?

మనిషికి ప్రత్యామ్నాయం మనిషే అయినప్పుడు
మరి ఈ అగాథాలను ఇంతగా తవ్విపోస్తుందెవరు?
సమాధానం సులభమే అయినప్పుడు
అదో అంతుపట్టని బ్రహ్మరహస్యంగా దాస్తోన్న
మహా వేదాంతులెవరు?
అసలు కొట్టుకుపోకుండా
బతకలేక పోవడానికీ, బతక్కుండా
ఉండకపోవడానికి సంబంధం ఏమిటి?
ఉన్నట్టుండీ నిలువెత్తు చెట్టులా
ఎండిపోవడానికీ, కూలిపోవడానికీ కారకులెవరు?
ఉనికికీ ఉనికికీ మధ్య అస్తిత్వ రహదారుల్లో
గాయాల పీలికలపై అంతులేని చర్చలెందుకు?
పల్చబడిపోయిన పదబంధాల నడుమ
రథయాత్రలకీ, రంగులకలలకీ మధ్య
కొత్త తెలను నాటుతోన్న సూత్రధారులెవరు?
ఆ దరిన తగలేసేందుకు ఈ దరిన తెప్పల్ని
నిర్విరామంగా సిద్ధం చేస్తోన్న ధారుశిల్పులెవరు?
రెండుగా విచ్చుకున్న గాయాల్ని కలపికుట్టి
ఒకే దేహంగా వధ్య శిలపై నిలబెట్టి తీర్పుల్ని
రచిస్తుందెవరు?
విముక్తిని నినదిస్తోన్న కంఠనాళాలపైన
నిషిద్ధపు శిలువల్ని నాటుతుందెవరు?
సుడులు తిరుగుతోన్న గాలి దేహంలో
అస్పష్ట మృతశిశువుల కేరింతల్ని నింపుతుందెవరు?
సీతాకోకచిలుకలన్నీ స్వేచ్ఛగా ఎగరగలవని
ముళ్ళకంచెల కంఠంతో ప్రకటిస్తుందెవరు?

క్షమించండి!
ఇప్పుడిక్కడ
కవిత్వ అబద్ధం
మరణమొక్కటే నిజం
మరణంతో మేల్కొనే అలజడి ఒక్కటే నిజం!

కలలలల ప్రపంచంలోకి ప్రచండంగా ప్రస్థానిస్తోన్న
పెను తుపాను హఠాత్తుగా తల వాల్చేస్తోంది
మానవుడు చచ్చిపోయాడు.
బహుశా చంపబడి ఉంటాడు
వాస్తవానికి చచ్చిపోయింది మానవుడు కాడు
సిగ్గుతో ఉంగలు చుట్టుకుపోయిన చరిత్రే!

ఇవ్వాళ్టికి...
ఇరుకిరుకు గదుల్లో శవమే చిరుదీపమవ్వడం నిజం
మహామహా సౌధాల్లో శవమే సీతాకోకచిలుకై
పరిభ్రమించడం నిజం
అలుపెరుగని బాటల్లో శవమే సేదదీర్చే చలివేంద్రం
కావడం నిజం

ఈ కాస్త జ్ఞాపకాల చెమ్మనీ జారవిడ్చుకున్నాక
ఇక పుట్టడమూ, మరణించడమూ ఏక క్రియే!
ఇప్పుడిక్కడ కొత్తగా పుట్టడమంటేనే
పాత మరణాన్ని తిరిగి పెనవేసుకోవడమే!
దారితప్పిన చోటునుంచే మొదలయ్యే నడక
ప్రతీ పాతముద్రనీ పరిచితం చేస్తోంది
అయినా - అసలిక్కడ రెండు కన్నీటి బొట్లకు చోటుందా?
మరణించడానికి ముందే చంపబడే శైతల్యమిది
విడిపోవడానికి ముందే అపరిచితం చేసే శైథిల్యమిది
దుఃఖం చిరునామా ఎంతకూ దొరకని ఈ బయళ్ళలో
దేన్నైనా కోరుకోవచ్చు, పరిగలాగా మనల్ని మనం ఏరుకోవచ్చు
ఒక శిబిరంలో కూర్చోనే బాటసారులుగా విడిపోవచ్చు
లేదూ మన మీదకు మనమే నిర్భయంగా కత్తులు దూసుకోనూవచ్చు

ఈ రాత్రికెలాగో మరుపుమెట్లమీద
ఆ ముసలి మృత్యువుని తారట్లాడనిద్దాం
రాత్రి అంటే మరణం
రాత్రి అంటే మరో అర్థంలో హంతకుడు
రాత్రి అంటే సీసపు పెంకుల్ని నమిలి తినే ఒంటరిపక్షి
రాత్రి అంటే.కబళించేదాకా ఎవరికీ గుర్తుకురాని పద్యం
రాత్రి అంటే ఒంటరి తనాల మీద వేలాడుతోన్న కళేబరం
రాత్రి అంటే న్యాయస్థానాల మూసిన తలుపులకు
దిగ్గొట్టబడ్డ కపటత్వం
రాత్రి అంటే పదేపదే మభ్యపెట్టే చర్మరక్షణ దీక్ష
రాత్రి అంటే జంగల్ మహల్‌లో చిందిన నెత్తురు
రాత్రి అంటే ఏ స్మృతివాక్యానికీ నోచుకోని
అనామకమరణం
ఈ రాత్రి నాకూ పరిచితమే
రంగుల్ని కోల్పోయిన సీతాకోకచిలుకలకూ పరిచితమే!

మృత్యుశీతల పరిచ్ఛాయలో తచ్చాడుతున్నప్పుడు

చేతిలోని పాతగొడుగుని పోగొట్టుకున్న నేను కూడా
అంత రొట్టెముక్క కోసం
ఈ రాత్రితో సరసాలాడాను!
అందరూ బజ్జున్నాక
పజ్జొన్న చేలమీదకు నిశబ్దంగా వాలే రాత్రికి
రెప్పవాలని కాపలా కాశాను!
చుట్టూనే తారట్లడే కట్లపాము కదలికలపైనా
మునిమాపు వేళ చీకటిని దాచిన గాజుకిరణాలపైనా
ఒంటిమీద గాయాల్ని ప్రేమగా నయంచేసే చూపులపైనా
ఈ రాత్రికి సందేహమే!

కనీసం ఓ రొట్టెముక్క కోసమైనా ఈ రాత్రిని
నమ్మొచ్చుకదూ!
దానివెంట వచ్చే సమూహాల్ని నమ్మొచ్చుకదూ!
చితుకులుగా రాలిపోతున్న ముసలిరాత్రినీ
క్షణక్షణానికీ ఖాళీ అయిపోతోన్న జోలెనీ
ఒదులొదులు చీకటిమెట్లనీ నమ్మొచ్చుకదూ!
ఏ దిక్కున తప్పిపోయిందో అర్థంగాని సందిగ్ధాల
ఎదురు చూపుల్లో చిక్కిన ఉదయాల్ని నమ్మొచ్చుకదూ!

సందేహం లేదు
సంకోచం లేదు
ఒంటిమీద వాలిన నిన్నటి సీతాకోకచిలుకల సాక్షి
ఈ రోజు నుంచి నా చీకటి చూపుల్ని నిషేధిస్తున్నాను!
శతబ్దాల క్రితమే చుట్టుకుపోయిన సంకెళ్ళ సాక్షి
ఈ రోజునుంచి నా నేల విముక్తిని నినదిస్తున్నాను!

## 4

ఓ నివాళికీ, లేదూ
ఓ చిన్న స్మృతివాక్యానికి సైతం
నోచుకోని నిశబ్దనిష్క్రమణాల కోసం...

బహుశా ఇదో సీతాకోకచిలుకల గురించిన పద్యం
కాకపోతే స్వేచ్ఛగా ఎగిరీ ఎగిరీ
రాల్చుకున్న రెక్కలపై
ఓ జాతి రాసుకుంటున్న ఆత్మకథని గురించిన
పద్యం కూడా ఇది!

ఓ చిన్న వీడ్కోలు మాటైనా లేకుండా
నిష్క్రమించడం అందరికీ చేతకాదు
శబ్దాలు వెలివేసిన గేయాన్ని
ఆయుధంగా ధరించి

అలా నిరాడంబరంగా సాగిపోవడం
చాలా మందికి సాధ్యం కాదు!

నిషిద్ధ కాలం ముంగిట
తెగిపడ్డ దీప స్తంభం
చీకటినే తిరిగి కొత్తగా పరిచయం చేస్తోంది
పీలికలైన దేహ గీతం
భగ్గున మండే నెత్తుటిచారికతో
ఓ వెల్తురు సంతకాన్ని చేస్తుంది
ఎప్పుడో పారేసుకున్న దృశ్యాలమధ్య
ఇక పాకులాట మొదలవుతోంది
ఇప్పుడు నేను కూడా ఎప్పుడో ఆరిపోయిన
దీపం గురించి కొత్తగా పలవరిస్తున్నాను.

ఏ దాహానంతర దారిలో గాయపడిందో తెలియదు
ఏ జ్ఞాపకాల ఉక్కు కంచెకు చిక్కుకుందో తెలియదు
ఏ బాయ్‌నెట్ పదును కొసను ధిక్కరించిందో తెలియదు
యిప్పుడంతా - ప్రతీమబ్బూ ఈ దీపంలా
ఓ వెండిచినుకుని మోసుకొస్తోన్న కల.

అసలు - ఈ దీపం
అనంత దిగంతాల దూర సంచారి
లేదూ ఎండిన బీళ్ళ మధ్య నిలబడి
తనను తాను వెదజల్లుకొనే పిచ్చిరైతు
లేదూ యిన్ని చిదుగుల్ని పోగేసుకొని
నది ఒడ్డున మాటువేసే మహా వేటగాడు
లేదూ ఒక్కో వాక్యాన్నీ చిత్రికపట్టి
సమస్త పదబంధాల్ని వెక్కిరించే మట్టిమనిషి

ఆరిపోయినా సరే ఆ దీపం గురించే నేను కలగంటాను
గ్రహణం పట్టిన నీడల మధ్య
దీపం మలిగిపోయిన గోడల మధ్య
చీకటి పొంచిఉన్న పులివాసనేస్తోంది
చీకటి అవిరామంగా సాగుతోన్న యుద్ధం వాసనేస్తోంది
చీకటి తలవాల్చిన పొద్దుతిరుగుడు పూల వాసనేస్తోంది
చీకటి చితికిన దేహంతో ఎగిరే సీతాకోకచిలుకల వాసనేస్తోంది

మలిగిపోయింది దీపం కాదు
మరణించింది నీవు కాదు.
మరణించడానికి ముందే పద్యానికి
అందమైన సమాధుల్ని తీర్చిదిద్దుతున్న
అత్యంత మర్యాదస్తులు మరణించారు
వాతావరణ సూచనలందక ముందే
ముందు జాగ్రత్తగా తలుపుల్ని మూసేసుకున్న

అత్యంత భద్రజీవులు మరణించారు
పాపం వాళ్ళకు తెలియదు
సమాధులన్నీ ఎప్పుడో మరణించాయని
గోడలన్నీ ఎప్పుడో కూలిపోయాయని!

అయినా సరే -
దెబ్బతిన్నాంకదా - అందుకే గాయానికి నా ప్రణామం
ఓడిపోలేదుకదా - అందుకే గాయ ప్రయాణీకులకీ నా ప్రణవం
అగంతకుల్లాగా
అప్పుడే మేలుకున్నవాళ్ళలాగా
ఎవరూ ఇటు తొంగిచూడొద్దు
అవనత ముఖ అభినయాలొద్దు
తప్పనిసరి స్మృతివాక్యాలసలేవొద్దు!

మన్నించండి ఎం.ఆర్. గారూ!
అప్పుడెప్పుడో చింతలముడిపి చెంచుగూడెం నుంచి
మీ కోసం రహస్యంగా జేబులో దాచుకొచ్చిన
అన్నం ముద్దని మీకివ్వడం కుదరనేలేదు
ఇప్పటికీ నేనా అన్నం ముద్దలోని
ఒక్కో మెతుకునే కాకిలా ఏరుకు తింటున్నాను.

చింతల ముడిపి నుంచి
రహస్యంగా దాచుకు తెచ్చింది
అన్నం ముద్దకాదు ఒట్టి కలలగుబురు నేనని
ఎవరినీ తాకని ఒలికిన మీ నెత్తురు చెప్పింది
చింతల ముడిపి చిన్నక్క
గుండెలో నాటుకున్న కరుకు అంబు సాక్షి
పెట్లిపోయిన కలల వెదురు వనాల సాక్షి
ఒక్కో మెతుకు ఒక్కో సీతాకోకచిలుకై ఎగిరిపోయింది
నాగులేటి వడ్డునో
నల్లమల గుట్టల్లోనో
ఒక్కో అవయవాన్నే ఖండించి
విత్తనాలుగా విరజిమ్మి
ఓ వెచ్చని చినుకు కోసం ఎదురుచూస్తోన్న
ఎండిన గరిక పువ్వుని నేనే!

నాకు తెలుసు -
అచ్చమైన కలల కార్మికుడివి నీవు
ఎవరికీ చెప్పకుండా మాయమైపోయిన మార్మికుడివి నీవు
గురితప్పని చెంచుల కంటిపాప తీక్షణం నీవు
మహా అద్భుత నిర్మాణం తాలూకు వీక్షణం నీవు
నిష్క్రమణకు నిశ్శబ్దాన్ని నేర్పిన బాటసారివి నీవు.

విధ్వంసంలో శకలమై చెదిరిపోవడం ఎలానో
విగ్రహారాధానల్లో దీపమై మలిగిపోవడం ఎలానో
నీలినయనాల్లో ఆరూపమై కరిగిపోవడం ఎలానో
నీనుంచి నేర్చుకోని
చితికిపోయిన గొంగళిపురుగును కూడా నేనే!

ఎడతెరపిలేని పయనంలో
నెత్తుటితో చెక్కిన మైలు రాళ్ళవద్ద
నా నిరీక్షణ ఓ నులివెచ్చని రుతుపవనం గురించి కావచ్చు
నా నిరీక్షణ ఓ భయకంపిత మృత్యు స్పర్శకోసం కావచ్చు
చిట్లక తప్పని నిశబ్దం కోసం కూడా కావచ్చు
ఏళ్ళ తరువాత
తెగులుతోన్న దుఃఖజలపాతం గురించి కావచ్చు

నాకు తెల్సు -
ప్రతీసారీ నన్ను నేను అంకితం చేసుకుంటోన్న
ప్రతీసారీ నన్ను నేను అవనతం చేసుకుంటోన్న
సంక్లిష్ట సందర్భాలు కూడా ఇవే!

ప్రతీదాన్నీ ధ్వంసం చేసుకుంటూ
మరో మహా అద్భుత నిర్మాణాన్ని సృజిస్తూ
సాగుతోన్న ఈ సుదూరయానంలో
నావెంట మార్మిజ్ వదిలిపెట్టిన
లేత సీతాకోకచిలుకలు ఎగిరి వస్తున్నాక
ఈ దారిలో నాకు కొన్ని అనుభూతులున్నాయి
ఈ దారిలో నాకు కొన్ని అనుబంధాలున్నాయి
ఈ దారిలోనే నేను పూర్తిగా ధ్వంసం చేసుకున్న
కొన్ని పదబంధాల ఆనవాళ్ళుండి ఉంటాయి
చెరిగిపోయిన పసుపు మరులాగా
మిగిలిపోయిన అమ్మ ఉండి ఉంటుంది
చెరిగిపోయిన పిట్టలకోసం గడ్డకట్టి పోయిన
ఆమె ఎదురుచూపు ఉండి ఉంటుంది
వేలాది కడుపుకోతల్ని భరిస్తోన్న
ఆమె శైథిల్యం ఉండి ఉంటుంది.

ఎదురుపడాల్సిన ఆనందం
ఒక్కో దుఃఖంగా పెనవేసుకుంటుంటే
ఏవో పురాజ్ఞాపకాలు గాయాలుగా తిరిగిరేగి
కాళ్ళకడ్డం పడుతున్నాయి

నిశ్శబ్దంగా రాలిపడే వానచినుకుని
ఎలాగైనాసరే మళ్ళీ పొదివిపట్టుకోవాలి
రెక్కలు కోల్పోయిన సీతాకోకచిలుకల్ని
దారిచూపే నక్షత్రాలుగా నింగికెగరేయాలి.

వాళ్ళకేం సూఫీ సాధువుల్లా
వెళ్ళిపోయికూడా లోపలే గింగిర్లు తిరుగుతారు
నిష్క్రమించి కూడా గుండెల్ని చుట్టుకుపోతారు
వాళ్ళ ప్రేమని రుచి చూసిన ప్రతి ఒక్కరూ
దుఃఖానికి బానిసలైపోతారు
గాయానికి సన్నిహితులైపోతారు

గాయపడికూడా కొనసాగుతున్న నడకలో
నక్షత్రాల్ని జారవిడుచుకున్న నడిజాములో
గొంగళి పురుగుతనాల్ని గేలిచేస్తూ
ఎగురుతున్న అడవి సీతాకోకచిలుకలు వాళ్ళు
విశ్వకుటుంబం కోసం కుటుంబాల్ని
బద్దలు కొట్టుకున్న ముక్కు పచ్చలారని పిల్లలు వాళ్ళు
బతుకు లిపిని చెక్కడానికి తమదైన లిపిని
భాషని, భావోద్వేగాల్నీ వదిలేసిన అడవిబిడ్డలు వాళ్ళు
నిరంతరం యుద్ధాన్నే ప్రేమిస్తూ
స్వేచ్ఛనే కలగంటూ
మృత్యువుని కౌగిలించుకుంటున్న
మహాయోధులు వాళ్ళు
వాళ్ళు బద్దలుకొట్టిన భాషని
భావోద్వేగాల్నీ, రహస్య లిపిని
రైతు తన వరిచేను మొలకల
మొదట్లో గోప్యంగా దాచిపెట్టాడా
ఆ సత్యాన్ని ఆకాశం కళ్ళారాచూసింది
గాలి తనివి తీరా ఆస్వాదించింది
ఆ రహస్యాన్ని దాచుకున్న నేల మాత్రం
తదుపరి పంటకోసం తృప్తిగా కడుపు తడుముకుంటుంది

రాలిన రెక్కల చప్పుడుకూ
ఒక రహస్యభాష ఉంటుంది
నిశబ్దంలో పెట్లిన ప్రతీపదానికీ
ఒక యుద్ధ వ్యాకరణముంటుంది
గాయంలో మేలుకొనే వేకువే
మనల్ని తిరిగి మనుషులుగా చేస్తోంది
మనల్ని ఎగిరగలిగే సీతాకోకచిలుకల్ని చేస్తోంది

ఈ ఎదురుచూపు
మళ్ళీ వస్తానని చేతిలో చెయ్యేసి చెప్పెళ్ళిన
ఓ వెచ్చని రుతువు కోసం!
ఈ ఎదురుచూపు
కాలంకాని కాలంలో ఆకస్మికంగా రాలిపడే
ఓ పదును వాన చినుకు కోసం!
నెత్తుటి నేలా పుష్పించు!
నా నల్లమలా తిరిగి పుష్పించు!

(ఎం.ఆర్. - మస్తాన్‌రావు అలియాస్ వెంకట్రావు మావోయిస్ట్ పార్టీ, ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక కమిటీ కార్యదర్శి, 2008 అక్టోబరు 28న విజయనగరం జిల్లాలో బూటకపు ఎన్‌కౌంటర్లో కాల్చి చంపారు)

## కెక్యూబ్ వర్మ కవితలు రెండు

# ఆదర్శం....

దేహమంతా గాయాల మయమైనా
పాడే వేణువు ఆదర్శం కావాలి....

నిర్బంధం ఎంతగా ఉక్కుపాదం మోపినా
గొంతు చించుకు వచ్చే నినాదం కావాలి...

నిషేధాలు ఎన్ని ఇనుప తెరలల్లినా
పొద్దు పొడుపులా పొడుచుకు వచ్చే వాక్యం కావాలి....

పెడరెక్కలు విరిచికట్టి కళ్ళలో గుండు సూదులు గుచ్చి
గుండెల్లో గురిపెట్టినా సత్యం వాక్కు కావాలి....

పాటల పల్లవిలో ప్రతి చరణంలో
నీ హృదయం నిక్షిప్తమై అజరామరం కావాలి....

# వాడి నెరవేరని కల

ఎప్పుడూ వాడికొకటే కల
తనకు నిద్ర పట్టనివ్వని వాణ్ణి
అంతం చేసేద్దామని...

వేల తుపాకులు భుజానేసుకొని
కవాతు చేస్తూ భయం భయంగా
నక్కుతూ నీల్గుతూ మూల్గుతూ
అడుగులేస్తూ
ఎదురుగా
వెన్నెలతో జలకాలాడుతూ
కోరమీసం మెలేస్తూ
నెగడు చుట్టూ థింసా ఆడుతున్న
వాడి గుండెల్లో తూటా దించేసి
హాయిగా ఊపిరి పీల్చుకుందామని...

కానీ,
నెగడులోంచి ఎగసి పడుతున్న నిప్పురవ్వలు
ఒక్కొక్కటి వేల సూరీళ్ళుగా ఉదయించడం
చూసి మరల నువ్వు
బురదపాములా ఊబిలో కూరుకు పోయావు....

చూసావా
నా అప్రియ శత్రువా

# ధృవతార కోసం...

- ఏకుల మల్లేష్

ఓ అజ్ఞాత పుష్పమా
నీవు రాలిపోయినా వాడిపోవు
నీ పరిమళం గాలిలో తెలియాడుతూనే ఉంది
తెలియని ప్రపంచానికి తెలుస్తుందిప్పుడే నీ పరిణామం
తెలిసిన ప్రపంచం శ్వాసిస్తుందిప్పుడే నీ పరిమళాన్ని

నీవు రాలిపోయావని సంబరపడే రాజ్యం
వాడిపోయవని హర్షించే శత్రువులు
నీవు రాలిపోయిన కాడే
ఉదయించే ఒక రవి కిరణం
ఉదయించిన రవి కిరణం
జయించె జంగల్ మహల్‌ను
చుట్టు ముట్టె లాల్‌గడ్‌ను
నీవు వాడిపోవు, అది వాడికి తెలియదు

రాజ్యం కత్తినంచునుంటూ
రాజ్యహింసనెదుర్కొంటూ
ప్రజల గుడారాలలోకి, గుండెల్లోకెళ్లి
'బిప్లక్' అంటే విప్లవమని
బెంగాలీలో బోధించావు
నలుదిక్కులూ తిరుగుబాటును విస్తరింపజేశావు

అజ్ఞాతం కాదు నీ జీవితం
నిజమైన ప్రజాజీవితం నీదే
నిజమైన ప్రజాసేవ నీదే
నీ ఆశయం విస్తరించి
ప్రజాయుద్ధం జయిస్తుంది

# జోహార్ !

- బాలసాని రాజయ్య

ఉదయించిన కిరణమా
పెద్దపల్లి రత్నమా
రైతాంగ పోరాట రైఫిల్ నీవు
శత్రువు గుండెల గురిచూసిన ఎకె47 నీవు
నల్లరేగడి భూముల్లో ఎర్ర విత్తనాలు చల్లినావు
నక్సల్‌బరీని విస్తరించిన ఘనత నీది
విద్యార్థుల హక్కుల కోసం విప్లవమన్నావు
ఆదివాసులకు అండగా నిలిసి అమరుడయ్యావు
పెద్దపల్లి నుండి పశ్చిమ బెంగాల్‌కు నీ ప్రయాణం
రగల్ జెండాను నలుదిక్కులెగరేసినావు
విశ్రమించదు ఏనాటికి ఈ పోరాటం
నాగేటి సాళ్లల్లో అమరులు మీరు
నిరుపేద గుండెల్లో ఎర్రజెండాలు మీరు
పీడిత ప్రజలకు ముద్దుబిడ్డలు మీరు
రేపటి వసంతానికి స్వాగతం పలికేటి
ఆనందపు చుక్కలు మీరు
జోహార్లు మీకు జోహార్లు!

# మృత్యుంజయుడు

- కెనరీ

దశాబ్దాలుగా అమ్మ ప్రేమకు దూరమై
పసిపిల్లాడివలె అల్లాడిన యోధుడతడు
మట్టి మనుషుల సమస్త విషాదాల
మూలాలు అన్వేషిస్తూ
అమ్మకు వేకువను వాగ్దానం చేశాడు
మహత్తర మార్క్సిజం వెలుగును
నరనరాన నింపుకొన్న అతను
జీవితాంతం పీడిత ప్రజలను
అమితానందంతో ప్రేమించాడు.

ఉద్యమంలో ఒక జీవనదిలాగ
సుదీర్ఘకాలం ప్రవహించిన అతను
పేదల రాజ్యాధికారం కోసం
విప్లవమే శ్వాసగా బతికాడు
అపసవ్య పాలనను, విధ్వంసక అభివృద్ధిని గేలిచేస్తూ
లాల్‌గడ్, జంగల్‌మహల్‌ల్లో జంగ్ నడిపినందుకు
అతని శరీరమొక చిత్రహింసల కొలిమయ్యింది
ఛిద్రమైన అతని సున్నిత దేహం సాక్షిగా
పోటెత్తిన విప్లవ నినాదాల హోరుకి
అనంత నీలాకాశం అరుణారుణమైంది

యుద్ధంలో ఎదురుదెబ్బలెన్ని తిన్నా
వీరుల నెత్తురు ఏరులై పారినా
పచ్చని కలలు కనడం మానొద్దు
వెచ్చని కన్నీళ్ళు ఉప్పొంగ నీయొద్దు
దుఃఖం పూర్తిగా ఘనీభవించాలి
బాధలన్నీ బద్దలయ్యి ఉప్పెనయ్యే
సమయం కోసమే వేచి ఉండాలి!

# అసిధారా వాహిక

- చైతన్యప్రకాశ్

కోటానుకోట్ల ప్రజలు సంధించే
అనంతకోటి ప్రశ్నలు
భారత పార్లమెంటరీ సాయుధ
హింసోన్మాద ప్రహసనం

హత్యలు చేయడానికేనా
జన సంపద కాజేయడానికేనా
తమ సుఖమే తమ లాభమే అధికారం
పార్టీ సుఖమే తమ లాభమే అధికారం
పార్టీ ఏదైనా అధికారమేదైనా
జాతి సంపద కొల్లగొట్టడమే ఏక సూత్రం
దేశ భద్రతకు అంతర్గత ముప్పు పర్యాయం

నాగలికి కర్రు అయి
చూపుడు వేలుకు ప్రశ్నించే జెండాయై
దశాబ్దాలు దశాబ్దాలుగా
కల్లోల కరీంనగర్ మీదుగా
సిరిసిల్లా జగిత్యాల జెండానెత్తి
నడుస్తూ విత్తనాలు చల్లుతూ
శ్రీకాకుళం ఒడిశా చత్తీస్‌గఢ్
ఝార్ఖండ్ లాల్‌గఢ్
కలకత్తా కాలిక నాలిక రెడ్ కారిడార్
ఇంకా జనవేదనా అసిధారా వాహిక
దేశానికి కొత్తఢిల్లీ కాదు పెద్దపెల్లి

మనం చేజేతులా వేసిన ఓట్లే
మనం ఒళ్ళొంచి కట్టిన జైలు కలుగుల్లో
మనం పండించిన పంటనే తింటూ
మన వేతనాల పహారా మధ్య

మైనింగ్ దొంగలే దొరలై
ప్రసార సాధనాల్లో త్యాగధనులై
రాజ్యాంగాన్ని కాలరాసి
రాసుకున్న ఆదేశిక సూత్రాలను ఉల్లంఘించి
ప్రశ్నించిన వాళ్ళను చంపడం
నేడు ప్రజాస్వామ్య హుందా

మనల్ని మనం కాపాడుకుంటానికి
మాట్లాడరాదాయే
మనం నిర్మించిన జైల్లోకైనా
మనం పోరాదాయే
చట్ట మర్యాదలు ఎక్కడ దొర్కవాయే
జనవేదనెక్కడా ఎట్లా ప్రదర్శించరాదాయే
అంతర్గతంగా డిమోరలైజ్‌డ్ స్ట్రగుల్
ఏళ్ళకేళ్ళుగా ఎదురు కాల్పుల్లో
ఏకపక్ష మరణాలు
ప్రశ్నల్ని చంపడానికి జ్ఞానమక్కర్లేదు
అధికారముంటే చాలు ఆయుధముంటే చాలు
చావడానికైనా సిద్ధపడి ప్రశ్నించడం సాహసం
దశాబ్దాల కొద్ది జనశ్వాసగా మారడం
బోలెడు జ్ఞానం
తెలంగాణ నుంచి ఝుర్‌గావ్ దాకా
నిరంతర అధ్యయనం పుట్టెడు త్యాగం
సంచరిస్తూ సంచలిస్తూ
చల్లిన విత్తనాలు పెరిగే వృక్షాలు
కోటి ఆశల సుదీర్ఘ ఆకాంక్షలు
అంతమొందించిన చోటే
మొలచుకొస్తూ విశాల తపన

దవడలు పగలగొట్టి కాళ్ళు విరగ్గొట్టి
కండ్లు పీకి మెదడు పేల్చి
తమ ప్రజల్ని తామే చంపుతూ
ప్రజల మీద నీతి బాహ్యంగా యుద్ధం

వీరుని నెత్తుటిలో నిలబడి
అంతమైందని మురుస్తూ ఎగురుతూ
చప్పట్లు కొడ్తూ మీరు ఉత్సాహపడ్తుంటే
అది మరింత కొత్తగా మళ్ళీ మళ్ళీ
అక్కడే పుడ్తూ
మరింత ఉత్తేజంగా
ముందుకొస్తుంటుంది
వీరుడి చితాభస్మాన్ని
నెత్తిమీదెత్తుకొని
జనం దేశమంతా చల్లుతూ
తిరుగుతుంటారు

# మనసు పొరలను తొలగించి చూస్తే......

- మధురశ్రీ

విన్నపాలను బుట్టదాఖలా కానివ్వకు
మోస్తున్నకొద్దీ బరువెక్కే సమస్యల కాగితాలను
హృదయ అద్దంలో వీక్షించు నిజ ప్రతిబింబాల్లా జాలిగా
ఆపన్న హస్తం కోసం ఎదురు చూస్తుంటాయి
పరిష్కార మార్గాన్ని అన్వేషించు
దారి చూపించేందుకు
ఏ మైలు రాయి జాడైనా దొరక్కపోదు
గడ్డుకాలపు కోర్కెల తుపాను నుండి
ఒడ్డున పడేసే చుక్కాని వాటపు సహజ సంకేతాలు
మేనులో ప్రాణం పోసుకోక మానదు
ఆచరణలో పెట్టేందుకు ఒకింత సహకరించావా
కొన్ని జీవితాలు రేకుల్లా విచ్చుకొని
శాశ్వత సంతోషాలతో పరవశిస్తాయి.
మానవత్వం ఇంకా మిగిలే ఉందన్న
నమ్మకపు కనురెప్పలు విశాలమై
ఆనందభాష్పాల జడిలో మనిషి ఓలలాడుతాడు.
అవసరాలు తీరాక ప్రతిఫలాలను అందించడంలో
విలువలు క్షీణిస్తాయే తప్ప
వేయి కళ్ళతో నిరీక్షించే ఆశలు చిగురించవు.
వచ్చీరాని పదాలతో రాసిన వాక్యాల మధ్య
సంసార సముద్ర బాధల బాంఢాగారాలు సుడిగుండాలై తిరుగుతూ
అట్టడుగును తాకుతున్నాయో
సమర్పించే లేఖలే నిర్దేశిస్తుంటే
విచారణా నెపంతో కాలాన్ని నెట్టేయడం అసమర్ధతకు పరాకాష్టే
అలసత్వానికి చోటివ్వక కర్తవ్యానికి పూనితే
కష్టాల వాన తెరపిస్తుందేమో
మరోమారు పునరాలోచించండి
సమయానికి ఆదుకున్న ఏ గుండె అయినా
సమాజంలో మీరెదురు పడ్డప్పుడు
అంతరించిపోయేందుకు సిద్ధమైన దేహం ఎదుటే నిల్చి
సేవా నిరతికి కృతజ్ఞతతో చేతులు జోడిస్తాయి
ఆ శాశ్వత కీర్తి చాలు మీరు మరింత కాలమనడానికి

(నోట్:- అనంతపురం జిల్లాలో గత 4 సంవత్సరాలుగా 33,474 అర్జీలు ఫీడ్ అయితే నిజంగా పరిష్కారమైనవి ఏ కొద్ది శాతమో)

# పోరే మార్గం

- రాజేష్ లింగంపల్లి

మా తెలంగాణ
మాక్కావాలంటే
మాటలంటారు
మన్నెత్తి పోస్తారు
ఎదురించి
నిలబడితే
గుండెల్లో
గుండ్లు దింపుతారు
నెత్తుటేరులు పారిస్తారు...
నా తెలంగాణ కోసం
తలలెగిరిపోని
తల వంచేది లేదు
తలదించేది లేదు
పోరు చేస్తే
పోయేదేం లేదు
అయితే గియితే,
ప్రాణాలు తప్పా!
పోతే పోని
తెలంగాణ కోసం
పోరాడి పోయినా ఫర్లేదు...
తెగించి పోరాడేందుకే
పుట్టామని
తెలుసుకున్నారు
నా తెలంగాణ ప్రజలు...
ఇప్పుడు రాకపోతే
ఇంకెప్పుడు రాదనీ
సకల జనులు
సమయత్తమయ్యారు
చావో రేవో తేలేదాకా
సమ్మె విరమించేది
లేదని చాటిచెప్పిన
నా తెలంగాణ
నాలుగు కోట్ల
ప్రజలకు
ఉద్యమాభివందనాలు...



అందొక ముసలమ్మ.

అందరూ విడవకుండా తలో మాటా అంటుంటే లేచి కూర్చొని బలవంతంగా రెండు గుక్కల గంజినీళ్లు మింగి మళ్లీ వాలిపోయింది.

* * *

మంగ్లి క్యాంపుకు వచ్చి నెలరోజులవుతోంది. మధ్యలో కోసి ఓసారి పారిపోదామని ప్రస్తావించింది. కానీ మంగ్లి రానంది. తాను పారిపోతే కొడుకును చంపేస్తారంది. కోసి కూడా మంగ్లిని వదిలేసి పోలేక ఉండిపోయింది.

"పోనీ నువ్వు పో అత్తా నా కోసం నీకెందుకు తిప్పలు" అంటే "నిన్నిట్ల ఇడ్సిపెట్టి నేనెట్ల పోవాల్నే..." అన్నది.

తనను అత్యాచారం చేసినవాళ్లు రోజూ తన కళ్ల ముందే తిరుగుతుంటే, తనను చూసి ఎగతాళి చేస్తుంటే రక్తం ఉడికిపోతున్నా నిశ్శబ్దంగా కళ్లు దించుకునేది. అవమానాన్ని గొంతులో దిగమింగేది మంగ్లి.

రోజూ కొడుకును దొడ్డికి తీసుకుపోవడానికి బయటకు తెచ్చేవారు. అప్పుడు దూరం నుంచే చూసుకునేది. దగ్గరికి వెళ్లనిచ్చేవారు కాదు. దగ్గరికి వెళ్తే కొట్టి తోసేసే వాళ్లు. అయినా రోజూ వెళ్లే ప్రయత్నం చేసి దెబ్బలు తినేది. రోజూ ఠానాకు పోయి "నా కొడుకును ఇడిసి పెట్టన్రయ్యా... ఇడిసి పెడితే ఎక్కడికి పోం ఇక్కడ్నే ఉంటం " అని వేడుకునేది. ఒక్కో సారి కోపంతో బాగా తిట్టేది.

క్యాంపులోని ఎవ్వరితోనూ మాట్లాడేది కాదు. పిచ్చిదానిలా ఎటో చూస్తూ కూర్చునేది. ఎవరన్నా పలకరిస్తే ముక్తసరిగా జవాబిచ్చేది. కోసి వేళకింత తెచ్చి పెడితే బలవంతంగా తినేది.

"అత్తే లేకుంటే నన్నాదుకునేవారెవ్వరు?" అనుకునేదామె. కోసి పట్ల కృతజ్ఞతతో మనసు నిండిపోయేది. ఆమెకు ఒక్కోసారి అయోమయంగా తోచేది. తానెక్కడుందో అర్థమయ్యేది కాదు. తమ ఇల్లూ, వాకిలీ, గొడ్డూ, గోదా, అడవీ, వాగులూ, వంకలను వదిలేసి ఈ ఇరుకులో ఈ రొచ్చులో ఎందుకున్నాను అని అయోమయంలో పడేది. దట్టమైన అడవిలో క్రూర మృగాలు, విషసర్పాల నడుమ సైతం భయమన్నది లేకుండా వంటరిగా సంచరించే తను ఈ మనుషులను చూస్తే ఎందుకింత వణికిపోతున్నదో అర్థమయ్యేది కాదు. వాళ్ల చేతుల్లోని తుపాకులను చూస్తే మనసు ఉడికిపోయేదామెకు.

తరచూ కమ్లి... కమ్లి వంటి మరికొందరు గుర్తొచ్చేవారు. వాళ్ల భుజాలకు వేలాడే తుపాకులను ముచ్చటగా చూసేదెప్పుడూ. "ఇది ఫలానా ఆంబూష్‌లో దొరికింది " అంటే గర్వంగా తాకి చూసేది. ఆ తుపాకులు తమ కోసమేనని అనిపించేదామెకు.

సంవత్సరం క్రితం కమ్లి మాటలు విని కొడుకును దళంలకు పంపివుంటే ఇప్పుడు వానికీ నాకూ ఈ తిప్పలు ఉండేవి కాదు గదా అనుకునేది.

ఎట్టకేలకు మంగ్లి నిరీక్షణ ఫలించింది. సుక్కును వదిలేశారు. జీవచ్ఛవంలా తల్లి ఒడిన చేరాడు సుక్కు. ఏదోలా ప్రాణాలతో మిగిలాడు అదే చాలనుకుంది మంగ్లి. తన కన్నీళ్లతో కొడుకు గాయాలను కడిగింది. కదుములు కట్టిన చోట కాపడం పెట్టింది. రోజూ కోసి తెస్తే రెండు ముద్దలు బలవంతంగా మింగే మంగ్లి ఆ రోజు తనే పోయి అన్నం పట్టుకొచ్చింది. కొడుక్కు బలవంతంగా తినిపించింది. చీమల పులుసు గుర్తొచ్చిందామెకు. అదయితే ఇష్టంగా తినేవాడు. ప్చ్ కానీ ఎక్కడ తేగలదు. అదే తమ ఊర్లో అయితే ఇలా వెళ్లి అలా తేగల్గేది అనుకుంది.

* * *

"సుక్కూ, ఎట్లనో అట్ల అమ్మా నువ్వు తప్పిచ్చుకొని వచ్చిన్రు. మళ్లీ ఇప్పుడు వాళ్ల చేతిల బడ్డవంటే ఇగ బత్కనీయరు. అందుకని దళంల జేరితే మంచిది. అమ్మతోటి నేను మాట్లాడుత, తనొప్పుకుంటే సరే... లేకుంటే నువ్వు అమ్మ మాటను పక్కన బెట్టయినా సరే దళంల జేరితేనే మంచిది." అనునయంగా చెప్పసాగింది. కమ్లి ఓ చెట్టు కింద వేసిన పాలిథిన్లో కూర్చున్నారిద్దరూ. ఎండలు ఇప్పుడిప్పుడే ముదురుతున్నయి.

"లేదక్కా అమ్మను వదిలి నేను దళంల చేరలేనక్కా" తలవంచుకున్నాడు సుక్కు.

"అదేంది సుక్కూ దళంలకు వస్తనని ఇన్ని రోజులు పట్టుబట్టినవ్. ఇప్పుడేమయింది?"

"నేను లేకుంటే అమ్మ బతుకలేదని అర్థమైందక్కా... లేకుంటే నా కోసం ఆ నరకకూపంలోకి వచ్చేది కాదు. అన్ని తిప్పలు పడేది కాదు."

"నిజమే సుక్కూ, కానీ నువ్వక్కడ్నే వుంటవనుకొని నమ్మి వదిలేసిండ్రు... ఈసారి దొరికితే మీ ఇద్దరికీ ఇంతకంటే తిప్పలుంటయి. అమ్మను గూడ ఒప్పిద్దం నేను నచ్చజెప్త..."

"అమ్మ ఒప్పుకుంటే గూడ నేను రానక్కా... నేను వస్తే అమ్మనెవరు జూసుకుంటరు? జుడుం గూండాలు చాలా తిప్పలు పెట్టిన్రక్కా... ఇప్పుడు మునుపటి లెక్క పనిజేసే శక్తిగూడ లేదమ్మకు..."

"జుడుం ఇట్లనే కొనసాగితే అమ్మసువంటోల్లు ఎందరో బలైతరు సుక్కూ.. దీన్ని మనం ఆపాలె. ఆపాలంటే యుద్ధాన్ని తీవ్రం చేయడం తప్ప ఇంకో దారి లేదు. మరి నీ అసువంటోళ్లు భర్తీ కాకుంటే యుద్ధం ఎట్ల తీవ్రతరం అయితది... అమ్మనూ, అమ్మసువంటి ఎందర్నో ఇంత తిప్పలు పెడ్తున్నవాళ్లకు బుద్ధి జెప్పాల్నని, జుడుంను ఓడించాల్నని నీకు లేదా సుక్కూ?"

"బుద్ధి జెప్పుడు కాదక్కా ఒక్కొక్కన్ని ముక్కలు ముక్కలు జేయాల్నని ఉంది. ఇప్పట్నుంచి నన్ను అన్ని దాడులల్లకు తీస్కపోండ్రకా. ఎర్ర బోరుల... రాణిబోదిలల నరికి సంపినట్టు సంపాలనుంది నాగ్గాడ..."

"అటువంటి దాడులు చేయాలంటే మన ప్లటూన్లు, కంపెనీలు పెరగాలె... మరి నీ అసువంటి యువతీ యువకులు భర్తీ కాకుంటే ఎట్ల చెప్పు..."

"కానీ అమ్మకు దూరంగా వుండలేనక్కా. మిలీషియాల ఉంటే యుద్ధం చేయొచ్చు... అమ్మకు దగ్గరిగానూ ఉండొచ్చు...."

"కమ్లి ఎంత జెప్పినా సుక్కు ఇదే నిర్ణయం మీద నిలబడ్డాడు.

ఇంతలో దూరంగా మంగ్లి వస్తూ కనబడిరది. "అమ్మ వస్తుంది" అంటూ లేచి ఎదురెల్లింది కమ్లి. లాల్‌సలాం చేసి భుజం మీద చెయ్యేసి దగ్గరికి తీసుకుంది. మంగ్లికి కళ్లలో నీళ్లు తిరిగినయి. కమ్లికీ హృదయం ద్రవించింది. "ఎంత చురుగ్గా వుండేది. ఎట్లయిపోయింది అనుకుంది."

"బేలె మంతిన్ నానో(ఎలా ఉన్నావక్కా)"

"సమాధానంగా తలవూపింది మంగ్లి. అలాగే పాలిథిన్ వరకూ నడిపించుకుంటూ వెళ్లింది. "రా కూర్చుందాం" అంది.

"ఎట్ల కొంచెం నొప్పులు తగ్గినయా? నువ్వసలు ఎందుకు పోయినవక్కా. వాళ్లెంత దుర్మార్గులో మనం వింటలేమా ఆ రోజు నువ్వు పోంగనే మేం వూళ్లెకొచ్చినం. అయ్యో కొంచెం ముందు వస్తే నిన్నెట్లయినా ఆపేటోళ్లం అనుకున్నాం..."

"నేను పోకుంటే సుక్కును సంపుదురేమో కమ్లీ..."

"సమాధానంగా కమ్లి మౌనం వహించింది.

"పోనీలే ఎట్లనో అట్ల తప్పిచ్చుకొని వచ్చిన్రు..." అంది కాసేపటికి కమ్లి.

మళ్లీ తనే "ఎన్నో ఘోరాలు చేస్తున్నరక్కా. ఇండ్లు తగలబెడ్తున్రు... పంటలు తగుల బెడ్తున్రు... గొడ్డూ గోదను చంపుతున్రు ఎత్తుకబోతున్రు... కనబడ్డోల్లను చంపుతున్రు, లేకుంటే చిత్రహింసలు పెట్టి శిబిరాలల్ల పెడ్తున్రు... ఎస్.పి.ఒలుగా తయారు చేసి మన వేలుతోటే మన కంటినిపొడుస్తున్రు. ఇక ఆడవాళ్లు కనబడ్తే మృగాల్లెక్కనే పీక్కు తింటున్రు. ఈ బాధ నీ ఒక్కదానిదే కాదు. మనల్ని ఇన్ని తిప్పలు పెట్టిన సర్కార్‌నూ, జుడుం మూకనూ చరిత్ర ఎప్పటికీ క్షమించదు... ప్రజలూ, ఉద్యమం తప్పక బదులు తీర్చుకుంటుంది...

ఇప్పటికే అది మొదలైంది కూడా, ఇన్ని గోరాలను జేసిన జుడుం మూక మట్టికరవడం మొదలైంది. బీజాపూర్ తానా వంటిదే ఎర్రబోరు తానా దానిమీద దాడిచేసి 33 మందిని చంపినం అట్లనే రాణిబోదిలల 55 మందిని చంపినం అందులో మన ఆరుగురు కామ్రేడ్స్ ప్రాణత్యాగం చేసిండ్రు.ఇంకా చాలా దాడులు చేసినం. ఊర్లమీద దాడి చేస్తందుకు వచ్చే మూక మీద, దాడి చేసి పోతున్న మూక మీద చాలా చోట్ల ఆంబూష్‌లు చేసినం. జుడుం వాళ్లనెందరినో చంపేసినం.మన ప్రతిఘటన పెరిగింది. కాబట్టి ప్రస్తుతం జుడుం బాగా తగ్గుమొఖం పట్టింది. నీక్కూడా అర్థమయ్యే ఉంటది ఈపాటికి. మునుపటిలా వురుకులు పరుగులు లేవుగా..."

"శ్రద్ధగా వినసాగింది మంగ్లి. ఇన్నాళ్లుగా సలుపుతున్న గాయం కొంచెం ఉపశమించినట్టుగా అన్పించిందామెకు.

"కమ్లీ సుక్కును దళంలకు పంపమంటే నేనప్పుడు పంపలేదు... నేను తప్పు చేసిన, ఇప్పుడు తీస్కపో..." అంది స్థిరంగా.

ఆమెనెలా ఒప్పించాల్నా అని తలమునకలవుతున్న కమ్లికి ఒక్క క్షణం నోటి మాట రాలేదు. జీవితానుభవం నుంచి మంగ్లి పోరాటావసరాన్ని మరింతగా గుర్తించింది అనుకుంది. అంతే కాదు పెరుగుతున్న విప్లవ విజయాలు ప్రజల్ని మరింతగా విప్లవోన్ముఖులను చేస్తయ్ అనుకుంది.

"సుక్కు తోటి ఈ మాటే మాట్లాడిన్నక్కా కానీ ఈ స్థితిలో నిన్ను ఇడ్సిపెట్టి రానంటుండు..."

"అవునా వాన్ని పిలువు నేను మాట్లాడుతా..."

'వెంటనే కమ్లి సుక్కును కేకేసింది. సుక్కు వచ్చి కూసుండు.

"అప్పుడు నిన్ను దళంలకు తోలకపోవుడే నేను చేసిన పెద్ద తప్పు. ఇప్పుడు నేను సంతోషంగ పొమ్మంటున్న పోరా సుక్కూ..."

"అమ్మలో ఈ మార్పుకు సుక్కు ఆశ్చర్యపోయాడు. "నాకు తెల్సమ్మా. నన్నెందుకు దళంలకు పొమ్మంటున్నవో, నేనుంటే మల్లెక్కడ వాళ్ల చేతికి దొరుకుతనోనని నువ్వు బయపడుతున్నవు... కానీ నేను మల్లా దొరక్కుంట జాగర్తగా ఉంట... ఈ పరిస్థితిల నిన్ను ఇడిసిపెట్టి నేనెట్ల పోత" అన్నాడు.

"సుక్కూ నేనప్పుడు పొరపాటుగ ఆలోచించిన... నువ్వు నాకు అండగ ఉండాలనుకున్న. కానీ ఈ దొంగ సర్కార్ మన మీద పగ బట్టింది బిడ్డా... ఈ సర్కార్ నుంచి కాపాడుకోవాలంటే నాకు నీ ఒక్కని అండ సరిపోదురా... మన సైన్యం పెద్దగ్గావాలె. మరి నీ అసువంటోళ్లు జేరకుంటే మన సైన్యం ఎట్ల పెరుగుద్ది? నువ్వు మన సైన్యంల జేరితే నా ఒక్కదానికే కాదురా, నా అసువంటి ఎందరో అమ్మలకు అండగుంటవు... అందుకని కమ్లి జెప్పినట్టు నువ్వు బర్తీ కావాలె బిడ్డా... నువ్వు బర్తీ అయ్యి నీ అసువంటోళ్లను శానా మందిని తయారు జెయ్యాలె..."

"కానీ నువ్వొక్క దానివి ఎట్లుంటవమ్మా"

"మన జనతన సర్కార్ మంచిగ పనిచేసినప్పుడు నా అసంటి ఒంటరోళ్లకు అండగ నిలిచింది. కానీ ఈ జుడుం దాడిల మన సర్కార్ చెల్లాచెదురయిపోయే... మల్లా మన సర్కార్ నిలబడితే నా అసంటోల్లకు ఏ తిప్పలూ ఉండయి బిడ్డా. నీ అసంటోల్లు బర్తీ అయితేనే మన లడాయి ముందుకు పోతది. మల్లా మన సర్కార్ నిలబడ్తది. కాబట్టి ఇగ నాగురించి ఏమాలోచించకు నువ్వు... నా అసువంటి తిప్పలు ఇంకెవ్వరికి రావొద్దంటే జుడుం ఆగిపోవాలె. ఇసువంటి జుడుంలను నడుపుతున్న దొంగ సర్కార్ కూలిపోవాలె..."

"తల్లి కర్తవ్య బోధ కొడుకులోని విప్లవ సంకల్పాన్ని దృఢపరుస్తోంది.

* * *

(ఇది కథ కాదు. తమ భర్తలనూ, పిల్లలనూ జుడుం నుండి కాపాడుకోవడానికి ఎందరో బస్తర్ మహిళలు పొందిన చేదు అనుభవాలనూ, తమ గొంతులో జ్వలిస్తోన్న గరళాన్ని చల్లార్చుకోవడానికి కన్నబిడ్డలను ప్రజాసేనలోకి సాగనంపుతోన్న తల్లుల నిలువెత్తు త్యాగాలనూ అక్షరీకరించడానికి చేసిన చిరు ప్రయత్నం. జుడుంలో అతలాకుతలం అయిన సమస్త బస్తర్ ప్రజానీకానికి సంఘీభావంతో....)



కథ

# ఎఫ్‌డిఐ

- సుజాత

రోడ్డుపై వచ్చి పోయే వాహన మోతకు చెవులు గింగురుమంటున్నాయి. రోడ్ క్రాస్ చేయాలి అంటే తల ప్రాణం తోకకు వచ్చినంత పనైంది. జన సందోహం - ఎవరి పని వారిదే అన్నట్టుంది. వాహనాలంత స్పీడ్‌గా కాకపోయినా పరుగు నడకతో సిటీ బస్సులను అందుకుంటున్నారు. ఎక్కడకి వెళ్లాలన్నా బస్సు ఎక్కాల్సిందే. మనుషులతో కిక్కిరిసిన బస్సులో కూర్చోవాలంటేనే ఊపిరి ఆడనంత పని. ఏంటో ఈ పట్టణ జీవితాలు. ఒక్కసారి మా ఊరు గుర్తుకు వచ్చింది. ప్రశాంత వాతావరణం, పచ్చని చెట్లు, కాలిబాటలు, బండ్ల బాటలు. బండ్లబాటలకు అటు, ఇటు చింతచెట్లు, మామిడి చెట్లు, మడ్డిపూల చెట్లు, సుంకేశుల చెట్లు. అలా నడుస్తూ చిన్నప్పటి జ్ఞాపకం తట్టి లేపింది. సుంకేశుల చెట్ల పూలు ఎర్రగా ఉంటాయి. వాటిని కొన్ని ప్రాంతాలలో అగ్నిశిఖలు అంటారని విన్నాను. మడ్డిపూలు తెల్లగా ఉండి కాడ పొడవుగా ఉంటుంది. వీటిని ఏరుకొని ఆడుకునేవాళ్లం. రేగిపండ్లు, గోరింటాకు కోసుకుని ఇంటికి వెళ్లేవాళ్లం. "ఏం పిల్లలే మీరు, పని లేదు, పాటా లేదు. తిరిగి ఆ గడ్డిపూలు తెచ్చుకోవడం ఏంటి?" అంటూ కేకలేసేది అమ్మ.

రోజూ ఇంటి దగ్గరకి కూరగాయలు అమ్మ గంపలో కూరలు తెచ్చి అమ్మేది. గ్రామాల నుండి వచ్చే తాజా కూరగాయలు నిగనిగలాడుతూ ఉండేవి. వంట సామాను ఏవైనా - నూనె, ఉప్పు, పప్పు, చెక్కెర, చాయపత్తి లాంటివి అయిపోతే అమ్మ డబ్బులు ఇచ్చి గంగయ్య దుకాణానికి పంపేది. చిల్లర సామాను పట్టుకొని చిల్లర డబ్బులు మిగిలితే, చాక్‌లెట్ నోట్లో వేసుకుని చప్పరిస్తూ వచ్చేవాళ్లం. ఇవన్నీ గుర్తు చేసుకుంటూ రోడ్ పక్క నుండి నడుస్తున్నాను. ఎదుటి నుండి వచ్చే ఇద్దరు అమ్మాయిలు తొందర తొందరగా వెళుతూ నన్ను ఢీకొన్నారు. "ఏంటండి ఏమో ఆలోచిస్తూ వెళుతున్నారు. ఎక్కడన్నా యాక్సిడెంట్ అవ్వగల జాగ్రత్త" అన్నారు. తేరుకుని రోడ్ క్రాస్ చేసి ఒక చిన్నబాట నుండి కొంత దూరం వెళ్లాను. ప్రహరి గోడ, నడుమ ఒక గేటు, లోపలకి వెళితే ఒకవైపు పాలప్యాకెట్లు అమ్మే దుకాణం, దాని పక్కనే కూరగాయలు అమ్మే దుకాణం. ఈ మార్కెట్ నుండి ఒక ఫర్లాంగ్ దూరం వెళితే మా రూము. రిటైర్ అయిన ఒక టీచర్ ఇంట్లో పక్క గది అద్దెకు తీసుకుని నేను, నాతోపాటు కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తున్న నా స్నేహితురాలు అపర్ణ ఉంటున్నాం. దుకాణం ముందు ఆగాను. ఖాళీగా తాళం వేసి ఉంది.

"ఏమైంది ఈ దుకాణాలన్నీ తాళాలు వేశారు?" అడిగాను పక్కన దిగులుగా కూర్చున్న నడీడు మనిషిని.

"ఏముందమ్మా, చిల్లర వ్యాపారులంతా చేత చిప్ప పట్టుకోవల్సిందే" అన్నాడు.

"ఎందుకని?" అడిగాను.

"ఇక అన్నింట ఎఫ్‌డిఐ ప్రవేశించి మా పొట్టలు కొడుతుంది. ఇక మేము బజార్లో పడాల్సిందే".

"ఎఫ్‌డిఐ?"

"రిటైల్ వ్యాపారం మొత్తంగా బహుళజాతి కంపెనీలకు ధారాదత్తం చేశారు. మాలాంటి వాళ్లు అడుక్కుని తినాల్సిందే" అంటూ ఏడ్చినంత పని చేశాడు. నా మనస్సు చివుక్కుమన్నది.

అప్పుడే ఆటోలో దిగిన అపర్ణ, "ఏమైందే ఏదో ఆలోచిస్తున్నావు?" అంది.

"పాలపాకెట్, కూరగాయలు ఇక్కడ లేవే" అన్నాను.

"ఆ, అదా, ఈ రోజు బస్సులో వస్తుంటే చూశాను. చిల్లర వ్యాపారులంతా కలిసి గాంధీ చౌక్ దగ్గర ధర్నా చేశారు. చిల్లర వ్యాపారం చేసే మహిళలంతా కలిసి రిలయన్స్ కూరగాయలు బిల్డింగ్ ముందు నినాదాలు ఇస్తూ కాంప్లెక్స్ పైకి రాళ్లు విసిరారు. ఎంత కోపం, కసి వాళ్లలో కనిపించింది అనుకున్నావ్?" అంది.

"కాదు మరి, పాపం వాళ్లు ఎలా బతకాలే" అన్నాను.

"ఏముంది వాళ్లు మాల్ కాంప్లెక్స్‌లు కడుతున్నారుగా. వాటికి రాళ్లెత్తే కూలీలు కావాల్సిందే వీళ్లు. ప్రతీదీ ప్రైవేటీకరణ చేస్తున్నారు, అంతటా ఎఫ్‌డిఐ అంటే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతినిస్తోంది భారత ప్రభుత్వం" అంది.

"అబ్బా! విద్య, వైద్యం, గనులు, ఫ్యాక్టరీలు, రోడ్లు-రవాణా ఒకటేమిటి అన్నీ ప్రైవేటు వాళ్లకే. ఇవి చాలవన్నట్టు ఇప్పుడు చిల్లర వ్యాపారస్తులను కూడా బతుకునివ్వడం లేదు కదా?" అన్నాను.

"ఎందెందు వెతికిన అందందే కలరు ఎఫ్‌డిఐ వారు" అంది అపర్ణ.

"ఇక పదవే పోదాం. ఏది ఏమైనా కూరగాయలు, పాల పాకెట్ కొనాల్సిందే కదా" అనుకుంటూ ఇద్దరం బయలుదేరాం. పెద్ద మాల్. అన్ని రకాల దుకాణాలు కలిసి ఉండే పెద్ద కాంప్లెక్స్. అన్నీ మంచిగా ప్యాక్ చేసి ఉన్నవి. ధరలు మాత్రం మామూలు మధ్యతరగతి కొనలేరు అనిపిస్తుంది.

"అబ్బా! ఏం ధరలే, అంతా ఐస్‌లో పెట్టినవి తినాల్సి వస్తుంది" అన్నాను. అప్‌స్టయిర్‌లో కూడా దుకాణాలు, సినిమా హాల్సు వగైరాలు, వగైరాలు ఉన్నాయట.

"వెళ్లి చూద్దామా?" అంది అపర్ణ.

"అలాగే, చూద్దాం" అన్నాను.

మెట్లలాగా ఉన్నాయక్కడ పైకి వెళ్లడానికి. "వాటి మీద ఎక్కితే

అదే పైకి తీసుకెళుతుంది తిరుగుతూ" అంది అపర్ణ.

"లిఫ్టు చూశాను, కానీ ఇవేమో మెట్లలాగానే ఉన్నాయి. కానీ అంతా ఎలక్ట్రిసిటీతోనే నడుస్తున్నాయి కదా" అన్నాను.

మెట్ల మీద ఎక్కి పైకి వెళ్లాం. నాకు కొంత కళ్లు తిరిగినట్టు అయ్యింది.

"అలవాటు లేదు కదా, అందుకే అలా అయ్యింది" అంది అపర్ణ.

సినిమా హాలు పక్కనే మరొక హాలు. బయటి నుండి లోపలకి తొంగి చూశాం. రకరకాల లైట్లు వేస్తున్నారు. జిగేల్, జిగేల్‌మంటూ లైట్ ఫోకస్ హాలంతా అలముకుంటోంది. సినిమా పాటల మ్యూజిక్‌తో మారుమోగుతోంది.

"అబ్బా! నేను ఒక్క నిమిషం కూడా ఉండను, పోదాం పదా" అన్నాను.

అపర్ణ నవ్వి, "ఎలా తయారు అయ్యావే సెన్సిటివ్‌గా, పట్టణాలలో ఇదంతా మామూలే కదా, సరే పోదాం పద" అంది.

మళ్లీ ఆ కరెంట్ మెట్ల మీద నుండి కిందికి వచ్చాం.

"సిటి బస్సు కోసం వెళదాం" అంది అపర్ణ.

"చస్తే రాను, డబ్బులెక్కువైనా ఫర్వాలేదు, ఆటోరిక్షా ఎక్కుదాం" అన్నాను.

నా పరిస్థితి అర్థం చేసుకున్న అపర్ణ తిన్నగా రిక్షా మాట్లాడింది. కొద్దిగా మనస్సు కుదుటపడ్డట్టు అయ్యింది. మెల్లగా మా రూముకు చేరుకున్నాం. కాళ్లు, చేతులు కడుక్కుని కూర్చున్నాను. అపర్ణ వేడి, వేడి కాఫీ తీసుకొచ్చి ఇచ్చింది. కాఫీ తాగి పేపర్ తిరగేశాను. ఒక దగ్గర నా కళ్లు అలాగే ఆగిపోయాయి. పైన పెద్ద అక్షరాలతో ఎఫ్‌డిఐ, కింద పెద్ద బిల్డింగ్, దానిపై 'మాల్ మార్ట్' అని రాసి ఉంది. దాని కింద ఒక ఎలుక ఆకలితో కోపంగా మాల్ మార్ట్ వైపు చూస్తోంది. "ఎవరో కానీ ఆర్టిస్టు భలే ఐడియా, ఈ విదేశీ పెట్టబడులతో ఎలుకలు కూడా సంకటంలో పడ్డాయి" అనుకున్నా.

మా పనులు పూర్తి చేసుకుని పడుకున్నాం. అపర్ణ మాత్రం గాఢనిద్రలోకి జారుకున్నది. నాకు మాత్రం వెంటనే నిద్ర పట్టడం లేదు. అటు, ఇటు దొర్లుతూ నిద్రలోకి జారుకున్నాను. అంతా కలత నిద్ర.

ఎలుకలు గుంపులు, గుంపులుగా అటూ, ఇటూ తిరుగుతున్నాయి.

"ముందు కిరాణా దుకాణంలో ఏవో టమాట, సొర, బీర లాంటి కాయలు, ఏవో పళ్లు దొరికేవి. పాపం ఆ కూరగాయల యజమానులు వాళ్ల వస్తువులకు నష్టం జరిగినా, 'ఈ ఎలకలు పాడుగాను' అనుకునేవాళ్లే తప్ప, మనల్ని మాత్రం తిండిలేక ఏనాడూ చంపలేదు" అంది ఓ ఎలుక.

"ఇప్పుడేమో ఆ చిల్లర దుకాణాలన్నిటినీ మింగేశాయి ఈ బయటి పెట్టుబడులు. ఎక్కడికి వెళ్లినా ఖాళీ దుకాణాలే. ఇక్కడి నుండి మాల్ మార్ట్‌కు వెళ్లితే పెద్ద, పెద్ద షెడ్‌లు, చీమలు కూడా దూరనంత ప్యాకేజీలు. పప్పు, బియ్యం ఇతర వస్తువులలో క్రిమి సంహారక మందులు కలుపుతున్నారు" అంది ఇంకో ఎలుక.

అవి అలా మాట్లాడుకుంటూ తమ బాధను వెళ్లబోసుకుంటున్నాయి.

"మన పరిస్థితే ఇలా ఉంది, ఆ నిల్వ కూరగాయలు, మందులు కలిపిన తిండిగింజలు తిని ఈ మానవులు ఎలా బతకగలుగుతున్నారో" అందో చిట్టి ఎలుక.

"ఏముంది దీర్ఘకాల జబ్బులు, అకాల మరణాలు" అన్నది ఇంకో వృద్ధ ఎలుక.

"సరే నేస్తమా, మన పరిస్థితి ఏమిటి? ఆకలితో నకనకలాడుతుంది, ఏం చేద్దాం?"

"మన ఆకలి అటు ఉంచు, ఎక్కడో ఉన్నోని తోటకు వెళదాం. అక్కడ ఏ కాయో, కసరో తిందాం."

"అక్కడ కాపలావాడు ఉంటాడుగా."

"వాడి కన్ను కప్పుదాం"

"అబ్బా, నీకు తెల్వదా? వాళ్లు పళ్ల తోటలకు పురుగు పట్టకుండా క్రిమిసంహారక మందులు కొట్టారు. ఈ క్రిమి సంహారక మందులు కూడా బహుళ జాతి కంపెనీలవట. అయ్యో రామ, ఈ బహుళ జాతి కంపెనీలు మనను ఎక్కడా వదలడం లేదే"

"సరే, ఒక్కటే మార్గం, అటు చూశావా, ఆ రోడ్డుపై చిల్లర వ్యాపారస్తులు అంతా కలిపి ఊరేగింపుగా నినాదాలు ఇస్తూ వెళుతున్నారు. చూడు, చూడు ఆ మహిళ ఎంత కోపంగా మాల్ మార్ట్‌పై రాయి విసురుతున్నదో, మనం కూడా వాళ్లతో కలుద్దాం"

"ఆ మహిళకైతే చేతులు ఉన్నాయి రాళ్లతో కొట్టడానికి, మనం అలా చేయలేం గానీ, ఆ కంపెనీ వాళ్ల ఇంట్లో దూరిపోయి ఆ బడా పెట్టుబడిదారుడు పండుకున్నప్పుడు వాడి చెవులు, ముక్కులు కొరుకుదాం. వాడికి చిర్రెత్తేలా వాడి ఒంటి మీద నాట్యం చేద్దాం"

"అవునవును, వాడిని అలాగే చేద్దాం, మన ఎలకలందరికీ కబురు పంపిద్దాం!"

ఎలకలన్నీ మహా ఆనందంగా వున్నాయి - బహుళ జాతి కంపెనీలపై, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులపై తమ నిరసనను, కోపాన్నీ, కసినీ ప్రదర్శిద్దాం అనుకున్నందుకు.

ఎలకలు ఎంత బాగా ఆలోచించాయి అనుకుంటూ ఉండగా నాకు మెలకువ వచ్చింది. ఏంటో పిచ్చి కల అనుకున్నాను. ఉదయం లేవగానే అపర్ణతో కల గురించి చెప్పాను. ఒకటే పడీ, పడీ నవ్వింది.

"ఇంతకీ ఎలకలతో కూడా నిరసన ప్రదర్శన చేయించావన్నమాట. నీ కల గురించి ఈ రోజు మన కాలేజీలో కొలీగ్స్‌కి చెబితే పడీ, పడీ నవ్వుతారు కదా" అంటూ మళ్లీ నవ్వడం ప్రారంభించింది.

"నవ్వడం కాదే, మనం కూడా ఏదో ఒకటి చేయాలి. రాయెత్తిన మహిళలాగా పిడికిలి బిగించాలి. వాళ్లందరితో మనం అందరం కూడా చేయి కలపాలి" అన్నాను కొంచెం సీరియస్‌గా.

అపర్ణ "యస్, యూ ఆర్ రైట్" అంటూ నాతో గొంతు కలిపింది.



కథ

# మంత్రాలకి చింతకాయలు!

- బి. అనూరాధ

సాయంత్రం 5 గంటల సమయం. ఎత్తైన జైలుగోడల మీద వరుసగా జంటలు జంటలుగా కూర్చున్న పక్షులు. కిచకిచమని ముక్కులు రాసుకుంటూ ఏం కబుర్లు చెప్పుకుంటున్నాయో కానీ... చూడడానికి మాత్రం ఆ దృశ్యం మనోహరంగా ఉంది. ఉదయం పూట పావురాలు, సాయంకాలం పూట గోరింకలు జైలుకి నిత్యం వచ్చే అతిథులు. మా స్వేచ్ఛలేని తనాన్ని గుర్తు చేయడానికే రోజూ వచ్చిపోతాయా అని అసూయ కలుగుతుంటుంది.

జైలు లోపలి జైలులో ఉంటుంది మహిళా బ్యారక్. మగాళ్ళు మాత్రం (హై సెక్యూరిటీ సెల్స్‌లో ఉండేవాళ్ళని మినహాయించి) జైలు ఆవరణమంతా స్వేచ్ఛగా తిరుగుతుంటారు. మహిళలు మాత్రం బ్యారక్‌కే పరిమితం. వార్డు నుంచి గేటు వరకూ ఇంగ్లీషు అక్షరం 'ఎల్' షేపులో ఉన్న సిమెంట్ చప్టా మీద రోజు ఈ ట్రెంకి అందరూ గుంపులు గుంపులుగా కూర్చుని ముచ్చట్లాడుతుంటారు. కొంత మందిమి ఆ చిన్ని జాగాలోనే వాకింగ్ చేస్తుంటాం.

బ్రిటిష్ హయాంనాటి పురాతన భవనం. ఎడమవైపు ఖాళీ ప్రదేశంలో మరొక కొత్త భవనం నిర్మాణంలో ఉంది. కుడివైపు నాలుగు పడకలున్న చిన్న ఆసుపత్రి, దాని వెనుక ఒక్క గదిలో పిల్లల స్కూలు. వార్డుల వెనుక ఆవరణలో ఎడమవైపు బాత్రూమ్‌లు. కుడివైపు బావి. మధ్యలో ఒక పాడు బడిన చిన్నగది. కొంత భాగంలో కూరగాయ మొక్కలు. మొత్తం ఇదే ప్రపంచం. ఇంకొద్ది సమయం మాత్రమే ఈ మాత్రం స్వేచ్ఛ. మరికొంత సేపటిలో వార్డులోకి పంపి తాళం వెయ్యడానికి జమ్మేదార్ వచ్చేస్తాడు.

"మనం కూడా ఈ పక్షుల్లా ఎగిరిపోగలిగితే ఎంత బాగుణ్ణు!" అంది రీలామాల. రీలామాల అంటే సంథాలీలో పచ్చదనం అని అర్థం అట. ఎంత అందమైన పేరు. ఝార్ఖండ్‌లో మనుషుల్లాగే పేర్లు కూడా ప్రకృతికి దగ్గర.

చిన్న చిన్నటి నల్లని పక్షులు రివ్వున మా తలలు మీద నుంచి దూసుకుపోయి వార్డులో చొరబడ్డాయి. వార్డులో కరెంట్ లేదు. బహుశా చీకట్లో తమ గూడును వెతుక్కోవడానికి కావచ్చు.

"ఆఁ కొత్త బందీలొస్తున్నారు!" హఠాత్తుగా అంది బుధీని. "గేటు చప్పుడు కూడా కాలేదు. నీకెలా తెలుసు వస్తున్నారని?" రీలామాల అడిగింది. "పక్షులు అట్లా రివ్వున లోపలికి పోయిననాడు కచ్చితంగా కొత్త బందీలొస్తారు" ఆమె జవాబుకి నేనూ రీలామాలా ఇద్దరం నవ్వాం.

"పక్షులు రోజూ లోపలికి పోతూనే ఉంటాయి. జైలన్నాక బందీలు రాకుండా ఉంటారా? ఏంటీ!" అన్నాన్నేను. బుధిని నాతో ఏమాత్రం ఏకీభవించలేకపోయింది. అప్పటివరకూ మౌనంగా మా సంభాషణ వింటున్న గీత మాతో పాటే నడుస్తూ "పక్షుల గురించి నేను చెప్పలేను కానీ - గాయత్రి సంఘం వాళ్ళు వచ్చి భజన చేసి పూజ చేస్తారు చూడు. అప్పుడు మాత్రం కచ్చితంగా వస్తారు" అంది. "వాళ్ళు నెలకోసారే వస్తారు కదా!" ఆశ్చర్యంగా అన్నా.

"హాఁ దీదీ గొంతు కొంచెం చిన్నగా చేసి వాళ్ళని జైలు అధికారులే రప్పించి పూజలు చేయిస్తారు. ఇంకా ఇంకా బందీలు రావాలని" రహస్యం చెప్తున్నట్టు అంది. 'మన సంఖ్య పెరిగితే వాళ్ళకేం లాభం? పైగా ఖర్చు కూడానూ!' అన్నాను. పిచ్చిదానా అన్నట్టు నా వైపు కొంచెం జాలిగా చూసి - "నువ్వు మరీ అమాయకురాలివి దీ! మనం వస్తే వాళ్ళకి ఆదాయం. లేకపోతే కొత్త బందీ వస్తే 'ఆమద్' వచ్చింది అని ఎందుకు అంటారు?"

"ఆమద్ అంటే?" ఈసారి భాషా సమస్య వల్ల రీలా వైపు తిరిగాను. "ఆమద్ అంటే ఆస్తి - ఆమ్‌దాని అంటారు కదా. ఆమ్‌దాని అంటే ఆదాయం." ఆమ్‌దాని ఇచ్చేది ఆమద్" అన్నది. అదంతా తాను హిందీలోనే వివరించింది. ఈసారి నిజంగానే ఆశ్చర్యం కలిగింది. బందీలను ఆమద్ అంటారని తెలిసిన దానికి ఈ అర్థం అని నాకూ తెలీనే తెలీదు. ఈ కొత్త 'జ్ఞానం' కలిగించిన ఆశ్చర్యం నుంచి కోలుకోకముందే జమ్మేదార్ వచ్చేశాడనడానికి సంకేతంగా గేటుకున్న గంట ఘల్లుమని మోగింది. ఎంత ఊహించిందే అయినా తుళ్ళిపడ్డాను ఆ శబ్దానికి. అంతా కలకలం మొదలయింది.

'ఛలో! ఛలో! అందరూ లోపలికి నడవండి' అంటూ గదమాయిస్తూ తిరగసాగింది. జమ్మేదారిణి, కొంతమంది కూర్చున్న దగ్గర నుంచి లేవడానికి ఇష్టం లేక బలవంతంగా లేస్తున్నారు. ఛలో... ఛలో..." అని లాఠీ పట్టుకుని అదిలించడం మొదలు పెట్టింది.

"ఏయ్! దీదీ నీక్కాని ఉద్యోగం ఊడిందనుకో నువ్వు మందులు కాసేపని చేసుకుని బతికెయ్యొచ్చు" ఆ పని నువ్వు బాగా చెయ్యగలవు!" ఎడమ అరిచేతిలో ఖైనీ (పొగాకు)ని కుడి బొటనవేలితో నలుపుతూ అంది ఓ శిక్ష పడిన ఖైదీ!

"నీకెప్పుడూ నా ఉద్యోగం ఊడగొట్టాలనే దుగ్ధ" నవ్వుతూ ఓ మొట్టికాయ వేసింది జమ్మేదారిణి.

"వెంటనే అందుకుంటూ" అప్పుడు నువ్వు అడవిలో మేకలు తోలుకోవడానికి పోయినప్పుడు నన్ను పట్టుకొచ్చినట్టే నిన్నూ మావోయిస్టువని చెప్పి జైల్లో తోస్తారు చూడు!" అంది ఫూల్ముని అందరూ నవ్వారు.

పూల్‌మునిని నిజంగానే అడవిలో మేకలు మేపుతుండగా ఇప్పుడే విచారణ జరిపి పంపుతాం ఒక్కసారి ఠాణకి పద! అంటూ ఇంటికి కూడా పోనీకుండా కూంబింగ్ పోలీసులు పట్టుకెళ్ళి నాలుగు రోజులు ఠాణాలో ఉంచి జైలుకి పంపారు. మూడేళ్ళయిపోయింది. "నా మేకలు ఇంటికి పోయినయ్యో లేదో" అని దిగాలుగా తలుచుకుంటూ ఉంటుంది.

బయట గేటు తాళం తెరిచిన చప్పుడవ్వడంతో ఇంక తప్పక అయిష్టంగా అచ్చంగా సాయంత్రం పూట పందుల్నో, మేకల్నో తోలితే లోపలికి పోయినట్టే అందరూ కొట్టాం లాంటి వార్డులోకి నడిచాము! కొందరు పడమర దిక్కు కేసి చూసి సూర్యుడికని కాబోలు ఓ నమస్కారం పెట్టి లోపలికి పోతూ దర్వాజాకి మొక్కి లోపలికి వెళ్తున్నారు. అలా దర్వాజాకు ఎందుకు మొక్కుతారో ఎప్పుడైనా అడగాలి అనుకుంటూ నేనూ లోపలికి నడిచాను.

రెండు భాగాలుగా చేసిన పెద్ద హాలు. మూడు వార్డుల్లోనూ ఇదే పెద్దది. ఒక్కో భాగంలో రెండేసి వరుసల్లో ఉన్న బిచాణాలు. నాకు కేటాయించిన స్థలంలోకి పోయి బిచాణా పరుచుకుని కూర్చున్నాను. గోలగోలగా అందరూ తమ తమ స్థలాల్లో సర్దుకొంటున్నారు. పహారా వచ్చి "ఏహేయ్! అందరూ కూర్చుండెహె!" అని గదమాయించింది.

టక్‌టక్ మని బూట్ల చప్పుడు విని ఇంకా పూర్తిగా బిస్తర్లు పరుచుకోని వాళ్ళు కూడా ఠక్కున కూర్చుండిపోయారు. జమ్మేదార్ వచ్చి శాల్తీలు లెక్కబెట్టుకుని వెళ్తూ పహరా వైపు తిరిగి 'డెబ్భైనాలుగు!' అన్నాడు. ఆమె 'జీ! సాబ్' అని తలూపింది. గిన్తీ అయిపోయింది. దర్వాజా మూసి తాళం బిగించి ఒకసారి లాగి చూసి రెండో నెంబర్ వార్డు వైపు వెళ్ళాడు. ఒక్కసారిగా అంతా గోలగోలగా మాట్లాడుకోవడం మొదలుపెట్టారు.

వెంటనే టి.వి. ఆన్ చేసిందొకామె. ఆ గోలలో వినబడదు కాబట్టి ఫుల్ సౌండ్ పెట్టింది. చేపల మార్కెట్లు, రైల్వే స్టేషన్లు ఈ వార్డు ముందు బలాదూర్.

నేను నా ఐదున్నర అడుగుల బిచాణా మీద బాసింబట్టు వేస్కుని కూర్చుని పుస్తకం తీశాను. ఈ గోలని భరించడం చాలా కష్టమైన పని. పుస్తక ప్రపంచంలో దూకి మనసు చెవులు మూసేసుకొంటే ఈ గోల మాయమవుతుంది. పుస్తకం తీశానో లేదో పహార సోమ్రి వచ్చింది. ఆమె ఒక శిక్షపడిన ఖైదీ. పదహారేళ్ళ నుంచీ జైలులో ఉంది. చేతులు తిప్పుతూ సంథాలీ కలగలసిన ఒక లాంటి హిందీలో ఏదో చెప్పడం మొదలుపెట్టింది. ఆమె హిందీని నేను అర్థం చేసుకోవడం కష్టం కనుక రీలామాలని పిలిచాను అనువాదం కోసం.

సోమ్రి చెప్పిన విషయం శ్రద్ధగా విని నా వైపు నవ్వుతూ చూసి "దీదీ! సోమ్రికి అన్నం తినగానే వెంటనే దొడ్డికి పోవాల్సి వస్తుందట. అలా ఎందుకవుతుంది, కాకూడదు కదా అంటోంది" అన్నది రీలామాల.

"అన్నం అరగడం లేదనుకొంట. కడుపునొప్పి కూడా ఉందా?" అని అడుగుతుండగానే మధ్యలో కల్పించుకుని నా మొహం మీద చేతులాడిస్తూ రహస్యం చెప్తున్నట్టుగా అన్నది.... "తెలుసా? నేను అన్నం తింటున్నపుడు నాకేసే చూస్తుంది. అప్పుడే అనుకున్నాను. నాకు దిష్టి తగులుద్దని" అంది. ఈసారి సగం సగం అర్థం అయింది నాకు.

'ఎవరు చూశారు?' అన్నాను నవ్వుతూ. సోమ్రి నవ్వలేదు. 'మజాక్ (హాస్యం) కాదు. నిజంగానే! ఆ కొత్తగా వచ్చిందే కమిలి... అదే!" (పేరుతో పాటే ఒక బూతుమాట కలిపి) అంది. ఆమె డాయన్ (మంత్రగత్తె) తెలుసా? అంది. ఒక అరగంట పాటు అలానే బుర్ర తిన్న తర్వాత పెద్దపెద్దగా అరుచుకుంటున్న గుంపు వ్యవహారం కనుక్కోడానికి వెళ్ళగానే హమ్మయ్య అనుకున్నాం.

"ఇక్కడ అంధ విశ్వాసాలు చాలా ఎక్కువ. ప్రతి విషయానికీ వెనుక అలాంటి కారణాల్నే నమ్ముతుంటారు. నీకు ఆశ్చర్యంగా ఉండి ఉంటది కదా?" అని నవ్వింది రీలామాల.

"దానికన్నా నాకు ఆశ్చర్యం కలిగించే విషయం నువ్వు! ఇదే రాష్ట్రంలో ఇంతకన్నా వెనుకబడ్డ గ్రామంలో పుట్టిపెరిగి ఇలాంటివేమీ నమ్మని విప్లవకారిణివి ఎట్లా అయ్యావా? అని."

"నిజమే! నేను పార్టీలోనే చదువుకొన్నాను. అంధ విశ్వాసాల మీద నిత్యం చర్చ, ప్రచారం జరుగుతుంటది. ముఖ్యంగా సాంస్కృతిక టీమ్‌లకి అయితే అదే ముఖ్యమైన పని. అంత తొందరగా ఏం పోలేదనుకో. మెల్లమెల్లగా అర్థం చేసుకోగలిగాను. ముఖ్యంగా నాది రెండోతరం అవ్వడం వల్ల కూడా కావచ్చు. నాన్న కిసాన్ కమిటీ నాయకుడు. అమ్మ మహిళా సంఘం కార్యకర్త. నేను చిన్నప్పటి నుంచీ ఈ రాజకీయ వాతావరణంలోనే పెరగడం వల్ల కూడా నాకు కొంత తేలికయింది. ఇప్పటికీ చాలా మంది కొత్తగా వచ్చినవాళ్ళు అంత ఎక్కువకాలం కాని వాళ్ళు కొన్ని కొన్ని నమ్ముతుంటారు. నేను...!" తన మాటలు పూర్తికాకముందే గోలగోలగా కొట్లాడుకుంటున్న గుంపులోంచి పెద్ద పెట్టున ఏడుపులు వినిపించాయి. మా ఇద్దరి మాటలు ఒకరికొకరికి వినిపించనంత గోలలో తలపట్టుకొని కూర్చున్నా. సంగతేంటో కనుక్కొందామని రీలామాల లేచి గుంపు దగ్గరికి వెళ్ళింది.

ఇంతలో బసంతి పెద్దపెద్దగా అరుచుకుంటూ వస్తుంటే సంగతేంటని అడిగింది. "ఆ లం.... బొడ్డున పెట్టుకొని దినాం తిరుగుతుంటే అక్కడ్నే ఉంటాయేటి?" అంది. మొత్తంగా ఆమె బూతు పురాణంతో చెప్పిన విషయం ఏమంటే - కమిలి రూ. 500 నోటు బొడ్డున దోపుకొనింది. అది కాస్తా ఇప్పుడు చూస్తే లేదు. ఎవరైనా కొట్టేస్తారనే భయంతో బొడ్డున దోపుకుంది. అస్తమానం తిసి చూసుకుంటూనే ఉందట. అది కాస్తా ఎక్కడ జారిపోయిందో కానీ పోయింది.

అందరూ తలోమాటా అంటున్నారు. కమిలి ఏడ్చుకొంటూ వార్డంతా తిరుగుతూ "ఓయ్ దీదీ ఎవురున్నా తీసింటే వాపసు ఇచ్చేయండి. నేనెవ్వరినీ దొంగ అన! మీ కాల్మొక్త పేద్దాన్ని నా డబ్బులు నాకిచ్చేయండి! అంటూ పాపం తిరిగి తిరిగి మళ్ళీ తన

చోటులోని కెళ్ళి కూర్చుని ఏడవడం మొదలుపెట్టింది.

ఒకరెవరో ఆమెకు గొప్పసలహా ఇచ్చారు. 'తెచ్చిచ్చిన వాళ్ళకి రూ. 50/- ఇస్తానని చెప్పు! అని మళ్ళీ ఆ ప్రతిపాదన పట్టుకుని కమిటీ వార్డంతా తిరిగింది. కొంచెం దాదాగిరి చెలాయించే రింకూ ఇదే అదనని సాయంత్రం కమిలికి దగ్గరలో ఎవరెవరు కూర్చున్నారో విచారణ ప్రారంభించి దమ్కీలివ్వడం మొదలుపెట్టింది. పొరపాట్న ఎవరైనా పట్టుబడితే సగం డబ్బు ప్రతిఫలంగా కొట్టేద్దామన్న ఆలోచన కావచ్చు. అలాంటి వాటిల్లో ఆమెకు చాలా అనుభవం ఉంది.

అయితే మేమెవ్వరమూ ఊహించనిది జరిగిందప్పుడే. కమిలి ఏడ్చి ఏడ్చి కళ్ళు తుడుచుకొంది. జుట్టు ముడివిడిపోయి జట్టు చెదిరి భుజమంతా పరుచుకుంది. ఎర్రబారిన కళ్ళతో వార్డంతా చూస్తో ఖంగుమన్న కంఠస్వరంతో 'అందరూ వినండో!' అని గట్టిగా అరిచింది. నెమ్మదిగా వార్డు నిశ్శబ్దమైపోయింది.

'మీ అందరికీ తెలిసే ఉంటది. నేను భక్తిన్''ని (మంత్రతంత్రాలు చేసే మగవాళ్ళని ఓఝా అని, ఆడవాళ్ళని భక్తిన్ అని అంటారు). ఈ ఒక్కరాత్రి మీకు సమయమిస్తున్నా. ఉదయానికంతా నా పైసలు యాడనించి తీసి(నో) ఆడనే పెట్టండి. రాత్రికి నేను "జాడ్ ఫూక్" (మంత్రం) జేస్తా. వాపసు ఇవ్వకున్నారో రేపటికంతా రక్తం కక్కుకొని ఛస్తారు!" అని జుట్టు ఝూడించి ముడేసింది. కాళ్ళు చేతులు కడుక్కుని వచ్చి తన బిస్తర్ పక్కనే గోడకి కుంకుమ పెట్టింది. ఆ తర్వాత కళ్ళు మూసుకుని ఏదో గొణగసాగింది. కొంచెం సేపటికి కళ్ళు తెరచి "నాకు తెలుసు నా పైసలు ఉదయం దొరుకుతాయి" అంది.

ఒక్కసారిగా మళ్ళీ అంతా కలకలం. అందరూ తలోరకంగా మాట్లాడుకోవడం మొదలుపెట్టారు. జాడ్‌ఫూక్‌తో ఎవరెవరు ఎక్కడెక్కడ ఎట్లా చచ్చిపోయిందీ కథ కథలుగా చెప్పుకోసాగారు.

ఇక ఈ రోజు లాభం లేదనుకుంటూ చదవడానికి తీసిన పుస్తకం లోపల పెట్టేసి రీలమాలతో బాతాఖానీలో పడ్డాను. అప్రయత్నంగా మా చర్చకూడా మూఢవిశ్వాసాల మీదకే పోయింది. ఫిలిప్పీన్స్ కమ్యూనిస్టు పార్టీ సాయుధ దళాలను ఏర్పరచిన కొత్తలో సి.ఐ.ఏ. అక్కడి ప్రజల మూఢవిశ్వాసాలను ఆసరాగా తీస్కొని ఎట్లా దళాన్ని అంతం చేసి నష్టం కలిగించిందో చదివినది గుర్తుకొచ్చి రీలామాలకు చెప్పాను.

"అలా ఎలా చేయగలిగింది?" ఆసక్తిగా అడిగింది రీలామాల.

"మొదలు ఆ ప్రాంతం అంతా వల్చర్ తిరుగుతున్నట్టు పుకార్లు పుట్టించారు." "వల్చర్ అంటే?" అడిగింది తను.

నిజానికి వల్చర్‌ని వచ్చీరాని హిందీలో అర్థం చేయించడం నాకు కొంచెం కష్టమే అయింది. అయినా ఎలాగో చెప్పా. "చైనాలో డ్రాగన్‌లాగా వల్చర్ కూడా కాల్పనికమే. అయితే ఇది పక్షి. మెడ కొరికి రక్తం తాగుతుందని విశ్వాసం.' ఆ తర్వాత ఒక రోజు దళం అడవి పొలిమేర దాటుతుండగా ఆఖరి వ్యక్తిపై ఆకస్మికంగా దాడిచేసి అరవకుండా నోరు నొక్కేసి ఈడ్చుకుపోయారట. తర్వాత అతని మెటమీద కన్ను పొడిచి చెట్టుకి తలకిందులుగా వేలాడదీశారు. ఉదయానికి రక్తమంతా పోయిన తరువాత అతని శవాన్ని దించి గ్రామ పొలిమేర్లలో విసిరేశారట."

"అబ్బా! ఎంత క్రూరత్వం" అంది రీలామాల నొసలు చిట్లించి. అంత అంధవిశ్వాసాలున్నచోట ఏం జరిగి ఉంటుందో ఊహించు" అన్నాను.

తను కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయింది.

"ఇంత అంధ విశ్వాసాలున్నచోట మరి మీరెలా పనిచేస్తారు? ఇక్కడ పార్టీకి కూడా సమస్యలు వచ్చి ఉంటాయి కదా!" అన్నాను.

"కొత్త కొత్తలో ఎలాంటి సమస్యలు వచ్చాయో నాకు తెలీదు కానీ, ఇప్పుడు ఉద్యమం బలోపేతం అయింది. సాంస్కృతిక కార్యక్రమాల ద్వారా చాలా ప్రచారం చేస్తుంటాం. ఇప్పుడు అంధ విశ్వాసాలు పూర్తిగా అంతరించి పోకపోయినా ప్రజల మద్దతుతో పార్టీ పరిస్థితిని తనకు అనుకూలంగా మార్చుకోగలుగుతుంది. ఎందుకంటే ఇక్కడ రాజ్యాంగయంత్రాంగంలో ఉన్నవాళ్ళు కూడా అంతే అంధవిశ్వాసాలతో ఉంటారు కదా!

ఒకసారి శిబుసోరేన్ ని ఇంటర్వ్యూ చేస్తూ ఒక విలేఖరి రాజకీయ అస్థిరత గురించి ప్రశ్నిస్తూ మీరు అధికారంలోకి వస్తే ఈ సమస్య గురించి ఏం చేస్తారు? అని అడిగాడు. ఆయన జవాబు ఏంటో తెలుసా? అసెంబ్లీ భవనంలో వాస్తుదోషం ఉంది. ఆ భవనంలో మార్పులూ చేర్పులూ చేస్తానన్నాడు. మరి అధికారంలోకి రావడానికి ఏం చేస్తారు? అంటే శాంతి పూజలు జరిపిస్తానన్నాడు. ఝార్ఖండ్ ప్రజలని ప్రగతి పథంలోకి తీసుకుపోతాననే ఒక పెద్ద రాజకీయపార్టీ 'ఝార్ఖండ్ ముక్తి మోర్చా' నాయకుడి అభిప్రాయాలివి!"

నిజమే! ఆ ఇంటర్వ్యూ నేనూ చదివాను. ఇంతకీ పార్టీ అనుభవం..." నా ప్రశ్న పూర్తికాకముందే రీలమాల అందుకుంటూ ఒకసారి ఏం జరిగిందో తెలుసా?... అంటూ బహుశా ఆ ఘటన తలుచుకొని కావచ్చు పకా పకా నవ్వింది. నేను ఆమె ముఖం కేసే ఆసక్తిగా చూస్తుండిపోయాను. నవ్వాపుకుంటూ మెరుస్తున్న కళ్ళతో నుదుటి మీద పడుతున్న ఉంగరాల జుత్తుని వెనక్కి తోస్తూ రీలమాల చెప్పడం మొదలుపెట్టింది.

"ఒకసారి మేం మీటింగ్ కోసం క్యాంపు వేశాం. మరొక్కరోజులో మీటింగ్ పూర్తి చేసుకుని వెళ్ళిపోయేవాళ్ళమే. ఈలోపు పోలీసులు కూంబింగ్‌లో భాగంగా చుట్టుపక్కల తిరుగుతున్నారని సమాచారం వచ్చింది. మాకు ఎక్కువ టైం కూడా లేదు. అప్పుడు మకాం మార్చడం అంటే రెండు రాత్రుల ప్రయాణం. కాని 'రిస్క్' తీసుకోవద్దు అని నాయకత్వం అభిప్రాయపడింది. కమాండర్ కొద్దిసేపు ఆలోచించి ఒక సలహా చెప్పాడు. అక్కడ గ్రామంలో తలలో నాలుకలా ఉండే కిసాన్ కమిటీ నాయకుడు కానూదాను పిలిపించి మాట్లాడుదాం అన్నాడు. వాళ్ళు రిపోర్టు తీసుకుని నిర్ణయించుకోవడం మంచిదనే నిర్ణయానికొచ్చారు."

"కామాదాతో విషయం మాట్లాడితే పోలీసులు తిరుగుతున్న మాట వాస్తవమే అని, వచ్చే అవకాశాలు ఎక్కువేనని అన్నాడు. 'రిస్క్' తీసుకుంటున్నామా అని కొంత ఆలోచనలో పడ్డాం. అప్పుడు కామాదాతో వచ్చినా రావి చెట్టు దాటి ఇటు రాకుండా చూసే బాధ్యత మాది' అన్నాడు. ఏం చేస్తావు? అంటే మంత్రం వేస్తాను అన్నాడు. దాదా నవ్వి మంత్రాలకి చింతకాయలు రాలవు! అన్నాడు. "కాని పోలీసులు ఆగుతారు. కామాదా గంభీరంగా అన్నాడు. తాత ఎన్నడూ వట్టి మాటలు చెప్పడు. పైగా గ్రామంలో అతనంటే అందరికీ చాలా గౌరవం. అతని మాట ఎవ్వరూ జవదాటరు కూడా! నాయకత్వ కామ్రేడ్స్ తాతతో విడిగా సమావేశమయ్యి వివరంగా చర్చించారు. తర్వాత మీటింగు జరుపుకోవచ్చని నిర్ణయమైంది.

"పోలీసులు వచ్చారా?" ఆ తర్వాత ఆపుకోలేక మధ్యలోనే అటకాయించాను. రీలా పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

'ఆఁ వచ్చారు. గ్రామం పొలిమేరలోనే రావి చెట్టుంది. తాత ప్రస్తావించింది ఆ చెట్టు గురించే. తాత ఆ రోజు గ్రామంలో అందరినీ సమావేశ పరిచి ఏం చేయాలో చెప్పాడు. రావిచెట్టుకు సింధూరం పెట్టారు. మౌలీధాగా (ఎర్రరంగులో ఉండే తాళ్ళు)లు కట్టారు. ఎర్ర బట్ట చుట్టారు. పూజలు చేశారు.

ఆ రాత్రి ఊహించినట్టే పోలీసులు వచ్చారు. రావిచెట్టు దాటాక ఇక అంతా అడవే. కాని ఏరియా మీద పట్టులేకపోతే రాత్రి పూట బాటలు గుర్తుపట్టడం అంత తేలికైన పనికాదు. వాళ్ళు వస్తూనే పొలిమేరలో ఉన్న ఇళ్ళ వాళ్ళందరినీ లేపి దారి చూపించడానికి పదమన్నారు. వాళ్ళు తాతని పిలుచుకొచ్చారు.

తాత వచ్చి అయ్యో! అడివికి ఎట్లా పొయ్యేది? రావి చెట్టు దాటకూడదు కదా? అన్నాడు. వాళ్ళు బిత్తరపోయారు. గ్రామంలో ఒకరికి దయ్యం పట్టిందని, వాళ్ళకి మంత్రం వేసి దయ్యాన్ని రావిచెట్టుకి మంత్రంతో కట్టేశామని రావిచెట్టుకి రాత్రిపూట దాటితే రక్తం కక్కుకొని చస్తారని, కాబట్టి తామెవ్వరం రాలేమని, అసలు రాత్రిపూట ఈ మాటలు మాట్లాడనే కూడదని చెప్పి దెయ్యాలను వెళ్ళగొట్టడానికి ఉద్దేశించే పాటందుకొన్నాడు.

"వాళ్ళు నమ్మారా?" ఆశ్చర్యంగా అడిగాను నేను. నమ్మడమా? ఎంత వేగంగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయారంటే మళ్ళీ ఇక ఆ ఏరియాకి రానేలేదు. అంతేకాదు ఇద్దరు ముగ్గురు సిపాయిలకి విరోచనాలు పట్టుకున్నాయట, భయంతో"

రీలామాల నవ్వుతో నేనూ శృతి కలిపాను.

ఇంతకీ డబ్బు దొరుకుతుందంటావా? రీలాని అడిగాను నేను. 'సందేహమా? రేపు చూద్దువుగాని!' అంది!

* * *

ఉదయం 8 గంటల సమయం. నేనూ రీలా పేపరు కోసం కట్టల్‌పేడ్ (పనస చెట్టు) కిందికి చేరాం. పేపరు చదువుతూ రీలా పగలబడి నవ్వింది. ఏంటంత జోక్ అని నేనూ తను చదువుతున్న పేపరులోకి తొంగి చూశాను.

కొత్తగా ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయబోతున్న అర్జున్ ముండాని విలేఖరులు అడిగిన ప్రశ్న గతంలో మీరు రెండు సార్లు ముఖ్యమంత్రి అయినప్పుడు కూడా ఎర్ర హాఫ్‌కోట్ వేసుకున్నారు కదా! ఈ సారి కూడా ప్రమాణ స్వీకారానికి ఎర్ర హాఫ్‌కోట్ వేసుకొంటారా? అది మీకు చాలా లక్కీ కదా! అని.

నేను చూస్తున్న హిందూస్థాన్ టైమ్స్‌లోనూ అదే ప్రముఖ వార్త. "రెండేళ్ళ రాష్ట్రపతి పాలన, ఇంత అస్థిరత తర్వాత వీళ్ళకి ముఖ్యమంత్రిని అడగడానికి మరేం ప్రశ్న దొరకలేదు చూడు! అది ఝార్ఖండ్ అంటే! అంది రీలామాల.

అందుకే తనని చూస్తే అంత ముచ్చట నాకు. దాదాపు అడవి దాటి బయటకు రాని రీలామాల నోటినుంచి ఇలాంటి కామెంట్స్ వింటున్నప్పుడల్లా భలే ఆశ్చర్యంగానూ అలాంటి చైతన్యాన్ని అందించిన విప్లవ రాజకీయాల పట్ల గౌరవంగానూ అనిపిస్తుంటుంది నాకు. ఇంతలో వెనుకవైపు ఆవరణలో ఏదో కలకలం. అందరూ ఆ వైపు పరిగెత్తడం మొదలుపెట్టారు. ఏం జరిగిందో అర్థం కాక గుండె వేగంగా కొట్టుకొంటుంటే నేనూ రీలా కూడా పరుగెత్తాం. ఇంకేముంది బాత్రూమ్‌ల వెనుక మొక్కల మధ్య రూ. 500ల నోటు దొరికింది.

మొదట చూసిందెవరు? అని ఆరాలు మొదలయ్యాయి. 'ఆనంద్‌కి మయ్యా' అన్నారెవరో. (ఆనంద్ వాళ్ళమ్మ) (ఇక్కడ బందీతో పాటు ఆమె పిల్లలు కూడా జైలుకి వచ్చింటే - ఆమెని ఫలానా వాళ్ళమ్మగానే తప్పపేరు పెట్టి అస్సలు పిలవరు, వ్యవహరించరు).

కమానీలు (శిక్షపడి శ్రమ చేసే ఖైదీలు) పెద్దగా బూతులు లకించుకొన్నారు.

"ఇప్పుడే కాలవలు కడిగాం. అక్కడ పడుంటే మా కళ్ళ బడకపొయ్యేదా? ఇప్పుడే పడేసుంటది అని. వాళ్ళ మాటల్లో నిజం లేకపోలేదు.

చూపించినందుకు నన్నే దొంగ అంటారా? అని ఆనంద్‌కి మయ్యా జవాబుగా బూతులు తిట్టడం మొదలుపెట్టింది. ఇంక ఆ బూతులు వినలేక వెనక్కి తిరిగాం.

జుట్టు విరబోసుకొని డబ్బులు కట్టుకున్న చేతుల్ని జోడించి పట్టుకుని పూనకంతో ఊగిపోతున్నట్టు నడుస్తూ మమ్మల్ని దాటుకుని వెళ్ళిపోయింది కమిలి.

మేమిద్దరం పనస చెట్టుకింద చేరి చెరో పేపరు పట్టుకొని అందులో మునిగిపోయి ఇక ఆ గోల పట్టించుకోలేదు. పేపరు ముగించి తలెత్తే సరికి హాస్పిటల్ ముందు మెట్ల దగ్గర పెద్ద గుంపు తయారయింది. ఏమయిందిరా బాబూ. మళ్ళీ అని పోయి చూద్దుం కదా.

కమిలిపై మెట్టు మీద దర్జాగా కూర్చుంది. ఒకామె ఆమె కాళ్ళు మొక్కి బెయిల్ ఎప్పుడొస్తుంది అని అడుగుతోంది. ఆమె వెనుక బోలెడు మంది తమ వంతు కోసం ఒకరినొకరు తోసుకుంటున్నారు. కమిలి శనగలు గట్టు మీద పోసి శకునం చూస్తుంటే అవాక్కయి చూస్తుండిపోయాం!



# కొత్త చదువు

- బి. భానుమతి

సుక్రు ఎన్.జి.వోలు నడుపుతున్న ఒక అనాథ పిల్లల వసతి గృహంలో ఉన్నాడు. అది, ప్రత్యేకంగా మడియాగోండు అనాథ పిల్లలకోసం ఏర్పాటు చేసిన వసతిగృహం. సుక్రు వంటి యాభైమంది పిల్లలు అందులో ఉన్నారు. సుక్రు పన్నెండు, పదమూడు సంవత్సరాల మధ్య వయస్సు పిల్లగాడు. సుక్రును అనాథగా మార్చిన కథ సుక్రూ చెప్పితేనే వినాలి. తన కథ చెపుతున్నంత సేపు కళ్ళు నిప్పురవ్వల్లా మండుతాయి.

"జుడుం వాళ్ళు మా గూడెం మీద పడి దాడి చేయక ముందు మా బతుకులు వేరుగా ఉండేవి. కల్లో, గంజో తాగి మా అడవిలో మేం శాంతంగా ఉండేవాళ్ళం. మాది పెద్ద సంసారం. మా తాత, నాయన, అవ్వ, నలుగురు పిల్లలం. అందరం ఒకే గుడిసెలో ఉండే వాళ్ళం. నేను మా తమ్ముడు సోను, అడవిలో పశువుల్ని మేపుకు వచ్చే వాళ్లం. మా అవ్వ ఆకలైనప్పుడు తాగడానికి సొర బుర్రలో మక్క అంబలిపోసి ఇచ్చేది. మా అడవిలో మేము ఇష్టం వచ్చిన చోట పశువుల్ని మేపుకొనే వాళ్ళం. అడవి కాయలు ఏరుకొని తినేవాళ్ళం. మా గూడెం పిల్లలందరం ఒక దాపునే పశువుల్ని మేపుకునే వాళ్ళం.

మా తాత నన్ను ముద్దుకు 'చెవుల పిల్లీ' అని పిలిచేవాడు. నేను అడవిలో చెవుల పిల్లిలా చెంగు చెంగున పరిగెత్తుతానని తాత అనేవాడు. నన్ను తాత చెవుల పిల్లి అని పిలవడం నాకు చాలా ఇష్టం. రాత్రిపూట నెగడు పక్కన, తాత పక్కలో దూరి పడుకోవడం నాకు చాలా ఇష్టం. పున్నమి రోజు రాత్రి, తాత నాకు చందమామ మధ్యలో చెవుల పిల్లిని చూపించేవాడు. తాత నాకు ప్రతి పున్నమి రాత్రి చెవుల పిల్లి కథ చెప్పేవాడు. పున్నమి రోజు అర్ధరేతిరి చెవుల పిల్లి నెలవంక మధ్య నుంచి అడివిలోకి మబ్బుల మీద నడుచుకుంటా దిగుద్ది. ఎవ్వరూ చూడకుండా అడవిలోకి దిగుద్ది.. చెవులపిల్లి చందమామ లాంటి తెల్లటి కూనల్ని గచ్చపొదచాటున ఈని ఏడుస్తూ తిరిగి వెళ్ళలేక, వెళ్ళలేక చందమామలోకి వెళ్లిపోతది. చెవులపిల్లి చెంగు చెంగున గెంతుతూ చూసుకోకుండా మునికాలు తొక్కినందుకు ముని శాపం పెట్టాడట. అడవిలో నీ వాళ్ళను వదలి దూరంగా ఒంటరిగా చందమామలో ఉండమనే ముని శాపానికి చెవులపిల్లి చందమామలో ఉంది. కానీ చెవుల పిల్లి మనసు ఎప్పుడూ అడవి పైన, తన కూనలపైన, అడవిలో ఉన్న సమస్త జీవాలపైన ఉంటుంది. చెవుల పిల్లి ఎప్పుడూ అడవిని, అడవిలో సమస్త ప్రాణుల్ని కాపాడుతుంది. చల్లగా చూస్తుంది. అందుకే మనవడా నిన్ను చెవుల పిల్లీ అని పిలుస్తారు. అని తాత చెప్పేవాడు. మా గూడెంలో పిల్లలం అందరం చెవుల పిల్లిలాగా వేగంగా పరుగెడతాం.

పశువుల్ని అడవిలోకి తోలుకుపోయిన పిల్లలందరం నడిపొద్దు వేళకి అంబలి తాగడానికి మద్దిచెట్టుకిందికి చేరేవాళ్ళం. ఆ వేళకు మద్ది చెట్టుకాడికి మిలీషియా అక్క కూడా వచ్చేది. అక్క, మాకు రోజూ చదువు చెప్పేది. చెట్టుకింద మట్టి నున్నగా చేసేవాళ్ళం. పుల్లతో ఆ మట్టిలో అక్షరాలు రాయడం నేర్చుకొనేవాళ్ళం. అక్కమాతో పాటే పాటలు పాడేది. మా కొండగాడు పాట పాడితే అడవి పక్షులు కూడా వినేవి. వాడి పాట గలగల పారే ఏటి రాగంలా ఉంటుంది. అక్కమాతో కథలు చెప్పించేది.

నేను మా తాత చెప్పిన చెవుల పిల్లి కథ చెప్పేవాడిని. మాబుద్రు సీతాకోక చిలుకల కథ చెప్పేవాడు. మా డింగ్రి గాడు ఇంద్రధనస్సు కథ చెప్పేవాడు. మా మద్ది చెట్టు ఒడిలో కథలు పుస్తకంలో రాస్తే పది పుస్తకాలు నిండిపోతాయి. అక్క మాకు, కొమ్రం భీం దాదా కథ, బిర్సాముండా దాదా కథ చెప్పేది. మా పాటలు, మా కథలు, మా మాటలు, మా తాత తండ్రుల బతుకులు మా భాషలో రాయడమే చదువులో ఒక భాగం అని అక్క చెప్పింది. చదవడం, రాయడం మనచుట్టూ జరుగుతున్న సంగతులు తెలుసుకోవడం చదువు అని అక్క చెప్పింది. మనిషి జ్ఞానం మనిషి బతుకును తెలుసుకోవడానికి, మనిషి బతుకును మెరుగు పరచడానికి ఉపయోగపడాలని అక్క చెప్పింది. జ్ఞానం వలననే మనిషి చంద్రుడి దగ్గరికి వెళ్ళి వచ్చాడని అక్క చెప్పింది.

అక్కమాకు అంకెలు, కూడికలు, తీసివేతలు హెచ్చువేతలు, భాగహారాలు నేర్పించింది. మా లెక్కల చదువుకు మేం ఏరుకొచ్చే రాళ్ళు, గింజలు ఉపయోగపడేవి. మేం అడవిలో పోగుచేసే జిగురు కుంకుడుకాయలు, చింతపండు, తేనేలాంటి సరుకులు అమ్మేటప్పుడు సరైన తూకం ఎలా వేయాలో అక్క మాకు తక్కెడతో చూపించేది. మమ్మల్ని మోసం చేసే సావుకార్ల దొంగతూకాలను ఎలా కనిపెట్టాలో అక్క చెప్పింది. ఎంత బరువు సరుకుకు ఎంత డబ్బులు వస్తాయో లెక్కకట్టడం నేర్పించింది. మేం పనులు చేసినప్పుడు కూలి డబ్బులు లెక్కప్రకారం ఎలా వసూలు చేసుకోవాలో అక్క చెప్పింది. సేట్‌ల దగ్గర మేం కొనుక్కునే కిరసనూనె, ఉప్పు, పప్పులకు లెక్కకట్టి డబ్బులు ఇచ్చే విధానం చెప్పింది. మా దగ్గరి సరుకులు పావలాకి తీసుకోవడం, మాకమ్మేటప్పుడు పనికిమాలిన సరుకులైనా రూపాయికి అమ్మడం కుదరదని మా లెక్కల చదువు మూలంగా మేం తెలుసుకున్నాం. మాకు ఇన్నాళ్లు లెక్కలు రాకపోవడం వల్ల సావుకార్లు, సేట్లు ఎలా

దొంగలెక్కలతో మోసం చేశారో అర్థం అయింది. మా లెక్కల చదువు సంగిసేట్‌ల మోసం సంగతి మా తాతకు చెప్పాను. సేట్‌లు మనల్ని ఇంత దగా చేస్తున్నారా అని తాత వింతగా చూశాడు.

అక్క మన బతుకులు మనం మార్చుకోవాలంటే, మనం ఎక్కడ ఉన్నాం, ఎలా ఉన్నాం అని తెలుసుకోవాలి అని చెప్పింది. అందుకే మా సాంఘికశాస్త్రం చదువులో, రాష్ట్రపటాలు, దేశపటాలు, ప్రపంచపటాలను గురించి మొదట నేర్చుకొనేవాళ్ళం. మా గూడెం, మా తాసీల్, మా జిల్లా, మా రాష్ట్రపటంలో ఎక్కడున్నాయో చూసేవాళ్ళం. మా రాష్ట్రాన్నే పాలిస్తున్న రమణసింగ్ సర్కార్ ఎక్కడ కొలువైంది చూసేవాళ్ళం. దేశపటంలో మనదేశాన్ని పాలిస్తున్న మన్మోహన్‌సర్కారు ఎక్కడ కొలువైంది అక్క చూపించేది. ప్రపంచ దేశాలన్నిటిని కొల్లగొట్టుకుతిని బతుకుతున్న పెద్దపులి, అమెరికా దేశం ప్రపంచపటంలో ఎక్కడ ఉందో అక్క చెప్పింది. అమెరికా వెనకాల గుంటనక్కల్లా పేదోళ్ళను పీల్చుకుతింటున్న బ్రిటన్, ఫ్రాన్స్ దేశాలు ఎక్కడ ఉన్నాయో చూశాం. మామడ్ కొండలంత లేని దేశాలు ఏడు సముద్రాలను మాంత్రికుడిలా దాటివచ్చి మన బతుకుల్ని పీల్చి పిప్పి ఎలా చేస్తున్నారో అక్క చెప్పింది. అమెరికా పంజాదెబ్బకు చితికిపోయిన ఆఫ్ఘానిస్తాన్, ఇరాక్ దేశాలను చూపించింది. అక్కడి పిల్లలు ఆకలికి, రోగాలకు ఎలా బలైపోతున్నారో అక్క వివరంగా చెప్పింది. మా కొండా, మా గూడెం, మా అడివిని మా నుంచి ఏ రాజకీయం గుంజుకుంటుందో తెలుసుకోవడమే మా సాంఘికశాస్త్రం చదువు. నాగరికత అని చెప్పి, అభివృద్ధి అని చెప్పి మానోటికాడ కూడు లాక్కొనే సర్కారు గుట్టు తెలుసుకోవడమే మా సామాజిక శాస్త్రం చదువు ఉపయోగం అని వేం తెలుసుకున్నాం.

అడవిలో మానుల్లో మానులా, మొక్కల్లో మొక్కలా, జంతువుల్లో జంతువులా, కలగలసి పోయిన బతుకుమాది. అడివిలో ఏ గింజ, ఏ మొక్క, ఏ వేరు, ఏ పువ్వు ఎందుకు పనికి వస్తాయో పరిశీలించడం, వాటిని సేకరించి ఉపయోగించడం మా సామాన్యశాస్త్ర చదువు మొదటి పాఠం. ఏ కాలంలో వానలు పడతాయి. ఏ వానకు గింజలు చల్లితే మా చెలకల్లో పైరులు బాగా పెరుగుతాయి. ఎప్పుడు ఎరువులు చల్లాలి, చీడపీడలకు ఏ మందులు చల్లాలి, పంట బాగా ఎట్లా పండించాలో తెలుసుకోవడం మా రెండో పాఠం. మా గూడెం పిల్లలం బక్కచిక్కి పోకుండా సరైన తిండి ఎలా పెట్టాలి, జ్వరం వచ్చినప్పుడు, విరోచనాలు వచ్చినప్పుడు, కురుపులు వచ్చినప్పుడు, ఏ తీరుగా ఉండాలి. అనేదే మూడోపాఠం. మాకు దొరికే ఆకులు, వేర్లు, పువ్వులతో మందులేలా తయారుచేసుకోవాలి, రోగాలు, రొప్పలతో మా పిల్లలు చచ్చిపోకుండా ఉండాలంటే మా జాతిని కాపాడుకోవాలంటే ఏం చెయ్యాలో చెప్పేదే మా సామాన్యశాస్త్రం నాలుగోపాఠం.

మొత్తంగా చూస్తే మా చదువు మా జీవితాలను చుట్టుకుని ఉన్నట్టు అనిపించింది. అందుకే మిలీషియా అక్క చెప్పే చదువు మా గూడెం పిల్లలందరికీ ఇష్టం. ఒక కంటితో జీవాలని, గొడ్లని చూసుకుంటూనే పాఠాలు నేర్చుకొనేవాళ్ళం. మద్ది చెట్టు బడికి నేను లీడర్‌ను. అక్కకు ఏదైనా పని తగిలి బడికి రాలేకపోయినా మా బడి మామూలుగానే జరిగేది. మా బడి పిల్లలకు అక్క పరీక్షలు పెట్టేది. ఆ పరీక్షలో నూటికి నూరు మార్కులు సంపాదించాలని అందరం పోటీపడేవాళ్ళం. మా సిండే గాడికైతే అన్ని పరీక్షల్లో వందకు వందమార్కులు వచ్చేవి. వాడు మా బడి ఫస్టు. మా బడిలో చదువురాని వాళ్ళు, మొద్దులు అస్సలు ఉండేవాళ్ళేకాదు. మద్ది చెట్టు చదువు తరువాత మేము పెద్దబడిలో చేరాలని, పెద్ద పెద్ద చదువులు చదివి మా జాతికి మేలు చేయాలని అక్కచెప్పేది. మా గూడెం పిల్లలం బాలల సంఘం పెట్టుకున్నాం. అందరం ఒకరికొకరం సాయం చేసుకోవాలనేది మా సంఘం ఆశయం.

మా తాత అందరికీ గొప్పగా చెప్పేవాడు. మా నాయన బాణం వేశాడంటే దెబ్బకి బెబ్బులైనా పడిపోయేదని మా నాయన బాణం గురి తప్పదని తాత చెప్పేవాడు. మా గూడెంలో 'జన తన సర్కారు' నడిచేది. మా నాయన జనతన సర్కారులో వేట బాధ్యుడు. జనతన సర్కారంటే మనం ఏర్పరచుకొన్న మన రాజ్యం అని మా నాయన చెప్పాడు. మన రాజ్యం మనమే నడిపించాలి. మనమే కాపాడుకోవాలని నాయన చెప్పాడు.

'జనతన సర్కారు' మా గూడెం రాకముందు, మా నాయన ఫుల్లుగా తాగొచ్చి మా అవ్వను చావగొట్టేవాడు. మా నాయన తన్నులకి మా అవ్వ ఒళ్ళు వాసి పోయేది. ఇంట్లో పిల్లలం ఆకలితో అన్నం పెట్టమని ఏడ్చే వాళ్ళం. మా ఆకలి తీర్చలేక అవ్వ ఏడ్చేది. "జనతన సర్కారు"తో పాటే మా గూడేనికి మహిళా సంగం వచ్చింది. మహిళా సంఘం, దొంగ సారా అమ్మకాలు బందు పెట్టిచ్చింది. తాగి పెళ్ళాన్ని తన్నే మొగోళ్ళను మహిళా సంఘం నిలదీసింది. 'జనతన సర్కారు' భూమిలేని పేదోళ్ళను దున్నుకోమని భూమి పంచింది. గుడిసెల్లో పిల్లలు పస్తులుండడం తగ్గింది. జనతన సర్కారు రాకతో మా గూడెం బతుకుల్లో మార్పు వచ్చింది.

మా గూడెం జనం బతుకుల్లో వచ్చిన మార్పు మా సావుకార్లకు నచ్చలేదు. పటేల్ పట్వారీలకు నచ్చలేదు. సర్కారుకు అస్సలు నచ్చలేదు. ఆ రోజున మా గూడెం జనం మొత్తం ఎవరి పనుల్లో వాళ్ళు ఉన్నారు. పొద్దునడినెత్తి మీదకు వచ్చింది. అడివిలో పశువుల్ని మేపుతున్న మాకు గూడెం మీద నుంచి పొగలు, మంటలు కనిపించాయి. పరుగు పరుగున పిల్లలందరం గూడానికి పరుగెత్తుకు వచ్చాం. జుడుం మూకలు, పోలీసులు దొరికి నోళ్ళను దొరికినట్టు పట్టుకు బాదుతున్నారు. పిల్ల, పెద్ద, ముసలి, ముతక భేదం లేదు. వరుస బెట్టి గొడ్డను బాదినట్లు బాదుతున్నారు. గూడెంలో గుడిసెలన్నిటికి నిప్పు పెట్టారు. గూడెం యువకులు చాలా మంది అడివిలోకి పారిపోయారు. ఆ బీభత్సంలో మా అవ్వ, నాయిన, తమ్ముడు ఏమై పోయారో అజలో లేరు. గూడెంలోకి పరిగెత్తుకు వచ్చినప్పటికీ ఇల్లలో పదిమంది పోలీసోళ్ళకు చిక్కాం. మమ్మల్ని పట్టుకొని లారీలో వేసుకున్నారు. క్యాంపుకు తీసుకుపోయారు. క్యాంపులో ఒక మూలన ఉన్న షెడ్‌లో పడవేశారు. చుట్టూకాపలా.

నేను ఏడుస్తూ మూలన పడి ఉన్నాను. అవ్వ, నాయన, తమ్ముళ్ళు గుర్తుకు వచ్చారు. పోలీసులు చితకబాదిన తాత గుర్తుకొచ్చాడు. అడివిలోకి పోలీసులు తోలేసిన మా ఎర్రావు దూడ గుర్తుకొచ్చాయి. ఎంత ఆపుకున్నా ఏడుపు తన్నుకొస్తోంది. పిల్లలందరం ఏడుస్తూనే ఉన్నాం. ఒక బాన పొట్ట పోలీసు నా దగ్గరికి వచ్చాడు. ఏడుపు ఆపమని కసురుకున్నాడు. నేను బిక్కచచ్చిపోయి ఏడుపు మానేశాను. నన్ను మిలీషియా అక్క గురించి అడిగాడు. అక్కను పట్టిస్తే తన బొడ్లో ఉన్న పిస్తోలు ఇస్తానన్నాడు. డబ్బులు ఇస్తాను, మీ గూడెం పంపించేస్తాను అన్నాడు. నాకు ఏడుపు ఆగలేదు పెద్దగా ఏడిచాను. ఆ పోలీసోడు ఒక్క తన్ను తన్ని మొకం మీద కాండ్రించి ఊసి వెళ్ళిపోయాడు. జుడుం వాళ్ళు మాకు రోజా పప్పు అన్నం పెట్టే వాళ్ళు, నాకు తిన బుద్ది అయ్యేదికాదు.

జుడుం వాళ్ళు నాతో క్యాంపు ఊడిపించే వాళ్ళు. సాయంకాలపు కాంపులో పిల్లలందరిని ఒకచోట పోగేసి, నక్సలైటులు మనుషులను పీక్కుతినే రాక్షసులని, కథలు కథలుగా చెప్పే వాళ్ళు. నాకు రాత్రిపూట నిద్రపట్టేది కాదు. తగలబడుతున్న గూడెం, జుడుం వాళ్ళు తన్నుతున్న తాత గుర్తుకు వచ్చేవి.

మమ్మల్ని పోలీసులు కాంపుకు లాక్కువచ్చి వారం రోజులు గడిచిపోయాయి. ఆ రోజు జుడుం వాళ్ళు, పోలీసులు తుపాకులు తీసుకొని ఆదరాబాదరగా జీపులెక్కి బయటికి వెళ్ళారు. ఒక గంట గడిచింది. ఒక జీపు నిండా శవాలు వేసుకొని వచ్చారు. మొత్తం లెక్కపెట్టాను. పద్దెనిమిది శవాలు. అన్నిటిని క్యాంప్ గోడ పక్కన పడేశారు. సాయంకాలం అయింది. పొద్దుగూకింది. ఆ వాతావరణంతో పిల్లలందరం భయంతో వణికి పోయాం. అన్నం తింటానికి శవాలున్నదారిలో పోవాలి. అన్నానికి పోయేటప్పుడు లైటు వెలుతురులో భయం, భయంగా శవాల వైపు చూశాను. శవాలలో మా నాయన శవం. పరిగెత్తికెళ్ళి మీద పడిపోయాను. పొర్లిపొర్లి ఏడ్చాను. జుడుం వాళ్ళు నన్ను తన్నుకుంటూ లాక్కుపోయారు. 'నక్సలైట్ నా కొడుకు' అని నాయన శవం జుడుం వాళ్ళు కాళ్ళతో తొక్కారు. ఆ రోజు రాత్రి నాకు జ్వరం వచ్చింది. క్యాంప్ అంతా శవాలు కుళ్ళిన వాసన. మా నాయన్ను చంపేశారన్న బాధ. వాంతులు, విరేచనాలు పట్టుకున్నాయి. ఒంటి మీద సోయి తప్పి స్పృహలేకుండా పడిపోయాను.

సోయి తెలిసేటప్పటికి ఇక్కడ ఈ అనాథల వసతి గృహంలో ఉన్నాను. మేం యాభైమంది పిల్లలం ఒక షెడ్‌లో ఉన్నాం. అదే మా నివాసం. అదే మా బడి. ఈ బడి కూడా పోలీసు క్యాంప్‌లాగే ఉంది. ఇక్కడ పిల్లలం మా కష్టసుఖాలు మాట్లాడుకోకూడదు. రోజంతా ఎవరెవరో తెల్లగుడ్డల వాళ్ళు వచ్చేవాళ్ళు. మమ్మల్ని వింత జంతువుల లెక్క చూసేవాళ్ళు. మేం పాడే మా అడివి పాటలు ఆ తెల్ల గుడ్డల వాళ్ళ ముందు పాడమని మా భాషలో మాట్లాడమని హోం ఆర్గనైజేషన్ వాళ్ళు మమ్మల్ని బలవంతం చేసేవాళ్ళు. మేం పాడే మా అడివి పాటలు ఆ తెల్లగుడ్డల వాళ్ళకి అర్థం అయ్యేవి కావు. మా పాటలు మా మనసులో బాధలాగే ఉండేవి. తెల్లగుడ్డల వాళ్ళను చూడగానే లేచి నమస్కారం పెట్టాలి. లేకపోతే క్యాంప్‌లో టీచర్ బెత్తంతో కొట్టేది.

ఈ హోం, ఈ బడి, నాకస్సలు నచ్చలేదు. టీచరు పలకమీద రాయించే తెలుగు అక్షరాలు నాకు రాయడం వచ్చేది కాదు. టీచర్ చదవమని చెప్పే తెలుగు మాటలు అర్థం అయ్యేవికావు. చదువురాని మొద్దును అని టీచర్ తిట్టి పోసేది. నాకు అక్క, మద్దిచెట్టు బడి, గుర్తు వచ్చేవి. మనసు అడివివైపుకు లాగేది. అవ్వ, నాయన గుర్తుకువచ్చే వారు. రాత్రిపూట కలలో, మా అడివి సుక్రూ... రా రమ్మని పిలిచినట్టు అనిపించేది. హోం నుంచి పారిపోవడానికి ప్రతి నిమిషం ఎదురు చూసేవాడిని.

మా హోం లో వంట చేసే అక్క ఒక్క దానికే మా భాష తెలుసు. మా బాధ ఆ అక్క అర్థం చేసుకునేది. నెల మొదటి తారీకున పంతులమ్మ ఆర్గనైజేషన్ వాళ్ళు జీతాల కోసం పట్నం పోయారు. వంట అక్కతో నేను పారిపోతున్నాను అని చెప్పాను. అక్క నాకు ఒక కవర్‌లో అన్నం కట్టి ఇచ్చింది. అక్క ఇచ్చిన అన్నం మూట భుజాన వేసుకొని అడివిదారి పట్టాను.



పుస్తక పరిచయం

# వాస్తవికత, మనోవిశ్లేషణల మేలు కలయిక లేర్మొంతోవ్ నవల 'మన కాలం వీరుడు'

- ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు

కవిత్వమంటే ఏమిటి? పదాల లయబద్ధమైన కూర్పు! అంతేనా? పదాలన్న తర్వాత వాటికి భావాలు లేకుండా ఎలా ఉంటాయి? అయితే ఆ భావాలు సరైనవయి ఉండాలి. కవిత్వమంటే అంతమాత్రమేనా? పదాల కూర్పేగానీ, భావాల కూర్పు కాదా? లయబద్ధమైన భావాలు కవిత్వం కాదా? లేర్మొంతొవ్ నవల 'మనకాలం వీరుడు' చదువుతుంటే, మృదువైన పదాలే కాదు, ఆ పదాల వెనకనున్న భావాల లయాత్మకత కవిత్వమంటే ఇదేననిపిస్తుంది. భావాలు లయాత్మకత సాధించినప్పుడు వచనానికీ, కవిత్వానికీ తేడా లేకుండా పోతుంది! అయితే గంభీరమైన భావాలను కూడా వ్యంగ్యపూరితంగా, పరిహాస స్ఫోరకంగా, విషయంతో మమేకం కాకుండా, అంటీ ముట్టనట్టు చెప్పడం మహా రచయితలకే చెల్లుతుంది.ఇంతటి పరిణతి కేవలం 26 సంవత్సరాలకే సాధించడం అసాధారణం! అంతటి అసాధారణత సాధించాడు గనుకనే లేర్మొంతొవ్ కేవలం అగ్రశ్రేణి రచయితగానే మిగిలిపోకుండా, ప్రపంచశ్రేణి ఉత్తమ రచయితలలో ఒకడిగా పరిగణింపబడుతున్నాడు.

19 వ శతాబ్దాన్ని రష్యన్ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా భావిస్తారు. ఆధునిక రష్యన్ సాహిత్యం ప్రారంభమైన ఈ యుగంలోనే పుష్కిన్, గోగోల్, తొల్‌స్తోయ్, దొస్తొయేవ్‌స్కీ, చేహొవ్, తుర్గేనెవ్, కుప్రీన్, గోర్కీ లాంటి ఉత్తమశ్రేణి సాహితీమూర్తులు వెలసి ప్రపంచ శ్రేణి ఉత్తమ రచయితలుగా కీర్తిప్రతిష్టలు పొందడం ఒక్క రష్యన్ సాహిత్యానికే చెల్లింది. అలాంటి సాహితీమూర్తుల సరసనే సముచిత స్థానం పొందాడు లేర్మొంతొవ్. కేవలం 26 సంవత్సరాల చిన్న వయస్సులోనే ఈ స్థానాన్ని ఆయన పొందాడంటే, ఆయన ప్రతిభా సామర్థ్యాలెలాంటివో అర్థం చేసుకోవచ్చు. ఒకే ఒక్క నవల ద్వారా ఆయన ఈ ఘనత సాధించాడు. ద్వంద్వయుద్ధంలోనే మరణించక పోయుంటే, అతని అద్భుత కలం నుండి మరెన్ని నవలలు, కావ్యాలూ వెలువడి, ప్రపంచ సాహిత్యాభిమానుల్ని అలరించేవో ఊహించుకోవాల్సిందే! అన్నట్టు, లేర్మొంతొవ్ పైన పేర్కొన్న నవలా రచనకు ముందే, పలు కావ్యాలు రచించి, ఆధునిక రష్యన్ మహాకవి పుష్కిన్ తర్వాత అంతటి స్థానాన్ని పొందాడన్న సంగతి ఇక్కడ ప్రస్తావించడం సముచితం! అయితే లేర్మొంతొవ్‌కి ప్రపంచ ప్రసిద్ధి లభించింది మాత్రం పై నవల ద్వారానే.

లేర్మొంతొవ్ వర్ణనల్లాంటి వర్ణనలు ఎవరూ చెయ్యలేరనీ, ఎప్పుడో గానీ వాటితో సమంగా కూడా రాలేరనీ కార్ల్‌మార్క్స్ మహాశయుడు భావించాడని "ఫ్రాన్‌త్సిస్కా కుగెల్‌మన్" రాసింది. "మన దేశంలో ఎవళ్ళూ ఇంతటి ఉదాత్తమైన జీవంతో తొణికిసలాడే వచనశైలిలో రాయలేదు. అతను జీవిత వాస్తవికతలోకి చొచ్చుకు పోయాడు. రష్యన్ జీవిత మహత్తర చిత్రకారుడయ్యే ఆశని కలిగించాడు. కానీ అకాల మృత్యువు అతన్ని మనకు దక్కకుండా చేసింది." అని ప్రసిద్ధ రచయిత గోగోల్ లేర్మొంతొవ్‌ని కొనియాడాడు.

ప్రపంచ సాహిత్యానికి రష్యన్ సాహిత్యం చేసిన సేవ, ఉత్తమ వాస్తవిక నవలల్ని అందించడం! ప్రసిద్ధ రష్యన్ విప్లవకర ప్రజాస్వామిక సాహిత్య విమర్శకుడు 'విస్సారియెన్ బెలీన్‌స్కీ' నినాదం 'సహజధోరణి' ని అంగీకరించాక, రష్యన్ సాహిత్యంమీద అమిత ప్రభావం కలిగించిన రచనల్లో లేర్మొంతొవ్ 'మనకాలం వీరుడు' నవల ఒకటి. అంతేగాక, ఈ నవల రష్యన్ సాహిత్యంలో మొదటి మనోవిశ్లేషణాత్మక నవల కూడా కావడం గమనార్హం! ఈ ధోరణికి కొనసాగింపు తొల్‌స్తోయ్, దొస్తొయేవ్‌స్కీ రచనల్లో కనిపిస్తుంది. లేర్మొంతొవ్ సాహిత్య కృషిని తెలుసుకునే ముందు ఆయన జీవితవిశేషాలు, నాటి రష్యా సాంఘిక, రాజకీయ పరిస్థితులు, అవి ఆయనపై నెరిపిన ప్రభావం గురించి కూడా తగు మాత్రం తెలుసుకుందాం.

లేర్మొంతొవ్ పూర్తిపేరు "మిహాయిల్ యూరియేవిచ్ లేర్మొంతొవ్"(జననం- 15-10-1814, మాస్కోలో. మరణం- 27-7-1841, ప్యాతిగోర్‌స్క్, రష్యా) తండ్రి 'యూరీ పెత్రోవిచ్', విశ్రాంత సైనిక కెప్టెన్. తల్లి పేరు 'మరియా మిహాయ్‌లోవ్నా నీ అర్సెయేవ్‌నా'. లేర్మొంతొవ్ మూడు సంవత్సరాల పసి వయస్సులోనే తల్లిని కోల్పోయాడు. అమ్మమ్మ 'ఎలిజవేతా అలేక్సెయేవ్‌నా ఆర్సెన్యేవా'. ఈమె 'పెన్ జెన్‌స్కయా' రాష్ట్రంలో ధనికురాలైన జమీందారిణి. తల్లిని కోల్పోయిన లేర్మొంతొవ్‌ని ఆమె తన జమీకి తీసుకొచ్చి పెంచింది. తండ్రిని బాగా ఎరక్కపోయినా, తండ్రికీ, అమ్మమ్మకీ జరిగిన ఘర్షణలు గుర్తున్నాయి. జర్మన్ ఆయా పెట్టిన తీవ్ర ఆంక్షలూ, భూదాసులపై అమ్మమ్మ జరిపే దౌర్జన్యాలూ లేర్మొంతొవ్‌పై తీవ్ర ప్రభావాన్ని కలగజేసి, స్వేచ్ఛపట్ల అతనికి గాఢానురక్తి కలగడానికి దోహదం చేశాయి. అంతేగాక రష్యాలో గల విస్తారమైన ప్రకృతి సహజసౌందర్యం, జానపదగీతాలూ, గాథలూ, ఆచారాలూ, కర్మకాండలూ, కఠినశ్రమ చేయడానికి ప్రేరేపించబడే బానిస రైతులూ, రైతాంగ పోరాటాల్లో పాల్గొన్న గొప్ప గొప్ప యోధుల గాథలు - ఇవన్నీ కూడా భవిష్యత్తు కవి అయిన లేర్మొంతొవ్ వ్యక్తిత్వంపై ప్రగాఢ ప్రభావాన్ని కలిగించాయి. అంతేగాక, అతను బాల్యంలో తరచు జబ్బులకు గురవ్వడం వల్ల,

ఆరోగ్యం కోసం తక్కువ వ్యవధిలోనే మూడుసార్లు కాకసస్ ప్రాంతాలకు తీసుకెళ్ళారు. ఆ ప్రాంతాలలో గల చిత్ర విచిత్రమైన ప్రకృతి దృశ్యాలు కూడా అతను రొమాంటిసిజం వైపుకు ఆకర్షించబడడానికి కారణమయ్యాయి.

1827 లో లేర్మొంతొవ్ తన అమ్మమ్మతో కలిసి మాస్కో యూనివర్సిటీ వద్దగల ప్రభువర్గాల కోసం ఉన్న బోర్డింగ్ స్కూల్లో చేరడం కోసం వెళ్ళాడు. అక్కడే అతను కవిత్వం రాయడం మొదలుపెట్టాడు. దానితోపాటే పెయింటింగులు కూడా! నాటి ఇతర యువరష్యన్ కవులకు వలె బైరన్ కవి ప్రభావంతో, 1828 లో "సర్కేషియన్లు", "కాకసస్ ఖైదీలు" మొదలైన పద్యాలు రాశాడు. రెండేళ్ళ తర్వాత "వసంతం" అనే పద్యం ప్రచురింపబడింది. అదే సంవత్సరంలో అతడు మాస్కో విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. ఆ విశ్వవిద్యాలయం నాటి రష్యన్ సంస్కృతికి, రాజకీయాలకు కేంద్రంగా విలసిల్లుతూండేది. విద్యార్థి బృందాల మధ్య రకరకాల చర్చలు తీవ్ర స్థాయిలో జరుగుతూండేవి. ఆ చర్చల్లో రాజకీయ, తాత్త్వికపరమైన సమస్యలేగాక, బానిస రైతుల దుర్భర బాధల గురించి, వాటిని నివారించడానికి ఏం చెయ్యాలన్న దాన్ని గురించి తీవ్ర వాదోపవాదాలు జరిగేవి. ఆ బృందాలలో రకరకాల రాజకీయ సైద్ధాంతిక భావజాలం గల విద్యార్థులుండేవారు. తర్వాతి కాలంలో ప్రముఖ విప్లవకారులుగా ప్రసిద్ధి చెందిన 'అలెక్సాండ్ర్ హెర్జిన్', 'నికొలాయ్ ప్లాతొనొవిచ్ ఒగర్యోవ్' మొదలైన వారు నాటి విద్యార్థుల్లో కొంతమంది. అంతకుముందే బైరన్ కవి ప్రభావానికి లోనైన లేర్మొంతొవ్, ఈ చర్చల లో తరచు ఉటంకించబడే పూష్కిన్ కవి పద్యాలు విని, క్రమంగా పూష్కిన్ మార్గానుయాయి అయ్యాడు. అక్కడుండగానే అతడు సుదీర్ఘ వర్ణనలతో కూడినవీ, లయబద్ధమైనవీ అయిన పలు పద్యాలు రాశాడు. అంతేగాక కొన్ని నాటకాలూ రాశాడు. నాటి రచనల్లో "దేవత (1830)" ఒకటి. అలాగే వాటిలో "అపరిచితుడు (1831)" అనే నాటకం కూడా ఉంది. ఈ నాటకంలో ఆ నాటి విద్యార్థి సంఘాల మనోభావాల్ని ప్రతిబింబింపజేసాడు. అంతేగాక, తాను ద్వేషించిన జార్‌ల పాలనా రీతుల్ని, బానిస రైతుల బాధల్ని ప్రస్తావించాడు. 1832 వ సంవత్సరంలో ఒక తిరోగమనవాదియైన ప్రొఫెసర్‌తో తగాదాపడి, ఆ విశ్వవిద్యాలయాన్ని వదిలి, సెయింట్ పీటర్స్‌బర్గ్ వెళ్ళాడు. అక్కడగల ఆశ్విక శిక్షణాలయంలో చేరి, డిగ్రీ పుచ్చుకున్నాక, 1834 లో హుస్సార్ రెజిమెంట్‌లో ధ్వజధారిగా 'జార్స్కొయెసెలో' అనేచోట పనిచేసాడు. ఆ ప్రాంతం సెయింట్ పీటర్స్‌బర్గ్ రాజధానికి చాలా దగ్గర. అందువల్ల అతడు తన ఖాళీ సమయాల్లో అధిక భాగం రాజధానిలో గడుపుతూ, రాజరికాన్ని నిశిత విమర్శనా దృష్టితో పరిశీలిస్తూ "మస్కరాద్"(మారువేషం) అనే నాటకాన్ని రాశాడు. ఈ నాటకాన్ని 1835 లోనే రాసినా, నాటి సెన్సార్‌షిప్ విధానాల వల్ల 1842 లో ప్రచురించబడింది. ఆ కాలంలోనే అతడు 'వర్వారా లోపుఖినా' అనే సౌందర్యవతిని ప్రేమించాడు. అయితే ఆమె అతన్ని మోసగించి మరొక ధనవంతుడైన వ్యక్తిని పెళ్ళాడింది. అయినా ఆమెనతడు మరవలేదు. విఫలమైన ప్రేమలో ఏర్పడ్డ మానసికస్థితి అతన్ని జీవితాంతం వదిలింది కాదు. ఈ భావన అతని రచన 'రాకుమారి లిగోవ్‌స్కయా' పద్యంలో కనబడుతుంది. ఇలాంటి మానసిక స్థితి ఉన్న అతనికి, తాను ఎంతగానో ఆరాధించిన 'మహాకవి పూష్కిన్' ఒకానొక ద్వంద్వ యుద్ధంలో 1837లో చనిపోవడంతో తీవ్రంగా చలించిపోయాడు. (తన భార్య గౌరవం కాపాడవలసి వచ్చిన పూష్కిన్ అందులో ప్రాణాంతక గాయాలు తగలడం వల్ల మరణించాడు). అయితే ఈ మరణంలో రాజాస్థాన్ బృందం కుట్ర ఉందని దుయ్యబడుతూ, లేర్మొంతొవ్ "కవిమరణం" అనే దీర్ఘ పద్యం రాశాడు. ఆగ్రహోదగ్ర పద గుంఫనకు నేటికీ రష్యన్ భాషలో ఆ పద్యం గొప్ప ఉదాహరణగా విమర్శకులు చెబుతారు. అలాంటి విమర్శనాత్మక పద్యాన్ని అచ్చువెయ్యడం నాటికాలంలో అసాధ్యమయినందున, దాని రాతప్రతులే నాడు వేలాదిగా దేశవ్యాప్తంగా ప్రచారంలోకి వచ్చాయట. 1836 లో ప్రసిద్ధ రష్యన్ విప్లవకారుడు హెర్జిన్ ఆ పద్యాన్ని విదేశాల్లో "ధృవతార" అనే పత్రికలో అచ్చువేశాడు. ఈ పద్యం రాసినట్లు తెలిసిన నాటి జార్ నికొలస్-1 వెనువెంటనే లేర్మొంతొవ్‌ని అరెస్టు చేయించి కాకసస్ ప్రాంతానికి ప్రవాసం పంపించాడు. ఒక రకంగా అదీ లేర్మొంతొవ్‌కి మేలే చేసిందనుకోవచ్చు. డిసెంబరిస్టులలో కొందరు అప్పటికే అక్కడ ప్రవాసంలో ఉన్నారు. వారితోను, ఆ ప్రాంతపు మేధావులతోను పరిచయం చేసుకున్నాడు లేర్మొంతొవ్. వారిలో ప్రసిద్ధ కవి "ఇలియా ఛవ్‌ఛవాడ్జె"(Ilia Chavchavdze) ని కలిశాడు. ఆ కవి కుమార్తెను ప్రసిద్ధ నాటకకారుడు, కవీ అయిన దౌత్యాధికారి "అలెక్సాండ్ర్ సెర్గియేవిచ్ గ్రిబొయెదొవ్" వివాహమాడాడు. జార్జియన్ ప్రాంతంలో గల 'త్‌బిలిసి'(Tbilisi) లోని కవులను కూడా లేర్మొంతొవ్ కలిశాడు. అంతమాత్రమేగాక, అక్కడి ప్రకృతి చేత, జానపద సాహిత్యం చేత ఆకర్షించబడడం వల్ల ఆ ప్రాంత భాషనూ నేర్చుకుని, ఆ భాషలోని 'అషిక్‌కెరిబ్' అనే అజర్‌బెజానియన్ కథకు మెరుగులు దిద్ది, దాన్ని రష్యన్ భాషలోకి అనువదించాడు. అలాగే కాకసస్ ప్రాంతానికి చెందిన కవితా వస్తువులకు, ఆ ప్రాంత భాషలలోని జాతీయాలకూ తన కవిత్వంలో ముఖ్యమైన స్థానమిచ్చాడు. అంతేగాక, తన నవల "గెరొయ్‌నషె గొవ్రెమెని" ("Geroynashe govremeni". ఇది ఇంగ్లిషులో "Hero of ourtimes" గాను, తెలుగులో 'మనకాలం వీరుడు' గాను అనువదింపబడింది). అనే దానిలో కూడా ఆ ప్రాంతానికి ప్రముఖ స్థానమిచ్చాడు. ఆ నవలలోని ప్రధాన ఘట్టాలు అక్కడే జరిగినట్లు రాశాడు.

ఇంతలో అతని అమ్మమ్మ నిరంతరం చేసిన ప్రయత్నం వల్లా, అలాగే పలుకుబడి గల నాటి ప్రముఖ కవి వి.ఎ.ఝుకోవ్‌స్కీ గట్టి ప్రయత్నం వల్లా లేర్మొంతొవ్ ని తిరిగి రాజధాని ప్రాంతానికి రావడానికి అనుమతిచ్చారు. ఇది 1838 లో జరిగింది. అప్పట్నుంచీ లేర్మొంతొవ్ కవితా ఖండికలూ, పద్యాలూ, గేయాలూ ప్రచురణకు నోచుకోబడ్డాయి. వాటిలో 1837లో రాసిన "జార్ ఇవాన్ వసీలియెవిచ్ యొక్క యువ అంగరక్షకుడూ, సాహస వర్తకుడూ అయిన కలష్నికోవ్ గురించిన పాట" ఒకటి. అలాగే 1838లో

"తాండొవ్ ప్రాంతంలో జీతాలు ఇచ్చే అధికారి భార్య" నూ, 1839లో "సాష్కా"(Sashka) (ఇది 1862లో ప్రచురించ బడింది) నూ, అలాగే "రాక్షసుడు" అనే రొమాంటిక్ కావ్యాన్ని రాశాడు. ఇంతకు ముందే "దీక్షార్థి" కావ్యాన్ని రాశాడు.

రొమాంటిసిజానికి సంబంధించి లేర్మొంతొవ్ మిగిలిన పద్య రచనలన్నీ ఒకెత్తు, దేవత, దీక్షార్థి, రాక్షసుడు కావ్యాలు ఒకెత్తు. వీటిలో రొమాంటిక్ లక్షణాలు స్ఫుటంగా కనబడతాయి. రొమాంటిక్ రచనల్లో విషాదం ఒక ముఖ్యాంశం. ఆ విషాదం కవి వ్యక్తిగత అనుభూతుల మీద గానీ, కావ్యనాయకుడి ఆంతరంగిక అనుభూతుల మీద గానీ లగ్నం చెయ్యడం జరుగుతుంది. అలాగే స్వేచ్ఛాకాంక్ష, నియమనిబంధనలను వ్యతిరేకించడం రొమాంటిక్ కవికి ముఖ్యలక్షణాలు. సంగీతం పట్ల అభిరుచి వీటన్నిటికీ జత కలుస్తుంది. బైరన్ లక్షణాలను పుణికి పుచ్చుకున్న పుష్కిన్, వాటికి రష్యన్ తత్వాన్ని జోడించాడు. తన స్వంత వ్యక్తిత్వాన్ని నిరూపించాడు. అందుకే పుష్కిన్ ఒక అనుకరణ కవిగాక, మహాకవి అయ్యాడు. ఈ దారిలోనే లేర్మొంతొవ్ కూడా నడిచాడు.

లేర్మొంతొవ్ తొలి యవ్వన దశలోనే, 16 వ ఏటే 'దేవత' రాశాడని ముందే చెప్పుకున్నాం. అంత చిన్న వయస్సులోనే రాసినా, బ్రహ్మాండమైన శక్తీ ఉరవడీ దానిలో ఉన్నాయని ప్రసిద్ధ విమర్శకుడు బెలిన్స్కీ చెప్పాడు. ఇక 'దీక్షార్థి' కావ్యంలో దీక్ష తీసుకోవడం కోసం వచ్చినవాడు మఠ జీవితానికీ, జైలుకీ తేడాలని గ్రహించి, స్వేచ్ఛ సంపాదించుకోవడానికి ఏ ప్రమాదాన్నయినా ఎదుర్కోవడానికి సాహసించడం వస్తువు. ఇక 'రాక్షసుడు' లో స్వేచ్ఛ కోసం దేవుడి మీద తిరుగుబాటు చేసిన వ్యక్తి, స్వర్గచ్యుతుడై, 'తమార' అనే సుందరిని ప్రేమించి, అందులో విఫలం కావడం వస్తువు.(ఇక్కడ మిల్టన్ కవి రాసిన 'పారడైజ్ లాస్ట్' కావ్యంలో 'సాటన్' దుష్ట పాత్ర కాకుండా, మెచ్చుకునే తిరుగుబాటుదారునిగా వర్ణించిన విషయాన్ని గుర్తుంచుకోవాలి).

లేర్మొంతొవ్‌కి అనతి కాలంలోనే ప్రసిద్ధ కవిగా గుర్తింపు వచ్చింది. పుష్కిన్ మార్గానుయాయిగా, తన స్వేచ్ఛా కవితల ద్వారా బాధింపబడి, ప్రవాసం పంపబడ్డాడన్న ఖ్యాతీ వచ్చింది. దాంతో ఇతర కవులూ, రచయితలూ, పత్రికా రచయితలు అతని యెడ ఆసక్తి కనబరచడం ప్రారంభించారు. 1840 ప్రాంతంలో విప్లవకర ప్రజాస్వామిక సాహిత్య విమర్శకుడు 'విస్సారియెన్ బెలిన్స్కీ' ని కలుసుకున్నాడు లేర్మొంతొవ్. బెలిన్స్కీ, లేర్మొంతొవ్‌ని రష్యన్ సాహిత్యానికి ఒక గొప్ప ఆశాకిరణంగా, పుష్కిన్ మరణాన్ని భర్తీ చేసే సమర్థునిగా పేర్కొన్నాడు.

1830 వ దశాబ్దం చివరికే లేర్మొంతొవ్ యొక్క సృజనాత్మక రచనా మార్గం స్పష్టమయింది. ఆ కాలం రచనల్లో స్వేచ్ఛా ప్రియునిగానే కాక, తాత్విక అవగాహన కల ఒక మేధావిగా కనిపిస్తాడు. సమకాలికమైన ప్రతిదాన్నీ అనుమానించి, విశ్లేషించడం అతని కవితా తత్వంలో ఒక భాగం అయింది. ఇదే విషయం అతని "ఆలోచన" అనే కవితలో కనబడుతుంది. "రుజువులు లేనిదే ఏదీ సత్యంగా భావించకు" అంటాడు ఆ కవితలో. అలాగే అంతకు పూర్వం కాకసస్ కి సంబంధించిన "మ్త్స్యీ"(Mtsyi) ఇంకా "దెమోన్" అనే కవితలలో తను చేసిన "ఊహా కల్పితమైన, నమ్మశక్యం గాని వర్ణనల్ని, తన తదనంతర రచనలలో వాటి వాస్తవిక రూపాలను మన ముందుంచుతాడు.

లేర్మొంతొవ్ యొక్క పరిపూర్ణత పొందిన వచనం అతని ఏకైక నవల "గెరొయ్‌నషిగొ వ్రెమేని" (మనకాలం నాయకుడు) లో కనిపిస్తుంది. ఇందులో సమకాలిక జీవనచిత్రం కళాత్మక విమర్శన కనిపిస్తుంది. ఈ నవల మన ప్రస్తుత వ్యాసాంశం గనుక, దీన్ని గురించి తర్వాత తెలుసుకుందాం. నవలా రచన తర్వాత, 1840 ఫిబ్రవరిలో ఫ్రెంచి రాయబారి కొడుకుతో ద్వంద్వ యుద్ధం చేశాడన్న సాకుతో సైనిక న్యాయస్థానంలో అవిధేయ కవి అయిన లేర్మొంతొవ్‌ని విచారించి, జార్ సూచనల మేరకు, తిరిగి కాకసస్‌కి ప్రవాసం పంపించారు. అతను కాకసస్‌కి వెళ్ళిన కొద్ది రోజుల్లోనే, అతని దళం ఒక ప్రమాదకర యుద్ధం చెయ్యాల్సివచ్చింది. ఆశ్విక దళాల దాడి అనంతరం, బాహాబాహీగా జరిగిన ఒక పోరాటంలో లేర్మొంతొవ్ గొప్ప పరాక్రమాన్ని ప్రదర్శించాడు. ఆ యుద్ధం 'వలెరిక్' నది ఒడ్డున జరిగింది. ఈ యుద్ధాన్ని గురించి 'వలెరిక్' పేరుతో రాసిన ఒక కవితలో అతడు వర్ణించడం జరిగింది. అంతకు పూర్వమే లేర్మొంతొవ్ తన పరాక్రమానికి 'సాహసానికి చిహ్నంగా' అనే మకుటం చెక్కబడిన కరవాలాన్ని బహుమతిగా పొందాడు. ఇప్పుడు జరిగిన ఈ యుద్ధంలో అతని ధైర్యసాహసాలకు గాను బంగారు పతకానికి సిఫారసు చేశారుగానీ, జార్ మొదటి నికొలస్ దాన్ని నిరాకరించాడు.

ఈసారి కూడా అతని ప్రవాసాన్ని తప్పించేందుకు అమ్మమ్మ తీవ్రంగా కృషి చేసింది. అయితే ప్రవాసం రద్దు కాలేదు గాని, కొద్ది వారాల సెలవు మాత్రం ఇచ్చారు. అందువల్ల లేర్మొంతొవ్ తిరిగి రాజధాని వచ్చి, తన రచనా కార్యక్రమాన్ని కొనసాగిస్తూ, అంతకు పూర్వమే ప్రారంభించిన రచనల్ని పూర్తి చేయడానికి పూనుకున్నాడు. అలాగే కొన్ని కొత్త ఖండికలూ రాశాడు. ఆ ఖండికలలో అతని ఆలోచనా పరిపక్వత స్పష్టమవుతుంది. అలాంటి కవితా ఖండికలలో 'మాతృభూమి', 'మరి నేను ప్రేమలో పడ్డాను' వంటి ఉన్నాయి. ఇవి రాశాక తనే ఒక స్వంత పత్రిక ప్రారంభిద్దామన్న ఆలోచనలతో, అందుకు తగిన ప్రణాళికలూ సిద్ధం చేసుకుని, ఈ విషయంపై నాటి ప్రసిద్ధ విమర్శకుడు 'బెలిన్స్కీ' అభిప్రాయం అడిగాడు. ఇంతలోనే కొంపలు మునిగినట్టు అతన్ని తక్షణం సైన్యంలోకి వచ్చి, విధులు నిర్వర్తించాల్సిందిగా ఆజ్ఞలు జారీ అయ్యాయి. వాటిని చూశాక తనకేదో కీడు మూడిందని శంకిస్తూ రాజధాని నుంచి బయలుదేరాడు. సుదీర్ఘమైన ఆ ప్రయాణంలో వరదలా ముంచెత్తిన సృజనాశక్తితో తన చిట్టచివరి నోట్ పుస్తకంలో రష్యన్ సాహిత్యంలోనే నిరుపమానమైన గేయాలెన్నింటినో రాశాడు. వాటిలో 'ఉప్పెన', 'వాదం', 'నువ్వు కాదు, నేను ప్రేమించాను గాఢంగా', 'రోడ్డు పైకి ఒంటరిగా నేను', 'ప్రవక్త' మొదలైనవి ఉన్నాయి. ఈ చివరి గేయమే అతని తుది రచన.

తన రెజిమెంటుకి వెళ్ళే దారిలో అతడు ఆరోగ్యస్థలమైన "ప్యాతిగోర్స్క్" లో చికిత్స నిమిత్తం కొద్ది రోజులు ఆగాడు. ఆ కొద్ది సమయంలోనే నవనాగరికులైన సెయింట్ పీటర్స్‌బర్గ్ పట్టణానికి చెందిన యువక బృందాలను కలిశాడు. అయితే అలా కలిసిన వారిలో రహస్యంగా కొంతమంది తన పతనాన్ని కోరుకుంటున్నవారు కూడా ఉన్నట్లు అతనికి తెలియదు. అలాంటి వారిలో కొంతమంది అతని నాలుక్కి జడిసిన వారుండగా, మరి కొందరు అతనికి అన్యాయంగా ఖ్యాతి లభించిందని అసూయపడినవారు. అలాంటి వారంతా అతని చుట్టూ చేరి ఒక విద్వేష పూరిత వాతావరణాన్ని ఏర్పరిచారు. అలాంటి పరిస్థితికి పరాకాష్టగా లేర్మొంతొవ్‌కి, ఎన్.ఎస్.మర్తీనొవ్ అనే ఒక సైనికాధికారికి మధ్య ఘర్షణ రేగి, చివరికది ద్వంద్వ యుద్ధంగా పరిణమించింది. ఆ యుద్ధంలోనే గుండు సూటిగా తగిలి లేర్మొంతొవ్‌కి మరణం ప్రాప్తించింది. ఏ రాజాస్థానం వారి ప్రమేయం వల్ల రష్యన్ కవితా పితామహుడు పూష్కిన్‌కి ద్వంద్వ యుద్ధంలో మరణం సంభవించిందో, అదే రాజాస్థానం ప్రమేయం వల్ల లేర్మొంతొవ్‌కి కూడా ద్వంద్వ యుద్ధంలో మరణం సంభవించిందని ప్రజలంతా భావించారు. మరణం తర్వాత రెండు రోజులకు 'ప్యాతిగోర్స్క్' మునిసిపల్ శ్మశానవాటికలో అతని శవం ఖననం చేశారు. ఆ కార్యక్రమానికి ఆ పట్టణంలోని యావన్మంది ప్రజలూ హాజరై శ్రద్ధాంజలి ఘటించారంటే, కేవలం 27 సంవత్సరాల వయస్సుకే అతడెంతగా ప్రజల హృదయాల్లో నిలిచిపోయిందీ అర్థం చేసుకోవచ్చు. ఆ తర్వాత అతని శవపేటికను 'తర్ఖానా' ఎస్టేట్‌కి తరలించి, ఏప్రిల్ 23, 1942 న 'ఆర్సెన్యేవ్' కుటుంబ శ్మశాన వాటికలో అంత్యక్రియలు చేశారు.

లేర్మొంతొవ్ యవ్వనవంతమైన గీతాలలో ఆవేశంతో కూడిన తీవ్ర స్వరంతో స్వేచ్ఛ కోసం పోరాడమన్న పిలుపు వినిపిస్తుంది. అంతేగాక ఆయన రచనలన్నిటా, అందుకోసం ఆయన పడిన ఆవేదన కనిపిస్తుంది. వాటిలోని వీరోచిత కృత్యాలలో ఆయన కన్న కలలు కనిపిస్తాయి. 1830 నాటి రైతాంగ సాయుధ పోరాటాల వల్ల ఎప్పటికైనా జార్ కిరీటం నేల వాలక తప్పదని ఆయన గ్రహించాడు. అలాగే 1830 జులైలో జరిగిన ఫ్రెంచి విప్లవం వల్ల ఛార్లెస్-10 పతనమవడాన్ని హర్షిస్తూ పద్యం కూడా రాశాడు. ఈ అంశం అతని తదనంతర రచనలలోనూ చోటు చేసుకుంది (ఉదా॥ సాష్కా).

లేర్మొంతొవ్‌పై రొమాంటిసిజమ్ ప్రభావం ఎక్కువగా ఉన్నప్పటికీ, అతనిలోని ప్రత్యేకత ఏమిటంటే ప్రాపంచిక వాస్తవికతకు కూడా పెద్ద పీట వెయ్యడం. అందువల్లనే చారిత్రకంగానే గాక, వాస్తవికంగా ఉండే ఘటనల ఆధారంగా మాత్రమే తన రచనల్లోని పాత్రల స్వభావాన్ని ఏర్పరిచాడు. అంత మాత్రంతోనే సంతృప్తి పడకుండా, రొమాంటిసిజానికి మూలాధారమైన పద బంధాలలోనూ, నుడికారాలలోనూ పొందికలేని వాటిని, వాస్తవ విరుద్ధమైన వాటిని తన తదనంతర రచనల్లో క్రమేపీ స్థానం లేకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. రొమాంటిసిజం నుండి వాస్తవికత వైపు పయనించడం అనేది అనాసక్తమైన వర్ణచిత్రాలనుంచి సాంఘిక వాతావరణాన్ని పునః సృష్టించడం లాంటిది. రోజువారి జీవితాన్ని ప్రజల నుంచి పాత్రల్ని ఎన్నుకోవడం ద్వారా సాధించ వచ్చునని చూపించాడు. జ్ఞానసంబంధమైన అంశాలతోటి వ్యక్తిగత ఆలోచనలను కలగలిపినట్లే, తాత్విక భావాలతోటి ప్రజల సామూహిక భావాలనూ జతగలిపి రచనా వస్తువులుగా స్వీకరించడం అతని కవిత్వంలో కనిపిస్తుంది. వస్తువుకి సంబంధించేగాక, ఛందస్సు విషయంలోనూ లేర్మొంతొవ్ పెక్కు ప్రయోగాలు చేశాడు. అంతకుపూర్వం ఏ మాత్రం లక్ష్యం లేకుండా, కేవలం లక్షణ మాత్రంగా ఉన్న ఒక కఠిన ఛందస్సుతో వీరోచిత గంభీర స్వరంతో ప్రథమ రాగాలాపన చేసిన ఒక ఖండిక శక్తివంతమైన మేధో వ్యక్తీకరణగా యావత్తు రష్యన్ సాహిత్యంలోనే విశిష్టమైనదిగా గుర్తింపు పొందింది. ఆయన సృజనాత్మక కృషి రష్యన్ సాహిత్యంలో స్వర్ణయుగ స్థాపనకు దారి తీసింది. అందుకు కృషి చేసిన ప్రసిద్ధ రచయితలు ఇవాన్ తుర్గనెవ్, లేవ్ తొల్‌స్తోయ్, ఫార్యదోర్ దొస్తొయేవ్‌స్కీ, ప్రసిద్ధ కవులు నెక్రసోవ్, ఎ.ఎ.బ్లాక్, మయకోవ్‌స్కీల మీద అతని ప్రభావం ఉంది. కవిగాను, రచయితగాను, నాటకకారునిగానూ మాత్రమే గాక, సంగీతంలోనూ, చిత్రలేఖనంలోనూ గొప్ప నైపుణ్యం కనబరిచిన లేర్మొంతొవ్ వారసత్వం రష్యన్ సాహిత్యకారులు, సంగీతకారులూ మాత్రమే కాక, నాటక, సినిమా నటులూ అందిపుచ్చుకున్నారు. ఆయన నాటక కళా వికాసంలో ఒక ముఖ్యపాత్ర పోషించాయి. అంతేగాక, ఆయన జీవితమే అనేక నవలలకూ, పద్యాలకూ, నాటకాలకూ, అలాగే సినిమాలకూ ఒక ముడిసరుకుగా పనికి వచ్చింది.

ఇక ఇప్పుడు వ్యాసాంశంలోకి వెళ్ళేముందు ఈ నవలకు గల నామౌచిత్యాన్ని గురించి పరిశీలించడం అవసరం. అసలు ఈ నవలకు 'మన కాలం వీరుడు' అని పేరుపెట్టడంలోనే రచయిత ఒక గొప్ప అధిక్షేపాన్ని కనబరిచాడని అనుకోవచ్చు. వీరుడంటే గొప్ప పరాక్రమశాలి అని సాధారణంగా అనుకుంటాం. లేదంటే ఆయా రంగాల్లో పని చేస్తూ, విషమ పరిస్థితుల్లోనూ మనో ధైర్యాన్ని ప్రదర్శించిన వాళ్ళని కూడా అలా భావిస్తాం. కానీ ఈ నవలలోని కథానాయకుడు అలాంటి వానిగా కనబడడు. ఉండడానికి నవలా నాయకుడు 'పెచోరిన్'లో ఎన్నో ఉత్తమ గుణాలున్నాయి. గొప్ప పరిశీలనా శక్తీ, కుశాగ్రబుద్ధీ, ఉన్నత విద్య, మంచిరూపం, వీటికి తోడు డబ్బూ, దాంతో పాటే వచ్చే కొన్ని అవలక్షణాలూ ఉన్నాయి. అయినా అతడు ఏ కాంక్షలూ లేకుండా గడుపుతున్నాడు. స్నేహంలోని విలువ గానీ, ప్రేమలోని ఆనందం గానీ తెలీకుండా! మంచి కాలమంతా వృథాగా గడిపేస్తాడు. గొప్ప గొప్ప సాహసకృత్యాల గురించి అతను కన్న కలలు కల్లలుగానే మిగిలిపోతాయి. అతని హృదయంలో అనుభూతమయ్యే గొప్ప శక్తులన్నీ బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. ఎప్పుడూ ఒంటరిగా, విచారంగాఉంటూ, తనకు దగ్గరైన వారందరికీ వినాశనాన్నైనా కలిగించాడు, లేదా బాధనైనా కలిగించాడు. ఈ విధంగా నిండు

అనువాదం

# గతితార్కిక భౌతికవాదం

- ఐరా గొలోబిన్

(గత సంచిక తరువాయి...)

స్వేచ్ఛానువాదం: కొడవటిగంటి రోహిణీప్రసాద్

## 4

### కార్మికులు వైజ్ఞానిక తత్వశాస్త్రం నేర్చుకోగలరు

సిద్ధాంతాలను ప్రతిపాదించగలిగిన శక్తి సామాన్యంగా ప్రతివారికీ ఉన్నప్పటికీ పుట్టుకతోనే ఎవరూ సిద్ధాంతకర్తలుగా అవతరించారు. ".... మనోభావనల ఆధారంగా ప్రతిపాదనలు చెయ్యడమనేది జన్మతః వచ్చే విద్యకాదు, అందుకు రోజువారీ జీవితపు చైతన్యం ఉంటే చాలదు. దానికై నిజంగా ఆలోచించాలి...".[21]

ఇందుకోసం పాటుపడనివారికి అంతా "అగమ్యగోచరంగా ఉండడానికి కారణం వారికి రూపరహిత భావనలను అర్థం చేసుకునే అలవాటు లేకపోవడమే".[22] ఇటువంటిది అలవడాలంటే తక్కిన విద్యల్లాగే అందుకు కొంత శిక్షణ అవసరం అవుతుంది.

గతితర్కం అనేమాట విని, దాని అర్థం తెలుసుకున్నంత మాత్రాన దాన్ని గురించి తెలిసి పోతుందని కాదు. అయితే మనకు తెలియకుండానే మనం కొంత అర్థం చేసుకోగలం. ఎటొచ్చీ "గతితర్కం అంటే ఏమిటో తెలియకమునుపే మనుషులు గతితార్కిక పద్ధతిలో యోచించడం మొదలుపెట్టారు; వచనం అనే మాట తెలియకముందే వచనంలో సంభాషించినట్టుగా".[23] కార్మికుల్లో ఉండే "అసాధారణ" తాత్వికవైఖరిని బూర్జువా సిద్ధాంతకర్తలు గుర్తించకపోవడమూ, మహా అయితే వట్టి లోకజ్ఞానంగా కొట్టి పారెయ్యడమూ మామూలే. గతితార్కిక భౌతికవాదాన్ని అధ్యయనం చేసి, ఆచరించినట్టయితే ఆలోచనల అవగాహన స్థాయి రానురాను పెరుగుతుంది; వాటిలోని ప్రగాఢతా, ఖచ్చితత్వమూ, పొందికా ఎక్కువవుతాయి.

కార్మికులకు సిద్ధాంతాలేవీ తెలియవని పెట్టుబడిదారుల విశ్వాసం. ఈ అబద్ధాన్ని నిజమని నిరూపించడానికి వారు కార్మికులకున్న సహజ శక్తులను తగ్గించడానికీ, అణచడానికీ కష్టపడి ప్రయత్నిస్తూ ఉంటారు. అందుకుగాను వారు తమ ఆధీనంలో ఉన్న విద్యా, ప్రసార మాధ్యమ వ్యవస్థలను ఉపయోగిస్తారు. కార్మికులకు మేధస్సు తక్కువగా ఉంటే బూర్జువా వర్గాలు దాన్ని ప్రకృతి వరప్రసాదంగా భావిస్తారు. నిజానికి అదొక మానసిక వికృతి; బూర్జువా నిపుణులు జాగ్రత్తగా పెంచి, పెంపొందించినది. ఎన్ని అడ్డంకులు ఎదురైనప్పటికీ, చాలా మంది కార్మికులు ఢక్కాముక్కీలు తిన్నైనా సరే, గట్టి శిక్షణను సాధిస్తారు. అది వారిలో నిద్రాణంగా ఉన్న తాత్వికశక్తులను మేలుకొలిపేటటువంటిది.

"పేదరికం వల్ల మార్పుకూ, చర్యకూ, విప్లవానికీ కాంక్ష జనిస్తుంది. ఎంత చక్కటి, కొత్త చిత్రాన్నైనా తెల్లకాయితం మీదనే గీయగలం". (మావో) తప్పుగా అర్థం చేసుకున్నవారికన్నా ఏమీ తెలియనివారే వాస్తవాలను కాస్త బాగా గ్రహించగలరు.

సిద్ధాంతాలనర్థం చేసుకోగలిగిన కార్మికుల పటిమ సాకారం కావాలంటే నిరంతరమూ ప్రయత్నపూర్వకంగా కృషిచెయ్యాలి. ఎదిగీ ఎదగని మానసిక శక్తి అభ్యాసం ద్వారా వారికి ఉన్నత అవగాహన కలుగుతుంది. "ప్రారంభం కష్టంగా ఉంటుందనేది శాస్త్రాలన్నిటికీ వర్తిస్తుంది".[24] వైజ్ఞానిక తత్వశాస్త్రంలోని పరమసత్యాలు అర్థం కావాలంటే బాగా శ్రమపడాలి. "విజ్ఞాన సముపార్జనకు రాజమార్గాలేవి ఉండవు; అందుకోసం కష్టపడి పర్వతారోహణ చెయ్యగలిగినవారే ఉన్నత శిఖరాలనధిరోహించగలుగుతారు".[25]

---

యవ్వనంలోనే పెచోరిన్ ను వృద్ధుడైనట్లుగా చేసింది ఏ జబ్బు? తననుకున్న గొప్ప గొప్ప సాహసకృత్యాలన్నీ ఎందుకు చెయ్యలేక పోయాడు? అతని శక్తులన్నీ ఒట్టినే వృథా ఎందుకయ్యాయి? ఏ పోరాటమూ లేకుండా అతను సోమరితనంతో వాడిపోతూ వృద్ధుడైపోవడం ఎందుకు?

ఎందుకంటే పెచోరిన్ డిసెంబరిస్టు విఫల తిరుగుబాటుకి మూల్యం చెల్లించవలసిన దురదృష్టతరానికి చెందిన వ్యక్తి. ఆ తిరుగుబాటు భగ్నం అయిన ఫలితంగా క్రూర దమనకాండ అమలు జరిగింది. ముఖ్యంగా గాఢ వాంఛలతో ఉరకలెత్తే యువతరం తీవ్ర బాధలకు గురైంది. ఆ తిరుగుబాటులో పాల్గొనేందుకు పెచోరిన్ తరం వాళ్ళు మరీ చిన్నవాళ్ళు. ఆ తర్వాత పదేళ్ళలో వాళ్ళు పెద్ద వాళ్ళవలేదు, భగ్నం అయిపోయారు. ఏ రకమైన జీవితాసక్తీ లేక క్షుద్రంగా, పిరికిగా, బానిసత్వంతో ఉన్న సమాజ పరివేష్టితులై అంటాడు ప్రసిద్ధ విప్లవకారుడు హెర్జెన్.

లక్షలాది ప్రజల అవమానకర బానిసత్వం తలుచుకుని ఒకప్పుడు పెచోరిన్ బాధపడతాడు. కానీ కాలం గడిచే కొద్దీ తన అత్యుత్తమ అనుభూతుల్ని హృదయపు లోతుల్లో ఎక్కడో మూసి పెట్టేసి, ఆ ప్రజల బాధని నిర్లిప్తంగా చూడడం నేర్చుకుంటాడు. మొదట్లో తన అసహాయతతోటి తను నిరాశ పడతాడు. క్రమేపీ దేన్నీ నమ్మకుండా, ఆశించకుండా బతకడం నేర్చుకుంటాడు. ఆ రకంగా తన మాటల్లోనే నైతికంగా కుంగిన మనిషి అయిపోతాడు. అతనలా ఉన్నందుకు తప్పు అతనిలో లేదు. చెడు అతనిలో లేదు. భూస్వామ్య దాస్య సమాజ స్వభావంలో ఉంది. అందుకే పెచోరిన్ని లేర్మొంతొవ్ "మన కాలం వీరుడు" అని పిలిచాడని అంటాడు ప్రముఖ రష్యన్ సాహిత్య విమర్శకుడు ఆంద్రోన్నికొవ్.

ఇప్పుడు ఈ నవలలోని కథాంశాలను పరిశీలిద్దాం. 

(ఇంకా ఉంది)

ఒక భౌతిక శాస్త్రవేత్త చెప్పినట్టుగా "వైజ్ఞానిక విషయాల్లోని నిగూఢమైన సత్యాలన్నీ తేటతెల్లంగా ఉన్నట్టే అనిపిస్తాయి; అయితే వాటిని కష్టపడి నేర్చుకోవాలి; తరుచుగా ఆచరణలో పెడితే మరీ మంచిది. ఆ సత్యాలను తమంతట తామే తెలుసుకున్న వారికీ, అర్థం చేసుకున్న వారికీ ఇది ఇంకా సులువు".[26] నిజానికి "ఒక భావనో, సిద్ధాంతమో పూర్తిగా అర్థమవాలంటే దాన్ని మళ్ళీ కనిపెట్టినంత పనిచెయ్యాలి".[27] బాగా నేర్పుగలిగినవారే దీన్ని వివరించగలరు.

కేవలం చదివినంత మాత్రాన వైజ్ఞానికతత్వశాస్త్రం పట్టుబడదు; నేర్చుకున్నదాన్ని నిజ జీవితంలో అర్థవంతంగా ఆచరించాలి. అధ్యయనాన్ని ఆచరణతోనూ, రోజువారీ జీవితానికీ, ప్రాథమిక సమస్యలకూ సంబంధించిన మరింత అధ్యయనాన్ని ఇంకొంత ఆచరణతోనూ ముడిపెట్టాలి; అప్పుడే మొదట్లో కాస్తకాస్తగా అర్థమయినదంతా రానురాను లోతైన అవగాహనగా రూపొందుతుంది. చిన్న చిన్న అడుగులు వేస్తూ పోతే ఎంత దూరాన్నయినా జయించవచ్చు. "చదివినది మొదట్లో అర్థం కాకపోతే మళ్ళీ చదివినప్పుడు అవగతం అవుతుంది; లేదా ఆ తరవాత అదే సమస్యను మరొక కోణం నుంచి సమీక్షించాలి".[28] ఈ సందర్భంలో హెగెల్ రచనలు చదవమని ఎంగెల్స్ ప్రోత్సహిస్తాడు. "హెగెల్ పుస్తకం చదువుతున్నప్పుడు ఊబిలో కూరుకున్నట్టనిపిస్తే నిరాశపడరాదు; ఓ ఆర్నెల్లు పోతే అదే ఊబినుంచి బైటపడే మార్గాలన్నీ మీకే సులువుగా లభిస్తాయి".[29]

తత్వశాస్త్ర అధ్యయనమంతా ప్రధానంగా ఎవరికివారుగా చేసుకోవలసిందే; ఇందుకు సక్రమమైన శిక్షణ కూడా తోడ్పడవచ్చు. దీన్ని నేర్పేవారు కూడా శాఖాపరమైన వేర్పాటు వైఖరి పాటించరాదు. "మేధావి వర్గం నుంచి కొంత మంది నాయకులను తయారు చేసే బాధ్యత తీరిపోయిన దశలో ఇట్టువంటిది అనవసరమే అవుతుంది".[30] సోషలిజం వచ్చేసిన పరిస్థితిలో కొంతవరకూ మేధావులు కానటువంటి కార్మికులూ, కొంతవరకూ కార్మికులు కానటువంటి మేధావులూ ఉండనే ఉండరు.

కొందరు కార్మికులు తత్వశాస్త్రం తమకు చదివినా అర్థం కాదనుకుంటారు; ఇంకొందరేమో తమకున్న విస్తృత అనుభవాల దృష్ట్యా ఏమీ చదవకపోయినా తమకు తత్వశాస్త్రం తెలుసుననుకుంటారు. కానీ అటువంటి అనుభవాల్లో ఎంత వైవిధ్యం ఉన్నప్పటికీ, తత్వశాస్త్రానికి ఆధారమైన విస్తృతజ్ఞానంలో వారికి తెలిసేది చాలా తక్కువే. కార్మికుల అనుభవం వల్ల తత్వశాస్త్ర అధ్యయనం తేలికవుతుంది కాని అనవసరం కాదు. ఇందులో మేధస్సుకు బ్రహ్మాండమైన అడ్డుగోడల్లా నిలిచే అవరోధాలను నిరంతర పరిశ్రమతోనూ, చైతన్యవంతమైన అధ్యయనంతోనూ అధిగమించవచ్చు. 'మొదట్లో అవగాహనకు లొంగవనిపించే విశ్వరహస్యాలన్నీ సాహసవంతమైన జ్ఞానతృష్ణకు లొంగితీరుతాయి; విలువైన, గాఢమైన జ్ఞానసంపద యావత్తూ అటువంటి సాహసానికి లోబడి, దృగ్గోచరమై ఆనందాన్నిస్తుంది".[31] (ఇందులోని సామాన్య సూత్రాలను Play, Dreams and Imitation in Childhood అనే తన పుస్తకంలో (పుట 172) పియాజే ఇలా ప్రతిపాదించాడు. "మానసిక శ్రమ ఫలితమమేటో తెలుస్తుంది కాని అది ఎలా పనిచేస్తుందో మాత్రం తెలియదు". ఫ్రాన్స్‌కు చెందిన బాలల మనోవిజ్ఞాని క్లాపారేడ్ మానసిక చర్యలు ఇలా త్వరగా అవగతం కాకపోవడాన్ని "చైతన్యవంతమైన సంజ్ఞానసూత్రం" అంటాడు).

## అమెరికాలో తత్వశాస్త్రం చరిత్ర బూర్జువాల ప్రాముఖ్యత గురించిన సమీక్ష

తొలిరోజుల్లో అమెరికాకు వలసవచ్చి స్థిరపడినవారికి చుట్టూ ఉన్న పరిస్థితులను మార్చక తప్పలేదు; కొంతమంది తత్వవేత్తల్లాగా కేవలం వాటిని అర్థం చేసుకోవడంతో వారికి సరిపోలేదు. ఏదో చేసెయ్యాలనేదే తప్ప శాస్త్రీయ ప్రాపంచిక దృక్పథం లేకపోవడంతో వీరందరికీ సిద్ధాంతాలంటే ఏవగింపు ఉండేది. అయినప్పటికీ వీరందరూ తమ మాతృదేశాల్లో అమలులో ఉండిన రకరకాల తత్వధోరణులని కలగాపులగమైన పద్ధతిలో గుడ్డిగా ఆచరించడం మాత్రం చేసేవారు. తత్వశాస్త్రాలని గట్టిగా నమ్మినవారి సంఖ్య అప్పట్లో తక్కువే అయినప్పటికీ వలసదేశమైన అమెరికాలో తాత్విక వైఖరి శూన్యంగా మాత్రం ఉండేది కాదు.

వివిధ ప్రాంతాల్లోనూ, సమయాల్లోనూ ఆనాటి తత్వశాస్త్ర వైఖరిలో స్పష్టమైన వర్గవిభజన కనబడేది కాదుగాని, అమెరికా అనుభవాల్లో అది ద్యోతకం అవుతూ, అక్కడికి దిగుమతి అయిన తత్వధోరణుల్లో మార్పులు కలిగిస్తూనే ఉండేది. ఆనాటి "పల్లె వేదాంతి"కి తత్వశాస్త్రంలో సరైన శిక్షణ లేకపోయినప్పటికీ స్థానికంగా కొంత ప్రతిష్ఠ ఉండేది. ఇలాంటివారు ఆర్థిక, రాజకీయ విలువల గురించీ, లోకంలో మానవ జాతికున్న ప్రపత్తి గురించీ అందరికీ తెలిసిన పద్ధతిలో స్థూల ప్రపంచ జ్ఞానం కొంత ప్రదర్శించేవారు. న్యాయవాదులూ, వైద్యులూ, రాచప్రతినిధులూ మొదలైనవారికి మాత్రం శాస్త్రీయ తత్వశాస్త్రంతో పరిచయం ఉండేది. అయితే వీరి అభిప్రాయాలు అధిక సంఖ్యాకుల ఆర్థిక, రాజకీయ ధోరణులకు భిన్నంగా ఉండేవి. అలాంటివారిలో పెద్ద పెద్ద పెద్ద భూస్వాములూ, వ్యాపారస్తులూ, పరిశ్రమల యజమానులూ అందరూ ఉండేవారు. 1743లో బెంజమిన్ ఫ్రాంక్లిన్ స్థాపించిన అమెరికన్ తత్వసమాజంలో (American Philosophical Society) వీరి అభిప్రాయాలను వ్యక్తం చేసే అధికార ప్రతినిధులుండేవారు.

ఇంగ్లండ్ నుంచి స్వాతంత్ర్యం పొందాక అమెరికాలో వర్గ విభజన పెరిగింది. అమెరికా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న డేవిడ్ బ్రౌన్ అనే సైనికుడికి 1798లో కారాగార శిక్షా, 400 డాలర్ల జరిమానా విధించారు. ఎందుకంటే అతనొక స్వాతంత్ర్య స్థూపం నిర్మించాడు. దాని మీద ఇలా రాసి ఉంది. "స్టాంప్ చట్టం, దేశద్రోహ చట్టం, పరదేశీ చట్టం రద్దు చెయ్యాలి; భూమి పన్ను చట్టం పోవాలి. అమెరికా శాంతి సమాజపు నియంతృత్వం కొనసాగరాదు; అధ్యక్షుడు పదవీ విరమణ చెయ్యాలి; ఉపాధ్యక్షుడికీ (థామస్ జెఫర్సన్), అల్పసంఖ్యాక వర్గానికి జయం కలగాలి; పౌర

ప్రభుత్వానికి నీతిమార్గమే ప్రాతిపదిక కావాలి!". షే (Shay) తిరుగుబాటుకూ (1786-87), విస్కీ తిరుగుబాటుకూ (1794) గల మూలకారణాలు కొన్ని అతని ఈ ప్రకటన వల్ల తెలుస్తాయి.

"అమెరికా సంయుక్త రాష్ట్రాల యాభై లక్షల మందిలో అయిదు వందల మందికే పబ్లిక్ ఆస్తివల్ల లాభాలన్నీ కలుగుతున్నాయి; తక్కిన సమాజపు శిథిలాలమీదనే వారికి పూట గడుస్తుంది. సమాజంలోని శ్రామికవర్గానికీ, ఆ వర్గాన్ని ఎలాగైనా తుదముట్టించేందుకు రకరకాల పైశాచిక కుయుక్తుల నుపయోగించే సోమరిపోతు వెధవలకీ మధ్య నిరంతరం పోరాటం జరుగుతూనే ఉంది; మనం ప్రజాప్రతినిధులుగా ఎన్నుకున్న వాళ్ళందరూ తమ బాధ్యతలు నిర్వర్తించకుండా, వెర్రి వెంగళప్పల్లాగా నోటికొచ్చినట్టు పేలుతూ, అదే ధోరణిలో కొనసాగడానికి ఎంతకైనా తెగిస్తున్నారు".[32]

1787లో రహస్యంగా జరిగిన రాజ్యాంగ సమావేశంలో పారిశ్రామికవేత్తలూ, బానిసల యజమానులూ, భూస్వాములూ, వ్యాపారస్తుల ఆర్థిక, రాజకీయ ఆధిపత్యాన్ని పటిష్టపరిచే ప్రయత్నం జరిగింది. వెళ్ళగొట్టబడిన బ్రిటిష్ పాలకుల స్కాట్లండ్ తరహా వాస్తవిక లోకజ్ఞానం దీనికొక తాత్విక ప్రతిరూపంవంటిది. 1780 లగాయతు కళాశాలల్లో తత్వశాస్త్ర అధ్యాపకులుగా వృత్తిపరమైన శిక్షణనిచ్చే ప్రయత్నాలు మొదలయాయి. "ఎన్ని జాతులున్నప్పటికీ పద్దెనిమిదో శతాబ్దం ముగిసేనాటికి విదర్స్పూన్ అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయంలో స్కాట్లండ్ తరహా లోకజ్ఞాన తత్వశాస్త్రంలోనే శిక్షణ మొదలయింది. ఇది క్రమంగా పెరిగి తత్వశాస్త్రమంతా దాదాపుగా ఈ పద్ధతిలోనే కొనసాగింది.. ఇందులో సున్నితమైన వాద ప్రతివాదాలుండేవి కావు; అన్నీ బలమైన మొరటు నమ్మకాలే. దీనివల్ల బైబిల్ బోధనలను అక్షరాలా పాటించే వైఖరి సులువయేది కనక స్వతంత్ర భావాలు కలవారిని బాధించడం వీలయింది".[33]

చదువురాని సామాన్యులకూ, పెద్ద చదువులు చదివిన వారికీ కూడా తత్వశాస్త్రంలో శిక్షణ పొందడం ఒక అనవసర భేషజంలాగా అనిపించేది. పెరుగుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థకు ఎదుగుదల అనేది తీవ్రమైన సమస్యగా ఉండేది కాని అసాధ్యమనిపించేది కాదు. సమస్యల్లో సైద్ధాంతికమైనవీ, వ్యవస్థాత్మకమైనవీ ఏవీ ఉండేవి కావు. 1830లలో ఫ్రెంచ్ రచయిత డి టోక్విల్ 'అమెరికాలో ప్రజాస్వామ్యం' అనే తన ప్రసిద్ధ పరిశోధన మొదలుపెట్టి, అమెరికన్ల తాత్వికపద్ధతిని ప్రస్తావిస్తూ, "నాగరిక ప్రపంచంలో తత్వశాస్త్రాన్ని అమెరికాలాగా ఎవరూ నిర్లక్ష్యం చెయ్యరని నా అభిప్రాయం" అన్నాడు. వారి తత్వశాస్త్ర పద్ధతిలోని ముఖ్య ధోరణిని గురించి చెపుతూ "మానసిక చర్యల విషయంలో ప్రతి అమెరికన్ తన కర్తవ్యమైనంత మేరకు ప్రధానంగా వ్యక్తిగత కృషిని గురించే ప్రస్తావిస్తాడు" అన్నాడు.[34]

1880ల గురించి చెపుతూ జాన్ డ్యూవీ "అప్పట్లో తత్వశాస్త్రాన్ని నేర్పేవారంతా మతాచార్యులే; దాదాపు అన్ని కళాశాలల్లోనూ తత్వశాస్త్ర బోధనలో మతానికీ, దైవశాస్త్రానికీ పనికొచ్చే విషయాలే ప్రధానంగా ఉండేవి... మానవజీవితాలకు అవసరంగా భావించబడిన దైవశాస్త్రంతోనూ, దాని నీతి నియమాలతోనూ తత్వశాస్త్ర శిక్షణ ఎంతగా ముడిపడి ఉండేదంటే వాటికి ఎదురుచెప్పడం ఊహించరానిదిగా ఉండేది".[35]

తత్వశాస్త్ర విద్య యావత్తూ ఎంతోకాలం పాటు దైవశాస్త్రపు ఊబిలో కూరుకుపోయి ఉండడాన్ని గురించి ఎం.ఆర్.కోహెన్ 1950లలో రాశాడు. "ప్రధానంగా పాలకవర్గాల ప్రయోజనాలకే దోహదపడే సామాజిక, ఆర్థిక వాతావరణం మేధోవికాసానికి అడ్డు తగిలింది. అందువల్లనే తత్వశాస్త్రమంతా రోజువారి పనుల దినచర్యకూ, మతాల ఓదార్పు ప్రక్రియలకూ పరిమితమయి పోయింది. కారణాలేవైనప్పటికీ అమెరికాలోని తత్వశాస్త్రమంతా ఎక్కువగా క్రైస్తవ మతపు సంజాయిషీ ధోరణిగానే మిగిలిపోయింది. రాజకీయంగా ప్రజాస్వామిక వ్యవస్థలో జీవిస్తున్నప్పటికీ మన మత తాత్వికులంతా ఉన్నత రాజవంశపు పరివారంలాగే ప్రవర్తించారు..".[36] ఈ వైఖరి వల్లనే "దేవుణ్ణి నమ్మనివారెవరూ తత్వవేత్తలు కారనే అభిప్రాయం అమెరికా అంతటా బలపడిపోయింది".[37]

బూర్జువాలు, బానిస యజమానులతో కూడిన పాలకవర్గాల ప్రయోజనాల్లో ఇటువంటి పరలోక చింతన బాగా పాతుకు పోయింది. "ఆ కారణంగానే మన వలస వ్యవస్థా, విప్లవ యుద్ధమూ, బానిస విధాన వ్యతిరేకతా, అంతర్యుద్ధమూ, ఎందరో వలసవచ్చి స్థిరపడడమూ, సరిహద్దు ప్రాంతాల్లో స్వేచ్ఛాజీవనమూ ఇవేవీ కూడా అమెరికాలోని తత్వశాస్త్ర శిక్షణపై తమ ప్రభావం చూపలేక పోయాయి..."[38]. దైవశాస్త్రానిదే పై చెయ్యి కావడం, యథాస్థితి కొనసాగేందుకు ఏవో సాకులు చెపుతూ ఉండడం వగైరాలన్నీ చూస్తే బానిస విధానం పట్ల తటస్థ వైఖరి ఎందుకుందో అర్థమౌతుంది. ఎందుకంటే "జాన్ సి. కల్హూన్ రచనలు ఏవో కొన్నిటిలో తప్ప మన ప్రధాన తత్వగ్రంథాల్లో నీగ్రో జాతులు బానిసలుగా ఉండేవారన్న ప్రస్తావన ఎక్కడా కనబడదు. ప్రసిద్ధమైన స్వాతంత్ర్య ప్రకటనను రచించి, 1797 నుంచి 1815 దాకా అమెరికన్ తాత్విక సమాజానికి అధ్యక్షుడుగా పనిచేసిన జెఫర్సన్ వంటి ఉదారవాద ప్రజాస్వామిక తత్వవేత్తలు కూడా ఒక వంక బానిసలను ఉంచుకోవడం, అమ్మడం చేసేవారు; మరొకవంక మనుషులందరూ సమానులనీ, స్వేచ్ఛాజీవులనీ కూడా నమ్మేవారు...".[39] (అమెరికన్ తాత్విక సమాజాన్ని స్థాపించిన ఫ్రాంక్లిన్కూ, జెఫర్సన్కూ నల్లవారిని గురించి ఎటువంటి సాంస్కృతిక వైఖరి ఉండేదో స్టీవెన్ జే గోల్డ్ The Mismeasure of Man, అనే తన పుస్తకంలో వివరిస్తాడు, పుట 32).

బూర్జువా తత్వవైఖరికి దైవశాస్త్రం ఇలా అడ్డుతగలడంతో తత్వశాస్త్రానికి ఉండవలసిన విశ్వ దృక్పథానికీ, విజ్ఞానం ద్వారా తెలియవలసిన విషయాలకూ విఘాతం కలిగినట్టయింది. "లాక్ తరువాత ఆంగ్ల అమెరికన్ తత్వశాస్త్రమంతా మనుషుల మనోవైజ్ఞానిక ప్రవృత్తిమీదా, వారి ధార్మిక విధుల మీద మాత్రమే కేంద్రీకృతం అయింది".[40] (1688లో జరిగిన "దివ్యవిప్లవం"

తరవాత బ్రిటిష్ పెట్టుబడిదారీ విధానం అక్కడి భూస్వామ్యపద్ధతికి స్వస్తి పలికింది) ఇటువంటి వైఖరి ప్రాచీన పాలకవర్గాల్లోనూ ఉండేది. "రోమన్, గ్రీక్ సంప్రదాయాల్లో మనుషుల వ్యవహారాలను అతిగా పట్టించుకోవడంవల్లనే తత్వశాస్త్రం సంకుచితమై, ఉదారతను కోల్పోయింది".[41]

ఇటీవలిదాకా తత్వశిక్షణలో దైవశాస్త్రానిది పెద్ద పాత్రే కాని, 1900 ప్రాంతాల నుంచీ కార్యసాధకవాదం (ప్రాగ్మాటిజం) దీనికన్నా బాగా ముందుకొచ్చింది; ప్రజలలో దీనికి ఆదరణ పెరిగింది కూడా. చార్లెస్ పియర్స్ ప్రతిపాదించిన ఇటువంటి తత్వానికి విలియంజేమ్స్ మూలవిరాట్టు వంటివాడు.

విజ్ఞానంలో ప్రగతీ, కార్మికవర్గంలో పెరుగుతున్న అవగాహనలవల్ల సామాన్యప్రజల మీద మతాల పట్టు సడలుతోందని విలియం జేమ్స్ గుర్తించాడు; యథాస్థితి కొనసాగడానికి కార్యసాధకవాదమే మంచిదని అతను ప్రతిపాదించాడు. తన బూర్జువా సలహాదారులతో అతను "మీకు కావలసిన వ్యవస్థలో శాస్త్రీయ వాస్తవాలను ఆమోదించి, వాటిని గుర్తించే సదుపాయం ఉండాలి; అనుకూలతా, అనుగుణ్యతా కావాలి. అయితే మునుపటిలాగా మానవ విలువలపై విశ్వాసమూ, దానివల్ల అప్రయత్నంగా కలిగే సద్యోజన ఫలితాలు కూడా అవసరమే; అవి మతపరమైనవి కావచ్చు, కాల్పనికమైనవి కావచ్చు" అన్నాడు.[42] అందువల్ల "కాస్త విచిత్రంగా అనిపిస్తుందిగాని, నా లెక్కన ఈ రెండు అవసరాలనూ తీర్చగలిగిన తత్వశాస్త్రం కార్యసాధకవాదమే. అది ఒకవంక హేతువాదాల్లాగా మతలక్షణాలను కోల్పోకుండా, మరొకవంక అనుభవవాదంలాగా వాస్తవాలకు అతి దగ్గరగానూ కూడా ఉండగలదు".[43] చివరగా జేమ్స్ 'మీకు అవసరమయే ఆలోచన విధానానికి కార్యసాధకవాదమే దారితీయగలదని నా ఆశ' అన్నాడు.[44]

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభానికల్లా ఏ శషభిషలూ లేనటువంటి కార్యసాధకవాదమే అమెరికా పెట్టుబడిదారీ పద్ధతిని సామ్రాజ్యవాదరంగంలో ప్రవేశపెట్టగలిగింది. (జేమ్స్ 'మీరు, మీకు అవసరమయే" అన్నదిందుకే) ఈ పరిణామమే అమెరికా ప్రపంచం మీద "గుత్తాధిపత్యాన్ని" కోరేందుకు ప్రేరకమయింది. రెండో ప్రపంచయుద్ధం ముగిశాక, ఈ లక్ష్యాన్ని సాధించిన ఉన్నత దశలో, రాక్‌ఫెల్లర్ సంస్థ అమెరికా తత్వశాస్త్ర సమాజం (1945లో 870 మంది) సభ్యులను ఆహ్వానించింది. వారిని "సమకాలీన తత్వశాస్త్ర పరిస్థితిని పరిశీలించి, యుద్ధానంతర ప్రపంచంలో అది నిర్వహించగలిగిన పాత్ర ఎటువంటిదో అంచనావెయ్య"మని ఆదేశించింది.[45] అయితే అప్పటి బూర్జువా తత్వవేత్తలంతా అర్థం లేని ముఠా తగాదాలతో సతసతమౌతు ఉండిపోయారు; అందుచేత అమెరికా సామ్రాజ్యవాదపు ఆర్థిక, రాజకీయ, సైనిక ప్రణాళికలకు ప్రపంచవ్యాప్తంగా వత్తాసు పలుకుతూ, చురుకైన సైద్ధాంతిక మద్దతును ఇవ్వడం వారికి వీలుకాలేదు. రాకెఫెల్లర్ సంస్థ అమెరికా తత్వశాస్త్ర సమాజం కోసం సమర్పించిన నివేదిక పరిచయ వాక్యాల్లో ఇలా ఉంది. "సమకాలీన పరిస్థితుల్లో తత్వశాస్త్రం అనేది ఒక పటిష్టమయిన సిద్ధాంతంగా రూపొంది, దాన్ని గురించి సాధికారికంగా చెప్పగలిగిన ప్రతినిధులెవరూ కనబడరు. ఎన్నో తత్వధోరణులూ, ఎందరో తత్వవేత్తలూ కనబడుతున్నప్పటికీ తమ ముందుకొచ్చిన కొన్ని సమస్యల విషయంలో మాత్రమే భిన్నాభిప్రాయాలు తలెత్తడం చూస్తాం".[46]

ఒకప్పుడు ఆత్మవిశ్వాసంతో ముందడుగేసిన పెట్టుబడిదారీ విధానంలో ఇప్పుడు కార్యసాధకవాదమే తత్వపరంగా ముఖ్యాంశమయింది. చైనా, కొరియా, వియత్నాంలలో అమెరికన్ సామ్రాజ్యవాదానికి ఎదురైన ఓటములూ, ఇతర సంక్షోభాలూ, క్షీణదశ లక్షణాలు మొదలైన కారణాల వల్ల కార్యసాధకవాదం పట్ల బూర్జువాలకు ఆసక్తి పెరిగింది. ఇలాంటప్పుడు అస్తిత్వవాదమే ప్రయోజనకరంగా అనిపిస్తుంది. దానివల్ల కళ్ళెదుట కనబడుతున్నది మాత్రమే యదార్థమనీ, అస్తిత్వమనీ, అంతర్గతంగా ఉండే లోతైన భౌతిక వాస్తవాలన్నీ యదార్థమైనవి కావనీ అనిపిస్తుంది. అస్తిత్వవాదం పెట్టుబడిదారీ గుత్తాధిపత్యపు అసమంజసమైన క్షీణదశ లక్షణాలను సామాన్య ప్రజలకు వివరించి, అవన్నీ ఆమోదయోగ్యమేనని అనిపించగలదు. వీటన్నిటికీ బూర్జువా వర్గాలను తప్పు పట్టి లాభంలేదనీ, వీటికి అసలైన కారణాలు ప్రతి మనిషిలోనూ, ముఖ్యంగా సామాన్య జనుల్లో సహజంగా ఉండే పాపభూయిష్టమైన బూర్జువా ప్రేరణలేననీ అస్తిత్వవాదం నమ్మించగలదు. మానవుడి సహజ లక్షణాలే అతన్ని పెట్టుబడిదారీ నరకప్రాయమైన ప్రపంచంలోకి నెడతాయనీ, ఇదంతా బైబిల్‌లో చెప్పిన పాపాల ఫలితం వంటిదేననీ అది నమ్మబలుకుతుంది. ఇహలోకంలో తప్పించుకునే మార్గమేమీ ఉండదని చెప్పే అస్తిత్వవాదం వల్ల పరలోకంలో నమ్మకం లేనివారందరూ మళ్ళీ దైవసిద్ధాంతానికే తిరిగి రాక తప్పదు. ఇది ఒకరకంగా దైవశాస్త్రానికి లౌకికమైన దొడ్డిదారి. (అస్తిత్వవాదం గురించిన వాస్తవాల వివరణ రెండో అధ్యాయంలోనూ, ఇతర అధ్యాయాల్లోనూ కనిపిస్తుంది. బైబిల్ వివరాలపై ఆధారపడే "విమోచనాత్మక దైవశాస్త్రం" అనే మరొక సమకాలీన సిద్ధాంత ధోరణి కూడా ఉంది. ఇది అణచివేతను ఎదిరించడాన్నీ, సోషలిజంతో ప్రమేయాన్నీ సమర్థిస్తుంది) దీని లెక్కన "అధోగతికి దారితీయగలిగినవి రెండే రెండున్నాయి ప్రపంచవ్యాప్తమైన కమ్యూనిజమూ, గతితార్కిక భౌతికవాదమూ".[47]

భాషాశాస్త్ర విశ్లేషణ అనబడే మరొక ధోరణి పదాలను అపూర్వ పద్ధతిలో విశ్లేషిస్తుంది. తత్వశాస్త్రమని పేరుపొందిన ఈ పద్ధతి నిజానికి తత్వశాస్త్రానికి వ్యతిరేకం. దీనికి తత్వశాస్త్ర విద్యారంగంలో కొంత ఆదరణ ఉంది. దీన్ని అవలంబించే బూర్జువా అభిమానులకు ఇది అంత ఉపయోగకరం కాకపోయినా క్షేమకరంగా అనిపిస్తుంది.

"1952లో డ్యూవీ చనిపోయాక... అమెరికన్ తత్వశాస్త్రంలో పెనుమార్పులు కలగసాగాయి; అపూర్వమైన తర్కపద్ధతుల వాడకమూ, చిన్న చిన్న విషయాలను కూడా భూతద్దం పెట్టి వెతకడమూ మొదలయింది... దైవశాస్త్రవేత్త జొనాథన్ ఎడ్వర్డ్స్ (1703-1758) నుంచీ డ్యూవీదాకా సమకాలీన వ్యాఖ్యాతలుగా

నవల సీరియల్

# గుమ్మేటమోత

- పాణి

(14)

(గత సంచిక తరువాయి...)

హాస్టల్‌కు వెళ్లినప్పటి నుంచి గిరి ఏదో ఒకటి మాట్లాడుతూనే ఉన్నాడు. ధర్నా బాగా జరగడంతో ఉత్సాహంగా ఉన్నాడు. ఏ ఏ కుల సంఘాల వాళ్లు ఏం మాట్లాడిందీ గుర్తు చేసుకొని మరీ చెప్తున్నాడు. మాలమహానాడు వాళ్లు పిలిచినా రాలేదు. వాళ్లనూ పిలుద్దామని ఉలిగప్పే అన్నాడు.

"రాకపోవచ్చు.." అన్నాడు గిరి.

"అయినా ట్రై చేద్దాం.."

"ఈ జి.ఒ. వెనుక కొందరు పెద్దలు ఉన్నారని, వాళ్లు మాల కులస్తులని కూడా అన్నాం. ఈ గొడవే కులానిదైనప్పుడు ఆ మాట అనకుండా ఎట్లా ఉంటాం? దాంతో ఆ సంఘం వాళ్లు తమ కులాన్ని అన్నామని కులంతో ఐడెంటిఫై అయి ఉంటారు. అందుకే రాలా. అస్తిత్వానికి ఉన్న బలం అదే. అయితే మనం చాలా జాగ్రత్తగా దీన్ని మామూలు మాల ప్రజలకు ఆరోపించలేదు. ఎత్తుగడగా కాదు. నిజం కాబట్టే. ఈ మాట మనవాళ్లకు చెప్పి ఒప్పించడానికి ఎంత యాతన పడాల్సి వచ్చిందో నీకు తెలుసుగా. వీళ్ల ఇబ్బంది ఏమంటే - ఆ జి.ఒ. రావడానికి వెనుక మాల అధికారులు, నాయకులు ఉన్నారని మనమంటే - ఆ కులమంతా ఉన్నట్లు చూస్తారు. కులం అంటే అదే. మనం ఎంత గింజుకున్నా వినరు. కాకపోతే ... మన జనాలకు, లీడర్లకు కూడా పెద్దగా చదువు రాదు కాబట్టి లాజిక్‌లోకి వెళ్లి మాట్లాడ్డం లేదు. గట్టిగా చెప్తే విని ఊరుకున్నారు. దాంతోటి బండి నడుపుతున్నాం. లేకపోతేనా...! మన కత ఉండేదే.." నవ్వాడు గిరి.

"మిగతా వాళ్లయినా బాగానే వచ్చారు.."

"ఈ పంచాయితీలో వాళ్లకు పోయేదీ లేదు... వచ్చేదీ లేదు. అందుకే వచ్చారు. పోతుందనుకున్నవాళ్లు రాలేదు. అసలు రావడమా.. పోవడమా అని కాకుండా న్యాయమా? అన్యాయమా? అనేది ముఖ్యం. కానీ మన లాంటి కులాలన్నీ ఎప్పటి నుంచో పై కులాల చేతిలో దారుణంగా అన్యాయమైపోవడాన.. ఇప్పుడు నా కులానికి ఏం వస్తుందని ఆలోచించడమే న్యాయమైపోయింది. దీన్ని తప్పించుకోలేం. మనదాంతోటి వీళ్లవరికీ నష్టం లేదు. మాదిగ ఉప కులాలన్నీ లేచి కూర్చొని వర్గీకరించి ఎవరిది వాళ్లకు ఇవ్వమంటే... తమకు నష్టం జరుగుతుందని ఎవరనుకుంటారో వాళ్లు సహజంగానే అడ్డం తిరుగుతారు. ఆ సమస్య లేనివాళ్లు ముందుకు వస్తారు. అయితే ఒక తిరకాసు ఉంది. అందరూ బాగానే మాట్లాడినారుగాని, ఏదైనా మెలిక పడితే విడమర్చుకోలేరు. అస్తిత్వాల సంగతి ఎట్లున్నా.. కామన్ ఎనిమీ మీద ఇంకా మనవాళ్లు గురి పెట్టలేకపోతున్నారు.."

"ఎందుకని" ఉలిగప్పకు కొంచెం ఆందోళన కలిగింది.

అది ముఖంలో స్పష్టంగా కనిపించడాన గిరికి తెలిసిపోయింది.

"అది అంతే..." అని గిరి ఇంకా ఏదో చెప్పబోతుంటే ఉలిగప్ప ఫోన్ మోగింది. ఊరి నుంచి తమ్ముడు..

మనసు ఏదో శంకించింది.

"ముసలోన్ని కొట్కూరుకు తోలకొచ్చినా. ఏకున గురగర అంటాండె. ఎంత పిలిచినా పలకలే. బయమైంది. డాక్టరు ఏ సంగతి చెప్పడంలా. గులుకోజు ఎక్కించినాడు. ఇప్పుడు రొంత నయం. ఉసి ఉంటే ఒకపారి రాన్నా" అన్నాడు తమ్ముడు.

ఏం చెప్పాలో వెంటనే తోచలేదు.

"జానన్నను కలిసినావా? " అన్నాడు కొంచెం సేపటికి.

"అన్న ఈడ్నే ఉండాడు. మాట్లాడు.." అని ఫోన్ ఇచ్చాడు.

"ఓల్డేజ్ గదా. మందులు పట్టడం కష్టమని డాక్టరంటుండడు.

---

అమెరికన్ తత్వవేత్తలకు అంతులేని గౌరవం లభించింది; ఎందుకంటే వారికి మతం, రాజకీయాలు, విద్య మొదలైనవాటి పట్ల ఆసక్తి ఉండేది. కాని వారి తరువాత వచ్చినవారు మాత్రం విశాల ప్రపంచాన్ని అంతగా పట్టించుకోలేదు".[48]

References:
21. Engels, Anti-Duehring, p.19.
22. Hegel, Logic, p.165
23. Engels, Anti-Duehring, p.161
24. Marx, Preface to the first edition of Capital, Vol.1, p.11.
25. Marx, Preface to the first edition of Capital, Vol.1, p.21.
26. Bunge, Intuition and Science, p.26.
27. Piaget, The Essential Piaget, p.731.
28. Lenin, Selected Works, Vol.11, p.640.
29. Engels, in Marx and Engels, Selected Correspondence, p.496.
30. Lenin, Selected Works, Vol.11, p.326.
31. Kaufmann, Hegel, p.281.
32. Quoted in Frank M. Anderson, "Enforcement of the Alien and Sedition Laws", pp. 122, 124, in Annual Report of American Historical Association for 1912, See also, James Morton Smith, Freedom's Fetters, pp. 257-274.
33. Cohen, American Thought: A Critical Sketch, p.258.
34. De Tocqueville, Democracy in America, Vol.2, pp.3-4.
35. Dewey, On Experience, Nature and Freedom, pp.6, 20.
36. Cohen, American Thought: A Critical Sketch, p.256.
37. Kaufmann, Existentialism from Dostoevsky to Sartre, p.46.
38. Cohen, american Thought: A Critical Sketch, p.255.
39. Ibid.
40. Ibid., pp.274-75.
41. Ibid., p.275.
42. James, Pragmatism, p.26.
43. Ibid., p.33.
44. Ibid., p.37, See also Wells, Pragmatism, pp.99-115.
45. Siu, The Tao of Science, p.35.
46. Ibid.
47. Rev. Dr. Ernest R. Palen, New York Times, Feb. 15, 1960.
48. White, Science and Sentiment in America, pp268, 301.

(ఇంకా ఉంది)



తిరిగి తిరిగి బాగ నలిగిపోయిన్లా.." అన్నాడు జానయ్య.

"నన్ను రమ్మంటవాన్నా?" అని అడిగాడు. అందులో ఏదైనా అవసరముంటే నీవు చూసుకుంటవా? అనే అర్థింపు కూడా ఉంది. గొంతులో దు:ఖం పలికింది.

"తిక్క నాయాల.. నువు కూడా బయపడితే ఎట్లరా? పెద్దమంచిగాదూ. ఒంటిని ఒక తాయాన కష్టపెట్టిండా? అయినా ఈడ నేను లేనూ. నువ్వేం ఉరికురికి రాబన్లా. డాక్టరు మనకు బాగా కావల్సినోడే. ఈడ కాకుంటే కర్నూలుకు ఏసకపోతాం. అవసరమైతే చెప్తా. వద్దువుగాని.. " అన్నాడు.

ఆ తర్వాత "దుడ్లు ఉండయా?" అని తమ్ముడ్ని అడిగాడు.

"అది గాదునా"

"అన్న చెప్పింది విన్నవుగా. ఏంకాదు. బయపడగాకు. నేను పైటాలప్పుడు మల్లా మాట్లాడతా. అవసరమైతే రేపు వస్తా " అని ఫోన్ పెట్టాశాడు.

గిరికి విషయం అర్థమైపోయింది.

మౌనంగా కూర్చుండిపోయిన ఉలిగప్ప భుజం మీద చెయ్యేసి " ఏం కాదులే..." అని క్షణమయ్యాక, " లేకపోతే బయల్దేరుదామా?" అన్నాడు.

ఉలిగప్ప పలకలేదు. ఆ క్షణాన నోరు తెరిస్తే ఏడుపు వస్తుందనిపించింది.

'జేజినాయనకు కష్టమేమో..' ఆ ఊహే భయంగా ఉంది. బాధగా ఉంది. బుద్ది తెలిసినప్పటి నుంచి అమ్మానాయినల కంటే ఆయనతోనే ఎక్కువ మెసిలాడు. తనకు లోకం తెలిశాక.. ఊర్లు తిరిగేదాని మీద ఒకటే కొట్లాట...! తన లోపల జాగాను ముసలోడు ఎంత దురాక్రమించేశాడో..

కళ్లలో నీళ్లు తిరిగాయి.

గిరి చలించిపోయాడు.

తనకు అంతా తెలుసు. ఉలిగప్ప అంతర్ ప్రపంచాన్ని జాగృతం చేస్తుండేదీ, యాతన పెట్టేదీ, ఉక్కిరిబిక్కిరి చేసేదీ, ఒక్కసారిగా సంశయాత్మక జగత్తులోకి తోసేసేదీ, సంభ్రమంలో ముంచి తీసేదీ... జంబులే.

వద్దన్నా ఊర్లు తిరుగుతుంటాడని ఎంత మంట ఉన్నా, జేజినాయన తలపు రాగానే ఆయన కళాశక్తికి వివశుడైపోతాడు. తన పాటతో, అభినయంతో విద్యుత్ ప్రవాహమైపోతాడు. జేజినాయినను అర్థం చేసుకోవడానికి పడ్డ యాతన ఊరకే పోలేదు. అల్లకల్లోలమైన కడలిలో ఆవలి తీరం చేర్చిన నావగా మారాడు. 'మా జేనాయన...' అని జంబులు ఊసు వస్తే ఆయన పాట గురించి, ఏటికి ఇరువైపులా ఆయనకుండే పేరు గురించి గర్వంగా చెప్పుకొస్తాడు.

అప్పుడప్పుడు తనకే విసుగొచ్చి ' మీ జేజినాయన కత ఇంక చాల్లే...' అనేవాడు.

కానీ ఉలిగప్పకు జేజినాయన ఒక పరవశం, వల్లమాలిన మైమరపు. 'ఒకప్పుడు బతుకుతెరువు అనుకున్నవే రానురాను బతుకుభారమైపోతాయి. అప్పుడు వాటిని భుజం మీది నుంచి ఎంత తొందరగా దించుకుంటే అంత మంచిది. ఇది గమనించకపోతే వాటి కింద పడి శిథిలమైపోవాల్సిందే..' గిరి నిశ్చయవాదం గుర్తుకొస్తే జేజినాయన గురించి మరింత బెంగటిల్లుతాడు. ఊర్లు తిరగడం, ఇంటింటికిపోయి జోలపట్టడం పోవాలనే ఆనందం ఇట్ల మాత్రమే కలుగుతుందా? అనే సందిగ్ధ సంబరం చుట్టుముట్టేది. అంతా ఇంతేనా? ముసలోడు మొండికిబడి తిరిగి తిరిగి కడాకు ఇట్ల ముగిసిపోతాడా? అనుకొనేసరికి దు:ఖం ఎగసి వచ్చింది.

ముసలోడికి విముక్తి అంటే ఇదేనేమో!

గిరి ఎప్పుడూ చెప్పే మాట ఇట్లా నిజమవుతుందా? ఆయనకే సొంతమైన అత్యద్భుతమైన కళా సంప్రదాయం ఇట్లా కడతేరిపోతుందా? అనిపించింది. ఉలిగప్పకు ఎప్పుడూ ఒక సందేహం వెంటాడేది. ఇంతకూ తనకున్నది... జేజినాయనంటే ప్రేమనా? ఆయన కళపట్ల ఆరాధనా? మనిషితోపాటే అంతరించిపోయే విద్యా ఇదా? తరతరాలుగా ఎన్నడూ ఎదుర్కోని సవాలు కావచ్చు ఇది. ఏటికి అటూ ఇటూ మరెవ్వరూ లేనట్టే. మారిపోతున్న ప్రపంచంలో ఈ కడపటి ముగింపుకు అర్థమేమిటి? అనే ప్రశ్న వేధించేది. జేజినాయన చివరికి వచ్చాడనిపించాక మరోసారి అదే సందేహం. ఆ మనిషిపట్ల ప్రేమనా? ఆయన పాట అంటే పిచ్చా?

"ఏంది మరి పోదామా? ఇప్పుడు బయల్దేరితే రాత్రికి చేరుకోవచ్చు..." అన్నాడు గిరి.

పది నిమిషాలయితేగాని ఉలిగప్ప తేరుకోలేదు.

"చూద్దాం. జానన్న ఆడ్నే ఉండాడు. మనకు పన్లు ఉన్నా. మధ్యాన్నానికి ఎట్లుండేదీ తెలుస్తుంది, దాన్నిబట్టి ఆలోచిద్దాం.." అన్నాడు.

* * *

"ఈ జి.ఒ. అప్పుడే ఎఫెక్ట్ కొట్టింది. జిల్లాల్లో కాస్ట్ సర్టిఫికెట్ ఇవ్వమని అంటున్నరట. బుడగజంగాలు తెలంగాణలోనే ఉన్నారని తిప్పి పంపిస్తున్నారు. కావాల్సింటే జంగమోల్ల కింద బి.సి. సర్టిఫికెట్ ఇస్తామని అంటున్నరట..."

ఆ మాటలు చెప్తున్నది ఎవరో పేరు తెలియకపోయినా సుధాకర్ ఆశ్చర్యంగా ముందుకు వంగి.."అట్లనా? ఎక్కడా? " అని అడిగాడు.

"కర్నూలు జిల్లా నుంచి నిన్న ఫోనొచ్చింది. ఆడికీ ఆ పిల్లోడు... మా పెద్దోల్లు పాలమూరు నుంచి వచ్చినారు సార్ అని చెప్తే .. ఆ దొంగనాకొడుకు.. అట్లయితే, ఆన్నుంచి వలస వచ్చినామని కాయితం తీసకరా అన్నడంట. .." ఆ మాట చెప్తూ ఉలిగప్ప ముఖంలోకి చూడటంతో అందరూ అటే చూశారు.

"అరెరె..నాకు తెలియదే..," అన్నాడు ఉలిగప్ప.

వలస వచ్చినట్లు సంచార తెగకు ఎవరు కాయితం ఇస్తారు? దుర్మార్గం కాకపోతే.. సుధాకర్‌కు కోపం ముంచుకొచ్చింది.

దాని మీద అంతా తర్జన భర్జన పడ్డారు. ఏం చేయాలంటే ఏం చేయాలని ఆలోచించారు. ఎవరో ఒకాయిన అందుకొని

"మాదిగ ఉపకులాలందర్నీ కువ్వేసి పెద్ద మీటింగ్ పెట్టాల. అప్పుడుగాని లంగనాయాల్లు దిగిరారు..." అని ఆవేశపడిపోయాడు.

ఇట్ల అయ్యేదేనా? అని గిరి సందేహంలో పడ్డాడు.

విశాల ఏదో చెప్పబోయిందిగాని గడిబిడిలో ఆమె గొంతు బైటికే రాలేదు. వెనక నుంచి ఎవరో "ముందు దండోరా వాల్లు వస్తరేమో చూడు. మిగతా వాల్ల కత తర్వాత. మూన్నెలాయె, మనం ఇంత చేస్తున్నం గదా? వాల్ల మెయిన్ లీడర్లు ఇట్ల తొంగి చూడలా. కలిసినపుడు చేద్దాం.. చేద్దాం.. ... అంటున్నరుగాని. లేకపోతే మన పోరు తట్టుకోలేక పేపర్లలో అన్నిటితోపాటు మనదీ ఒక మాట అంటున్నరు..." అని కుర్చీలోంచి లేచి గట్టిగా మాట్లాడి అందర్నీ తన వైపు తిప్పుకున్నాడు.

అంత దాకా మాట్లాడినవన్నీ పక్కకుపోయి, ఇదే ముందుకు వచ్చింది. దండోరా వాల్లతో కలిసి గట్టిగా మాట్లాడాల్సిందే... అని చాలా మంది అన్నారు. కొందరు మౌనంగా ఉండిపోయారు. గిరి, ఉలిగప్ప కూడా ఏం మాట్లాడలేదు. ఇట్లాంటి రోజు వస్తుందని అనుకుంటూ ఉన్నందు వల్ల .. 'అన్నిటికీ మనమే ఏం చేస్తాం.. అదీ తెలుస్తుందిగా' అని ఊరుకుండిపోయారు.

కాసేపటికి మల్లీ మొదటికి వచ్చారు.

అప్పుడు సుధాకర్ అందుకున్నాడు.

ఆవేశకావేశాలన్నీ వెళ్లగక్కుకోవడం వల్ల అప్పటికి కొంచెం స్థిమితంగా ఉన్నారు. దాంతో ఆయన మాటలు ఆలకించారు.

"నేను ఈ రెండు మూడు నెలలుగా మనకు సంబంధించిన కాయితాలు చాలా వరకు చదివినా. నాకు అర్థమైందేమంటే- మనది ఇప్పుడు రాజ్యాంగపరమైన సమస్యగా మారిపోయింది. కలెక్టర్లు, మంత్రులు, ఆఖరికి ముఖ్యమంత్రి కూడా నా చేతిలో ఏమీ లేదని తప్పించుకోవచ్చు. వాళ్లు ఎందుకు చేశారో గాని ఒక కులం మొత్తానికి హానీ చేశారు. నాకు తెలిసిందేమంటే- ప్రకాశం, నెల్లూరు జిల్లాలతోపాటు ముఖ్యంగా కృష్ణ, గుంటూరు, గోదావరి జిల్లాల్లో ఎస్.సి. జాబితాలోకి, మాల ఉపకులాల్లోకి కొంతమంది చొరబడేందుకు చూసింటారు. దాన్ని అడ్డం పెట్టుకొని వీళ్లు ఇదంతా చేసినా చేసి ఉండొచ్చు. అయినా ఇది చాలా అన్యాయం. ఇప్పుడు మనం ఏం చేసీ..తెలంగాణలో తప్ప మరెక్కడా బుడగజంగాలు లేరనేదాన్ని మార్పించాలి. మనం ఏ పని చేసినా దాని కోసమే చేయాలి. ఇది రాజ్యాంగానికి సంబంధించిన సమస్య కాబట్టి ఆ పద్ధతుల్లోనే చేయాలి. మనం చేసే ఆందోళనల వల్ల విషయం అందరికి తెలుస్తుంది. కొంచెం ఒత్తిడి పెరుగుతుంది. ఇట్లాటి వాటి కోసం కొట్లాడాల్సి ఉంటదని మనోల్లకు తెలుస్తుంది. అంత వరకే. ఆ పని చేస్తూనే ఇంకా చాలా చేయాలి. తెలంగాణలో తప్ప మరెక్కడా లేర్నేదాన్ని కొన్ని చోట్ల తిప్పి కొట్టొచ్చు. ఇందాక మన మిత్రుడు చెప్పినదాన్నిబట్టి ...కర్నూలుకు అవతలి నుంచి వలస వచ్చారనడానికి చాలా ఆధారాలున్నాయి. బుడగ జంగాలంటే ఎవరు? అనేదానికి ఆ జిల్లాలో అధికారులు ఫీల్డ్ వర్క్ చేసి పద్దెనిమిది లక్షణాలు రాశారు. అవి ఉన్నవాళ్లు ఎక్కడున్నా బుడగజంగాలే.. అని మనం వాదించవచ్చు. మిగతా రాయలసీమ, కోస్తా జిల్లాల సంగతి నేను ఇంకా చదవలేదుగాని, మనం కష్టపడితే కర్నూలు జిల్లాకు కొంచెం మేలు జరుగుతుంది. అది మిగతా చోట ఉపయోగపడుతుందోమో చూడాలి..." అన్నాడు.

ఈ ఆలోచనలు ఉలిగప్పకు చాలా బాగా నచ్చాయి.

కార్యకర్తల మీటింగుల్లో ఇట్లాంటివేవీ తేలవని గిరికి గట్టి నమ్మకం. కాకపోతే సంఘమన్నాక అందరి ముందు పెట్టాల్సిందే. తర్వాత ఎట్ల చేయాల్నో ఆలోచించాల్సిందే... అనుకున్నాడు.

సాయంత్రం నాలుగు గంటలకు మొదలై పొద్దుపోయేదాకా సాగింది. అంతా అయ్యాక పోయేటప్పుడు "చాలా ఓపిక ఉండాలబ్బా. మనం కూచొని మాట్లాడుకున్నంత ఈజీ కాదు" తనకు తాను చెప్పుకుంటున్నట్లు అన్నాడు సుధాకర్.

తనకిది కొత్త. తలా ఒకరకంగా అరుపులు, కేకలు, ఆవేశకావేశాలు... ఉలిగప్ప, గిరి మధ్య మధ్యలో సుధాకర్‌కేసి చూశారు. వాళ్లకు తెలుసు.. గిరి ఇట్లాంటి మీటింగ్‌కు ఎన్నడూ వచ్చి ఉండడని.

"బోర్ కొట్టిందా?" అని అడిగాడు ఉలిగప్ప.

"అబ్బే.. అదేం లేదు. ఒక దాని మీద ఎన్నెన్ని రకాల ఆలోచనలు ఎక్కడెక్కడి నుంచో వస్తుంటాయి. ఒకసారి తుట్టె కదిలిస్తే ఇక అంతే. మనం అనుకున్నట్లు ఏదీ ఉండదు. ఇంట్లో కూర్చొని ఒక్కల్లం తీరికగా ఒక పద్ధతిగా ఆలోచించినట్లు కాదు. జనంలోపడితే ఇక అంతే..." తాను ఎట్లా అర్థం చేసుకుంటున్నదీ చెప్పాడు సుధాకర్.

"మా వాళ్లకు ఇట్లాంటివి కొత్త గదా. ఈడిదనక పట్టకరావడమే కనా కష్టమైంది. కాకపోతే ఏదైనా మేలు జరుగుతదమో అని ఆశ ఉండటాన వస్తుండరు" అన్నాడు ఉలిగప్ప.

"అవునవును. మనం దాన్ని నిలబెట్టాలి, నిజం చేయాలి. అయినా మీరు మాట్లాడే స్టైల్ బలే ఉంది. అంతక ముందు కూడా గమనించా. జనంలో మాట్లాడడం చాలా కష్టం. అందరూ తోచినవి మాట్లాడినా.. అన్నిటిని వెనుక దిక్కు నుంచి ఒక దారిలోకి తెచ్చారు.." అని అప్పుడే వచ్చిన గిరి కళ్లలోకి కూడా లోతుగా చూశాడు.

"దిగినం కదా... కుందేళ్లు పట్టే వాళ్లతో కుందేళ్లు గురించే మాట్లాడాలని టాల్‌స్టాయ్ చెప్పిన్లా. వాటి మీదే ముచ్చట మొదలుపెట్టి చిన్నగా ముందుకు తీసకపోవాలి.." గట్టిగా నవ్వాడు గిరి.

సుధాకర్‌కు ఆ మాట ఫ్లాష్‌లాగా వెలిగింది. ఎంత స్పష్టత! తాను ఏం చేస్తున్నాడో, ఏం చేయాలనుకుంటున్నాడో తెలిసి ఉండడంలోని నిర్మలత్వం అది. ఆ క్షణమే.. గిరి అంటే అంతక ముందుకంటే గౌరవం కలిగింది. తాను ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు, వింటున్నప్పుడు .. ఇంతకూ ఈ మనిషికి వీటన్నిటిపట్ల నమ్మకం ఉందా? ఈ మాట్లాడుతున్న వాటి అర్థం తెలిసే మాట్లాడుతున్నారా? చేస్తున్న పనికి ఉన్న అర్థం తెలుసుకొనే చేస్తున్నారా? అనే ప్రశ్నలు తలెత్తేవి. నమ్మకం కుదరకపోతే తన వాదనతో అవతలివాణ్ణి ఉక్కిరిబిక్కిరి చేసేస్తాడు. అవతలివాళ్లు

ఊహించని వైపు నుంచి ప్రశ్నలు విసిరి కకావికలం చేస్తాడు. అదో సరదా కూడా. గిరి పరిచయం అయిన తొలి రోజుల్లో సరిగ్గా అట్లాగే అనిపించింది. దాంతోనే ఎక్కడో దొరకబుచ్చుకొని వాదనలోకి దిగాడు. తన వాదప్రియత్వంతో అప్పుడు అతణ్ణి ఇబ్బందిపెట్టేశానేమో.. అని ఈ మధ్యే అనిపించింది.

"గిరి.. నేనూ ఒకటే అనుకున్నం. మా జనాలకు ఇవేవీ తెలియదు. కొత్త. ఎవరు ఎట్ల తీసకపోతే అట్ల పోతరు. ఎటుపోతే తిండి దొరుకుంతుదనుకుంటరో అటు.. ఆ ఊరుకెళ్లి దారిపట్టి పోవడమే తెలుసు. మేం చదూకోని ఇక్కడిదాకా వచ్చినం కావట్టి ఎట్ల పోవాలో మాకు తెలిసిన కాడికి చెప్పాలనుకున్నాం. పోతరా లేదా? అనేది అంతా మన చేతిలో ఏముంది? ఇట్ల తిరిగి మాట్లాడే కొద్దీ .. వాళ్లకేం చెప్పున్నమోగాని మాకు శానా తెలుస్తుండాయ్...మేం తెలుసుకోనీకనే ఇదంతా.." ఉలిగప్ప అన్నాడు.

గిరి ముందుకు జరిగి.. ఉలిగప్ప భుజం చుట్టూ రెండు చేతులు వేసి దగ్గరికి తీసుకున్నాడు.

సుధాకర్ ఇష్టంగా వాళ్లిద్దరి వైపు చూశాడు.

అంత వరకు లోపల ఎవరితోనో మాట్లాడుతూ ఉండిపోయిన విశాల గబగబా వస్తూ " వెళ్లిపోయావనుకున్నా..! నేనూ నీతోపాటు వస్తా. ఆ దిక్కు పని ఉంది" అనింది సుధాకర్‌తో.

అతని సమాధానం కోసం కూడా చూడకుండా.."అబ్బా.. నాకు బుర్ర తిరిగిపోయింది. ఇట్లాంటివి అర్థం చేసుకోవడం చాలా కష్టం. మీలాంటి వాళ్లు సిద్ధాంతాలు చెప్పినంత తేలిక కాదు. నాకు ఈ రోజు ఏమనిపించిందంటే- ఇట్లాంటి వాటి గురించి అసలు మనకు ఎంత తెలును? ఆ ఇంత తెలునుకొనే వాదించుకుంటుంటాం.." అనింది.

"ఇప్పుడు మనం ఇక్కడ వాదించుకుంటున్నామా?" అమాయకంగా చూస్తూ మిగతా ఇద్దర్నీ అడిగాడు ఉలిగప్ప.

"నీ మొహం..నీకేం తెలుసని వాదిస్తావు? నేను అంటున్నది వీళ్లను..." అంది అంతే వేగంగా.

ఆ మాటకు ఆ ఇద్దరూ బళ్లున నవ్వారుగాని ఉలిగప్ప గింజుకున్నాడు.

విశాల అంతటితో ఆగకుండా "నేనేమన్నా తప్పు అన్నానా?" అంది.

సుధాకర్‌కు అంతా తెలుసు కాబట్టి " ఆ సంగతి మీరిద్దరు తేల్చుకోవడం బాగుంటుంది..." అన్నాడు మురిపెంగా.

"సర్లే.. " అని ఉలిగప్ప చనువుగా సుధాకర్ మాటను తీసేసి, "మరి.. లీగల్‌గా ఏం చేయాలంటవ్?" అని మాట తప్పించాడు.

"అదే ఆలోచిస్తున్నా. చాలా కొత్త సమస్య ఇది. సీనియర్లతో, ఇట్లాంటివి బాగా తెలిసినవాళ్లతో మాట్లాడాలి. నేను ఇంత వరకు చూడగలను. ఏమేం చేయాలో తేలాక కలిసి కూచోని మాట్లాడుకుందాం" అని సీరియస్ మూడ్‌లోకి వెళ్లిపోయాడు సుధాకర్.

కాసేపయ్యాక సుధాకర్, విశాల బండి మీద వెళ్లిపోయారు. వారం తర్వాత దండోరా వాళ్ల మీద ప్రెస్ మీట్ ఉందని పిలుపు వచ్చింది.

'ఇప్పుడు అది ఎందుకు? మంచిది కాదేమో. ఒకరి మీద ఒకరం స్టేట్‌మెంట్లు ఇచ్చుకుంటే నష్టం. మాదిగ ఉప కులాలైనా కలిసి ఉన్నట్లు చూడ్డానికైనా అనిపించాలి కదా? మనది ఇంకా ఏం తేల్లేదు. ఇట్లాంటప్పుడు కోపానికి పోవడం మంచిది కాదు. మనకు అందరితో పనులు ఉంటాయి. అట్లనికాకపోయినా.. నాకు ఇష్టం లేదు..' అని చెప్పేశాడు గిరి.

' ఆ పొద్దు అనుకున్నట్లు వాల్లతో మనోల్లు మాట్లాడింద్రు. ఏం లాబం లేదు. పట్టించుకోవడం లేదు. కింది నుంచి జనాలు ఏంది వాల్ల కత? అని అడుగుతుంద్రు..' అని అవతలి వైపు వాదన.

'మీ ఇష్టం ..' అని పెట్టేశాడు.

ఇంతకూ అడుగుతున్నారా? అని గిరికి సందేహం. అట్ల అడిగినా మంచిదే.

అశాంతిగా అనిపించింది.

"అవతలి వాళ్లు సరే. వీళ్లేంది? ఒకసారి బజార్లో పడ్డాక ఇంక మాట్లాడుకోవడానికి ఏముంటుంది? ఎవరు చెప్పాలి?" అన్నాడు చిరాగ్గా.

" ఏందో.. ఒకరు చెప్పడానికి లేరు. చెప్పింది వినేవాళ్లు లేరు" ఉలిగప్ప కూడా అసహనానికి గురయ్యాడు.

"ఇట్లయితే ఎట్లబ్బా.." మళ్లీ తనే అన్నాడు.

"ఏం చేస్తాం? మనలాంటి సంఘాల్లో ఇట్లనే ఉంటుంది. సమస్య ఉంటడాన..దానికి ఒక దోవ దొరికితే ఏమైనా లాభం ఉంటుందేమో అనే ఆశనే అందరినీ ఒకచోటికి తెస్తుంది. ఇన్ని దినాలకైనా అట్ల ఒక చోటికి రావడం చిన్న సంగతి కాదు. ఇంత కాలం కులాచార్లాలతో ఒక కుదురుగా ఉన్నవాళ్లకు ఇంకా ఏవో కావాలనే తెలివిడి కలిగడం మంచిదే. కానీ అంతకంటే పైకెళ్లి ఆలోచించడం చేతకావడం లేదు. అందరిని కలిపి ఉంచడానికి ఇంతకన్నా గట్టి ఆధారం ఉంటే బాగుండేది. అదే లేదు.. దాంతో ఎవరికి తోచిన ఆలోచనలు వాళ్లు చేస్తున్నారు. ఎవరకి ఇష్టమైన పనులు వాళ్లు చేస్తున్నారు.." గిరి తన బాధ బైటికి కనిపించకుండా మాట్లాడాడు. దేనికంటే తనకు లోపలి కతలు చాలా తెలుసు. అవన్నీ ఉలిగప్ప దాకా తీసకరాడు. గొడవలు ఏవేవో ఉంటాయి. అవి ఎత్తిపోసుకోవడమంటే నిజంగానే కొంచెమైనా బరువు తీరాలి. దేన్నయినా తెరిచామంటే సక్రమంగా మళ్లీ మూసెయ్యాలి. లేకపోతే తెరవనే కూడదు. తెలిసినవన్నీ వలపోసుకోవడం, అనిపించినవన్నీ మాట్లాడుకోవడం కాలక్షేపం కాకూడదు.. అనుకుంటాడు.

"ఇట్లుంటే ఎట్ల? పైన ఉన్న లీడర్లన్నా చెప్పాలి గదా?" అన్నాడు ఉలిగప్ప.. ఏదో ఆశ చంపుకోలేక.

"ఇందాక నువ్వే అన్నావు గదా? చెప్పడానికి లేరు, వినేవాళ్లు లేరని. అదే పరిస్థితి. ఎవర్నీ ఏం అనలేం...పైనా కిందా అంతా ఇట్లనే ఉంది" అని మర్మంగా అన్నాడు.

"పై నుంచే ఎగదోస్తున్నారా?" అని సందేహంతో మాట పూర్తి చేయలేదు ఉలిగప్ప.

"ఒకటి కాదులే... మనకు అవన్నీ ఎందుకు?

చేద్దామనుకున్నది చేయడమే" అని ఇక ఆ సంగతి వదిలెయ్.. అన్నట్లు ముగించేశాడు గిరి.

తెల్లారి 'దండోరా నాయకులారా.. ఎందుకీ మౌనం?' అనే ప్రకటన అన్ని పేపర్లలో వచ్చింది. 'వర్గీకరణ ఉద్యమంలో మీతో కలిసి పని చేసినందుకే మాకు ఈ కష్టం వచ్చింది. జీవో 144కు వ్యతిరేకంగా మాతో కలుస్తారా? కలవరా? మా సమస్యల మీద మీరెందుకు పోరాడటం లేదు... మీ మౌనానికి అర్థం ఏమిటి?' అని ప్రశ్నలు విసిరారు.

అది చూసి సుధాకర్ కంగారుగా ఫోన్ చేశాడు.

"ఏందిది? ఏమన్నా మతి ఉందా? మీరైనా చెప్పొద్దూ.." అని నిలదీశాడు.

గిరి నిస్సహాయంగా వింటూ ఉండిపోయాడు.

"ఇప్పుడు ఉన్న పరిస్థితిలో వాళ్లను కూడా దూరం చేసుకుంటే ఎట్ల? అసలు దగ్గరా దూరం కత కాదు. ఈ రెండు కులాల మధ్య కూడా చిచ్చు రాజుకుందని సంబరపడేవాళ్లు చాలా మంది ఉంటరు. ఏ రెండు అస్తిత్వాలైనా కలుస్తాయా? అవకాశం ఎంత వరకుంది? దాన్ని ఏమైనా పెంచవచ్చునా? అనే ప్రశ్నలతో ఒక పక్కన చస్తుంటే మధ్యలో మళ్లీ ఇది కూడానా? ఏం బాగలా? ఇట్లయితే కష్టం..." అని నిప్పులు చెరిగి పెట్టేశాడు.

"మధ్యలో కల్పించుకొని గిరి తను చేసిన ప్రయత్నం చెప్పాడు. కానీ ఆవేశం, బాధ తన్నుకోని రావడంతో సుధాకర్ వినలేకపోయాడు. అసలు గిరి సమాధానం ఆశించి ఫోన్ చేస్తేగదా.. వినడానికి!

గిరికి తల తిరిగిపోయింది.

అయితే ఊహిస్తున్నదే.

సుధాకర్ ఫోన్ చేశాడని ఉలిగప్పకు చెప్పాడు.

గంట తర్వాత సుధాకర్ మళ్లీ ఫోన్ చేశాడు. తాను దూకుడుగా మాట్లాడినందుకు ఫీలయ్యాడు. ఈసారి దాని ప్రస్తావన తేలేదు.

"ఒకసారి అస్తిత్వం గురించి తెలివిడి కలగడమంటే కొత్త ప్రపంచం పరిచయమైనట్టే. తనను తానే కొత్తగా చూసుకోవడం చిన్న సంగతి కాదుగదా? అంతక ముందున్నవన్నీ కూలిపోతాయి. పాత నమ్మకాలు, భయాలు, మొహమాటాలు అన్నీపోయి కొత్త పద్ధతులు పట్టుపడతాయి. అంత వరకు బాగనే ఉంటది కాని, తన అస్తిత్వం తప్ప మరో ఆలోచన రాదు. దాన్నుంచే ఇట్లాంటివన్నీ. ఇంతకాలం ఏం కావాలో కూడా తెలియనివాళ్లకు ఉండే ఆరాటం పూర్తి న్యాయమేగాని ... "

ఎందుకో అలసట అనిపించింది. కొనసాగించలేకపోయాడు. ఇందాకటి తన ఆవేశాన్ని అర్థం చేసుకోమన్నట్లు ఈ నాలుగు మాటలు చెప్పేశాడు.

తానే ప్రయత్నం చేసిందీ చెప్పడానికి ఇప్పుడు గిరికి అవకాశం వచ్చింది.

"నేనూ ఇట్లే అనుకుంటున్నానని... అంతా అయిపోయాక అనబుద్ధి కావడం లేదుగాని నాతో వాళ్లనప్పుడే వద్దన్నాను. కానీ వినలేదు. ఎంత చేసినా.. నేనైనా, ఉలిగప్పైనా పిల్లలమైపోతాం. ఏదో కొన్నిటికి మా మీద డిపెండవుతారు. మాక్కూడా మేమేం చేయగలమో దిగినాక తెలిసింది. ఒక్కోసారి మాలాంటి వాళ్లం చెప్పినా వింటారు. లేకపోతే లేదు. లోపల చాలా గొడవలున్నాయి. వాటిని ఎవరమేం చేయలేం. ఇట్లాంటి వాటిలో ఉండేవే అనుకొని వదిలేయాల్సిందే..." చివరి మాటలు కొంచెం పశ్చాత్తాపంగా, దిగులుగా వచ్చాయి.

సుధాకర్ ఆ సంగతి గమనించాడు.

"ఈ ఒక్కదానితోనే ఏదో అయిపోతుందనుకోవడం దేనికిలే. ఆవేశం కొద్దీ మనం ఏమనుకున్నా లాభం లేదు. ఇప్పటికే ఎన్ని కాలేదూ. ఇదొకటి. ఇంకోపక్క నుంచి ఆలోచిస్తే.. మొదట్లో అనుకున్నట్లు మనం మాట్లాడాలనుకున్నవాటికి ఇదీ కలిసి వచ్చింది. వీళ్లు ఈ స్టేట్‌మెంట్ ఇవ్వడం... వాళ్లు మరొకటేదో అనడం మామూలే. అయితే మనం వాటిజోలికి పోకుండా అసలు ఇట్లాంటివి ఎందుకు వస్తున్నాయి? అనే చర్చ లేవదీయవచ్చు. ఉద్యమాల ఇమీడియట్ ప్రయోజనాలు, గొడవలు ఎప్పుడూ ఉండేవీ.. వాటిని అట్ల ఉంచి.. ఈ ఆలోచనలు కూడా చేయమని కొన్ని ముందుకు తేవాలి. పదే పదే ఎందుకు ఇట్లాంటివి వస్తున్నాయి? ప్రతి పీడిత కులం తన గురించి తాను మాట్లాడుకున్నా మరో పీడిత అస్తిత్వంతో పేచీ ఎందుకు వస్తోంది? అనే ప్రశ్నలు వేయొచ్చు..." అన్నాడు.

"నిజమే.. ఇవి ఎట్లయినా నడుస్తాయి. కొన్ని ఆలోచనలు ఇవ్వడమే మనం చేయాల్సిన పని..."

ఇంతయ్యాక కూడా సుధాకర్ పాజిటివ్‌గా ఆలోచించడం బాగా నచ్చింది గిరికి.

"మరి ఏదైనా రాయరాదూ!" అన్నాడు.

దానికి సుధాకర్ "అదే ఆలోచిస్తున్నా. తొందర్లోనే పూర్తి చేస్తాను. అయితే నీవూ రాయాలి. అక్కడి నుంచి వచ్చినట్లు కూడా ఉండాలి. సమస్యలో ఉన్నవాళ్లు మాట్లాడితే వెయిట్ ఉంటుంది అన్నాడు.

"తప్పకుండా రాస్తాను. అసలు ఎప్పటి నుంచో అనుకుంటున్నా. ఏదీ ఈ పనుల్లోపడి కావడమే లేదు"

సుధాకర్‌తో మాట్లాడాక శరీరంలో విద్యుత్ ప్రవహించినట్లయింది.

* * *

జంబులు ఆస్పత్రి నుంచి వచ్చిన నాలుగు దినాలకల్లా లేచి తిరగడం మొదలుపెట్టాడు. బజార్లో నిలబడి వచ్చేపోయే వాళ్లందర్నీ మందలించడం చూచి "కొడుక్కు దుడ్లు ఒత్తుకుంటుండాయని ఆమైన రోగమొచ్చె.." అన్నది కోడలు .

ఆ మాటలు జంబులు చెవిన పడ్డాయేమోనని మశమ్మ గుంజుకుంది. జంబులు వింటే బాధపడతాడనేగాని, మాటకు మాట ఎదురివ్వడంలో ఆమేం తక్కువ. జంబులు గేర్లోకి పోయాడని తేల్చుకొని..

"అందుగ్గాదూ ముసలోడనేది.. కాళ్లేతులు ఆడినన్ని దినాలు ఆయమ్మను, ఈయమ్మను ఆడుక్కోని తినడం మంచిదని.

అయినోళ్ల ఛీత్కారానికన్నా .. కానోళ్లకాడికిపోయి జోలెపట్టడమే నయం. కొడుకులకు, మనవల్లకేం తెలుసు..ఆడయి ఇట్ల కూస్తాయని? ఎట్టికి తినబట్టినామని మాటపడేదానికన్నా ఇద్దెను నమ్ముకోని ఊర్లమీదపోతే సరిపోలా?" అనింది. సుంకమ్మ తగ్గే రకం కాదుగాని, మొగుడు అటుకెల్లి రావడం చూసి ఊరుకుంది. మామూలుగా అయితే అట్లాంటి భయాలు గియాలు ఏమీ లేవు. మనసులోది దాచుకోవడం అంటే ఏందో తెలీదు.

మామూలుగా అయితే నెత్తి మీదికి పొద్దొచ్చే దాకా బువ్వ ఒండని మనిషి ఈ నడమ జంబులు ఆస్పత్రిపాలయ్యాక పొద్దునే రెండు చారలు బియ్యం పోసి ఉడకపెడుతోంది. ఆ టయానికి చిన్న కొడుకో, మొగుడో ఉంటే రెండు తల్లెల్లో అన్నం పెట్టి రాత్రి కాచిన చారో, ఊరిబిండో వేసి పెడుతుంది.

బైట గోడెంబడి రాళ్ల మీద పెట్టి గంజి వార్చుతుంటే దారినపోయే వాళ్లెవరో "ఏందే.. పొద్దున్నే కుండెక్కించినావు" అని అడిగితే "మా ముసలోడు కాయిలా పడిన్లా. పైటాల దాకా తినకపోతే తిరగబెడతదని.:" అనే మాటలు కూడా మళమ్మ విన్నది.

అయినా తూస్కారంగా మాట పడ్డప్పుడు మనసు చివుక్కుమంటుంది. ముసిలోడికి ఉసి వచ్చింది.. తాంబుర తీసుకోని యా దిక్కుపొయినా బువ్వ పుడతది.. అనుకుంది. ఒకటి రెండు తూర్లు కోడలు మాటలు విన్న మీదట బైటికి పోతే బాగుండని ఆమెకే అనిపించింది. కానీ కొడుకు, మనవడు ఏమంటరో అనేదే భయం. మొన్ననే అంత పెట్టిన్లా. 'మళ్లీ తిరగనుపోతుండరా?' అని గోల చేస్తారనేగాని లేకపోతే ఆమాట ,తానే జంబులుతో అనేది. పిల్లోల్లకు ముసలోడంటే బో ప్రేమ. యాడోడ్నో తిరిగి బిందెలమ్మి సంపాదించుకున్న దుడ్డు నీళ్ల మాదిరి ఖర్చుపెట్టినాడు. ఆ దినం జేనాయిన మాట పలుకు లేకుండా పడిపోతే చెట్టంత పిల్లోడు వలవల ఏడ్చినాడు... అని చిన్న మనవణ్ణి తలచుకుంది.

జంబులు కాసేపటికి అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు. ఇప్పుడాయనకు అంతా వింతగా ఉంది. జంబులుగాడు రాయిలెక్కటి మనిషి. జరంగాని, పడిశంగాని ఎరగడు..అని తెలిసినవాళ్లంతా అంటారు. తన స్వరం గురించిగాని, ఆరోగ్యం గురించి గాని ఎవరన్నా మాట్లాడితే నుదురు ఒక పక్కకు ఎగరేసి ఒకరకమైన చూపు చూస్తాడు. అందులో కాటమరాజు, బొబ్బిల రాజుల కతలు చెప్తున్నప్పుడు ముఖంలో చూపించే ధీరోదాత్తత, ఆభిజాత్యం.. తొంగి చూసేవి. అట్లాంటి మనిషికి ఇప్పుడు తనకుతానే అర్థం కావడం లేదు. ఏందిది? ఇట్లయితదా? అనిపిస్తోంది. కళ్లెదుట శానా మంది రాలిపోతున్నా ఏ పొద్దేగాని చావు గురించి జంబులు ఆలోచించలేదు. చావుకాడికిపోయి బతుకు గురించి పాటలు పాడినందువల్లనో ఏమో తననూ మృత్యువు పొంచి ఉందనిగాని, ఏదో ఒకనాడు ఎగరేసుకపోతుందనిగాని అనుకోలేదు. చావింటికి జంబులు వచ్చి పాటలు పాడటం ఓ గొప్ప ఓదార్పు అని ఎందరో అనుకొంటారు. అదొక ఆనవాయితీగా జంబులును పిలిపించి రాత్రంతా జాగరణ చేసేవాళ్లు కొంత మందైతే, ఆ పాటల్లోని ఆర్ద్రత దు:ఖాన్ని బాపుతుందని, మనిషిని కోల్పోయినవాళ్లకు మిగిలి ఉన్న బతుకు మీద మమకారం పెంచుతదని చాలా మంది అనుకుంటారు. అట్లాంటి జంబులు విచిత్రంగా అసలు ఏదైనా శాశ్వతమా? కాదా? అనే తర్కానికే లోనుకాలేదు. జీవించడమే తెలుసుకాని మరొకటి తెలియదు. 'మనిషన్నాక గండశిల మాదిరి ఉంటడా? తియ్... ' అని ఎన్నిసార్లు అని ఉంటడో.. కానీ ఆయనకు అదొక ఊతపదమో, నానుడో! అంత మాత్రమే. చావిండ్లల్లో తండ్రి పాడగా చిన్నప్పటి నుంచి విన్న పాటల వల్లే మృత్యువును బతుకులోంచి వేరు చేసి కూడా చూడడం పట్టుపడలేదు. కానీ మూడు దినాలపాటు తెలివి లేకుండా పడిపోవడం ఆయనకు వింత అనుభవం. చావు బతుకుల పొలిమేర తచ్చాడి వచ్చానని తెలుసుకోవడమే విచిత్రమూ, దిగ్భ్రాంతికరం.

పై పల్లె నుంచి పోతున్న కురువ మద్దిలేటి కట్ట మీద కూచోని ఉన్న జంబులును చూసి " ఏంది జంబులా ! ఇంక మాకెల్లి రావా ఏంది?" అని పలకరించాడు నడుస్తూనే.

దానికి ఆయన ఏమీ బదులివ్వకముందే పక్కన ఉన్న పేటాయిన అందుకొని "ముసలోడు ఇంకేడ కత చెప్తాడు. ఎగిరి దునికి కత చెప్పే దినాలు పొయినై... " అన్నాడు.

దానికి మద్దిలేటి "అరెరె.. ఏమైంది. మంచి బాగ దుసబీక్కపొయినడే..!" అని రెండడుగులు ముందుకు వచ్చి అడిగాడు.

"ఈ నడమ జంబులుగాడికి మోపయిన్లా. పీనిగ సవార్లయ్యేటోడే. ఆడిదనకపోయి తిరిగి వచ్చినాడు... " అని క్షణమాగి, "ఊర్లు తిరుగుతా కతలు చెప్తే బాగనే ఉండేటోడు. ఇంట్లో ఉండేతలికి ఇట్లయింది.." అన్నాడు కొంచెం ఎకసక్కెంగా.

దానికి ఆయన చాలా నొచ్చుకుంటూ "ఏందబ్బా.. ఎట్లాంటి మనిసి ఎట్లయినాడు? ఆ దినాల్లో జంబులు కత చెప్పనీక వస్తే మా దిక్కు యాడాడి జనాలు కదిలి వచ్చేటోల్లు. మేమైతే మళ్లా అట్ల కత చెప్పేటోల్లను చూల్లా.." అని మొదలుపెట్టాడు.

జంబులుకు అదంతా సుదీర్ఘ గతంగా తోచింది. నోటి నిండా కత చెప్పక ఎన్నేండ్లయింది? పెండ్లాం పోటీపడి గుమ్మెట కొడ్తా వంత పలుకుతుంటే రాత్రంతా కత చెప్తే తెల్లారినాక వొంట్లోకి ఏనుగులెక్క బలం వచ్చేది. గుర్రం లెక్క పరుగు వచ్చేది. ఊరోల్లు ఏమిస్తారనేదానికంటే కత చెప్తాంటే జనం కదిలాడకుండా కూచోవడం.. తెల్లారి గేర్లో పోతాంటే.. 'ఏంది జంబులా..రేత్రి బాలనాగమ్మ కష్టాలు చెప్పి ఆమైన ఏడిపిస్తివి..' అని ఎవరైనా ఆడోల్లు అంటే తృప్తిగా ఉండేది. ఎన్ని తూర్లో విన్నా జనాలకు ఇంకా అట్లనిపించిందింటే - కించిత్ గర్వంగా ఉండేది. తాంబుర ముట్టక ఎన్ని దినాలైంది?

కురువ మద్దిలేటి ఏవేవో జ్ఞాపకాలు మాట్లాడుతుంటే జంబులు మరేవేవో తలపోసుకుంటున్నాడు. ఏదో నొప్పి.. శరీరంలోంచి, బతుకులోంచి ఏదో తెగిపోతున్నట్లు బాధ..ఆయన ఇక్కడ లేనేలేడు. ఏటికి అటూ ఇటూ పరుచుకున్న తన గతంలో తచ్చాడుతున్నాడు. ఒక ఊరని లేకుండా, ఇల్లని లేకుండా యాడ

ముద్ద పుడతదని నమ్మకముంటే ఆడికి నడకే. పెండ్లాం పిల్లలను వెంటేసుకొని, గుడారం నెత్తినేసుకొని పోవడమే. యాడికి పొయినా తిండికి కొరత ఉండేది కాదు. అసలు తిండి తిప్పల గురించిన రంది లేకుండా, యా గడప ముందు నిలబడ్డా పాటలు ఇవ్వడం, ముద్ద తీసుకోవడం. యాట మీదికి మనసుపోతే శికారీ పోవడం... ఇంకోట ఉంటదని తెలియనే తెలియదు. ఏదో కావాలనే ఆరాటం లేనే లేదు.

తానే తలపోసుకుంటూ గుండెల మీదికి తెచ్చుకున్నాడో.. కరిగిపోయిన ఆ ప్రపంచంలోకి తన నిమిత్తం లేకుండా జారిపోయాడో..! కళ్లలో తడి అయింది.

మద్దిలేటి ముందుకు కదిలాడు.

జంబులు ముఖంలోని విషాద చారికలు పక్కనున్న పేటాయిన గమనించి జంబులుకు ధైర్యం చెప్పాలన్నట్లు "ముసిలోడికేమి? యమదర్మరాజాతోని లిగాడి పెట్టుకోని ఎనక్కి తీసకొచ్చే కొడుకు, మనవల్లు ఉండారు. జంబులుగాడు తిరిగి మల్లీ తాంబుర బుజానేసుకొని మీ పల్లెలకు వస్తడు చూడు.." అన్నాడు మద్దిలేటితో.

దానికాయన " నీమాట నిజమైతే ఇంకేమి కావాల? యా మనిసైనా చల్లగా ఉండాలి. జంబులుగాడు అప్పట్టెక్క కత చెప్తే విందామని ఆశ. ఇప్పుడు అట్ల చెప్పేటోల్లు లేరు.. వినేటోల్లు లేరు" అని ఇంకోసారి అని దారి పట్టాడు.

ఒక్కో మాట యాడికిపోయి తగులుతదో.. దేన్ని కెలుకుతదో చెప్పలేం. ఆయన ఓదార్పుగా అన్నమాట జంబులును కకావికలం చేసింది.

కొడుకు.. మనవల్లు అనే మాటతోనే బిచ్చావతి మతికి వచ్చాడు. అందరూ వాడ్ని మర్చిపోయి ఒకడే కొడుకు అంటారుగాని తనెట్లా మర్చిపోగలడు? వాడు జ్ఞాపకాల్లో ఒరుసుకపోతా ఉండే పిడిబాకు లాంటోడు కదా? ఎప్పుడూ సలపరం పెడతా ఉంటాడు. ఈ పొద్దుకూ అర్థం కాదు.. ఇంతకూ వాడికి తనంటే ఎందుకంత కోపం?

బిచ్చావతిని తలచుకున్నప్పుడల్లా ఇదే ప్రశ్న. జంబులుకు వశం కాదు. ఆయన వివేకం, తెలివిడి ఏదీ పని చేయదు. ఏదీ సాయం రాదు. ఇంతకూ వాడు ఉండడో.: యాడైనా రాలిపోయినాడో..? అనిపించేసరికి అంత వరకు ఉన్న హద్దులను దాటి కన్నీళ్లు గుండెల మీద పడ్డాయి.

పేటాయిన " ఏందిరా! నువ్వే అట్లయితే ఎట్ల. ఎన్ని చాత్రాలు చెప్పేటోడివి. మనిషి అన్నాక లోకంలోకి వచ్చిపోయే జీవుడని చెప్పేటోడివి. ఇవ్వాల్సింది ఇవ్వనీక, తీసుకొనేది తీసుకోనీక వస్తాడని, ఆ లెక్క అయిపోయినాక పోతాడని చెప్తుంటివి. ఉన్నోల్లకు మిగిలేది వరసలే ..." పేటాయిన ఇంకా మాట్లాడుతున్నాడు. కొత్తగా ఒక్క మాట కూడా చెప్పడం లేదు. జంబులు కతల్లో చెప్పే శాస్త్రాలే గుర్తు చేస్తున్నాడు.

జంబులుకు అవేవీ తన మాటలనిపించడం లేదు. దూరంగా బిచ్చావతి కాడ తనను తాను వెతుక్కుంటున్నాడు.

కట్ట దగ్గర వేరే మాటలేవో కలిశాయి.

జంబులు కాసేపటి తర్వాత అక్కడి నుంచి కదిలాడు. అక్కడి నుంచి ఇల్లు పది అడుగులే. కానీ యోజన పర్యంతమనిపించింది. మందులుపోసి పొట్టిగాల్లు తెప్పించిన బలం అంతా ఆవిరైనట్లయింది. అడుగడుగూ భారమే. మెల్లగా ఇంటి దగ్గరికి వచ్చే సరికి అలిసిపోయాడు. వచ్చి రాతి గోడ మీద కూర్చున్నాడు.

సుంకమ్మ లోపలి నుంచే చూచి.. వాకిట్లోకి వచ్చి " మామా.. బువ్వ పెట్టినా" అంది.

జంబులు వినిపించుకోలేదు.

బైటే ఉన్న మశమ్మ మొగుడికెల్లి చూసి.. 'ఏందీ ఈ పొద్దు దివాలతీసినట్లుండాడు' అనుకుంది. కానీ జంబులు కదలకపోయే సరికి మళ్లీ గుర్తు చేసింది. ఈతూరి పెండ్లాం పిలిచింది కావట్టి చిరాకు కలిగింది.

"ఏం బువ్వ తియ్.. ఆకలి లేదు" అన్నాడు.

ఆ మాట సుంకమ్మకు కూడా వినిపించింది.

అత్తా కోడళ్లు మళ్లీ పిలవలేదు.

లోపల తల్లె ఎత్తిపెట్టిన శబ్దం వచ్చింది.

ఎండ పెళపెళలాడుతూ వచ్చింది.

కానుగ చెట్టు కింద బండ మీద పడుకున్న జంబులు అటూ ఇటూ నుసులుతున్నడేగాని ఎవరినీ పలకరించడం లేదు. కొడుకూ, మనవడూ కొట్కూరు నుంచి బిందెలు తీసుకొని కోడుమూరుకెల్లి పోయారు. దాంతో ఇంక పలకరించేవాళ్లు లేకుండాపోయారు. మశమ్మ ఒకసారి చెంబుతో నీళ్లు తెచ్చి మొగిడ్ని "నీల్లు తాగుదువు లెయ్" అని పిలిచింది.

జంబులు లేచి నోరు పుక్కిలించి ఉమ్మేసి గుక్కెడంటే గుక్కెడే నీళ్లుతాగి మళ్లీ కళ్లు మూసుకొని పడుకున్నాడు. కానుగ చెట్టు కింద నీడ పోయింది. ఇప్పటికో లేచి లోపలికి వెళ్లాడు.

ఆ దినమంతా మెతుకు కొరకలేదు.

మర్నాడు పైటాలప్పుడు కొడుకు తిరిగి వచ్చాడు. మనవడు ఆడనే ఉండిపోయినాడు. తెల్లారి కొట్కూరు నుంచి మరిన్ని బిందెలు తీసుకొనిపోనీక వచ్చాడు.

రాగానే " రెండు దినాలాయె ముసలోడు బువ్వతినక.." అని సుంకమ్మ చెప్పింది. కొడుకు ఎంత బంగపోయినా ఆ పొద్దు కూడా జంబులు ముద్ద ఎత్త లేదు.

* * *

లెక్కల ప్రకారం కోస్తా జిల్లాల్లో కూడా బుడగ జంగాల జనాభా బాగా ఉన్నా అక్కడ ఈ జీవోకు వ్యతిరేకంగా ఎందుకు కదలిక లేదనే ప్రశ్న సుధాకర్‌ను వేధిస్తోంది. అదే సంగతి గిరిని అడిగాడు.

"నిజమే.. మాకైతే అక్కడ పని చేయడానికి తగినంత మంది జనాలు కూడా లేరు. సంగంలో చేరినప్పుడే నేను ఇది గమనించా. ఎక్కడెక్కడ ఎంత జనాభా ఉందని చూస్తే ఈ సంగతి తెలిసింది. రాయలసీమ, తెలంగాణ వాళ్ల మధ్య ఉన్న చుట్టరికాలు, రాపోకలు

ఆ ప్రాంతంతో లేవు... అక్కడ ఏదో మనకు తెలియని డెవలప్‌మెంట్ జరిగినట్టుంది. ప్రాంతానికి ఉన్న ప్రత్యేకతలు మా వాళ్ల మీద కూడా పని చేసి ఉంటాయి. నాకు అక్కడి వాళ్లతోపెద్దగా పరిచయం లేదు కాబట్టి తొందరపడి నిర్ధారించలేం.." అన్నాడు.

సుధాకర్‌కేదో పాయింట్ దొరికినట్టయింది.

ప్రాంతాలను బట్టి తేడా ఉందంటే- సంచార సమూహాలు కూడా కాలానుగుణంగా మార్పులకు లోనైనట్టే. వీటిని పట్టించుకోకుండా ఏ కుల అస్తిత్వాన్నయినా వందల ఏళ్ల కిందటిలాగా యథాతథంగా చూసేవాళ్లున్నారు. జరుగుతున్న మార్పులు ఏమిటి? అట్లాగే నిలిచిపోయింది ఏమిటి? అనే బేరీజు వేయాల్సిందేగాని...

కోర్టులో కేసుకు అవసరమైన కాయితాల గురించి, తాను రాద్దామనుకుంటున్నదాంట్లో చేయాల్సిన వాదన గురించీ కలిపి ఆలోచిస్తున్నాడు సుధాకర్. కేసుకు ఇప్పటి దాకా సేకరించిన కాయితాలన్నీ ఇద్దామని గిరి వచ్చాడు. వెంకటేశ్వర్లు సారు దగ్గర ఉన్న కాగితాలను తేవడానికి ఉలిగప్ప అటు వెళ్లాడు. బైట చేయాల్సిన పోరాటాలతోపాటు కోర్టు వ్యవహారం కూడా వెంటనే కదించాలని ఇద్దరికీ పడింది. ఇప్పటికే సుధాకర్ ఇద్దరు ముగ్గురు సీనియర్లతో మాట్లాడి పెట్టాడు. 'డిమాండ్లనుబట్టి స్ట్రగుల్ ఉంటది. దాన్నిబట్టే అందులో ఉండేవాళ్లకు స్పృహ ఉంటది. అంతకంటే ఎక్కువ ఆశించడం అన్యాయమే.. కాకపోతే దాన్ని పెంచే పని చేయవచ్చు. అంత మాత్రాన ఏదో ఐపోతుందనుకోడానికి కూడా ఏమీ లేదు. అయినా ఈ బహుళత్వం గొప్పగా ఉంటుంది..లోపలికి పోయి చూస్తే చికాకులు కూడా ఉంటాయి. అయితే అది ఇవాళ కళ్ల ముందుకు వచ్చి నిలిచిన వాస్తవం.. ' ముగ్గురూ సమాధానపడిపోయారు.

ఉలిగప్ప వస్తే ఆ కాయితాలు కూడా ఇచ్చేసి వెళ్దామని గిరి ఎదురు చూస్తున్నాడు.

ఇంతలో ఫోన్..

ఉలిగప్ప ఏడుస్తున్నాడు..

గిరి కంగారు పడిపోయాడు.

సుధాకర్ కాగితాలు మూసి అతడి ముఖంలోకే చూస్తుండిపోయాడు.

ఉలిగప్ప మాటలు ఏమీ అర్థం కావడం లేదు.

"మా జేనాయినకు..."

గిరికి భయమేసింది. ఏమైనా అయిందా? ఈ మధ్య బాగుండె కదా? రెండు దినాలకు ఓసారి ఇంటి నుంచి ఫోన్ వస్తూనే ఉంది...

అవతలి నుంచి వెంకటేశ్వర్లు సారు ఫోన్ తీసుకొని మాట్లాడుతున్నాడు. .. అయితే సారు వాళ్లింట్లో ఉన్నాడన్న మాట. నయమే.

"గిరీ.. నేనయ్యా! ఉలిగప్ప నీదగ్గరికి బయల్దేరుతుంటే ఫోన్ వచ్చింది. వాళ్ల జేజినాయనకు సీరియస్‌గా ఉందంట. డాక్టర్ ఇంటికి తీసుకపొమ్మన్నడట.." అన్నాడు.

అప్పుడాయన గొంతు చాలా పీలగా, బేలగా వినిపించింది.

గిరికి ఏమనాలో తోచలేదు. అట్లాంటప్పుడు ఏం మాట్లాడాలో పెద్దగా తెలియదు.

"ఎట్లమరి?" అన్నాడు అయోమయంగా.

జంబులు తనకెంత సుపరిచితమంటే - ఒకే ఒక్కసారి చూసినా- ఉలిగప్ప అణువణువనా ఎప్పుడూ తొణికిసలాడుతూ నిత్యం ఇద్దరి మధ్య వాదనలో సంచరిస్తుంటాడు. అసలు ఉలిగప్ప జంబులు గురించి అంతగా చెప్పకపోతే తనకు ఈ మూలాల గురించి, పాతవాళ్ల పెనుగులాట గురించి, దానికి ఉన్న అర్థం గురించి తెలిసేదే కాదు. ఒక రకంగా తన ఆలోచనల్లో కేంద్ర స్థానం ఆ ముసలాయన కళా సౌందర్యమే, జీవితానుభవమే. ఉలిగప్ప కలవడానికి ముందు తను చేసిన ఆలోచనలకూ, ఆ తర్వాతకూ పోలికే లేదు. అందులో ఉలిగప్ప వేసిన ప్రశ్నలకన్నా జంబులు విసిరిన సవాళ్లే ఎక్కువ. ...

ఆ వార్త గిరిని కకావికలం చేసింది. పూర్ణ జీవితం గడిపి ఓ ముదుసలి మృత్యువును చేరబోతున్నాడనే సమాచారం మాత్రమే కాదది. ఇంకా ఎక్కువగా కలిచివేసింది. అప్పుడనిపించింది... జంబులు వయో భారంతో పొద్దువాలిపోయిన మనిషి మాత్రమేనా ... ఆయన మరణం మరి దేన్నయినా సంకేతిస్తున్నాదా...?

అవతలి నుంచి వెంకటేశ్వర్లు సారు.." ఏంది గిరి.. పలకవ్. ..." అని రెండోసారి అన్నాక గిరి " చెప్పండి సార్ " అని స్పందించాడు.

"ఉలిగప్ప వెంటనే పోవడం మంచిది. నీవు ఈడికి రా. నేను కూడా వద్దామనుకుంటున్నా. అంత గొప్ప కళాకారుడు మనోళ్లలో ఇంక లేరు. కడ చూపు చూసినానని తృప్తి మిగులుతుంది..." అని ఫోన్ పెట్టేశాడు.

కుర్చీలో కూర్చున్నవాడు ఆతృత కొద్దీ లేచి నిలబడడం, గొంతు బలహీనపడడం, ముఖం వివర్ణం కావడం గమనించిన సుధాకర్ " ఏమైందీ" అని మృదువుగా అడిగాడు.

గిరి చెప్పాడు.

"అయ్యో... ఆ ముసలాయన గురించి ఉలిగప్ప ఎన్ని సార్లు చెప్పాడో..." అన్నాడు సుధాకర్.

గిరి లేస్తుంటే.. " నాకూ వద్దామని ఉంది. రేపెట్లా కోర్టు లేదుగదా.." అన్నాడు.

"బయల్దేరు మరి. వెంకటేశ్వర్లు సారు కూడా వస్తానన్నారు.." అని, "విశాలకు చెప్పొద్దు. లేకపోతే పీక్కుతింటుంది..." అని ఫోన్ తీశాడు.

ఆ మాట ఆ ఇద్దరి ముఖాల్లో చిన్న కదలిక తెచ్చింది.

* * *

తెలతెలవారుతున్నప్పుడు ఐదుగురూ నందికొట్కూరులో దిగారు.

రాత్రంతా నిద్రపోలేదని ఉలిగప్ప ముఖం చెప్తోంది. నిజమే .. అతనిపాలిట అది ఎంతకూ ఎడతెగని దీర్ఘరాత్రి. జీవితపు మారుమూలల్లోకి తిరుగాడి రావడం అన్నిటికన్నా కష్టమనిపించింది. బరువైనవి తలుచుకున్నప్పుడు ఇంత బరువు మోశాం గదా? అనే విషాదం, ఉల్లాసమైనవి తలచుకుంటే.. వీటికి దూరమైపోయాం

గదా? అనే విచారం.. మనిషిని నిలువెల్లా దుర్బలుని చేస్తాయి. ఉలిగప్ప పరిస్థితి సరిగ్గా అలాగే ఉంది.

అక్కడి నుంచి ఆటోలో బయల్దేరారు.

రాత్రి నుంచే ఇంటి దగ్గర గుంపులుగా జనం.

అరగంట కింద కూడా తమ్ముడు ఫోన్ చేసి 'గురగురమంటున్నాడు. నీ కోసమే జీవి ఎదురు చూస్తుంది. బేరీత రానా' అన్నాడు.

వీథి మలుపులోనే కనిపించిన జనాన్ని చూచి ఉలిగప్ప గుండె గుబగుబలాడిందేమో. కడా చూపు కూడా లేదేమో.. అనుకున్నాడు.

ఏకునే వస్తారని గేర్లో అందరూ ఎదురు చూస్తున్నందున.. ఎవరో ముసలామె... "సారా ..సా నిన్ను చూసి పోదామని మీ జేజినాయిన కొటకలాడుతుండాడు.." అనింది.

కానిగ చెట్టు కింద గుమ్మిగూడిన జనం అటు ఇటూ సర్దుకోని దారి ఇచ్చారు. ఆ ఉదయం పూట, బంగారు వెలుగు తూర్పు దిక్కున పరుచుకుంటూ ఉంటే .. అక్కడ మాత్రం ఒక రకమైన బరువుతో కూడిన మసక చీకటి ఉన్నట్లనిపించింది గిరికి.

ఉలిగప్ప, అతడి వెనుకే వెంటేశ్వర్లుసారు, విశాల, గిరి, అందరికన్నా రెండే రెండడుగులు వెనక సుధాకర్ ఇంట్లోకి నడిచారు. గోడకు మంద్రంగా వెలుగుతున్న లైటు కాంతిలో మంచంలో జంబులు. ప్రాణం ఉందనడానికి గుర్తుగా గుండెల దగ్గర సన్న కదలిక. నడుం దాకా గుడ్డ కప్పి ఉంది. మంచానికి ఒక పక్క తమ్ముడు, మరో పక్క తండ్రి. గోడెంబడి కింద ఆనుకొని జేజి కూచోని ఉంది.

మనమడ్ని చూచి ఆమె వలవల ఏడ్చింది.

బలంగా ఊనుకొని కూడా లేవను చేతగాక అట్లే చతికిల పడిపోయింది.

"జేనాయినా.. జేనాయినా.. అన్న ఒచ్చినాడు.. లేచి సూడూ.. " తమ్ముడు ముసలాయన చేయి తట్టి పిలిచాడు. పలకలేదు.

మళ్లీ అతనే " ఉలిగప్ప.. ఉలిగప్ప వచ్చినాడు.." అని ముఖం మీదికి వంగి చెప్పాడు. అప్పుడు అతడి గొంతు ముద్దగా మారిపోయింది. జేజినాయన్ను అట్లా చూచి, తమ్ముడి స్వరం విని ఉలిగప్పకు కళ్లెంబడి నీళ్లు కారాయి. తాను పిలుద్దామని అనుకున్నా గొంతు పెగల్లేదు. నోరు విప్పి ఉంటే మాటకంటే ముందు దు:ఖం వచ్చేదే.

జంబులు ఎడం కన్ను కొంచెం తెరిచాడు

కుడి చేతి వేళ్లు కదిలాయి. అదే అతని పలకరింపు..

ఉలిగప్ప ఆ వేళ్లనట్లా ముట్టుకున్నాడు. ఎంత అద్భుతంగా ఆ వేళ్లు తాంబుర మీద తిరుగాడేవి. ఆయనలోని స్వరానికి, జేజి గుమ్మటమోతలోని లయకూ అనుగుణంగా ఆ వేళ్లు తాంబుర మీటేవి. బిరుసుగా, ఇప్పుడైతే సొక్కిపోయి, చల్లబడిపోతున్న ఆ వేళ్లు తన వేళ్లను పట్టుకున్నట్టనిపించింది. అది పిలుపో, పలకరింపో, మందలింపో, వీడ్కోలో... ముఖంలోకి చూస్తే అర తెరుచుకున్న కన్నులో కనుపాప కదిలినట్లయింది.

ఉలిగప్పకు వశం కాలేదు.

ఒకటే ఏడుపు..

జేనాయినా నేనే.. ఉలిగప్పను.. ఉలిగప్పను లెయ్.. ఒక తూరి మాట్లాడు.. ఇదుగో సూడి..నిన్ను సూడాలని అప్పుడు వచ్చిన్లా.. మా సారు వచ్చినాడు. నీతో పాటలు పాడించుకోని వినిన్లా.. వాల్లు కూడా వచ్చినారు..

అంత వరకు అక్కడ అప్పుడప్పుడు మశమ్మ ఏడుపు ... ముసలోడి గురించిన మాటలు ఉండేవి. ఇప్పుడు ఉలిగప్ప ఏడుపుతో అంతా గడిబిడైపోయింది. మశమ్మ స్వరనాళం తెగిపోయేలా ఏడుస్తోంది. ఉలిగప్పకు ఇక మాటలు రావడం లేదు. వెంకటేశ్వర్లు సారు ముందుకు జరిగి జంబులు చేయి పట్టుకున్నాడు. అదే ప్రతిస్పందన. వేళ్లు సన్నగా కదులుతున్నాయి. ఎడం కన్ను కదిలాడుతూనే ఉంది. వెంకటేశ్వర్లు సారు మంచెం పట్టె మీద కూర్చొని ఆయన చెంపలపై, గొంతుపై సన్నగా నిమిరాడు. "పెద్దాయినా.. నేనే వెంకటేశ్వర్లును.. నీ కోసమే వచ్చినా..." ఆయనకు ఇంక మాటలు రాలేదు. అప్పుడు వచ్చినప్పుడు చావు ఇంట్లో పాడినపాటలే గుర్తుకు వస్తున్నాయి. ఆ కరుణ, విషాదం, ప్రేమ, బతుకుపట్ల భరోసా చెప్పే పెద్దరికం.. అన్నీ కలగలసిన ఒకరకమైన ఆదిమ తాత్వికత.. వెంకటేశ్వర్లుసారుకు ఆనాటి జంబులు గాత్రం, అభినయం.. అంతకన్నా అందులోని ప్రాచీనమైన అర్థాలు తలపుకు వస్తున్నాయి. ఉలిగప్ప ఎప్పుడూ చెప్పేవాడు.. జేజినాయిన రౌద్రం, వీరం ఎంతగా పలికించేది. కానీ ఆ రోజు .. జంబులులోని కరుణామయమైన స్వరం, దు:ఖంలో ఉన్నవారికి ఊరడింపు చెరగని ముద్రపడిపోయాయి. ఇక.. ఈ స్వరం మూగపోయినట్టేగదా? అనిపించేసరికి ఏడుపు వచ్చింది.

ఎవరో వచ్చి ఉలిగప్పను రెండు భుజాల మధ్య పొదుపుకొని బైటికి నడిపించారు. వెనుకే వెంకటేశ్వర్లు సారు కూడా వచ్చాడు. గిరి, విశాల, సుధాకర్ దగ్గరిగా వెళ్లి జంబులును చూశారు. సుధాకర్ ఆయన వంకా, ఇంట్లో నలుదిశలా చూస్తుంటే గోడకు ఓ వైపు వేలాడదీసిన గుమ్మట తాంబురలు కనిపించాయి. అటు చూడమన్నట్లు విశాలతో అన్నాడు.

విశాల ఆ రెంటినీ, మంచంలో తుది ప్రయాణంలో ఉన్న జంబులును, కిందపడి ఏడుస్తున్న మశమ్మను మార్చి మార్చి చూసింది.

"కన్ను మూతపడుతోంది..." అన్నాడు గిరి.

నిజమే అనిపించింది సుధాకర్‌కు.

బైటి నుంచి చూడ్డానికి ఎవరో పది మంది దాకా లోపలికి వచ్చారు. 'పక్కూరి వాళ్లు పొద్దున్నే బయల్దేరారు.. విశాల బైటికి కదలడంతో మిగితా ఇద్దరూ కానుగచెట్టు కిందికి వచ్చారు.

పది నిమిషాలయ్యాక లోపలి నుంచి ఒక్కపెట్టున ఏడుపులు వినిపించాయి.

ఉలిగప్ప అడ్డంగా ఉన్న వాళ్లను తోసుకుంటూ లోనికి వెళ్లాడు. ఎడం కన్ను పూర్తిగా మూతపడిపోయింది. వెళ్లి కుడి చేతి వేళ్లు ముట్టుకున్నాడు. చల్లగా.. చలనం లేకుండా తగిలాయి.

పరంపరాగతమైన బంధమేదో ఈ లోకంతో తెగతెంపులు చేసుకొని మౌనంగా వెళ్లిపోయినట్టనిపించింది.



( అయిపోయింది)

# -: స్వీకారం :-

| | | |
|---|---|---|
| దండెడ<br>కవిత్వం<br>రచయిత :<br>పొన్నాల బాలయ్య<br>ప్రచురణ :<br>మంజీరా రచయితల సంఘం<br>వెల : రు. 50/-<br>పేజీలు : 98 | సంక్షోభకాలంలో<br>(వ్యాసాల సంకలనం)<br>రచయిత :<br>దుడ్డు ప్రభాకర్<br>ప్రచురణ :<br>కులనిర్మూలన ప్రచురణలు<br>వెల : రు. 100/-<br>పేజీలు : 236 | పునఃసృష్టి<br>కామ్రేడ్ కిషన్‌జీ<br>రచనలు<br>ప్రచురణ :<br>విప్లవ రచయితల సంఘం<br>వెల : రు. 15/-<br>పేజీలు : 37 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ<br>రచయిత :<br>కె. ఆర్. చౌదరి<br>ప్రచురణ :<br>వీక్షణం పబ్లికేషన్స్<br>వెల : రు. 100/-<br>పేజీలు : 224 | రాబందు వాలిన నేల<br>రచయిత :<br>ఎన్. వేణుగోపాల్<br>ప్రచురణ :<br>స్వేచ్ఛాసాహితి<br>వెల : రు. 180/-<br>పేజీలు : 408 | People's Hero<br>Comrade Kishenji<br>ప్రచురణ :<br>Friends of Kishanji<br>పేజీలు : 16 |
| "సీమ" మాటేమిటి?<br>మరికొన్ని వ్యాసాలు<br>ప్రచురణ :<br>రాయలసీమ<br>విద్యావంతుల వేదిక<br>వెల : రు. 10/-<br>పేజీలు : 40 | ప్రకృతి-పర్యావరణం<br>రచయిత :<br>కొడవటిగంటి రోహిణీప్రసాద్<br>ప్రచురణ :<br>స్వేచ్ఛాసాహితి<br>వెల : రు. 90/-<br>పేజీలు : 203 | మనుషులు చేసిన దేవుళ్ళు<br>రచయిత :<br>కొడవటిగంటి రోహిణీప్రసాద్<br>ప్రచురణ :<br>హైదరాబాద్ బుక్‌ట్రస్ట్<br>వెల : రు. 100/-<br>పేజీలు : 196 |
| కథల వాచకం<br>14 దేశాలు - 20 కథలు<br>రచయిత :<br>ముక్తవరం పార్థసారథి<br>ప్రచురణ :<br>వికాసం బుక్స్<br>వెల : రు. 100/-<br>పేజీలు : 143 | కథలు-కథకులు<br>రచయిత :<br>ముక్తవరం పార్థసారథి<br>ప్రచురణ :<br>వికాసం బుక్స్<br>వెల : రు. 80/-<br>పేజీలు : 136 | ప్రపంచ రచయిత్రుల<br>కథలు 14<br>రచయిత :<br>ముక్తవరం పార్థసారథి<br>ప్రచురణ :<br>వికాసం బుక్స్<br>వెల : రు. 90/-<br>పేజీలు : 144 |
| మరణోపనిషత్<br>రచయిత :<br>ముక్తవరం పార్థసారథి<br>ప్రచురణ :<br>వికాసం బుక్స్<br>వెల : రు. 80/-<br>పేజీలు : 107 | మనిషివాసన<br>కవిత్వం<br>రచయిత :<br>ఏటూరి నాగేంద్రరావు<br>ప్రచురణ :<br>సాహితీ మిత్రుల ప్రచురణ<br>వెల : రు. 50/-<br>పేజీలు : 120 | కవినై... కవితనై...<br>రచయిత :<br>చలపాక ప్రకాష్<br>ప్రచురణ :<br>రమ్యభారతి<br>వెల : రు. 60/-<br>పేజీలు : 152 |

**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)

● RNI Regn.No.21152/72 ● Published on 24/02/2012 289 - Nov - Dec, 2011



# విప్లవ రచయితల సంఘం 23వ రాష్ట్ర మహాసభలు

కామ్రేడ్ కిషన్‌జీ హాల్ (లయన్స్ క్లబ్ కమ్యూనిటీ హాల్, స్టేట్ బ్యాంక్ ఎంప్లాయిస్ కాలనీ)

10, 11 మార్చి, 2012 (శని, ఆదివారాలు), కర్నూలు.

కార్యక్రమం :

10 మార్చి 2012 ఉదయం 10.00 గంటలకు పతాకావిష్కరణ,

ఉదయం 11.00 గంటలకు ప్రారంభ సమావేశం

ప్రారంభోపన్యాసం : కా. జీతన్ మరాండీ, కా. అపర్ణా మరాండీ (ఝార్ఖండ్ అభేన్)

కార్యదర్శి నివేదిక, సౌహార్ద్ర సందేశాలు, పుస్తకావిష్కరణలు

**మధ్యాహ్నం 1.00 గంటకు భోజన విరామం**

మధ్యాహ్నం 2.00 గంటలకు

అంశం: ఆదివాసీ ప్రాంతాల్లో వనరుల దోపిడీ

వక్త: వరలక్ష్మి; నిర్వహణ: ఉదయమిత్ర

సాయంత్రం 4.00 గంటలకు

అంశం: దండకారణ్య అభివృద్ధి నమూనా-ప్రగతి భావన

వక్త: పాణి; నిర్వహణ: నల్లూరి రుక్మిణి

**సాయంత్రం 6.00 గంటలకు కవిసభ**

నిర్వహణ: రివేరా, నాగేశ్వర్

**11 మార్చి, 2012న ఉదయం 10 గంటలకు**

ప్రజాకళామండలి సాంస్కృతిక కార్యక్రమాలు

ఉదయం 11.30 గంటలకు

అంశం: సామ్రాజ్యవాదం- ప్రపంచవ్యాప్త నిరసనలు

వక్త: ప్రొ. ఘంటా చక్రపాణి; నిర్వహణ: కె.వి. కూర్మనాథ్

మధ్యాహ్నం 1.00 గంటకు

అంశం: దండకారణ్యంలో విప్లవ కళా సాహిత్య సృజన

వక్త : డి.వి రామకృష్ణారావు; నిర్వహణ: అరసవెల్లి కృష్ణ

**మధ్యాహ్నం 2.00 గంటలకు భోజన విరామం**

మధ్యాహ్నం 3.00 గంటలకు

అంశం: గ్రీన్‌హంట్ విధ్వంస రూపాలు

వక్త: రాజానందం; నిర్వహణ: ఎం.ఎ. బాసిత్

సాయంత్రం 4.30గంటలకు

అంశం: యుద్ధ సమయంలో బుద్ధిజీవుల పాత్ర

వక్త: కాశీం; నిర్వహణ: జగన్

11 మార్చి 2012న సాయంత్రం 6.30 గంటలకు

బహిరంగ సభ

వక్తలు : కొత్త కార్యదర్శి, జి. కళ్యాణరావు, వరవరరావు, సి.ఎస్.ఆర్. ప్రసాద్

**విరసం, ఝార్ఖండ్ అభేన్, ప్రజా కళా మండలి సాంస్కృతిక కార్యక్రమాలుంటాయి.**

ఇది ఆపరేషన్ గ్రీన్‌హంట్ రెండో దశ. 'గ్రీన్‌హంటా? అదేమిటి?' అన్న కేంద్ర హోం మంత్రి చిదరంబరం మిథ్యావాదపు నీడలో దేశ ప్రజలపై భారత ప్రభుత్వం ప్రకటించిన యుద్ధం రెండో దశకు చేరుకున్నది. పారా మిలటరీ బలగాలతోపాటు నేరుగా... విదేశాలతో యుద్ధం చేసే (ఆ యుద్ధాలు మాత్రం న్యాయమా? అని ప్రశ్నించవలసిందే) సైన్యం మధ్య భారత దేశంలోని ఆదివాసీ స్థావరాల్లోకి దిగింది. గ్రీన్‌హంట్ ఈ దశకు చేరుకోవడమంటే... 'ఇక ప్రజలతో మిగిలింది యుద్ధమే' అని కేంద్ర సర్కార్ ప్రకటించడమే. వలసానంతరం భారత ప్రజలకు -పాలకవర్గాలకు మధ్య కొనసాగుతూ వచ్చిన వైరుధ్యాలు ఇప్పుడీ యుద్ధ సన్నివేశానికి చేరుకున్నాయి. మావోయిస్టు ఉద్యమం దేశ ఆంతరంగిక భద్రతకు ముప్పుగా తయారైందనే సాకుతో ప్రారంభించిన ఈ యుద్ధం ఇక ఎంత మాత్రం విప్లవకారుల సమస్య మాత్రమే కాదు. ప్రజాస్వామ్యం గురించి కలగనేవారందరి సమస్య. వేర్వేరు రాజకీయ వైఖరులతో, భావజాలాలతో ప్రజాపక్షం తీసుకున్న వారందరూ ఈ యుద్ధంపై గొంతు విప్పుతున్న తరుణమిది.

2009 సెప్టెంబర్‌లో ఈ యుద్ధం ఛత్తీస్‌గఢ్‌లోని దంతెవాడలో మొదలైంది. 4000 మంది సి.ఆర్.పి.ఎఫ్. 600 మంది కోబ్రా కమెండోలు పాల్గొన్నారు. నవంబర్‌నాటికల్లా 70 మందిని, జనవరినాటికి 107 మంది ఆదివాసీలను, మావోయిస్టులను కాల్చేశారు. ఈ లెక్కలు ఆ రాష్ట్ర ప్రభుత్వం చెప్పినవే. మొత్తంగా బస్తర్‌లో 20 వేల పారా మిలటరీ బలగాలను మోహరించినట్టు కూడా చెప్పింది. ఇక అప్పటి నుంచి జార్ఖండ్, బీహార్, ఒడిశా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బెంగాల్‌లలో ఎన్నో దుర్మార్గాలు జరిగాయి. గ్రామాలకు గ్రామాలనే తగలబెట్టేశారు. మహిళలపై అత్యాచారాలు చేశారు. ఆస్తులు ధ్వంసం చేశారు. నేరం... విచారణ లేకుండా వేలాది మందిని అక్రమంగా అరెస్టు చేసి జైళ్లల్లో తోశారు. ఈ మొత్తం విధ్వంసంలో మానవహననం ఎంత జరిగిందీ పూర్తి లెక్కలే లేవు. మీడియా, మావోయిస్టు నాయకుల ప్రకటనల్లో ఆపరేషన్ గ్రీన్‌హంట్ అప్‌డేట్స్ గమనించినవాళ్లకు ఈ వివరాలు కొంత తెలిసే ఉంటాయి.

దేశంలో తూర్పు, మధ్య, దక్షిణ ప్రాంతాల్లోని సువిశాల ఆదివాసీ స్థావరాలన్నిటిపై ఈ యుద్ధం పేట్రేగిపోయింది. అమెరికా దుర్మార్గ యుద్ధం చేసిన ఆఫ్ఘనిస్థాన్, ఇరాక్‌ల కంటే ఈ ప్రాంతం విశాలమూ, సుసంపన్నమూ. గ్రీన్‌హంట్ నడుస్తున్న ప్రాంతంలో గోదావరి మొదలు గంగా తీరం దాకా అనేక నదులున్నాయి. కేరళ రాష్ట్రం కంటే పెద్దదైన బస్తర్ జిల్లాలో; జంగల్‌మహల్, ఒడిశా, ఆంధ్రప్రదేశ్‌ల్లో మూడేసి జిల్లాల్లో అపార ఖనిజ సంపద ఉంది. దండకారణ్యంగా గుర్తింపు ఉన్న సువిశాల అటవీ ప్రాంతంలో 28 రకాల ఖనిజాలున్నాయి.

(మిగతా 60వ పేజీలో...)

Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002,
Editor : Chalasani Prasad

100



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M157 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | naizma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Sharmila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |